# గోలకొండపత్రిక

## విభవ సంవత్సరాది

# సంచిక




గోలకొండ ముద్రాక్షరశాల,

ట్రూపు బజారు, హైద్రాబాదు దక్కన్.

---

Price Re. 2—0—0 ౧౯౨౮ వెల రు. ౨—౦—౦

# SUN LIFE ASSURANCE CO OF CANADA

## సన్ లైఫ్ అష్యూరెన్సు కంపెనీ ఆఫ్ కనడా హెడ్ ఆఫీస్ మాన్ట్రియల్

వక్షిస్థానము

---

బ్రిటిషు సామ్రాజ్యములో నిదియె యుత్తమమైన భీమాకంపెని

---

| | | |
|---|---|---|
| ౧౯౨౪ లో క్రొత్త అష్యూరెన్సు చెల్లించిన మొత్తము | రూ | ౭౯, ౯౪, ౮౭. ౦౫.౦ |
| ౩౧ డిసెంబరు ౧౯౨౪ వరకు కూడిన అష్యూరెన్సు మొత్తము | | ౮౬౪౬౬౮౬౪౯౭ |
| మొత్తము ఆదాయము | | ౨౭, ౮౫, ౨౩, ౨... |
| ౧౯౨౪ లో పాలిసీ హోల్డర్లకు లేక బెనిఫిషియరీలకు చెల్లించిన మొత్తము | | ౧౧, ౪౫౯౩౯౯౮ |
| ౧౯౨౪ లో నుండిన మొత్తము నిలుకు | | ౧, ౦౯. ౯౮, ౬౭, ౧... ౧౨౮౬౫౪౨౮౯ |

వివరములకీ క్రిందివారిని విచారించుడు.

ఎ. కె. హారవు ప్రధానప్రతినిధి

౨౦౯౫ షుబ్రిక్ వీధి. సికింద్రాబాద

---

టెలగ్రాములు "వారీ"

సికింద్రాబాద.

రోడ్ "బెల్డ్లిన్"

టెలీఫోను 377&157

ప్రభుత్వము వారియొక్కయు, రైల్వేవారి యొక్కయు, మ్యునిసిపల్ వారియొక్కయు స్థిరమైన వ్యాపారులు. మేమీక్రిందివాటిలో వర్తకము చేయుచున్నాము

### యంత్రములు

(1) విద్యుచ్ఛక్తికి కావలసిన మిషనులు, సామానులు.

(2) ఆయిల్ ఇంజన్లు, స్టీముఇంజనులు, గ్యాసుఇంజనులు

(3) జిన్నులు కాటన్ ప్రెస్సులు. (4) బియ్యపు మిల్లులు, పిండిమిల్లులు, కోలమిల్లులు, నూనెప్రెస్సులు మరియు వేరుసెనగ కాయలను పగులగొట్టు యంత్రములు.

(4) పంపులు వగైరాలు. (6) సడక ఇంజనులు (రోడు రోలర్లు) మరియేవిధమగు రోడ్ల కావశ్యకములగు యంత్రములు నున్నవి, రాతులు కలుపుయంత్రములు.

### ఇనుపసామానులు

దూలములు. నాసులు, రేకులు మొదలైనవి నాలీలు, నీటికాలువలను గావలసినఅన్ని పదార్థములు. కట్టెసామానులు, గూనలు మొదలయినవి, స్టేషనరీసామానులు.

అన్ని ఆర్డర్లు శ్రద్ధతో త్వరగా పాలింపబడును.

సగసమైనధరలు

**K. R. Chari & Co,**
**Secunderabad (Deccan)**

0—10—0

# గోలకొండపత్రిక

## విభవ సంవత్సరాది

# సంచిక



గోలకొండ పత్రికా ముద్రాక్షరశాల

త్రూపుబజారు హైద్రాబాదు దక్కను

౧౯౨౮

వెల చందాదారులకు రు ౦—౧౨—౦ | ఇతరులకు రు ౨—౦—౦

గోలకొండ పత్రికకు రాజపోషకులై, పోషకులై, అభిమానులై పత్రికయొక్క యుత్పత్తికిని, నింతవఱకు నడచుటకును గారకులై సాయపడుచున్న యుదారులును, భాషాభిమానులును నగు నీక్రింది మహాశయులను స్మరణచేయుచు మా నిరంతర కృతజ్ఞతను వెల్లడించు చున్నాము.

( గో. సం )

# రాజపోషకులు

శ్రీశ్రీశ్రీ. చెన్నకేశవస్వామివేర గద్వాల సంస్థానము

„ రాజా వేంకట లక్ష్మారావు బహద్దరుగారు సంస్థా॥ జటప్రోలు

„ రాజా శ్రీరామభూపాలురావు బహద్దరుగారు అమరచింత సంస్థానము

„ రాజా రామదేవరావు బహద్దరుగారు సంస్థా॥ వనపర్తి

„ రాజా రాజేశ్వరరావు బహద్దరుగారు దోమకొండ ప్రభువుగారు

„ రాజా రామచంద్రరావుబహద్దరుగారు దోమకొండసంస్థానము

„ పింగిలి వేంకటరామారెడ్డిగారు దేశముఖు

„ పింగిలి కోదండరామరెడ్డిగారు „

„ కొత్వాలు వేంకట రామారెడ్డిగారు

„ రా॥ సా॥ ముస్త్యాల వేంకట క్రిష్ణయ్యగారు సికింద్రాబాదు

„ కొండా వేంకట రంగారెడ్డిగారు వకీలు

„ గంగిరెడ్డిగారు అమరచింత సంస్థానము

„ కైలా బలవంతరెడ్డిగారు వకీలు

„ సీతారామచంద్రరావుగారు దే॥ బేతవోలు

„ కీ. శే. సిద్దంసెట్టి చంద్రయ్యగారు సికింద్రాబాదు

# పోషకులు



శ్రీ. అక్కినేపల్లి జానకిరామ్‌రావుగారు వకీలు

# అభిమానులు



శ్రీ. చక్రహరి నరసరాజుగారు వకీలు జటప్రోలు సంస్థానము
,, పి. నరసింహారావుగారు వకీలు కోటపల్లి
,, రాజారెడ్డిగారు అల్లీపురము (అమరచింత)
,, కేశవరెడ్డిగారు అమరచింత సంస్థానము
,, నడికోడ లక్ష్మారెడ్డిగారు దే॥
,, కృష్ణాజీనాయకుగారు కంట్రాక్టర్
,, బి. వేంకట కృష్ణారెడ్డిగారు నిజాంసాగర్



# విషయానుక్రమణిక







# చిత్రపటముల వివరము



[1] బారాదరీ తారామతి. [2] రాజాధిరాజగీర్జీగారు. [3] రెడ్డిగ్రంథాలయము హైద్రాబాదు. [4] రెడ్డివిద్యార్థి వసతిగృహము (భోజనశాల). [5] క్షీరరామేశ్వరాలయ గోపురమందలి యజ్ఞోపవీతధారులగు రెడ్లవిగ్రహములు. [6] ట్రాక్టర్లు (పూనా) [7] భాగ్యరెడ్డిగారు. [8] ఎలిఫెంటాలోని ఏనుగు. ౧ [9] ఎలిఫెంటాద్వీపము ౨ [10] బ్ర. శ్రీ. మహాముని కావ్యకంఠ గణపతిశాస్త్రిగారు. [11] ద్వారపాలకులు(ఎలిఫెంటా) ౭. [12] గంగావతరణము (ఎలిఫెంటా) ౮. [13] రెడ్డివిద్యార్థివసతి గృహము. ౧. [14] రెడ్డివిద్యార్థివసతిగృహము ౨. క్రొత్తగకొనినట్టిది. [15] రెడ్డివిద్యార్థి వసతిగృహము ౩. [16] కీ. శే. వేంకటలక్ష్మారావు బహద్దరుగారు (జటప్రోలు సంస్థానాధీశులు) [17] చార్మినారు (హైద్రాబాదు) [18] చాందుమినారు (దౌలతాబాదు) [19] త్రిమూర్తి విగ్రహము. (ఎలిఫెంటా) ౩ [20] అర్ధనారీశ్వర (ఎలిఫెంటా) ౪. [21] పార్వతీ పరిణయము (ఎలిఫెంటా) ౫. [22] ద్వారపాలకులు ఎలిఫెంటా) ౬. [23] బారాదరీ తారామతి (గోలకొండ) [24] నాగనాధ దేవాలయము [ఔంధా] దక్షిణభాగము. [25] ఔంధా దేవాలయ ఉత్తరభాగము. [26] ఎఱుకబాలుర పాఠశాల ప్రారంభోత్సవము. [27] మాడపాటి హనుమంతరావుగారు హైకోర్టు వకీలు. [28] పి. యస్. శర్మగారు బి. ఏ. ఎల్. ఎల్. బి. సుజాతపత్రికా సంపాదకులు. [29] వ్యవసాయకళాభవనముపూనా. [30] సింధీఆవు. [31] మినుములశాఖ. [32] మినుములశాఖ. [33] వ్యవసాయ ప్రదర్శన స్థలము. [34] పశువుల కొట్టములు. [35] నాములు. [36] అపోలోబందరు (బొంబాయి) [37] ముషీరాబాదు మసీదు. [38] టోలీమసీదు. [39] అజంటాగుహాలు, రాచనగరములోని దృశ్యము. [40] ఔంధా దేవాలయ శిఖరము.



# గోలకొండ

(ఆదిపూడి సోమనాథరావుగారు)

కాంతిపర్వతమును కమనీయరత్నమును
గూర్మితోఁగన్నది గోలకొండ

అక్కన్నమాదన్న లనుమంత్రిరత్నాలఁ
గూర్మితోఁగన్నది గోలకొండ

భవ్యాదిశుద్ధాంధ్ర కావ్యరత్నంబును
గూర్మితోఁగన్నది గోలకొండ

ప్రఖ్యాతశ్రీరామ భక్తరత్నమ్మును
గూర్మితోఁగన్నది గోలకొండ

యన్నిరత్నమ్ములనుగని యెసఁగుచుండు
గోలకొండను దలపించు గోలకొండ
పత్రికారత్న మెంతయుఁ బాత్రముగద,
యాదరింపంగ మనకెల్ల నాంధ్రులార!

# కోరిక

(వేంకటరాజన్న అవధానిగారు)

ఆంధ్రదేశీయుల • యజ్ఞానమ్ముఁ బాపి
స్వావలంబనమును • పాఠమిచ్చి;

స్వార్థపరత్వ పి • శాచమ్ముఁ దోలఁగించి
దేశసేవాసక్తి • దీక్షనిలిపి;

స్వమత సంస్థాపనా • సక్తి పెంపొందించి
సహజభీరుత్వమ్ముఁ • సమయఁజేసి

అమితదోర్బల పరా • క్రమ మండితులఁజేసి
శత్రుసంహార దీ • క్షాసమన్వి

గీ॥ తులుగఁజేసి; యధర్మమ్ముఁ • దొలఁగఁజేయు
మమ్మ, పూర్వంపు ఔన్నత్య • సుమరఁజేసి;
తావకీయ సువ్యాసామ్ము • తంబుఁజిలికి,
యాంధ్రజనులందు జాగృతి • నలరఁజేయు
మమ్మ! గోల్కొండ పత్రికా! • అనవరతము!!

# సంచిక ప్రస్తావన



ఆజుర్ ౧వ తేదివరకే యీ సంచిక వెలువడవలసి యుండెను. కాని కంపాజిటర్లు లేక చాల శ్రమకలుగుటచే నాలస్యమయ్యెను. సహృదయులగు మా పాఠకు లీ మా యాలస్యమును సహింప బ్రార్థితులు.

ఈ సంచిక మా ప్రథమ ప్రయత్నము. కావున నుండఁదగినట్లుగా నాకర్షణీయముగా లేకుండవచ్చును. దీనలోపములుండిన క్షంతవ్యులము.

ఈ సంచికకు వ్యాసములను అనుగ్రహముతో వ్రాసి సాయపడిన పండితు లందఱకును కృతజ్ఞతా పూర్వక వందనములు. మఱియు నిందు ప్రత్యేకముగా ముగ్గుఱు మాకృతజ్ఞతకుఁ బాత్రులు. ఆర్షశాఖాధ్యక్షులు [Arch aalopccalDefarpmet]అగు యజ్దానీ సాహేబుగారు తమ శాఖలోని కొన్ని యుత్తమ బ్లాకులను బ్రచురణార్థమిచ్చి సాయపడిరి. మఱియు చంద్రకాంత ప్రెస్సు అధికారులగు శ్రీకృష్ణస్వామి ముదిరాజగారు మాకుఁ గార్యభారమంతు బెట్టఁగి మాకు కొన్ని బ్లాకులు ముద్రించి యిచ్చి సాయపడిరి. మఱియు రెడ్డి హాస్టల్ అధికారులు తమ హాస్టలు యొక్క బంగ్లాల బ్లాకులను సంచికలో బ్రకటింప ననుజ్ఞయిచ్చిన వారలు. ఈ పైవారికి మే మత్యంత కృతజ్ఞులముగా నున్నాము. మఱియు శ్రీ పి. యన్. శర్మ బి. ఏ. గారు ముఖపత్రమును చిత్రించి యిచ్చినందులకు వారికెంతయు కృతజ్ఞులము. శ్రీయుత గణపతిరావుగారు మాపత్రికకు ప్రకటనలు తెచ్చుటలో మఱియు పత్రికయొక్క యితర సహాయములలో చాల తోడ్పడుచున్నారు. వారి గొప్పసహాయమును మేము మరువజాలము. వ్యాసములనుసాధ్యముండినంతవఱకు సుప్రసిద్ధ పండితులచేఁ బద్యములఁ గవులచే వ్రాయించినారము. పాఠకులిది గ్రహింపక పోరు. ఈ సంచిక ధరలను మా మిత్రుల బలువురి యభిప్రాయాను సారము తగ్గించి యున్నాము.

ఆంధ్రు లెల్లరును లో యీ యుద్యమమునకుఁ దోడ్పడి మమ్ము ప్రోత్సహింతురని నమ్ముచున్నాము.

సంపాదకుఁడు.





# ఉగాది

శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారు

౧

చ. ఋతువున కొక్క రూపలవరించుచు, రేల్బవ లీజగానకున్
స్థితిగతి కర్మభేదముఁ విధింప, సనాతనసాక్షివై, ఋగు
ర్చిత మహదంశుమండలిఁ జరించు హిరణ్మయ దివ్యమూర్తికిన్
నతులొనరింతు నీవిభవనామమహాబ్ద శుభోదయంబునన్.

౨

కం. అరువదియాకుల చక్రము
తిరిగెన్ గిరగిర మహర్షి తేజఃకృషిచే
నరుణమయిన యీ భారత
పరివర్తన భాగ్యపంక్తి వలయమునందున్.

౩

ఉ. కోయిల మానలేదు మధుగుంభిత గీతములన్ వనస్పతు
ల్పాయక వీడలేదు దెసలన్ గయిపెత్తు సుగంధ సంహతిన్,
మాయవొకింత యీప్రకృతి మంగళవాహిని జీవనద్యుతుల్,
నేయఁగరాదికేః కమనీయ మదీయ వచోదుకూలమున్.

౪

గీ. తల్లిమొగము గన్పడినవత్సము విధాన
పెనఁగులాడు నాచిత్తమో విభవవర్ష
దేవతా! నింబ కుసుమగంధిల మనోజ్ఞ
మయిన యీపల్లవావరణాంతరమున.

౫

గీ. స్మరణయు, ననంటి పువ్వుమాదిరి మెలమెల
పొరలువిప్పఁ, జిరంతన చరితమెల్ల

తేటగాఁ గనఁబడు తెరఁ దీసినట్లు
ప్రాతక్రొత్తలు లేనిభావన సెలంగ.

౬

గీ. ఋషుల యారణ్యకములు, క్షత్రియు లనిశిత
ఖడ్గధార లీ భారత ఖండమందు
నొక్కటే లక్ష్యమునకయి యుద్యమించెఁ
బ్రజల కర్మకల్యాణ సంప్రాప్తి కర్థి.

౭

గీ. స్వర్గమింద్రుఁ డేలినను, రాక్షసులు గొడుగు
లెత్తినను, లంక కాలిపోయినను దక్షు
యజ్ఞము చెడినను, చెడ లే దార్య కర్మ
జన్యసంస్కార మక్షుమైన జనహృదయము.

౮

చ. మంత్రమయంబులైన నిగమంబులనమ్మిక, యార్యసభ్యతా
తంత్రముఖానువర్తన, యథాకృషిపాలన, భారతీయజీ
వాంత్రము వీడ వెన్నడు, కటా! తెగనున్నది నేటికీమహా
యంత్రము మూలతంత్రియె! నయజ్ఞులెఱుంగుదు రీవిపద్దశన్.

౯

గీ. శీతవాతాతపములచేఁ జీలి, వేష
భాషలన్ బహుముఖమయి, వర్ణమతమ
తాంతరముల వేఱయియున్న నార్యధర్మ
ధార యంతఃకరణ భూమినాఱిపయ్యె.

౧౦

చ. అతివిపరీతమైన విలయంబు గ్రసించుచునున్న దిప్డు భా
రతజనజీవమూలమును, రాష్ట్రములంచును, ప్రాతినిధ్య ప
ద్ధతియను, చల్పసాంఖ్యగణ ధర్మమటంచు; సమష్టిభావమే
హతమయి మాతృదేశము సహస్రముఖంబుల ఛిన్నమయ్యెడిన్.

౧౧

సీ. తనయతి ప్రాచీన తరచరిత్రముఁజూపి
ఆంధ్రుఁ డాంధ్రుఁడనని యంధుఁడగును,
తనరాజ తంత్రకథన్ వినిపించి మ
రాటి మరాటినన్ అంకెవేయు,

తననాయకుల యశోధార నారసివంగ
జూఁడు వంగజూఁడ ననుచు గర్వించు
తనతుపాకీకాయలను బ్రదర్శించి పం
జాబి పంజాబినఁట చలముఁ బూను

గీ. ఘూర్జరులు ఘూర్జరులమని ఘూర్ణిలంగ,
ద్రావిడులు ద్రావిడులమని తన్ను కొనఁగ.
భరతపుత్త్రుఁడనని చాటు భారతీయుఁ
డేడి? తద్భద్ర సాధన యేడనింక!

౧౨

ఉ. భాషలుమూసివేసిన కవాటములన్ దెఱవన్ కులాంతర
ద్వేషము పాముపోల్కిఁ బొదివెన్ తదపాయమెఱింగి దృష్టివి
శ్లేషము నాయకానుచరసిద్ధికి భంగముదార్పనీక, యు
న్మేషపథంబుఁ బట్టు డరుణించునె దీపము లార్పినంతనే?

౧౩

గీ. జన్మవాసన లతిబలిష్ఠములువానిఁ
జంపకుఁడు విజాతీయ సంసర్గకలన;
కట్టువడియు శార్దూల మాకట నలిగియు
మాంసమే తినుతినదు సాంబారుకూడు.

౧౪

గీ. క్షేత్రశుచియునట్టిదనిరసింపఁ దగదు,
గనులలోనె రత్నములు సంఘటితమగును,
శుక్తిమాత్రమె ముత్యాల చూలుమోయు
రాలకును గుల్లలకును క్షేత్రములెయున్న.

౧౫

గీ. భరతభూమి యభారత పథముఁ బట్టి
ఎక్కఁబోవు మహోన్నత శృంగమెద్ది?
హారికనబడదని తలచీరఁ గాల్చి
వెదకుదురె బుద్ధిమంతులు వెరవునెందు.

౧౬

గీ. మహిషముఁ జేరి నాగల కమర్చికట్టి
కదులనాగలి బంధింత్రె కార్యపరులు;

ఆవు నడవికిఁ దోలి, సింహముల గ్రామ్య
గతికి లాగుట "అస్థానకృతము" సుమ్మి.

౧౭

గీ. పల్లెలూపిరితిత్తులు భరతలక్ష్మి,
కాదిజ్ఞయము కృషికర్మ యార్యులకును
నగరములు పెంత్రే జనపద నాశనమున
యంత్రమాడింత్రె కృషికు స్థైర్యముఁ బెకల్చి.

౧౮

చం. సకలజగన్మనీషి పరిషన్ముఖవేదికలన్ బ్రమాణదీ
పికవలె వెల్గనీభరత విశ్వవిభూతి, తదీయయోగకీ
లకము నెఱింగి సూత్రములు లాగుఁడు, నన్నబలంబునిచ్చుక
ర్షకుని, తపోబలంబొసఁగు సాధకుముందు సముద్ధరింపుఁడీ!

౧౯

గీ. దేశకాల పాత్రముల సూత్రించుటొప్పుఁ
గాని యొప్పునె యన్యదేశానుకరణ
మన్ని జాతీయ జాగ్రదుద్యమములకును,
చిత్రసృష్టియెందును బ్రాణి సృష్టియగునె?

౨౦

గీ. తొలుత గృహమేధి, తరువాత కులముపెద్ద,
నవల గ్రామపెత్తనదారి, యార్యకర్మ
చక్రమును ద్రిప్పి రెన్నాళ్లో నక్రమముగ;
రాజుపడినఁ గోశములు నిర్ధనములయిన.

౨౧

గీ. చదువనుష్ఠానమున, ననుష్ఠానమాత్మ
యజ్ఞమున, నాత్మయజ్ఞ మత్యంతకృషిని,
సూక్ష్మమయి తైజసికబల స్ఫూర్తినించు
స్థాయికలదె తేజములేని నభ్యతలకు.



# విస్మృతి

సన్నిధానము సూర్యనారాయణశాస్త్రిగారు

౧

గీ. ప్రేయసీ! నాకుఁగలకార్య వేగతమము
కప్పిపుచ్చంగ నీమోముఁ గాంచకుండఁ
బ్రాణసమమైన నీతోడఁ బలుకకుండఁ
దనివిదీఱంగ నొకముద్దుఁ గొనకయుండ
నాప్రయాణంబు సాగించినాఁడ నాఁడు.

౨

బండి సాగుచునుండె; నాభావవీథిఁ
దెలియరాని వికృతి ధూళికలఁవైచె
స్మృతికి వచ్చినటులుండె స్మృతికిరాదు
నాదు విస్మృత విషయసంతతిలతాంగి!

3

కొంతకాలంబు గందర గోళపడఁగ
నీదు మంగళమయమూర్తి నిలిచెనెదుట
వ్రేలు గొఱుకుచుఁ గూర్చుంటిఁ జానిసేపు
పుచ్చినట్లుగ నాబుద్ధి; మూతపడిన
యట్లు నాదైన ధారణ యాత్మఁగంటిఁ
బావకార్యంబు నేసిన భాతిమనసు
నొచ్చుకొనుచుండె సూదుల గ్రుచ్చినట్లు
దేహబంధంబు సడలెను; దీప్తితఱఁగె
బరువుగాఁ దోచుచుండెను బయసిమపుడు;

౪

మొదట నీవె విస్మృతినిద్రఁ బుచ్చినన్ను
మాలదైవంబ! స్మృతిచేత మేలుకొలిపి
తకట! నేఁగుందు చుండంగ హర్షపడుచుఁ
దాండవింతువు కాఁబోలు! గండుమీఱి.



రాజా ధనరాజగీర్జీగారు



రెడ్డిగ్రంథాలయము (హైద్రాబాదు)
రెడ్డిహాస్టల్ వారి (నూతనభవనము)



# ఆంధ్ర సామ్రాజ్యము

శ్రీ శేషాద్రిరమణకవులు.



సమధిక చక్రవాళగిరి చాడ్పున నున్నతభావమూనఁ; సువృ
త్తమునగు కోటగోడఁగని, దర్శన లాలసమానసంబుతో
విమలతరప్రభాత రుచివిశ్రుత శాద్వల లీనదుర్గమా
ధ్వమున నినుంగనుంగొనఁగ వచ్చితి నిత్తఱి నోరుగల్లుపురీ.

తే. గీ. జీవనదిమాడ్కి పరిశుద్ధ జీవనమున
నలరు నిర్మల పరిఖా తటాంచలములు
కటకటా? కూలినిస్సార కల్మషాంబు
సిక్త పంకిల భూములై చెన్నుతొఱఁగి.

ఉ. వైరివితానదుర్గమము ద్వారము పూర్తిగఁ గూలిపోయె, దు
ర్వార మనోహరాంధ్ర కవిరాజవిరాజిత పుణ్యభూమిలోఁ
ఘోరకఠోర ఘూకకృత ఘుర్ఘురరావము మేరమీఱెఁ గూ
లారెను గాకతీయ సముదగ్రపరాక్రమ భాసురాంకముల్

తే. గీ. పిఱికికండ నెఱుంగని బిరుదుమగలు
మహిత నవలక్షధానుష్క మణులు మెలఁగు
పుణ్యభూమిని పరదాస్య బుద్ధిబద్ధు
లల్పసంతోషులే కననౌదురకట.

ఉ. చారువిచిత్రశిల్ప విలసత్తగముల్ నరపాలమందిర
ద్వారము లక్కటా! మహితవైభవ శూన్యములై మహాగ్రహ
స్ఫారవిరోధిరాజ కలుషక్రియకోర్చి యపూర్వ శిల్పశృం
గారవిలాసముల్ విడువఁగా గమకించుచునుండె నక్కటా!

చ. పగతుర రక్తవాహినులపై, నిజపౌరుష రక్తదీధితుల్
స్థగితమొనర్చి యాంధ్రనృపు సైన్యముపోరి జయంబుగన్న పు
ణ్యగుణవిశిష్టభూములకటా నికటస్థవనాటకర్షక
ద్విగుణితలాంగలాహతుల దిక్కరుచుండె ననేకభంగులన్.

సీ. అల్లవిద్యానాథుఁ డనుపమ సుకవితా
మహిమచూపిన మాతృ మండలంబు
తిక్కన సుకవితా దివ్యామృతంబుచేఁ
బరమపావనమైన భాగ్యభూమి
నవలతుః ధానుష్క నాథవిక్రమవహ్ని
రాజివెల్గిన పవిత్రస్థలంబు
ఆంధ్రకుమార ధైర్యస్థైర్య విక్రమ
సంపదావృతమైన జనపదంబు

తే. లలితమోహన శిల్ప కళాకలాప
చిత్రదేవాల యానేక చిహ్నితంబు
ఓరుగల్లు పురంబునేఁ డున్న తెఱఁగుఁ
గనఁగొనిన గుండె తార్మారు గాకయున్నె.

చ. తిరుగుచునున్న కొండల గతిం బురచించెడి మత్తుటేన్గులా
కలవయిపోయె, సంగరముఖంబున మార్తుర నోర్చివిక్రమా
కరులయి యున్న యాంధ్రుల వికాసము విస్మృతినొందె; పూర్వసుం
దరతర రాజమందిర వితానముహూపశా నల్ గెలంకులన్.

మ. కదసంబంధుఁ ప్రతాపరుద్ర ధరణీకాంతుండు గెల్పొంది స
ర్వదిగంతంబుల సుస్థిర ప్రతిభ మీఱంగొన్న విఖ్యాతి శా
స్త్రదముల్, శాసనసంచయంబు లకటా పర్యంత జంతుచ్ఛటా
పదసంఘట్టన జాతదైన్యదశకుం బాలయ్యె నిర్మూలమై.

కం. తులలేని రాజభవనపుఁ
జలకప్పను విగ్రహప్రతానము చెడె స
ల్లైలకులఁ బడియున్నవి యాం
ధ్రులశిల్పము దెల్పుశిలలు తునుకలగుటచేన్.

ఉ. రాజగృహాంతరాళముల రక్కసకంపలు నిండె, నాలయ
ప్రాకృత గోపురాగ్రనికరంబులు సర్వము నేలమట్టమై
తేజము డిందె, నాంధ్రజగతీ విభుకల్పిత విగ్రహాళికిన్
బూజలు శూన్యమయ్యె, సరిపోయెను బూర్వ మహాత్త్వమంతయున్.

సీ. పందులు పొరలాడ పాడుబొందగ మాఱె
లాలితంబగుశోభ నాలభవి.
పాపకర్మములకుఁ బ్రథమ శరణ్యమై
రామణీయకమాఱె రాచనగరు
పూజా పురస్కారములకు దూరంబయ్యె
శ్రీస్వయంభూనాథు జీర్ణగృహము
పంకిలదుర్గంధ పర్ణాంబు వృతమయ్యె
పావనక్రీడా సరోవరంబు

తే. గీ. పాడువారినపూర్వ వైభవములెంచి
పూజ్యచారిత్ర కాకతి రాజ్యలక్ష్మి
దీనవదనంబుతోడఁ జింతించుచుండె
నరయఁ జనుదేరరాదెనీ వాంధ్రతనయ.

ఉ. కూలిన యాలయంబులును గుర్తులుమాత్రము నానవచ్చు దే
వాలయ సన్నివేశము లసంతమనోహరశిల్పవైభవ
శ్రీలకుఁ దావకంబులగు చిత్తరువుల్ ప్రకృతాంధ్రపాలిక
స్నిభుల కాటపట్టులయి నిండె "నోరంగలు"నల్ కెలంకులన్.

తే. గీ. పసుపుఁ బట్టలతోవచ్చి భర్తృచితిని
దుమికి సహగమన వ్రతాదుల నొనర్చి
పేరుగాంచిన యాంధ్ర సాధ్వీపవిత్ర
మందిరములెల్ల నేటికి మాటుమడఁగె.

చ. వితతశిలాభిరామ పదవిస్తృతమై రమణీయమై సమం
చితమగు జాతికోటను రచింపఁగ నెంతధనంబుబట్టెనో
బ్రతుకును బన్నిదంబునిడి పౌజదియెంత నశించెనో పురా
కృతమునఁ బూర్వవైభవముకీడ్వడెఁగాక విరోధులోర్తురే.

తే. గీ. అమల గోదావరీ పవిత్రాంబుపూర
సహిత నిత్యాభిషేక సంపదలఁ బడసి
పేరుగాంచిన విగ్రహావారమునకుఁ
జేకురియె ధేనురక్తాభిషేక గరిమ.

సీ. గోలికాయలనాడు వేళమార్తురవ్రచ్చు
శరలక్ష్యవిద్యను సంగ్రహించి
డాఁగురుమూఁత లాడఁగ నేర్చినప్పుడే
పరదుర్గ భేదన పటిమనెఱిఁగి.
నాల్గుస్తంభాలాట నాఁడె వైరివ్యూహ
నిర్మథనైక పాండితి గడించి
జోలపాటలవిను బాలత్వమునరిపు
సింహనాదము జెవి జేర్పనేర్చి

తే. గీ. ఉగ్గుతో వీరరసవిక్రమోగ్ర గరిమ
యలవరచి పేరుగొన్న మా తెలుఁగుజాతి
భూరి పాశ్చాత్య భేతాళమూర్తి చెంత
బందెగొఱ్ఱెల మందగాఁ బరిణమించె.

చ. ఎలమిప్రతాపరుద్రమనుజేశ్వరుఁ డేనుఁగునెక్కి సంపదు
జ్జ్వలమగు నేఁజారునఁ బ్రచారము చేసెనొ యప్పొలంబులో
మొలచెఁ గఠోరకంటకసమూల మహాతరువుల్ తదంతిక
స్థలములు దుర్గమంబులయి దైన్యముఁగూర్చెడిఁ బ్రేక్షకాళికిన్.

ఉ. ఎన్నిప్రబంధరాజముల కీగృహముల్ నెలవై పురాతనా
భ్యున్నతి సాటెనో బుధగణోదిత వేదసుధాద్రవంబుచేఁ
బున్నెపుఁబంటలై భవనముల్ మునుపెన్ని ప్రశస్తినొందెనో
కన్నులఁ జూడమైతి మిలఁ గాకతిరాజ్యముఁ పేరడంగుటన్.

క. శ్రామారణ్య త్రిపాద
స్వాముల పూజావిధాన సత్కారసము
ద్ధాముఁడవైన స్వయంభూ
స్వామీ నీకెట్టిపాటు సమకూరెదుర్దీ.

ఉ. చారుమరాళహేమ కలశప్రథితంబులు రాజమందిర
ద్వారములెందజాంధ్ర నరపాలురకుఁ నెలవయ్యెనో మహో
దారకవీంద్రనవ్య కవితాసుధలోల్కు బవిత్రమయ్యెనో
దారుణకాల పూరుషుని దర్పము చేఁజెడెఁ దొంటిభాగ్యముల్

సీ. కఱగిపోనుండె నాకాశస్థలస్పృశత్
విస్తృతప్రాకార వితతులెల్ల
పూడిపోవుచునుండె భోగీంద్రపట్టణ
పర్యంత లక్ష్యముల్ పరిఘలెల్ల
నశియించుచుండె ననన్యచిత్రవిచిత్ర
శిల్పదేవాలయ సీమలెల్ల
కూలారుచుండె భూపాలధైర్యౌదార్య
సంవృతంబగుదుర్గ సమితియెల్ల

తే. గీ. మహిత నవలక్షధానుష్క మండలేశ
పూతరక్తస్రవంతికా వ్రాతపిహిత
రవిమహోబింబ మాంధ్రసామ్రాజ్యమకట
అంతరించునె? కాలగర్భాంతరమున.





# గంగాపుర చరిత్ర

(పి. సూర్యనారాయణశాస్త్రిగారు.)

ఒక సంవత్సరముక్రింద శ్రీమాన్ దూపాటి వెంకట రమణాచార్యులవారును నేను గలసి మహబూబు నగరము జిల్లాలో కొంత భాగమున శాసన పరిశోధనార్థమై పర్యటనము గావించి యుంటిమి. మొదట మహబూబు నగరమునకు దక్షిణమున బూదపురను తాటికొండ గ్రామముల రెండిటను గల శాసన ప్రతి బింబముల గైకొని యంతట దూర్పుదిక్కున గల జెడిచెర్లలో బ: జూచుకొని తత్సమీపమున నాలుగు మైళ్లదూరమున కల్వకుర్తి రోడ్డు ప్రక్కనగల గంగాపురము చేరితిమి. మిగిలిన వారము దినములు నీ గ్రామమునందును దత్పరిసరముల శాసన పరిశోధనకై యుంటిమి. అయిన నచ్చటి శాసనముల నెల్ల సంపాదించుట కవకాశము చాలినది కాదు.

2. గంగాపురము బహు చారిత్రక ప్రాముఖ్యత వహించిన యొక స్థలము. అది ప్రస్తుతము కే. శే. సయ్యద్ నూరుల్ బాషీఖాన్ సాహెబుగారి జాగీరులోని ముఖ్యగ్రామము. ప్రస్తుతము కోర్టు ఆఫ్ వార్డ్సు యధీనములో నున్నది. 400 గృహసంఖ్యయు 1700 జనసంఖ్యయు గలదు. రోడ్డు ప్రక్కనయుండియు చుట్టు ప్రక్కలకెల్లపెద్ద గ్రామముగా నుండియు, జెడిచెర్ల గుల్లపల్లియను రెండు రైలు స్టేషనులకు సమీపమున 4 మైళ్ల దూరమున నుండియు నిప్పటికిని గొందరు ధనికులయిన వర్తకుల కాలవాలమై యుండియు, ప్రతి సంవత్సరమును వేల జనము నాకర్షించు జాతరగలదై యుండియు నభివృద్ధియం దెంతయో వెనుకబడి యున్నది. ఆ గ్రామమున బోస్టాఫీసు లేదు. ప్రారంభ పాఠశాలయయిన లేదు. కాని యచట మహమ్మదీయ బాలురకు అంజమన్ తబ్లీగె ఇస్లాము పక్షమున నొక ప్రాథమిక పాఠశాలయొకటి యున్నది. ఇప్పటికి రెండు సంవత్సరములనుండియు బని చేయుచున్నది. కావున భజన సమాజముగాని, వాచనాలయముగాని, గ్రంథాలయముగాని పరపతి సంఘముగాని లేవని వేఱ చెప్పుట నవసరము.

కాని యీ గ్రామప్రముఖులైన శ్రీయుత అనంత రెడ్డిగారికిని జి. పాపయ్య శర్మగారికిని గోల్కొండ సుజాతలును, తెనుగు పత్రికలును వచ్చుచుండెను. శ్రీమాన్ ఆచార్యులవారి యాగమనము వలన లాభము పొందునిచ్ఛతో శ్రీయుత రెడ్డిగారి కుటుంబములోని నారాయణ రెడ్డిగారును బుచ్చా రెడ్డిగారును సభల నేర్పాటుచేసి వారిచే ... ప్రబోధముచేసి గ్రంథాల

యీ స్థాపనోన్ముఖుల గావించి నొక సభలో రు ౫౦౦ రూప్యముల నటకును వాగ్దానముల గైకొని వసూలు చేయుటకును గ్రంథాలయము నడుపుటకు భారము పూని మాయెదుట వాగ్దానము గావించిరని మాత్రమిచట దెలిపిన యప్రస్తుతము గాదు.

౩. అది యేమి దురదృష్టమో గాని తరుచు చారిత్ర ప్రాముఖ్యత హెచ్చు గాగల స్థలములు జాగీరులుగా నుండి తమ పూర్వౌన్నత్యమునెల్ల బొత్తిగా విస్మరించుటయే గాక ప్రస్తుత విద్యాది విషయముల హైన్యము బొందినవి. ఇందున కొక ముఖ్య కారణము గమనింపదగి యున్నది. జాగీరుదారులు దరుచు నిరంకుశముగ బ్రవర్తించుట కలవాటుపడి యుండుటయో లేక తమ జాగీరు వ్యవహారములను స్వయముగా జూచుకొనకయన్యాయత్తము నేసి యుంటనో యందలి ప్రజలభివృద్ధి బొందజాలకనే యుండిరి. భోగ లాలసులయిన జాగీరుదారులు స్వయముగా శ్రద్ధ గైకొనువా రుండిన నాత్మ సుఖ సంపాదన వ్యాపార నిరతులయిన కతన బ్రజల యభివృద్ధికై ప్రయత్నించు టటుండ తమ యభీష్ట పరిపూర్తికై ప్రజల బీడించి వారి నెన్నియో విధముల నడచి వారి ప్రాథమిక స్వాతంత్ర్యముల దోచికొని వారి ధనమానము లపహరించి వారి పతనమునకు గారకులైరి. ధన సంపాదనా దాహము గొని యున్న కొందఱు జాగీరుదారుకు బదులు వ్యవహారముల నిర్వహించు చుండుట తటస్థించిన బ్రజల బాగు పెంపులు స్వప్న వార్తయే. ప్రజల నిరంతతము తమ ప్రాణ ధన మానముల భీతిలో గాలము గడుపుచుండ వలసి యుండిన కారణంబున నన్య విషయములో మనోద్యోగముల దలంచుటకయిన యవకాశ ముండెడిది కాదు. విద్యావంతు లనిపించు కొనుచుండిన జాగీరుదారులు మొదలయిన వారును గోరుచుండినదిదియే. తాము స్వయముగా బ్రజలకు విద్యాది సౌకర్యములు గలిగించిన దా మొనర్చు యాగడముల కభ్యంతరములు గలుగునను సంకుచితాభిప్రాయము తోడనే వారయిన సంపాదించు కొనుట కవకాశ ముండ నీయరైరి. నీతి బాహ్యమయిన సుఖమున పేక్షించు వారికి ధర్మచింత యుండదు కదా!

పై వర్ణితమయిన పరిస్థితు లిపుడెన్నియో ధనికులయిన పటేలు పట్వారీలుగల గ్రామములందు గన్గొన వచ్చును. అందువలననే సట్టవారలుగల చోట్ల విద్యావిషయకోద్యమములకు బ్రజ లందు వ్యాపకము కలుగదు. ఇంతయేల యొకచిన్న గ్రామమున నొక ప్రాథమిక పాఠశాల ప్రధానోపాధ్యాయుని ప్రోద్బలమున కృషికులు కొందఱు తమ బాలురను బడికి బంపుచుండగా నాయూరి ధనికుడయిన పటేలు వారలజూచి "ఏమిరా! మీ పిల్లల జదివించి తాస్సీలుదారుని గావింతువు గావా?" యని బెదరించి బాలుర నిలిపించుటయు, విద్యాభిమానియయిన యీ యుపాధ్యాయుడు పట్టుదలతో నా పటేలునకు గ్రమముగా బోధించి యాతని యుదారుని గావించి యాతని చేతనే యా బాలుర రావించి తన స్కూలు నభివృద్ధి గావించు కొనుటయే గాక నాతని సాయమున నొక గ్రంథాలయమును స్థాపించుటయును స్వయముగా నెఱుగుదును. అది యటుండె.

౪. గంగాపురము మంత మర్భర స్థితియందు లేకుండిన నింతవఱకే ప్రయత్నము, ప్రారంభించి కొనసాగింపబడి యుండలేదు. ఇది యిటు

లుండ శిల్పకళానైపుణ్యము గొనియాడువారెవరు? పూర్వ చారిత్రికోన్నతి దలంచికొనియెడు వారెవరు? శిథిలమగుచున్న శిల్పములగాపాడ శ్రద్ధ గైకొనకున్నబోయె; నున్నదయిననుండునటులుంచెడివారైన లేరైరి. నిజమయిన విద్యావ్యాప్తి లేని కారణంబున జనసామాన్యమునకివన్నియు వెర్రిగా గాన్పించుటబ్బురము గాదు. బాపనయ్యకు సంభావన సాహిత్యములు దొరకని పనిగాని వైశ్యునికి నాలుగు కాసులు లభింపని వ్యాపారముగాని, యుద్యోగికి పది రూప్యములు లంచము లభింపని కార్యముగాని, కూలివాని కానాటి కూటికి రాని ప్రయత్నముగాని విశాల దృష్టి లేనియెడ వ్యర్థముగా గాన్పించుట సహజము. స్వార్థలోభము మేలు దలపోయనీయదుగాదె!

5. గంగాపురముయొక్క భౌతిక స్థితి నెఱుగుట కొంత యవసరము. గ్రామము సముద్ర మట్టమునకంటె చాల యెత్తయిన నొక మిట్ట భూమిపై గలదు. కావున మిడివేసవియందు నిచట జల్లగానుండును. భూమి యిసుక గులకపారుగలిగిన గట్టి యెఱ్ఱభూమి. కావున నచట మంచినీటి బావులకు గొఱతయే లేదు. గ్రామమునకు జుట్టును రెండు కుంటలు నొక చెరువును దిగుడుబావులు సేద్యమున కాధారములుగానున్నవి. అచటి భూములలో 10 వీసములు పల్లమును 6 వీసములు మెఱకయునుగా సేద్యమగును. గ్రామమున కీశాన్యమున జాగీర్దారుగారి తోటయొకటి 25 యెకరముల పరిమితి గలదు. ఇందు ఫల వృక్షములు, శాకములు పెంపబడుచుండును. మధ్య నొక భావియును గలదు. చాల రమణీయకముగా నుండి యొకప్పుడౌన్నత్యము ననుభవించిన వైఖరి బ్రకటించుచుండును. గ్రామముచుట్టు నొక విధమైన యౌదార్యము గాంభీర్యము, నౌన్నత్యము నిప్పటికి స్ఫురింపజేయు స్వాభావిక సౌందర్యమొకటి గలదు. అచట భూములు నచటినైసర్గిక ప్రాంత దృశ్యములు గాంచిన నెవ్వనికైన యుత్సాహము, ధైర్యము, భక్తియు గౌరవము హృదయమున మొలకెత్తును. కాని చూపుల మిగుమిట్లు గొలుపునది గాని, మనంబున భయము నించునదిగాని యందెద్దియును గాన్పింపదు. ప్రకృతి బహు నిరాడంబరము, మృదువునైన బహు నిమ్నము. చూడ జూడ నరివీరమాన నిభేదనా దక్షులగు నృపహర్యక్షుల శౌర్య రసోత్సేకంబుగన్న దిక్కులు గాంభీర్యము, తత్పవిత్రోష్ణ రక్త పరిపావితమై గడ్డకట్టి నక్షత్రములు భక్తియు, నిర్మల మందాకినీ నిర్ఝరీనైరర్గళ్య ప్రసన్నత వహించిన పూర్వకవివర్యుల వాఙ్మాధుర్యము సూచించు తేటనీరు ప్రేమోత్సాహముల, ననన్య సామాన్య శిల్పనైపుణ్యమున కాలవాలములై వెలయు దేవాలయములౌదార్యము బోధించుచున్నటు లెఱుంగనగు.

6. గంగాపురము బహు పురాతన కాలమునుండి ప్రశస్తి ననుభవించినదని తెలుపుటకు స్థానికులు "మాయాపురీ, మత్స్యపురీ దురిత కోలాహలం, కలియుగే గంగాపురీ," యనువాక్యము నుడువుచుందురు. దీని నాధారముగా జేసికొని కొందఱీ పట్టణమే కృతయుగమున మాయాపురి యనియు, త్రేతాయుగమున మత్స్యపురియనియు ద్వాపరయుగమున దురిత కోలాహలమనియు, బ్రసిద్ధినొందెనని యనుచున్నారు. మఱికొందఱు కృతయుగమున మాయాపురియు, త్రేతాయుగమున మత్స్య



రెడ్డివిద్యార్థి వసతిగృహము (భోజనశాల)



క్షీరరామేశ్వరాలయ గోపురమందలి యజ్ఞోపవీతధారులగు
రెడ్లవిగ్రహములు (పాలకొల్లు)



ట్రాక్టర్లు (పూనా)

పురియు, ద్వాపరమున దురిత కోలాహలము నెటుల ప్రసిద్ధిగాంచెనో కలియుగమున గంగాపురము నటుల ప్రసిద్ధి గాంచెనని యందురు. ఈ రెండంశములలో నేది నిశ్చయమో నిర్ధారించుట కింతవఱ కాధారము లెవ్వియు లభించలేదు. గంగాపురమునందు తత్ప్రాంతమున లభించిన శాసనములలో స్థానిక చరిత్రాంశము లెవ్వియు గాన్పింపలేదు. ఒకటిరెండు శాసనములీ విషయమును గురించి వ్రాయబడినవి శకలములే లభించెను గాని పూర్తిగా దొరకవయ్యె. లభించిన భాగములలోనైన నేయాధారము జిక్కకపోయె. కాని కొన్ని శాసనముల లిపినిబట్టి గంగాపురము పదునైదువందల యేండ్లనుండి యైనను ప్రాముఖ్యత నొందియుండెనని చెప్పవచ్చును.

7. ఇచ్చటికొక మైలుదూరములో జెడిచెర్ల కల్వకుర్తి రోడ్డుపై 53 మైలురాయిదాటి 2 ఫర్లాంగులు నడచిన యొక చారిత్రక దృశ్యము గాననగు. రోడ్డునకు గుడిచేయివైపున 50 గజముల దూరములో నిటుకతో నిర్మింపబడిన యొక మందిరము గాన్పించును. ఇదియొక గుడియాకారముగ నుండునుగాని గుడిగాదు. ప్రస్తుతమిది శిథిలావస్థలో నున్నదికాని మానవుని చేయి దీనిపై బడకుండినచో నింక నెన్నియో శతాబ్దముల జూడగలదు. ఇది సుమారు 55 అడుగుల యెత్తును 110 యడుగుల వలయమును గలిగి పైకి బోనుబోను వలయము సన్ననగును గోడ సుమారు గజమున్నర మందముగానుండును. ఇటుకయు సున్నము దప్ప నందు వేరెద్దియు నుపయోగింపబకలేదు. గోడలపై శిల్పమేదియులేదు. లోపల విగ్రహము లసలే లేవు. దీని ప్రక్కనే రెండు త్రవ్వబడిన భాగములు పద్మదళాకారములుగ గన్పించును. మధ్యభాగము వలయముగానున్నది. చుట్టునెత్తుగా దిబ్బవలెనున్నదిగాని నాలుగు గజముల లోతుగా త్రవ్వబడియున్నది. అగతట నిటుకయు సున్నము గాన్పించును. శిల్పము బౌద్ధులకాలమునాటిది. ఇవియే బౌద్ధస్తూపములు. బౌద్ధస్తూపము లనగా శాంతిహిత్యహింసాసందేశ దూతయు ధర్మజ్ఞుడైన గౌతమ బుద్ధుడు తన భౌతిక దేహమును వదలగనే యతని యనుచరులయిన సన్యాసు లొక కొందఱా మహాత్ముని దంతముల నెముకల నెవరికిలభించినవి వారు స్మశానమున సంగ్రహించి యాసేతు సీతనగ పర్యంతముగల భారతావనిలో నప్పుడు ప్రశస్తిగాంచిన పట్టణముల నెలవేర్పరచుకొని తమ మతవ్యాప్తికై నిరంతర కృషిగావించు చాయాప్రాంతముల నేలికల సాయమునదాము సంగ్రహించి తెచ్చిన స్మారక చిహ్నమును దమతమ యార్థికస్థితి యనుకూలమొసంగిన రీతి బంగారు లేక వెండిపాత్రములలో నునిచి యద్దానిపై బైవర్ణింపబడిన విధమున నొక మందిరము లేక స్థూపము నిర్మించిరనియు నామందిరముల మిక్కిలి భక్తిప్రేమలతో గాపాడుచుండెడివారనియు క్రమముగా నాస్థానమునకు ముఖ్యులుగానుండిన వారలు మరణింపగనే వారి శిష్యులు వారికి ప్రధాన మందిరమునకు చుట్టును బద్మదళాకారముగ సమాధి నిర్మించి యందు వారి స్మారకచిహ్నము నునిచి పూజించుచుండెడివారనియు దెలియవచ్చుచున్నది. ఈగత్యము నచ్చట గన్నులార గనుగొనవచ్చును.

గంగాపుర నివాసుడైన వైశ్యుడొకడు తనయింటికి గావలసిన యిటుకకై నొకదిబ్బ త్రవ్వించుచుండగా నొక స్వర్ణపాత్ర దొరకినదని

గ్రామమున బ్రబలమైన వదంతి గలుగుటయు నంత నాతనిపై బోలీసువారొక యభియోగము దీసికొనిరాగా, యది యిపుడు జెడిచెర్ల డిప్యూటి కలెక్టరుగారి విచారణలో నుండుటయు బైవర్ణింపబడిన విషయమును బలపరుచు చున్నదని చెప్పవచ్చును.

పైవాని వెనుక దక్షిణభాగమున నల్లచెఱువు కట్టపై మరియొక స్థూపముండిన గుఱుతులు గాన్పించును. ఆదిబ్బచుట్టును వీరుల విగ్రహములుగలశిలలేడు మొదటివరుసలోగలవు. రెండవ వరుసలో నాలుగు శాసనములు గలవు. ఆలిపి 1500 వందల సంవత్సరముల నాటిది. మధ్యభాగమున నెడమ కుడివైపుల నొక్కొక్క జతరాళ్ళు పాతబడినవి గలవు. ఒక్కొక్కదాని పై నొకపాదము దానిమధ్యమున ధర్మచక్రముతో నున్నవి. పాదము 45 అంగుళముల పొడవును 27 అంగుళముల వెడల్పును గలదు. ఈ జంటలమధ్య శాంతభావ ప్రకటనతో 3 శిరములు గల శిలలున్నవి. ఇట్టి స్థూపమె యొకటి గంగాపురమునకు రెండుమైళ్ల దూరములోగల కృష్ణాపురమునందు సగముభాగము భూమిలోనికి గలదు. ఇదంతయు 1500-2000 యేండ్లనుండియు గంగాపురము ప్రసిద్ధస్థానమని దెలుపుచున్నది.

8. అద్వైత మతమురాగ బౌద్ధమతము నాస్తికమతముగా బరిగణింపబడి క్షీణస్థితికి వచ్చిననాటనుండియు గ్రమముగా బ్రజలకీమతమునందసహ్యము గలిగియుండును, ఈ అసహ్యము రానురాను శ్రుతిమించిన రాగమున బడగా వారి శిల్పములైన నేవంగిపు [illegible] లు. వానిని నిర్మూలింపక బోయినను బహిష్కరించిరి. దానికి నీచములగు పేర్లుబెట్టిరి. ఇప్పటికి వానిని గొల్లత్తగుళ్ళనియు లంజెగుళ్లనియు ననుచున్నారు. బౌద్ధవిజ్ఞాన ప్రాబల్యమున గన్నులు దెరచిన లోకము వానినంతట నిలచియుండ నిచ్చెను. తత్స్థానము నాక్రమంచిన మతమును గొల్లత్తగుళ్ళ వినాశనమునకు హేతువుగాలేదు. శిల్పవినాశనమంతయు 11-17 శతాబ్దముల మధ్య బూర్తియయినది. క్రమముగ వేలయేండ్లక్రిందటినుండియు ననేకమతముల మార్పులకు లోబడక యవిచ్ఛిన్నముగా బ్రబలిన హైందవ విజ్ఞానము కృశించినదియు నాకాలముననే. హైందవేతరుల పరిపాలనల యొత్తిడిలో బ్రజలు నానాటికి క్షీణగతికివచ్చి నిస్తేజులైరి. ప్రజలం దజ్ఞానమును మూర్ఖమును హెచ్చిపోయెను. తమభూతమును మఱచిరి. వర్తమానము నెరుగరైరి. భవిష్యత్తునకు జింతింపరైరి. వారిచర్యలు నానాటికి వారినే నిర్బధించుచుండెను. తమ వినాశనమునకు దామే తోడ్పడిరి. అందున రానురాను నేడు మన వారలజ్ఞులై యన్యమతావేశుని క్రూరహస్త ప్రఘాతములచే హతశేషములయ్యు బూర్వ ప్రతిభనస్మృతి పథమునకు దెచ్చుచున్న మృదు శిల్పములు నశించుచుండగా గన్నులార జూచుచుండుటయు, దాము స్వయముగా గొన్నియెడల వాని వినాశమునకు గారకులగుటయు గన్గొనుచున్నాము. పూర్వ రాజన్యుల చరిత్రల నెఱుంగుటకు ముఖ్యాధారములయి యున్న యెన్నియో శాసనములు వాకిండ్లముందఱ మెటకును బావులయొద్ద బ్రొక్కుడురాళ్లుగను, స్తంభములక్రింద బునాదిరాళ్లుగను, రోళ్లకును, ఖల్వములకును వినియోగింపబడినవి. ఇటులెన్నియో పవిత్రరాజకుటుంబముల చరిత్ర మంటగలసె. గంగాపురమున శాసనపురాళ్లు తరుచీ శోచనీయస్థితి

లో గనుగొనవచ్చును. ఇంతకుముందె రెండువే లయేండ్లనుండియు నవ్యాహతముగా నిలచియున్న బౌద్ధస్తూపముల(గొల్లత్తగుళ్ళ)దమయిండ్లయిటుకకై పడగొట్టినపుణ్యాజనులుగలరని తెలిసికొంటిమి. ధనాశాప్రేరితు యి లోకజ్ఞానశూన్యులయిన మూర్ఖులెందరోమతాంతరులశిల్పభేదన ధనాపహరణాదిగాథలు గొంతవరకు గర్ణాకర్ణికగవిని యెన్నియో శాసనములవాటిక్రింద ధనముగలదని దురూహతో వానిస్థానమునుండి త్రవ్విపారవయిచి పాడుచేసిరి. ఇప్పటికినిగ్రామ్యులయినవారు శాసనశిలపై వ్రాయబడినవిషయముబూర్ణముగా జదువగలిగినవారికి ధనము లభించుననియు, నెందరోయటులసంపాదించికొనిరనియు, శాసనపరిశోధకులు ధనాపేక్షలేకయే వ్యయప్రయాసలకోర్చి తిరుగుటకు వెఱ్ఱికారనియు ననుమానముతో జూడబడుటొకవింతగా

9. గంగాపురము దత్పరిసరముగల శాసనములలో బౌద్ధస్తూపంబుల సమీపముననున్న విగాశ పెక్కులు వేయిపదునొకండువందలయేండ్లక్రిందటివి. అవి ౮౦౦-౯౦౦క్రీ. శ. మధ్య విజృంభించిన పశ్చిమచాళుక్యరాజుల సంబంధమయినవి. ఈగ్రామమున నేప్రక్కద్రవ్విన నెద్దియోయొకవిశేషము బయలువెడలును. ఒకశాసన మొకశిల్పశిలావిగ్రహము, రాతివలె కఠినమై యంత్రములచే సిద్ధముచేయబడినవాని బోలిన పలురంగులయిటుకలుగాన్పించును. ఇంతకుమున్నె బౌద్ధస్తూపములందలి యిటుక రెండువేల సంవత్సరములనాటిదయ్యు నిప్పటికిగడ్డపారపోటునకు లొంగనిదయి యున్నదనిచెప్పంబడియె. ఆ యిటుకయెగ్రామము ని పెక్కిండ్లకుపయోగింపబడిన శాసనములు విగ్రహములు మాత్రముచాళుక్యచారిత్రికవైభవమునకు దార్కాణములుగానున్నవి. శాసనములో దరుచు జగదేకమల్ల చాళుక్యత్రిభువనమల్ల జాళుక్యధరాధిపులనేకులు బిరుదావళులతో గలవు. జగదేకమల్ల చాళుక్యుడు పదునొకండవశతాబ్దమున బశ్చిమ చాళుక్యరాజధానియగు కోడూరు(కోడూరు మహబూబునగరము స్టేషనుతరువాతిస్టేషను)పురంబున రాజ్యమేలెనని తెలియుచున్నది. త్రిభువనమల్లదేవుడాతనితరువాతప్రసిద్ధుడయిన చాళుక్యరాట్పుంగవుడు. ఈతడుపంన్డెండవశతాబ్దమునాటివాడు. శాసనములన్నియు వీరునువీరివంశీయులు నొసరించిన దానములసంబంధమయినవి. ఈశాసనములందు గాకతీయ రుద్రదేవునిచే నిహతుడయిన తైలపదేవుని ప్రశంసయుగలదు. శాసనములబట్టి యీచాళుక్యరాజన్యుల చారిత్రికవిశేషాంశము లెరుంగుట కవకాశముగలుగకపోయిన చాళుక్యులకాలమునందు గంగాపుర మెక్కుడుప్రతిభ గన్నదనిమాత్ర మూహింపవచ్చును.

10. బౌద్ధకాలమునాటి ప్రతిభజాటుటకు స్థూపములేవిధముగ నిప్పటికి హతశేషములై యున్నవో యటులనే చాళుక్యుల కాలమునాటిదగు దివ్యదేవాలయమొకటి గ్రామమునకు బశ్చిమభాగమున ప్రాఙ్ముఖమైయున్నది. దీనికి బ్రస్తుత మర్చకత్వము జేయుచున్నవైష్ణవులేమని పేరిడనను శాసనములందుమాత్రము కేశవాలయమని యుదహరింపబడియున్నది. ఈదేవాలయము నెవరునిర్మించిరో దేవుని నిత్యనైమిత్తికకైంకర్యమున కేవసతిగల్పించిరో వారివంశావళియెద్దియో దెలుపునట్టిదగు శాసనశకల మొకటిలభించినది. అది మూడుప్రక్కలచక్కని చాళుక్యలిపితోవ్రాయబడియున్నది: కాని యొక్కప్రక్కన పీఠికలో బ్రశంసాభాగమును వేఱొక

ప్రక్కన సమాప్త భాగమును వేరొకప్రక్క నమధ్యదానాదికములు గలవు. కానియందొకచోటను రాజనామబిరుదావళి గన్పింపదయ్యె. వంశానుక్రమణిక ప్రశంస ప్రారంభమగువరకె శకలముగలదు. ఇదెంతవిషాదకరమో చారిత్రికప్రియు లూహింపగలుగుదురు. ఈదేవాలయనామమును బట్టియే గంగాపురమునకు గేశవాపురమనియు నామాంతరముగలిగెనట. ఈదేవాలయము గ్రామమునకంటె నెత్తయినప్రదేశమునగలదు. ప్రథమప్రాకారము పెద్దపాటి రాతిపలకలతో నిర్మింపబడియున్నది. చాలభాగము విధ్వంసమయియుండినకారణమున మొన్న మొన్నటివారలచే బునర్నిర్మితమయినటుల గాన్పించును. గాని మరలనిర్మించునపు డెన్నియో భగ్న శాసనశిలల గూడవేసికట్టిరి. అందువలన లభించుటకు వీలుండిన యా కాలదివిషయము లభింపదయ్యె. దేవాలయ పురోభాగమున రెండు మట్టిబురుజులు గలవు. ముఖ్యదేవాలయము చుట్టు మరియొకప్రాకారముగలదు. ఈ రెండిటిమధ్య చిన్నచిన్నగుళ్ళు చిల్లరదేవతలకై నిర్మితములయినవి. ప్రధానదేవాలయము చాల చక్కనై శిల్పమున కాకరము. శిల్పము బహు మృదువులలితము. శిల్పము జూచినవారి కయ్యది కరగిపోసిన యచ్చువలె గాన్పించు. అందలి చిత్రముల వివిధభంగములు చిత్రించిన శిల్పినైపుణ్యము కాంచువారి కచ్చెరువు గలిగించును. అయ్యది వీరరసోత్పాదక మయినది. కానిమతాంతరావేశపూరితుడయిన యున్మాదుని తీవ్రఘాతమునకు గురియైన కారణంబున నొకచిత్రము సంపూర్ణముగాలేదు. మతోన్మాదపూరితు డెట్టి సాహసమునకైన నొడిగట్టునుగదా!

సింహద్వారము దాటిన నుత్సవమంటపము గాన్పించును. స్తంభములు పెద్దవి. యెత్తయినవి. ఏవిధమైన శిల్పము వానిపై గాన్పింపదు. గర్భాలయము నిరాడంబరముగ నుదారముగ నున్నది. విరాడ్విగ్రహ మంధకారములోగూడమెఱయు నలుపుతో బుష్టిగా నాలుగడుగు లెత్తుగా నున్నది. స్వర్ణరజత వికారమైన భూషణములు గలవు. ఉత్సవ మంటపమునకొక ప్రక్క నుత్సవ సామగ్రియు వాహనాదికములు గలవు. ప్రధాన దేవాలయము గోడలో దక్షిణపుదిక్కున శాసన మొకటి గలదు. రెండవ ప్రాకారము నంటిపెట్టుకొని ఉత్తరపు దిశనొక వాపిగలదు. అందొక గుండము గలదు. ఇందెల్లప్పుడు నీళ్ళుండునట. ఒకానొకప్పుడు శత్రుప్రఘాతములకు వెఱచి దేవుడందు డాగికొనియెనని యచ్చటు లనుశ్రుతమయిన గాథ నొకదాని జెప్పుదురు. ఇది యథాస్థితి గ్రహింపకున్నను, శత్రువులీ దేవాలయము నెదిరించి విధ్వంసము జేయ నుద్యుక్తులయి యున్నపు డర్చకులు బహ్వలంకార భూషితమయిన విగ్రహమునందు వైచి దేవుని మహిమకు భంగము గలుగకుండుటకై నిటుల ప్రకటించియుందుగు. ప్రథమ ప్రాకార సింహద్వారమున కంటిపెట్టియే భక్తులకు నివాసయోగ్యముగ నుండునటుల మంటపము నిర్మించు తలంపుతో నొక భక్తమహాశయుడు కొంతధనము ప్రోగుచేసి చాలవఱకు స్తంభములు సేకరించి యచట యుంచినటుల తెలుపుచున్నారు కాని "శ్రేయాంసి బహువిఘ్నాని" యన్నటుల నయ్యది తలపెట్టినవారు మరణించుటయు నయ్యదంతటనే నిలచిపోయినది. ఏమిలేకుండినబోయె! నున్నదిమాత్ర ముండనిచ్చిన గుడి కట్టించినంత పుణ్యము లభించును. ఈ కేశవస్వామికి మాఘశుద్ధమందు ప్రతివత్సరము తిరుణాల (జాతర) జరుగును. ఈజాతరకు చుట్టు ప్రక్కలనుండి వేలకొలది జనమువత్తురు. దేవునికి

గానుక లర్పింతురు. ఏటేట నీ కానుకలవల్లనే వేయిపై రూప్యములు లభించునని వినికిడి. ఈ దేవాలయమున కినాము లనేకము లుండినవి కాని నేడన్యాక్రాంతమయి కొలదిగా శేషించిన వి. మొత్తము సంవత్సరమునకు వేలోపు రా బడియున్నదని తెలియుచున్నది.

11. ఈయూరుత్తరపుదెశను జాగీరుదారుగారి తోటకు సమీపమున రెండు గమనింపలగిన శిల్పములు గలవు. అందొకటి భీకరమయిన దేవీ విగ్రహము గల చిన్నగుడి, ఇది నిశ్చయము గా గదనరంగమున వెనుకదిరుగు బెలుగని వీర భటులకు ప్రోత్సాహజనకమయిన శక్తివిగ్రహ ముగా బొడకట్టెడిది. దానిప్రక్కనే యొక మంటపమున గజాననునియొక్కయు కాలభైరవుని యొక్కయు బెద్దవిగ్రహములు గలవు. అచ్చట నుండి ఫర్లాంగు మేరలో గ్రామమునకు వాయు వ్య మూలలో నొకచిన్న దేవ్యాలయము గాన్పించి ఇందొక వీరపత్ని శిలావిగ్రహమును జుట్టి వీరపురుషుల విగ్రహములు గలవు. ఆహా! పూర్వుల వీరపూజ ప్రశంసనీయము కదా? ఏత త్ప్రాంత భూములందు రెండుచెఱువులు నాని పై చిన్నదేవాలయము లుండిన గుఱుతులతో నున్నవి. ఇపు డయ్యవిలేవు. గాని భగ్నవిగ్రహ ములు, నందులు, వీరశిలలు గలవు. రెండింటి క ట్టకొమ్ముల పై నొక్కొక శాసనము గలదు. అం దా చెరువుకిందిభూమి దానశాసన వివరములు గలవు. ఆ దానశాసనములు త్రిభువన మల్లదే వుని వంశములోనివారలే నిలిపినటుల దెలి యుచున్నది.

12. గంగాపురము చాళుక్యుల కాలములో బంచక్రోశాయతమయిన పట్టణమని యందురు. అందునకొక స్థానికగాథ గలదు. ఆయూరిగా ని చుట్టుప్రక్కల గల చిన్న పల్లియలలోగాని బొడ్డాయియు హనుమద్దేవాలయమా నాటిదిలే దనియు సేయూరి బొడ్డాయి సిరసవాడలో గల వనియు సిరసవాడవారా బొడ్డాయిని గంగాపు రముదని నుడువుదురనియు జెప్పుదురు. ఇదెంత వఱకు సత్యమో గ్రామమున కీరెండులేమి నిజ ము గాన సంపూర్ణతగా బరిగణింపబడునో తె లిసికొనదగిన విషయము లయియున్నవి. అది యటుండె. మొత్తముమీద నొకవిషయముమా మనింపదగియున్నది. గంగాపురమున కేడనిమి ది మైళ్ళ కైవారములోగల గ్రామములందలి శిల్పములు శాసనము లొకేకాలమునకు సంబం ధించినవియు నొకే శిల్పిహస్తముచే సిద్ధము చే యబడినవియుగా గనిపించును. కృష్ణాపురము నందు మొన్న మొన్నటి హనుమద్దేవాలయపు ముంగలిభాగము స్తంభములక్రింద రెండుశాస నములు జగదేక మల్లదేవుని దానవిషయిక ములయినవి గలవు. ఈగ్రామము నంటికొని యే మీనాంబరియను యేఱొకటి పారుచుండు ను. దీనిప్రభావ మధికమని యందురు. ఇయ్యది యేపురాతన గంగాపుర పట్టణమున పారుచుం డిన యేరందురు. ఈ యేటిపొడుగునను శైవమ త ప్రియులగు చాళుక్యులు కోటిలింగముల స్థా పించిరట. కోటిలింగాల యని యీ యేటి దిగు వ భాగమున కందురు. ప్రవాహగర్భమునగూడ త్రవ్వుచుండ లింగములు, సోమసూత్రములు, నందులు బయల్పడలుచుండెడివట. ఏదెట్టుల యిన ప్రస్తుతమున కృష్ణాపురమునకు దక్షిణది శ పెక్కులింగములు, సోమసూత్రములు, నం దులు కనుచూపందువఱకు గానవగును. కృష్ణా పురమున కెదుర మీనాంబరి కావలియొడ్డున నొక శివాలయము సుందరతరులతా గుల్మపరి వేష్టితమై యొప్పుచున్నది. దీనికొక వైశ్యభక్తు

డు ధర్మశాల గట్టించుచు దానుగూడ నచటనే నివసించుచున్నాడు. ఈయాలయము వెనుక జైనవిగ్రహము గలదు. ఈ ధర్మశాల గట్టించుట కు వలసిన యిటుకయు స్తంభములు నాగుడివెనుకనే త్రవ్వగా లభించినవని చెప్పెను. ఈస్తంభములు బౌద్ధశిల్పము వెల్లడించుచున్నవి. ఈ మానాంబరీ తీర ప్రాంతముననే కానుపర్తియను చిన్న యగ్రహారమొకటి కలదు. అచ్చట శివాలయము నొకటిగలదు. దానికెదుట "శోభనాల" బావి యనబడు బౌద్ధశిల్పము బ్రకటించు దిగుడుబావి యొకటి యున్నది. ఆబావి కుపయోగించిన యిటుకయు గచ్చును నేటికి బలముగానున్నది. వేలయేండ్లు గడచినదయ్యు నేటిదానివలె గన్పించును. మఱియు నీప్రాంతములల శిల్పప్రశంసా కుతూహలులును, శాసన పరిశోధనాసక్తులును, జూడవలసిన గ్రామములలో నెక్కొండ నసీరులాబాద్, వేంకటాపురం మొదలయినవి కలవు.

గంగాపుర చరిత్ర నెఱుగుటకు బూర్వకవులు వ్రాసిన గ్రంథములు మాకెవ్వియు లభింపలేదు. అయిననొక "అలివేల్మంగ పరిణయ" మను గ్రంథము కొంతకాలము క్రింద నీయూర నుండెనని మాత్రము తెలిసినది. ఆగ్రంథము సంపాదించుట కనేక ప్రయత్నములు గావింపబడగా నద్ది మహబూబునగరము చేరినది. మహబూబునగరము పోవుటకు కింకను సందర్భము కలుగలేదు.

13. ఇట్టి ప్రశస్తిగల గంగాపురపు నేటి యవస్థ చూచువారికన్నులనీరు దెచ్చు. గ్రామనివాసులు తమ గ్రామ ప్రతిభ నెఱింగియున్నటులగుపడదు. చరిత్రయందీ గ్రామ మెట్టిస్థానమలంకరింపదగినదో యొక్కమాఱెఱింగిన నిజముగా గర్వింపదగినదని కనుగొందురు. అప్పుడు ప్రతివారికిని దమ గ్రామమం దభిమాన ముద్భవించును. అచటి ప్రతివస్తువునందును బ్రేమ వాడమును. ప్రతిశిలా విగ్రహము నొక బోధకుడగును. అచటి మట్టికనకమగును. నీరమృతమగును. క్రమముగా ప్రజలు తాము నివసించుచున్న గ్రామమునకు యోగ్యులగుటకు బ్రయత్నింతురు. కాని యీస్థితి గలిగించుటకు మొదటిమెట్టేది? అది వాచనాలయ గ్రంథాలయాది సంస్థల స్థాపించిపైపై నచ్చట స్థానికప్రముఖుల నెల్లర జేర్చి వారికి దమ ప్రస్తుతస్థితిని బూర్వస్థితిని దెల్పి విద్యాది వైజ్ఞానిక విషయములందు బ్రబోధించి క్రమముగా వారి గ్రామచరిత్ర వారికి దెలుపవచ్చును, ప్రజలు తలంచిన నెట్టిప్రయత్నమయిన నెరవేరుట కభ్యంతర ముండజాలదు. స్థానికులలో ధనకులు గలరు. దేవాలయాదాయము పుష్టిగనే యున్నది. ఇట్టి స్థితియందు బూర్వశిల్ప చారిత్రికాధారముల సంరక్షణకు వలసిన యార్థికము కొదువబడదు. సర్వమును సులభమే యగునుగాని నిశ్చయ మొకటి యవసరమయి యున్నది. ప్రయత్నము ప్రారంభింపవలసి యున్నది.

గవర్నమెంటు ఆర్షశాఖవారికి నిది శ్రద్ధ వహింపవలసిన విషయము. వారి పరిశోధనల కిచట జాలసామగ్రి లభించగలదు. ఇచట శిల్పశాసనాది చారిత్రిక చిహ్నముల గాపాడుటలో బ్రజలకన్న దమకే యెక్కువ బాధ్యతగలదని యెఱుంగుట వలన దమ ధర్మనిర్వాహణము సంపూర్ణముగ చేయగలుగుదురు. ప్రభుత్వమువారును ప్రజలు నన్యోన్య సహకారముతో బ్రయత్నించిన కార్యము సుకరముగ నెరవేరును.



# పంచముల చరిత్రము

(శ్రీమత్పరమహంస జి.యస్.బి. సరస్వతీ స్వాములుగారు.)

శ్రుతియుక్తమై "ఆత్మవత్సర్వభూతాని, అహింసాపరమోధర్మః। పరోపకారార్థమిదంశరీరమ్" అను నీ ధర్మోపదేశములుజేయు ఈ భరత ఖండమున పంచముల నంటరాదనియును, వారు బహిష్కృతులనియును, జెప్పరాని వారనియు, నిట్లు జెప్పుచు పశువుల కన్న నతినీచముగ వారల జూచుచున్నారు.

2 ఇట్టి వీరలీ భరత ఖండమున గల దేశములలో 1 పంజాబునందు మేఘులు, 2 బంగాళమున నామశూద్రులు, 3 గుజరాతునందును, హిందీలోను దేధులు, 4 మహారాష్ట్రమందు మహారులు, 5 ఆంధ్రమునందు మాల మాదిగలు, 6 తమిళమనగా ద్రావిడమందు పరయాలు 7 మళయాళమునందు చామార్ లేక పులియులు, 8 కన్నడమున వాలితులు, అని యిట్లు వేరువేరు పేరుల బిలువబడుచున్నారు. మఱియు వేరువేరు భాషలను మాట్లాడుకొనుచున్నారు. ఇట్టి వీరందఱికిని కంచపుపొత్తువియ్యపుంబొత్తు గలవని చెప్పుదురు.

3 ఇట్టి స్థితిలోనున్న వీరు ఈ భరతఖండమున రాజ్యాంగము వారి జనాభా లెక్కలనుబట్టి యేడు కోట్ల యేబది లక్షలమంది జనసంఖ్య గలిగియున్నారు. ఇంత జనసంఖ్యగల వీరినటుల నీచముగ జూచుట గారణమేమై యుండునాయని యోచింప సరియగు కారణము గన్పట్టదు. ఏలయన్నను వీరలు శుభ్రతగా నుండని కారణముచేతనా యనిన వీరలకన్న నశుభ్రతగల మొండిబండ ఎఱుకుల, యానాదుల నటులనలనుటలేదు, అందులకు నశుభ్రత కారణముగాదు. వెండియు గోమాంస భక్షకత్వమాయనిన గోవులకన్న నతి నీచ జాతువులగు ఎలుకలు, ఎండ్రకాయలు, కప్పలు, కాకులు మున్నగు జంతువుల దిను జాతులను గూడా యిటులనుటలేదు. వెండియు గోమాంస భక్షకులగు [illegible] జాతులనట్లనుటలేదు.

4 అట్టి యితర జాతులవారును బ్రతికియున్న పశువులను జంపి మాంస భక్షణచేయుదురు. వీరన్నను చచ్చిన పశుమాంసమునే భక్షింతురు. ఆందుచేతనే శ్రీ వేమన యోగీంద్రులు "ఆ॥ హింసజేయకుంటయే ముఖ్యధర్మంబు వెనకచంపుదురట విప్రవరులు చావుపశువు తినెదు. చండాలుడేమేలు విశ్వదాభిరామ వినరవేమ" అనగా బ్రతికియున్న పశువధజేసి మాంస భక్షణము జేయువారికన్న జచ్చిన గోమాంసమును దిను చండాలుండే మేలని వచించియున్నారు. ఆందువలన అస్పృశ్యతకు గోమాంస భక్షణము కారణముగాదు. మఱియు "విద్యావిహీనఃపశుర్భిస్సమానః" అను నీ యార్యోక్తి ననుసరించి వీరలు అవిద్యావంతులుగనుండుటచేతనా? అనిన అవిద్యావంతులగు ఎఱుకల ఏనాదులు మొదలగు వారి నటులనుటలేదు. అందువలన నదియు గాదు. ఇక నిర్ధనికత్వమాయనిన నిర్ధనికులై పరార్జితముచే జీవించు బ్రాహ్మణాది యితరులన నటులననుటలేదు. ఈ పంచములు నిర్ధనులైనను కష్టార్జితముచే జీవించుచున్నారు గాన వీరలు నిర్ధనులని జెప్పుటకు వలనుబడదు. ఇట్టి వీరిలో మహదైశ్వర్యవంతులు గొందరుగూడా గలరు.

5 అయితే వీరిని నస్పృశ్యులనుటకు గారణమేమై యుండును, అటులను వారేమి జెప్పుచుందురని యోచింప "శ్లో॥ స్యాచ్చండాలస్తు జనితో బ్రాహ్మణ్యాం వృషలేనయః" అనగా శూద్రుని వలన విప్రవనితలకు గలిగిన వారు చండాలురు. అను నీ మనుస్మృతి వాక్యమునాధారము జేసికొని చండాలురు గ్రామ బహిష్కృతులుగ, నస్పృశ్యులుగ నుండవలయునని జెప్పెడి యీ శాస్త్ర ప్రమాణమును జూపి బ్రాహ్మణీ శూద్రునకు గల్గిన చండాలుండే పంచముండనియునందుచే నస్పృశ్యుండని జెప్పెదరు. అయినను అట్టి యీ చండాలురే పంచ[illegible]

6 అదియటులుండుడు ఈ పూర్వోక్త శాస్త్ర వాక్యము ననుసరించి పంచములస్పృశ్యులైన రీతులను "శ్లో॥ రజకశ్చర్మకారశ్చ నటోబురుడ ఏవచ కైవర్తమేద భిల్లాశ్చ స్వర్ణకారశ్చసౌచికః । తక్షకస్తైలయాంత్రీచ మానుశ్చక్రీతథాధ్వజీ । నాపితఃకారుకశ్చైవ షోడశైతే జనంగమాః । ఏతే గ్రామచండాల ఇత్యర్థః" అనగా 1 చాకలి 2 చర్మకారుడు, 3 నటుడు 4 దొమ్మరి 5 పల్లె 6 మేదరి 7 భిల్లుండు 8 కంసాలి 9 దర్జి 10 వడ్రంగి 11 తిలఘాతకుడు 12 కటికవాడు 13 కుమ్మరి 14 ఈడిగ 15 మంగలి 16 కమ్మరి అను నీ పదునార్గురు గ్రామ చండాలురుగ జెప్పి యున్నందున వీరిని గూడా అస్పృశ్యులని వ్యవహరింప వలసినదియేగదా? అటులనీ ప్రపంచమున వ్యవహరించ బోవుటకు గతంబెద్దియో? తత్కారణంబేమియో? కొంచమాలోచించి జూడుడీ.

7 రెండియు "శ్లో॥ కిమత్రబహునోక్తేన బ్రాహ్మణాయేష్య వైష్ణవః । నస్పృష్టవాన వక్తవ్యాన ద్రష్టవ్యః కదంచన" అనగా వైష్ణవులు గాని బ్రాహ్మణులందరు నస్పృశ్యులు, అసంభావ్యులు, అద్రష్టవ్యులు అని యిట్లు జెప్పిరి. ఈ ప్రమాణమును బట్టి వైష్ణవులుగాని బ్రాహ్మణులందర రస్పృశ్యులని వ్యవహరింపబడ వలసినదేగదా? అటుల నెచ్చటను వ్యవహరించు కారణమేమి. మఱియు గ్రామ పౌరోహిత్యము చేయువారు గ్రామ చండాలురని మరియొక ప్రమాణము గలదు. ఇంతియేగాదు ప్రస్తుతములో భారతీయుల నందఱిని విదేశీయులు హిందూ శబ్దవాచ్యుల జేసి వైచినారు. నేడు భారతీయులందరూ హిందూ శబ్దము చేతనే బిలువఁబడుచున్నారు. మఱియు నట్లుగనే ఒకరి నొకరు బిలుచుకొనుచున్నారు. ఏతచ్ఛబ్దముగాని, ఏతచ్ఛబ్దార్థ బోధకముగాని మన గ్రంథములెందెచ్చటనుగనఁబట్టదు. అట్టిహిందూ శబ్దార్థము పారశీక నిఘంటువుల వలన చండాల చోరిస శబ్దార్థ వాచ్యములగుచున్నది. అని యిట్లు తత్పండితులు వచియించెదరు, అట్టి చండాల యర్థమును సూచించు హిందూ శబ్దవాచ్యులందఱు అస్పృశ్యులని విదేశీయు లనవలసినదేనా? ఇట్లు ఆచార భేదమువలన జనించిన ద్వేషముచే నొకరి నొకరు నిర్విధిని దూషించుకొన్న ప్రమాణము లనేకములు గలవు, అట్టి వాటినన్నిటిని నిజమని నమ్మి వ్యవహరించ బూనినచో భారతీయులెల్లరు నొకరి నొకరు స్పృశింప వలను గాక ఒకరికి మఱియొక రస్పృశ్యులై "ఎవరికి వారే యమునాతీరే" అనునటుల యుండక తప్పదు, అందువలన నా ప్రమాణంబులన్నియు మతావేశములచే జనించిన దూషణలని విసర్జించి పరిత్యజించుట సధర్మమై యున్నదని వాకొనుచున్నాము.

8, ఒకవేళ నట్టి ప్రమాణములన్నియు ద్వేషముచే గల్పింపఁబడిన పగుట వలన అనృతములనియు, బ్రాహ్మణీ శూద్రునకు చండాలురు (పంచములు) బుట్టినది సత్యమని చెప్పుదురేమో? అటులైన, "శ్లో" మైత్రేయకంతువై దేహోమధూస్సంచ ప్రసూయతే, అనగా వైశ్యునివలన బ్రాహ్మణ స్త్రీకి బుట్టినవాఁడు వైదేహుఁడని మనుస్మృతి జెప్పుచున్నది. 2 రెండియు, "శ్లో" క్షత్రియాద్విప్రకన్యాయా సూతోభవతిజాయతే" అనగా క్షత్రియునివలన విప్ర స్త్రీ యందు బుట్టినవాఁడు సూతుడనియు గూడా మనుస్మృతి జెప్పుచున్నది. 3 మఱియు "శ్లో॥ వ్రాత్యాత్తుజాయతే విప్రా పాపాత్మ భూర్జకంటకః" అనగా ఉపనయనాది సంస్కారములు గాని వ్రాత్య బ్రాహ్మణునకు బ్రాహ్మణ స్త్రీయందు పాపియగు భూర్జకంటకుడు బుట్టుచున్నాడని మనుస్మృతి బల్కుచున్నది. ఇంతియేగాక, 4 "శ్లో॥ బ్రాహ్మణాద్విప్రకన్యాయా చౌర్యాజ్జాతశ్శివద్విజః" అనగా బ్రాహ్మణుడు చౌర్యముగా బొందిన బ్రాహ్మణికి శివద్విజుడు బుట్టెనని స్కాందపురాణము వర్ణోత్పత్తి ఖండమందును మరియు తాంత్రిక మీమాంశయందును జెప్పుచున్నది. ఇట్లున్న శాస్త్ర వాక్యముల ననుసరించి సంకరోత్పత్తి నిజమని నమ్ముటకు విప్రస్త్రీలు చెడు నడత గలవారై 1 శూద్రునితో బొందిన చండాలురు బట్టుట, ఒక వైశ్యునితో గూడిన వైదేహులు గల్గుట, 3 క్షత్రియునితో బొందిన సూతుడు బట్టుట, 4 వ్రాత్యవిప్రునితో బొందిన పాపులగు భూర్జ కంటకలు బట్టుట, 5 చౌర్యముగ విప్రునితో గూడిన శివద్విజులు బట్టుట ఈ మొదలగునవిని జరుగు నెడల నీ రైదు శాఖలలోను నేడు భూర్జకంటకులే పేరుతో వ్యవహరింపబడుచుండిరో తెలియదుగాని మిగత నాల్గు శాఖలలో చండాలురే



ఎలిఫెంటాలోని ఏనుగు ౧.



ఎలిఫెంటా ద్వీపము ౨.

పంచములను గూర్చిన ప్రస్తుతము జనాభాలెఖలను బట్టి పంచములు ఏడున్నర కోటి జనసంఖ్య గలిగియున్నారను విషయమును యోచించి జూడ ఈ రైతు శాఖలు సుమారు పదికోట్ల జనసంఖ్య యుండుననుట కిసుమంతయు సందియముండదు.

9 ఈ పది కోట్ల జన సంఖ్య విప్ర స్త్రీల చెడునడతవలన గలుగుటను స్త్రీ యొక తెకు పదిమంది చొప్పున గనునని తలచి చూచినను చెడునడతగల విప్ర స్త్రీలొక కోటి యుండవలెను. ఇప్పుడు జనాభా లెఖలను బట్టి యున్నటువంటి విప్ర స్త్రీ లేబదిలక్షల మంది మాత్రమే గలరని దెలియుచున్నది. అటువున్న వారిలోను పతివ్రతా మతల్లులెందరో గలరు. అందువలన పది కోట్ల జనులను కనుటకు తగినంతమంది చెడు నడతగల విప్ర స్త్రీలు లేరనుట నిశ్చయము. తల్లులు లేని పిల్లలుగలుగుటయు నసంభవము. ఒకవేళ నా రైతు శాఖలలోను పూర్వమింత జనసాంఖ్య యుండదనుకొనుట కాధర్మమును బట్టి ఎట్టి విప్ర స్త్రీలును గత గణితమునకు తక్కువ జన సంఖ్యరైై యుండక తప్పదు.

10 ఎవరైనను అందుచే వ్యభిచారము చేయు విప్ర మగులవల సంతానమభివృద్ధియై వ్యభిచారము చేయని కాంతల సంతానము క్షీణించినదని వచింప వచ్చును. అటులైన వంశాభివృద్ధి క్షయములు పుణ్య పాపములననుసరించి యుండుననను ధర్మమునుబట్టియు వ్యభిచారుల సంతానము వృద్ధియగుటను బట్టియు వ్యభిచారము చేయుట పుణ్య కార్యమనక తప్పదుగదా. అదట్లుండుగా. శూద్రుని గూడిన విప్ర స్త్రీకి గల్గు సంతానము పంచములగునది సత్యేతరము. అందువలన నటులైనచో! వర్తమాన కాలంబున విప్ర వనిత లావిధినిగని సంతానములేదని చెప్పవలయును. అట్లున్న యెడల నిక్కాలంబున యట్లు జనించిన విప్ర మగువల సంతానము పంచములుగా వ్యవహరింపబడని కారణమేమి. ఇట్లుగ విభాగించు శక్తి సామర్థ్యంబులు భారతీయులలో లేని కతనయందురా? అట్లైన వర్తమాన కాలమున శూద్రునితో బొందిన విప్ర యువిదల సంతానము పంచములై యుండియు పంచమ వర్ణములో చేరక అగ్రజత్వము నొందుచుండగా లేని యనర్థకము పూర్వమెప్పుడో శూద్రుని వలన విప్ర లలనకు జనించిన వారి సంతానమును స్పృశించిన అపవిత్రత గలుగుననుట యెట్లు. అను నీ విషయము పరిశోధనము చేయ విప్ర స్త్రీ చెడు నడత వలన బూర్వోక్తములైన ఆయిను శాఖలు గలిగెనని జెప్పుట ద్వేషముతో వారిని సంకరులను జేయుటయను, విప్రకాంతల వ్యభిచారము యొక్క భ్రమోత్పాతముచే వారి నరికట్టుటకునై యున్నదని దర్పణము భాతి గన్పట్టుచున్నది. ఇట్లు కుతంత్ర కోవిదులగు వారు ద్వేషముతో గల్పించుట చేతనే అందందనేక స్వవచన వ్యాఘాత ప్రమాణంబు లనేకంబు లబ్దంబులగుచున్నవి. అందుల కొకటి రెండు విషయములు చదువరుల పరిశీలనార్థమిచట నుదహరించెద గమనింపుడు.

11 ఇందు మంగలి జన్మ కథను గురించి వివరింపబడు. 1 మంగలినిగూర్చి పరాశర స్మృతిలో విప్రునివలన శూద్ర స్త్రీ యందు బుట్టిన వాడని జెప్పబడియున్నది. 2 రెండియు నమరములో మంగలిని గురించి విప్రుని వలన వైశ్య స్త్రీకి బుట్టిన వాడని వచించియున్నది. 3 మరియు కమలాకర స్మృతిలో మంగలినిగూర్చి సంకరియైన ఉగ్ర స్త్రీకిని సంకరుడగు మాగధునకును జనించిన వాడని జెప్పబడియున్నది. ఇట్లు జేర్కొనబడియున్న మార్గత్రయములో మంగలి ఏ మార్గమందు జనించెనని సిద్ధాంతము జేసుకొనవలెనన్న నిజముగ మంగలి సంకర జాతివాడై యుండిన యెడల నన్ని గ్రంథములలో నొకే మార్గమున నుండవలెను. ఇప్పుడట్లు గాక గ్రంథమునకొక మార్గముగ నుండుటకు గారణమేమి కొంచమిందు విషయమై యోచించి జూడుడి.

12 రెండియు 1 క్షత్రియ స్త్రీకిని విప్రునకును జనించినవాడు ఆత్మనివేదకుడు. 2 క్షత్రియ స్త్రీకిని విప్రునకును జనించినవాడు నియోగి బ్రాహ్మణుడు 3 విధవరాలైన క్షత్రియ స్త్రీకిని బ్రాహ్మణునికిని జనించినవాడు వైదిక బ్రాహ్మణుడు 4 క్షత్రియ స్త్రీకిని విప్రునికిని జనించినవాడు వైఖానసుడు. 5 క్షత్రియ స్త్రీకిని విప్రునకును బుట్టినవాడు (ధృతరాష్ట్రుడు) క్షత్రియుడు. ఇట్లుగ దెలియబడు ఈ సంకర సిద్ధాంతము నిజమగు నెడల క్షత్రియ

స్త్రీకిని విప్రునకును బుట్టినవారొక్క జాతిగ నుండక పెక్కు జాతులుగ మారుటకు కారణమేమి. ఈ విషయములను సత్యైక దృష్టితో జూడ బ్రాహ్మణులు కొన్ని జాతులను సంకరులుగజేయ సంకల్పించుకొని పలువురు పెక్కు గ్రంథములు వ్రాయుటలో నా పలువురు పలు మార్గముల సంకర జాతి నిరూపణ జేసి గ్రంథములు వ్రాసిరనియు, ఇట్లు గల్పింపబడినందున నయ్యవి ప్రమాణములు గావనియును, ఆట్టి సంకరత్వ నిరూపణము ద్వేషముతో గూడిన దూషణకు జనించిన దగుటచే జాతి నిరూపణ కనర్హమైనదనియు సిద్ధాంతమగుచున్నది ఇందుకై పెక్కేల, శాస్త్రములలో సంకరులను శాఖలన్నియు అనులోమ విలోమ అను నీ రెండు తెఱగులుగ జెప్పబడియున్నవి. అందు 1 వైదేహులు 2 సూతులు 3 చండాలురు అను నీ మువ్వురను విలోమ సంకర జాతీయులుగ వక్కాణించిరి. ఆ విలోమములో మువ్వురు స్పృశ్యులనియో? మరియు నస్పృశ్యులనియో? ఇట్లు నేకత్వముగా ధర్మ నిరూపణ జేయుట సలక్షణముగా నుండును కాని 1 వైదేహులు 2 సూతులును ఈ ఇరువురిని స్పృశ్యులనుచు 3 మూడవ వారగు చండాలురను విలోములు అస్పృశ్యులనుట ధర్మమెట్లగును. ఇట్టి స్థితిలో విలోమ సంకరులకు ద్విమార్గాచరణయుండవలెననుటయిట్లు సిద్ధాంతమగును. ఈ విషయంబులన్నియు జూడ సంకర జాతుల నిరూపణ ద్వేషము వ్రాసినదనియు నిట్లుగ తెలియుచున్నది.

13 ఒక వేళ శాస్త్రములు జనించక పూర్వమే ఈ పంచమ జాతివారు మారు పేరులతో ప్రత్యేక శాఖలుగా నుండి నటుల భారతీయుల పరిణామ చరిత్ర వలన దెలియుచున్నందున శాస్త్రములందు జెప్పు చండాల ధర్మములీ పంచములకే మాత్రము సంబంధించినవి గావని సుబోధక మగుచున్నది. వెయ్యేల గత నెలలో బందరు నందు జరిగిన అస్పృశ్యతా నివారణ కధ్యక్షత వహించిన బ్రహ్మశ్రీ కావ్యకంఠ గణపతి శాస్త్రులు వారు తమ ప్రారంభోపన్యాసమున ,,చండాల శబ్దము అంత్యప్రతిలోమ సంకీర్ణునియందును, ప్రకృత పంచముని యందును వర్తించుట చేతను ఈ యిద్దరిలో నొక్కరే యనుట పొరబాటు. చండాల శబ్దమునకు రెండర్థములున్నవి. అట్టి విషయమై నిఘంటువును జూడుడు. ,,శ్లో॥ స్యాచ్చాండాలస్తు జనితో బ్రాహ్మణ్యాం వృషలేనయః'' అని యమునంత్య ప్రతిలోమ సంకీర్ణుని నామము పఠియించి తరువాత ననేక నామములను బిమ్మట "శ్లో॥ చండాల ప్లవమాతంగదివ కీర్తి జనంగమాః........నిషాధ శ్వపచావాంతేవాసచండాల పుల్కసా'' అని ఇట్లు ఒక ప్రత్యేక స్వతంత్ర జాతివారి పేరులను పఠించుచున్నాడు. ఆందువలన నీ నామములలోని "నిషాదపద'' మును గమనించతగినది. ఈ నిషాద శబ్ద వాచ్యుడు ,,చత్వారోవర్ణాః నిషాదః పంచమః'' అని నిరుక్తములో వైదిక పంచ జన శబ్దార్థ నిరూపణ ఘట్టమునందు జెప్పబడిన నిషాదుడితడే. ఈ బ్రాహ్మణీ శూద్ర జాతాను లోమ సంకీర్ణునియందును గూడా నిషాద శబ్దము వర్తించుట చేత నాయనులోమ సంకీర్ణుడే వేదోక్త పంచ జనులలోని పంచముడుగా కూడదాయని అంటిరేని యది సరికాదు. అతనికి పంచమత్వ వ్యవహారమే లేదు. అదియునుంగాక నతనిని శూద్రుని కంటె ప్రత్యేకముగ పఠింప నవసరములేదు. అనులోమ సంకీర్ణులు మాతృజాతిని బొందుదురు. ఈ విషయములో పూర్వాచార పరాయణులు గూడా నేకీభవించుచున్నారు. ఇతర సంకీర్ణులను విడిచి యొక సంకీర్ణుని మాత్రము పంచమునిగా జెప్పుటలో స్వారస్యములేదు'' అని ఇట్లు నుడివియున్నారు.

14 ఇట్లు వచించుట జూడ బ్రాహ్మణీ శూద్రునకు బుట్టిరను చండాలురు పంచములు గారని విశదమగుచున్నది. ఇంతయేల బ్రాహ్మణీ శూద్రునకు బుట్టినవారు చండాలుడగుటయే గాని ఏ విప్రస్త్రీకి ఏ శూద్రుని వలన పంచముడు బుట్టెనో ఆ వివరములేదు గాన పంచములు అస్పృశ్యులని జెప్పెడి సిద్ధాంత మపసిద్ధాంత మనుట కిసుమంతయు సందియము లేదు. అందు వలన నీ పంచమ చరిత్రమునకు వేరొక మార్గముండి తీరును, అయితే మన మార్గమేదో పరిశీలింతుము. ఈ వర్ణములను గురించి వేదములలో ,,శ్రు॥ బ్రాహ్మణోస్య ముఖమాసీత్। బాహూరాజన్యః కృతః। ఊరూతదస్య యద్వైశ్యః। పద్భ్యాగ్ం శూద్రో అజాయత'' అనగా బ్రాహ్మణ క్షత్రియ వైశ్య

శూద్రులు అను నీవర్ణ చతుష్టయము మాత్రమే వేదముల యందు నిరూపింపబడి యుండలేదు. మరియు మను స్మృతి పదవ యధ్యాయము 4 నాలుగవ శ్లోకమగు ,,శ్లో॥ బ్రాహ్మణ క్షత్రియ విశ స్త్రయోవర్ణాద్విజాతయః చతుర్థ ఏకజాతిస్తు శూద్రో నాస్తితు పంచమః'' అను నీ శ్లోకమందును బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులను మూడు వర్ణములవారు ఉపనయనాది సంస్కారములు గలవారు గనుక ద్విజులైరి. శూద్రుడు మాత్ర మొక జన్మగలవాడు. ఇట్లుగ నాలుగు వర్ణములు మాత్రమే యున్నవి. అయిదవ వర్ణము లేదని చెప్పుచున్నది. ఇట్లుండుట వలన నీ చాతుర్వర్ణములను బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులను ఆఖ్యలతో చైవర్ణ చతుష్టయము ప్రకాశించుచున్నది. అయితే అయిదవ వర్ణమున కెచటను వేరుపేరు నిరూపింపబడి యుండక పోవుటచేతను పంచములు వర్ణ నిర్ణయముగల వైదిక మతము నాదరించక తద్భిన్న మతము వారై యుండవచ్చునని తోచుచున్నది. అందుచే మనకిప్పటివరకు వేరు నిదర్శనములు లభింపవు. గావున వైదిక గ్రంథముల ననుసరించియే పంచముల స్థితిగతులను దెలుసుకొందుము. శూద్రుడు పరిచర్య జేయుటయే స్వభావ జన్యమైన కర్మగలవాడు. అను నీ వైదిక మత సిద్ధాంతమును బట్టియు పంచముల యాచార వ్యవహారములను బట్టియు వైదిక మతము వారు శూద్రులని వ్యవహరించి యిమ్మట తమ మతతంత్రములు సాగుబాటగు కాలానుకూలతచే పంచములని చేసిరి. అట్టివారి నంటరాని వారినిగాను బహిష్కృతులుగను జేసినటుల సుబోధకంబగుచున్నది.

15 ఇక పంచములను నస్పృశ్యులుగా జేసినట్టి ద్వేషమునకు మూలకారణమెయ్యదియో విచారింతము.

16 ,,శ్రు॥ దైవ్యోవై వర్ణ బ్రాహ్మణః । అసుర్యో వై శూద్రః'' అను నీ తైత్తరీయ బ్రాహ్మణ వచనానుసారము దేవత్వము గలవారనగా శమదమ తప శ్శౌచాదులతో గూడి సత్వగుణము కలవారు బ్రాహ్మణులనియు, పూర్వోక్త గుణములు లేక కేవలము తమోగుణము గలవారు అసుర లక్షణముగల శూద్రులై యున్నారనియు నిందులకు స్పష్టంబుగ ,,శ్లో॥ అనార్యమార్య కర్మాణ మార్యం చానార్య కర్మిణం ... 10 ... మనుస్మృ

అధ్యాయము 73 శ్లోకము గూడా నైయభిప్రాయమును బోధించుచున్నది. ఇందు విషయమై బ్రహ్మశ్రీ మండా కామేశ్వర శాస్త్రులు గారు ,,ద్విజాతినిరతుడగు శూద్రుని న్ని శూద్రకర్మ నిరతుడగు బ్రాహ్మణుని న్ని'' అని ఇట్లు జెప్పుచు ,,అనార్య'' శబ్దమునకు ,,శూద్ర'' అను నీ యర్థమును జెప్పుట జూడ శ్రుతి చోదితమైన అసురులనే అనార్యులగను, అనార్యులను శూద్రులుగను వ్యవహరించు నటుల ద్యోతకమగుచున్నది.

17 అందువలన నసురులనగా అనార్యులనియు శూద్రులనియు. ఇట్లుగ న్యార్యానార్య భేద ప్రతిభేదములతో జనించిన ద్వేషముచే ఆర్యులవలన నదార్యులా విధిని దూషింపబడిరనియు నిట్లు గ్రాహ్యంబగుచున్నది. అందుచే ఆర్యానార్య భేదపరిణామ చరిత్ర వలన పంచముల చరిత్రము దర్పణము భాతి గన్పట్టుననుట నిశ్చయము. అందువలన నీ పరిణామ చరిత్ర మొకింత పరిశీలింతుము. ఈ చరిత్రమునకు వేదకాలము ప్రథమదశగను, శాస్త్ర కాలము మన్యవు దశగను, విభాగించి పరిశీలింతుము. ఆదు ప్రథమ దశలో నిప్పటికి సుమారు నాలుగువేల సంవత్సరముల పూర్వము వింధ్యోత్తరార్యావర్తమున (వింధ్యోత్తర హిందూదేశమున) గల జనసముదాయములో గొందరు మూడవ 1 కులపతులు, 2 క్రయకర్తలు, 3 నాయకులు, 4 జన సామాన్యము, అను నీ నాలుగు అంతఃశాఖలలో 1 నరులను, 2 పశువులను, 3 అశ్వములను, 4 మేకలను జంపి యజ్ఞయాగాది క్రతువుల నెపంబున దినుచు సురాపానాది యాచారములతో నొక సంఘము జనించెను. ఈ సంఘజులనే కొందరు విదేశముల నుండి రాబడినవారని జెప్పుదురు. అయ్యది సరియగు నభిప్రాయము గాదు. ఏల యన్నను ఈ సంఘజులను గూర్చి స్వధర్మ ప్రకాశికయను పత్రికలో ,,వేదభూమి'' అను నీ శీర్షిక క్రింద వ్రాయబడిన దానిలో నయ్యది మిథ్యా వచనమనియు అట్టివారు భరతఖండ జనితులేయనియు ఇట్లుగ నిరూపింపబడి యున్నది. ఇట్టి విదేశీయుల మత గ్రంథములను, మతమును, భాషను ఈ మొదలగు సాంఘిక విషయములను పరిశీలించి చూచిన యెడలనే తద్దేశీయుల మత సాంఘికాది విషయముల కెంతయో భేదము గన్పట్టుచున్నది. అయితే యిందు విషయమై కీ. శే. భాల

గంగాధర తిలకుగారు „హిందూ ఆర్కిటిక్ హోం" అను నీ గ్రంథమున నెక్కువగ విమర్శించి యుండుటచే మేమింతన బొందుపఱచి యుండలేము, అయినను అట్టి వారీ దేశజులే యనుట యొప్పిదమగునని తోచుచున్నది. ఈ సంఘజులను ఆర్యులనియెదరు. వారిప్పటివలె జాతి భేదము రుగరనుటకు కీ. శే. కొమర్రాజు లక్ష్మణరావు పంతులుగారు తమ హిందూదేశ కథా సంగ్రహమున „అప్పటి వారిప్పటి జాతి భేద మెరుంగరు. ఆర్యులనార్యులన్న భేదము తప్ప మరియే మరియే వర్ణ భేదము నప్పుడులేదు" అని యిట్లు హిందూ మహా యుగము 32 పేజీయందు వ్రాయుటయే దృష్టాంతము.

18 ఇక నార్యులు సురాపాన మాంస భక్షణము జేయుచురనుటకు నీ దిగువ నుదహరించు లౌకిక ప్రమాణములే ప్రబల దార్ష్టాంతికములు, "1 పశు మేధము, 2 సోమపానము. ఈ రెండును ఆర్యులకు విశేష ప్రియంబులైయుండె. సోమరసము ద్రాగుటకందరు నర్హులు గాకయుండిరి. విద్యాదిగుణములచే భూషితులగు వారును, క్రతువులు జేసినవారును మాత్రము సోమ పానమున కర్హులగా నెంచబడుచుండిరి. ఇందులకు „శ్రు॥ యేబ్రాహ్మణాస్త్రిసుపర్ణంపఠన్తి తే సోమం ప్రాప్నువన్తి" అనగా త్రిసుపర్ణమును పఠించు బ్రాహ్మణులకు సోమము ప్రాప్తమగును. అను నీ మంత్రము మన దేశపు బ్రాహ్మణులెపుడును బఠించునదియే" అని ఇట్లు హిందూ మహా యుగము 38 వ పేజీయందు చేర్కొనబడియున్నది. (2) మఱియు „ఆర్యుల యందు నరమేధమను నొక విధమగు యజ్ఞమాచరణములోనున్నది. ఎట్లన్నను (అంబరీషుడు ఋచీకుని కుమారుడైన శునశ్శేఫుని లక్షగోవులనిచ్చి యజ్ఞ పశువుగా గైగునియె.) ఇయ్యది సంస్కృత రామాయణములో బాలాకాండయందును, ఆంధ్రములో భాస్కర రామాయణమందును యున్నదని శంబుకవధ యను గ్రంథమందలి తొలిపలుకులో నుడువబడియున్నది. (3) మరియు (సోమకుడు కుమారుని జంపి నరమేధమును జేసెను. ఈ విషయము మహాభారతములో నారణ్య పర్వమందు జెప్పబడి యున్నదని శంబుకవధ తొలిపలుకులో 2 వ పేజి యందు చేర్కొనబడియున్నది. (4) ఇంతియేగాదు. „వీరు (ఆర్యులు) సంపూర్ణముగ మాంస భక్షకులుగ నుండుటయేగాక గోమాంస భక్షకులుగా గూడనుండిరి. ఇంతియేగాక గోమేధము పుణ్య కార్యముగా గూడా విభావింపబడుచుండెను. నరమేధము గూడా నచ్చటచ్చట భావింపబడుచుండెను. భవభూతి యుత్తర రామ చరిత్రలో వాల్మీకి నాతిథ్యమొసగు సందర్భమున జాగరూకులమై పరీక్షించినచో వసిష్ఠుడెట్టి తరపి పెయ్యను జంపి విందు జేసినది తెలియగలదు. (5) మరియు నొక మహారాజు నిత్య బ్రాహ్మణ సమారాధనకై గోవులను జంపి యా చర్మములను మెట్టగా వైచిన నందుండి స్రవించిన ద్రవమే చర్మణ్వతీ నదియయ్యెనన్న భారతకథ మన కన్నులకు దెరచి సత్యమును మోమోటమి లేకుండా జూపింపగలదు. ఇయ్యది భారతము అను శాసనిక పర్వము 3వ యాశ్వాసములో రంతి దేవుని చరిత్రయందు గన్పట్టుచున్నది. అను నీ విషయము తొలిపలుకులలో 5 వ పేజీయందు బొడగట్టుచున్నది.

19 ఇట్టి ప్రమాణములను బట్టి ఆర్యులు సురాపాన గోమాంసము మొదలుగాగల మాంసాహారులని దెలియబడుచున్నది. ఇట్టి యార్యులకు వ్యతిరేకులు కొందరు వర్ణ వ్యవస్థ లేనివారై శైవ వైష్ణవ మతాచార ప్రవిష్టులై యుండి తమతమ ధర్మముల ననుసరించి ఈ యార్యులు చేయు జీవహింసలు నరికట్టువారై యుండిరి. ఇట్టి వీరిని యీ యార్యులు 1 ద్రవిడులనియు, 2 అసురులనియు 3 అనార్యులనియు 4 దస్యులనియు 5 శూద్రులనియు ఈ మొదలగు నామములతో బిలుచుచుండిరి. ఇందు శైవ వైష్ణవాది మతముల నార్య మతములనుటచే కొందరి కాశ్చర్య జనకముగ నుండవచ్చును. అనార్యులలో చేరిన పంచములు దక్షిణాపథమునందు వైష్ణవ మతము నేటివఱకు అతిభక్తితో ప్రేమించుట జూచిన తద్విషయము గోచరమగును. ఇందులకు స్పష్టంబుముగ తిరువల్లువ, నందనారు మొదలగు మహా పురుషుల చరిత్రలు గనుగొనిన శైవమత విజృంభణము గనుగొనవచ్చును. ఇట్లుగనే వైష్ణవ మత మందలి ఎంబెరుమానారు మొదలగు వారి చరిత్రలు గనుగొనిన వైష్ణవ మత వ్యాప్తి గూడా జూడవచ్చును. అయితే శైవ మతమునకు లేనట్లు నేటివఱకు గూడా గోచరమగును. మఱియు ననార్యులలో జేసిన శైవోపాసనలు

జూచినను అట్టియాశ్చర్యము ఘంటకమగుననుటలో నాశ్చర్యము గాదు. ఈ యార్యానార్యులను శాఖాద్వయంబున ఆర్య సంఘమందు, 1 దివోదాసుడు 2 సుదాసుడు 3 గుత్సుడు, ఈ మొదలగు వారు ప్రముఖులు, అనార్య సంఘమునకు 1 యవుడు 2 కృష్ణుడు 3 ప్రమగందుడు, ఈ మొదల వారు ప్రముఖులైయుండిరి. ఈ యార్యానార్యులగు యిరు తెగలకు నాచరణ భేదముచే గలిగిన యంతఃకలహము వలన పదాతులు, పదాతులతోను, అశ్వికులాశ్వికులతోను, నాయకులు నాయకులతోను, ఇట్లు ననేక పర్యాయములు యుద్ధము జేసిరి. ఇందులో ఆర్యులకు గోచర్మములు గప్పిన రథములుండెడివి. ఆ యుద్ధములో ఏ యార్యులు శీతర ప్రదేశమునుండి వచ్చిన వారగుటచే ఆర్యులకెక్కుడు విజయము గలుగుచు వచ్చినది. అందువలన ఈ యార్యులు తమ స్వాధీనమైన ప్రదేశములలోని జనులకుబోధించి ఈ యనార్యులను తమ మతానువర్తులుగ జేయుచు వారివారి యాచార వ్యవహారంబుల ననుసరించి 1 గులపతులనియు, 2 క్రతుకర్తలనియు, 3 నాయకులనియు, 4 సాధారణమైన జన సామాన్యమనియు నిట్లుగ నంతరోప నామంబులుంచి ఈ యనార్యులను ఆర్యులని వ్యవహరింపుచు తమకు వ్యతిరేకులగు శైవ వైష్ణవ మతాచారపరుల బూర్వోక్తములైన దస్యులనియు, దాసులనియు, అనార్యులనియు, అసురులనియు దానవులనియు నిట్లు బిలువ జొచ్చిరి. ఇందులకీ క్రింద నుదాహరించు ప్రమాణములే నిదర్శనములు. అదెట్లన్నను. "ఆర్యులు వీరికి దిరస్కార భావముతో (దస్యులనియు) దాసులనియు, అనార్యులనియు, పేర్లు పెట్టిరి. ఆర్యులకీ యనార్య భాషయగు ఆంధ్ర ద్రవిడ కర్ణాటకము మొదలుగాగల భాషలు తెలియనందున వీరిని భాషలేని వారనిరి. ఆర్యుల వలె వీరు క్రతువులు చేయనందున వీరిని నిరీశ్వరులనిరి" ఈ విషయములు ఋగ్వేదములోని ఈ క్రింది ఋక్కుల వలన దేటపడగలవు. "ఓ యింద్రా! మా చుట్టును దస్యులున్నారు. వారు క్రతువులు చేయరు. వారు దేనిని నమ్మరు. వారసుర ప్రకృతులు, ఓ శత్రుసంహారకుడైన యింద్రా ఈ దాసుల సంహరింపుము. అని యిట్టి ఋక్కులచే దెలియుచున్నది. వెండియు, "ఆర్యులలో ననేక నాయకులు వేర్వేరుగా గొందరు జనులను గూర్చుకొని స్వతంత్రమున ఆర్యుల నాయకులతో బోరుచుండిరి. వారి సైన్యములో పదాతులును గుఱ్ఱపు రౌతులుండిరి. ఋగ్వేదములో (1–68–8) గుఱ్ఱపు రౌతులు సైనికులతో బోరాడినట్లున్నది. మరియు నొకచోట (1–73–9) బదాతులు బదాతులతోను, అశ్వికులతోను బోరాడినటులున్నది. ఈ సైన్యమునకు నాయకుడగు వాడు గోచర్మముతో గప్పబడిన రథము నెక్కి యుద్ధమునకు బోవును. అట్టి వాని యనుచరులచేత కేతనంబు ధరించి తమ పూర్వుల యశంబును బాటలుగా బాడుచు, శంఖముల నూదుచు సంగరము జేయుచుండిరి, ఇట్లు జరిగిన యుద్ధానంతరము జయము బొందిన ఆర్యులు శత్రు గ్రామములను స్వాధీనపఱచుకొన్నప్పుడు పెక్కు పర్యాయములీ యార్యులు గ్రామములో నందరిని జంపుచుండిరి. ఒకొక్కప్పుడు గ్రామములో ధనమును దోచుకొని ఆగతటిలో సంతుష్టి జెంది జగలకసాయము జేయక వెళ్లుచుండిరి ఇట్లు గ్రామము స్వాధీనమైనప్పుడు అచట తమ యాచార వ్యవహారములను ధర్మకల్పనలను బాలుకొల్పుచుండిరి అని ఇట్లు ఋగ్వేదాదుల వలన దెలియబడుటయే గాక హిందూ మహాయుగము 21—22 పేజీలయందు దెలియబడుచున్నది.

20. ఇట్లు ఈ యిరుతెగలును సమాన ప్రతిపత్తులతో వైర భావమూని యుండి ఈ యుభయులు వేరు వేరు నామములతో వ్యవహరించుకొనుచున్నను. ఇప్పటి వలె ఆర్య నామములు మిన్నలనియు, అనార్య నామములు దూష్యములనియు వ్యవహరించబడక నా కాలములో ఆయుభయులు గుణ కర్మల కనువగు నామములు ధరించి యుండుట చేతను, ఆయుభయులు ఎవరి నామములు వారధికముగా తలంచి వ్యవహరించు కొనుచు వచ్చిరి. అదెట్లన్నను, ఆర్య శబ్దమునకు, "ఆరాత్ దూరాత్ యాతీత్యార్యః" అనగా ఈ యార్యుడు ఇహపరములను గూర్చి చక్కగ నాలోచించి ప్రవర్తించువాడని యర్థము, వెండియు యజ్ఞాదికర్మల నాచరించు వాడనియు వ్యవసాయము చేయువాడనియు, నిట్లర్థమని వేదభూమిక, శంబుకవధలోని తొలి పలుకులు ఈ మొదలగు గ్రంధములు వచించుచున్నది. ఇటు పయిన అనార్యులగు వారి నామ

ములెట్లన్నను, దస్యు శబ్దమునకు కర్మతులగు వారి సందరి నివేదించు శత్రువనియు, అసుర శబ్దమునకు సురాపాన విరోధియనియు, ఈ మొదలగు విశేషణములచే దెలియ బడుచున్నది. ఈ యభిప్రాయము నే వేదభూమిక మొద లగు గ్రంధములు సూచువుచున్నవి.

21 ఇట్లు ఆర్య జయము కొంత కాలము జరుగ ఆనార్యులలో హిరణ్యాక్ష హిరణ్య కశ్యపులు జనించిరి. వీరు శైవ మతస్థులై శివపూజా ధురంధరులై మిక్కి లి మహాబలవంతులై ఆర్యులను నుగ్గునుగ్గుగా గొట్టి నిశ్చేష్టి తులంజేసిరి. అంతట ఆర్యులు సామదాన భేద దండో పాయంబులను చతుర్విధోపాయంబుల నెఱింగిన వారు గాన సమయానుకూలమునకు వేచియుండి సమయము చిక్కినప్పుడు భేదోపాయంబును బ్రయోగించి శైవ వైష్ణవ భేద ప్రశక్తిని జనింపజేసిరి (ప్రహ్లాదుడు హరి భక్తుడగుటకు యిదియే కారణము) ఇట్లనార్యులలో జీలదీసినను బాహాబాహీ యుద్ధము చేయజాలక మాయో పాయంబులతో నొంటరిగా నున్నప్పుడు ఆ హిర ణ్యాక్ష హిరణ్య కశిపులలో నొక్కొక్కరిని బరి మార్చి వారిని శ్రీ మహా విష్ణువు జంపెనని గ్రంధములు వ్రాసిరి. ఇట్లనేక పర్యాయములు ఆనార్యులలో బలవం తులు జనించి ఆర్యాచారములు నరికట్టుటయు, అప్పు డార్యులు మిన్నకుండి పిమ్మట సమయానుకూలత గలిగి నప్పుడు మాయోపాయములను బన్ని వారిని హతమొన ర్చుటయు, ఇట్లు అనార్యులను బరిమార్చిన వారు దేవ దేవుండగు మహావిష్ణువనియు లేక ఈశ్వరుడనియు గ్రంధ ములు వ్రాయుటకు మొదలిడిరి. (ఇప్పుడు మనచే పూజిం పబడు దేవతలందరిట్టి మిథ్యారూపమగు అవతార పురు షులేయని గుర్తెరుగ తగియున్నది.) ఇట్లు అనార్యులను జంపిన మిథ్యారూపులగు దేవతలందరు శైవ వైష్ణవ శాక్తేయ గాణాపత్య సౌరకాపాల భైరవాది మతముల లో ప్రధాన దేవతులగు 1 శివుడు, త్రిపురాసురాదులను, 2 విష్ణువు హిరణ్యాక్ష హిరణ్యకశ్యపాదులను, 3 శాక్తే యమున ప్రధానమగు దేవి మహిషాసురాది రాక్షసులను 4 గజాసురాది రాక్షసులను మిథ్యారూపావతారులగు దేవతులు జంపినట్లు మిథ్యా రూపములైన కల్పిత పురాణ ములను శైవ వైష్ణవ శాక్తేయ గాణాపత్య సౌరకాపా లాది భేదంబులుగ రచించి వెల్లడి జేసిరని దోచుచున్నది. ఈ పురాణములు భేదములుగ నుండుటకివియే కారణ ములు, ప్రాచీనులగు ఆనార్యులు యీ పురాణంబుల పొంతనైనను కన్నెత్తిచూడక ఆనార్య భాషలయందే శైవ వైష్ణవాది నామముల స్తుతించి యున్నట్లు శైవాది గ్రంధములును, నాలాతురము మొదలను ద్రవిడ ప్రబంధ ముల జూచి గనుగొనవచ్చును.

22 ఇట్లు గవింధ్యోత్తర హిందూ దేశమును ఆర్యు లు సంపూర్ణముగ జయించి అందలి జనుల తమ నూతనా చారపరులగ జేసి అట్టి వారికి ఆర్యులని పేరులుంచి తమ లో జేర్చుకొనిరి. వెండియు నిటుల నార్యాచారముల బూనక తదాచారముల ననుష్ఠించు వారిని జూచి సహింప జాలకను, తదాచారముల నాపుశక్తి జాలకను. కొందరు వింధ్య దక్షిణమునకు విచ్చేసి స్థిర నివాసమునేర్పరచుకొని ద్రావిడులై పోయిరి. ఇట దక్షిణాపథమునకు రాజాలని వారు పగలే కొండగుహలందో, నే యడవినో నివసించి రాత్రికాలమున నార్యులను చావమోదుచుండిరి. అయి నను ఈ యనార్యులు ఆర్యులొనర్చు జీవహింస నాపలేక బోయిరి. ఇట్లు ఎదురులేక బోవుటచే ఆర్యులు ఆకా లపు వాఙ్మయ స్వరూపములగు వేదములలో ఆర్యానార్య భేద ప్రసక్తి దెలుపు ఆనార్య రచితములను కలగూర గంపగా నేకము జేసి ఆర్యాది పరమేశ్వర రచితమైన టుల గల్పించిరి. అందుచే యిప్పుడనార్యులకు వేదాధ్య యనార్హత లేదని వాదించుచుండిరి) వేదములలో ఆచా ర్య రచితములైన ఋక్కులున్నవనుటకు రావణుడు వేదము నకు పదచ్ఛేదము క్రమము జట ఘనము మొదలగు నియ మములను ఏర్పఱచుడయు, మరియు దాస పుత్రుడగు గవషయై వాషుడు కొన్ని ఋక్కులను రచించియుండు టయు ఏ మొదలగు విషయములను బట్టి మనము దృష్టాం తముగ దెలుసుకొనవచ్చును.

23 వెండియు గొందరనార్యులకు ఆర్యులకువలె సంస్కృత భాషా పరిచయముండుటచేతనే రావణ గవష యై లూషాదులు ఆర్య మత ప్రవిష్టులు గాకబోయినను వేదాభిమానులై వేదములలో గొన్ని ఋక్కులా రచించి

యు వేదములు పదవి భాగము మొదలగు వాటిచే సంస్కరించియున్నట్టుల నింతకు బూర్వము తెలుసుకొనియుంటిమి. ఇప్పుడార్యులకు వలె వారికిని సంస్కృత భాషా పరిచయముండినటుల రామాయణములోని సుందరాకాండమందలి "శ్లో॥ యదివాచాం ప్రదర్శ్యామి ద్విజాతిరివ సంస్కృతాం। రావణం మన్యమానా మాంసీతా భీతా భవిష్యతి" అనుని శ్లోకముచే తెలియునదేమన్నను అనార్యుడగు హనుమంతుడు ద్విజాతులవలె సంస్కృత భాషచే నేను సీతతో మాట్లాడితినేని నన్ను రావణుని గాదలచి సీతనాతో మాట్లాడక బోవును. అని యిట్లు జెప్పి యుండుటచే ఆర్యులగు ద్విజాతులకు సంస్కృతము ముఖ్య భాషయనియు అనార్యులగు ఆంజనేయ రావణాదులు కాలోచితముగ తత్సంస్కృత భాష నభ్యసించిరనియు వేద్యమగుచున్నది. రెండియు నేను ద్విజాతులవలె సంస్కృత భాషతో మాట్లాడితినేని సీత నన్ను రావణునిగా దలచి భీతిచే మాట్లాడక బోవునేమో అని యిట్లున్న వాక్యముచే రావణుడు ద్విజాతుడగు ఆర్యుడని బోధ్యమగుచున్నది. అయినను యితడు ద్విజాతుడని జెప్పుటకు వలనుపడదు. ఏలయన్నను ఈ రావణునికి బూర్వులగు కశ్యపాదులు ఆర్యమత ప్రవిష్టులై యుండినను ఈ రావణునికి తన్మత ప్రవిష్టత యందిష్టములేక తమ స్వాభావిక మతమగు అనార్య మతము నే గ్రహించి ఆర్యులతో వైరము బెట్టుకొనెనని గూడా దెలియుచున్నది. ఏదెట్లుండినను ఈ యనార్యులగు రావణాదులకు సంస్కృత భాషా పరిచయముండినట్లు పై వాక్యము వలన బోధయగుచున్నది. మరియు "శ్లో॥ ఇల్వల సంస్కృతం వదన్॥ ఆ మంత్రయ విప్రాన్ సః॥ సర్వవేద విదశ్శూర సర్వేసు చరితవ్రతాః" అనగా ఇల్వలుడను రాక్షసుడు బ్రాహ్మణులగు ఆర్యులను సంస్కృత భాషతో నాహ్వానించెను. మరియు సర్వ రాక్షసులు వేదవిదులనియు, నిట్లు రామాయణములో 1_8_11 యందు వ్రాయబడియున్నది. ఇందువలన ననార్యులకు గూడా సంస్కృత భాషా పరిచయము కొంత కాలమునకు గలిగినట్లును, వేద చతుష్టయము ఆర్యానార్యులకు సమ్మతమై యుండినట్లును బోధ్యమగుచున్నది. ఇంతియే గాక అనార్యులార్యులతో విద్యాద్యైశ్వర్యములందు సమాన ప్రపత్తి గలిగియుండినను మిక్కుటమగు వైరభావమును వహించియుండినట్లు మాత్రము వేద్యమగుచున్నది మరియును అప్పటిలో నార్యులు అనార్యులను దూషించి వేదబుక్కుల యందును తదితర గ్రంథముల యందును వ్రాయుట మిన్నక యుండుట యసంభవము. ఇప్పుడనార్య దూషిత భాగములు మనకన్నుల కగపడక బోవుటచేతను, ఆర్య దూషితంబులు ఆర్యానార్య భేద ప్రవృత్తి దెలుపునవియైన తద్గ్రంథములను ఆర్యులు హరింప జేసిరనుట సిద్ధాంతమగుచున్నది.



# ద్విపదాంజలి

బ్రహ్మశ్రీ మహాముని కావ్యకంఠ గణపతిశాస్త్రిగారు

౧. మంగళనాముని మంగళయశుని
మంగళరూపుని మఘవంతుఁదలఁతు॥

౨. మంజుల ద్విపదల మరుదవనీశ
యంజలి నింపినీ కర్పింతుఁగొనుము॥

౩. లలిత సంస్కృత మంత్ర లాలితయిపుడు
తెలుఁగున ద్విపదల దేవేంద్ర వినుము॥

౪. ఋక్కులోరుచి నిర్జరేంద్రుఁడా తెలుఁగు
వాక్కులో వినసీకు నిక్కముఁ తెలియు॥

పరమాత్మయు, ఇంద్రుఁడును:—

౫. భువనము సృజియించి భువనాధిపరుఁడు
భువనాంతరాత్మయై పురుహూతుఁడయ్యె॥

౬. భువనాదియున్నాఁడు భువనము దాఁటి
భువనాంతరాత్మయీ భువనమునందు॥

౭. భువనాంతరాత్మకు భువనాదితోడ
వ్యవహారదశయందె యరయ భేదంబు॥

౮. ఆత్మయే భువనాల కాదిమూలమగు
నాత్మయే భువనాంత రాత్మయై యొప్పు॥

౯. అతఁడు దానొక్కఁడే యావల వెలుఁగు
నతఁడుండు నిక్కడ నఖిలముగూడి॥

౧౦. అదిమూఁడు పాళ్లఁట అభవురూపాన
నిదియొక పాలఁట—ఋషులు గన్గొనిరి॥

౧౧. అదినిర్గుణంబగు నవికల్పచిత్తి
యిదిసగుణంబగు నింద్రవిభూతి॥



బ్రహ్మశ్రీ మహాముని కావ్యకంఠ గణపతిశాస్త్రిగారు



ద్వారపాలకులు (ఎలిఫెంటా) ౭.



గంగావతరణము (ఎలిఫెంటా) ౮.

౧౨ నిరుపాధియచ్చట నిర్గుణ బ్రహ్మ
కరుణసోపాధియా పురుహూతుఁడిచట॥

౧౩. అతఁడతీతుండగు నఖిలాండములకు
నితఁడేలు శక్తిచే నీ దృశ్యకోటి॥

౧౪. ఆత్మయే లోకమానావల జూడ
నాత్మకులోకములంగము లిచట॥

౧౫. యాధారమాత్రమే యాతఁడన్నిటికి
నాధికారిక దేవతాత్మయితండు॥

౧౬. విభుని రెండు విధాల విశ్వకారణుని
విభజించి చెప్పిరి విద్వాంసులిట్లు॥

"ఇంద్రజనన ప్రస్తావము"

౧౭. జనులార బ్రహ్మము జంభాంతకుఁడును
జనకుఁడు కొడుకును జతురులభాష॥

౧౮. భువనము సకలముఁ బుట్టించువాని
భువన ప్రవేశము పుట్టుక యనిరి॥

౧౯. అట్టి చిత్రంబగు పుట్టుకయందు
పట్టికి నీదేవ పదవియేతల్లి॥

౨౦. అదితి నీతల్లి యీ యాకాశ సమితియె
సదయ నీ తండ్రి కశ్యపుఁడు బ్రహ్మంబె॥

౨౧. ఖండము దితియగు ఖవిశాలవాటి
ఖండవిహీనయా ఖండలయదితి॥

౨౨. పశ్యకుఁడక్షర వ్యత్యాసరీతిఁ
గశ్యపుఁడయ్యెను గవిసూక్తులందు॥

౨౩. కవియా పిత్రుఁడునగు కశ్యపుఁడన్యుఁ
డవనిఁబుట్టిన వ్యక్తి యజనీవంటు॥

౨౪. జనకుని నీకిట్లు జననితోఁగూడ
ఘనవాహ సుకవులు గల్పించిరయ్య॥

"శక్తుఁడు, శక్తియును"

౨౫. ఆత్మయే శక్తుఁడా నాత్మయే శక్తి
యాత్మశక్తి విభేదమౌపచారికము॥

౨౬. ఆత్మమహాబ్ధిలో నభిమానియైన
యాత్మాంశిమాంశమే యగును శక్తుఁడు॥

౨౭. ఆపయోరాశిలో ననుభూతియైన
వ్యాపకమహిమయే యాతనిశక్తి॥

౨౮. సత్తులో మూలమే శక్తభాగంబు
సత్తులో శాఖలే శక్తిభాగంబు॥

౨౯. ధర్మిభూతజ్ఞాన తత్త్వమొకండు
ధర్మభూతజ్ఞాన తత్త్వమింకొకటి॥

౩౦. విభజనాశక్యము విబుధోక్తులందు
విభజింపఁబడియిట్లు ద్వివిధమై తోఁచు॥

౩౧. వాక్య నిష్ణాతుల వైఖరివలన
నైక్యాన భాసించె నజ్ఞులకు భిద॥

౩౨. పరపురుషాతుల భాగించినట్లె
యిరువుర శక్తుల నిరు శక్తులనిరి॥

౩౩. ఆమె విశ్వాతీతయానందరూప
యీమె విశ్వంబున కీశ్వరురాలు॥

౩౪. ఆతఁడేయీతఁడై యఖిలమునేలు
నాతని శక్తియే యీతనిశక్తి॥

౩౫. శక్త "శక్రా" ఖ్యలు సదృశార్థకములు
శక్తి "శచ్యా" ఖ్యలు సదృశార్థకములు॥

"ఇంద్రుని యింకొక కార్యరూపము"

౩౬. అండాలఁ బాలించు నాఖండలుండె
మండలాంతర వర్తి మహనీయుఁడయ్యె॥

౩౭. బ్రహ్మాండజాలము పాలించునతఁడు
బ్రహ్మాండమొక్కటి పాలించు నితఁడు॥

౩౮. పురుహూతసవితలు పూర్వులభావ
హరికేశవులు వీరలధునాతనోక్తి॥

"జీవతత్త్వము॥"

౩౯. ప్రతిబింబరూపానఁ బ్రతిదేహియందు
ప్రతిఫలించితి వీవు పరమేశ యిచట॥

౪౦. ఉన్నావు మాలోన యోగులవలన
విన్నాము విని మేము వెతకి చూచితిమి॥

౪౧. వెతకెడుబుద్ధికి వేరాగునీవు
వెతకఁగ వెతకఁగ విబుధేంద్ర తెలిసె॥

"అహంకారనింద"

౪౨. నీవునీయదియైన నిఖిలలేంద్రుకంటె
నీవుభిన్నుండవు నిజము మానవుఁడ॥

౪౩. ఆక్రమించెదు నప్పుడహమును మానము
శత్రుఁడంతర్యామినలుపఁడు చర్చ॥

౪౪. గుహలోపలకుఁబోయి గుప్తదేవునకు
నహమును మానస మర్పింపవలయు॥

౪౫. అన్యవానిసొత్తగు నది గాదు తనది
మదియట్లు సేయుట మహాన్యాయమగును॥

౪౬. అతనివస్తువుదెచ్చి యతనికీయక దా
సతతమువాడుటసరిగాదు మదికి॥

౪౭. ఆపాపమే మూలమఘములకెల్ల
నాపాపము భవాసనందఁజేఁగట్టి॥

౪౮. ఆపాపమేయుత్త మాఘమువాని
యాపాపము హరించునద్వైతబోధ॥

౪౯. అడుగఁగఁదనసొత్తు నాతండురాఁడు
విడువదు చిత్తము వెఱ్ఱియైతాను॥

"మనోబాధావర్ణనము"

౫౦. మనసు చూచినఁదాను మఱిచూడలేఁడు
మనసు చూడఁగలేదు మఱితానుజూడ॥

౫౧. ఇదితాను వీక్షింపనదిశయనించు
నదితానువీక్షింప నిదిలయమందు॥

౫౨. ఒక్కటి శిరసుననుండి భక్షించు
నొక్కటిహృదయాననుండి వెలుంగు॥

౫౩. భక్షించి భక్షించి పరితృప్తి లేక
శిక్షించి మమ్మిది చేయించుఁజనూ॥

౫౪. దీనిరాజ్యంబున దీనులౌమమ్ము
దీనావన! మహేంద్ర! దేవ! కాపాడు॥

౫౫. మాశక్తి లేకయే మఱిసాగలేదు
మాశక్తి నిహరించి మమ్ము బాధించు॥

౫౬. మేముభాసింతుము మేముందునయ్య
మామనస్సునకెంచ మా కేమి మేలు॥

౫౭ ఈప్రకారంబున నీతిబాధలును
నీ ప్రతిరూపముల్ నిత్యము పడఁగ॥

౫౮. శోచింపకేమియు సురరాజపదవిని
చూచుచునుండుట శోభయా నీకు॥

౫౯. నిన్ను నన్నుగఁజేసి నిర్జరనాథ
మిన్నునఁగూర్చుండి మేలెంచవేమి.

౬౦. ప్రతిబింబమునఁ జిత్తి ప్రసరింపనేల
పతితపావన! దాని బంధింపనేల॥

౬౧. తనరూపు బంధింపఁ దనకేదియశము
ఘనవాహ! నీవిది గమనింపలేదా॥

"కొన్ని యోగమార్గములు"

౧౨. చేదైన విషయాలఁ జిత్తము విడిచి
నీవు ప్రక్కకు వంగి నిర్జరేశ్వరుఁడ॥

౧౩. యోచింపయోచింప నుదయించు శక్తి
యాచింపయాచింప నలవడు భక్తి॥

౧౪. తలనుండి స్వహృదయ స్థలముఁ జూచుటయె
బలవైరి ప్రక్కకు వంగుటయగును॥

౧౫. తన మూలమును బుద్ధి తర్కించుటొకటి
తన బుద్ధినే తాను దర్శించుటొకటి॥

౧౬. నిన్ను భజించుట నిఖిలేంద్రయగును
దన్ను విడిచిననేది తపసులో కాన॥

౧౭. ఆత్మప్రతీతియే యప్రమాదమగు
నాత్మను మఱచుటయగు ప్రమాదంబు॥

౧౮. అప్రమాదము యోగ మన్నింటికన్న
నప్రమత్తుఁడు నిన్నె హరిహయ! చేరు॥

౧౯. నినుఁజేరుటయనంగ నిర్జరనాథ
తనయందు నిల్చుట తాత్పర్యమందు॥

౨౦. తనపట్టు విడుచుచుఁ దలఁచుట భవము
తనపట్టు విడువక తలఁచుట తపము॥

౨౧. తనచోటనుండుట తలఁపులు లేక
ఘనవాహ! నీయందు ఘనమగు నిష్ఠ॥

౨౨. చూపునేచూచెడు శుద్ధయోగులకుఁ
బాపహారిపరుండు ప్రత్యక్షుఁడగును॥

౨౩. క్రొండనాల్గుకబుద్ధి కూర్చుండవింపు
పిండాననిది శక్రవేశ్మము సుండు॥

౨౪ ఆధారమండలి యణువైనయగ్ని
యాధారముగ దృష్టి నతియుక్తి దింపి॥

౨౫. చింతింపు మింద్రుని జిత్తమువంచి
సంతతమది పంథ సర్వ సిద్ధులకు॥

౨౬. ప్రాణనిత్య విహార పరిశోధకుఁడగు
ప్రాణికింద్రుని శక్తి ప్రత్యక్షమగును॥

౨౭. శక్తుని విశ్వప్రసారిణి శక్తి
భక్తుని తనువులోఁ బ్రవహించుఁగాత॥

---

శివుల కవుల పద్ధతి ననుసరించి కొన్నిచోట్ల ప్రాస యతి కీయబడినది.



## ఘనము

(మామునూరు నాగభూషణరావుగారు)

౧

తతమహాఘోరదుఃఖ సౌధంబులందు
నధివసింపుచు దుర్వ్యథలందుకంటె,
ప్రవిమలానంద నీలాభ్ర పథమునందు
మేఘశకలంబుగామాఱుటే ఘనంబు!

౨

కల్మషప్రపూర్ణ తుచ్ఛసుగంధ వస్తు
వులను బీలిచి భ్రమలలో మలయుకంటె,
లలితమంజుల మలయానిలంబులోన
కలసియొకరేణువుగ మారగా ఘనంబు!

౩

దారుణక్రూర వాగమృతంబుగ్రోలి
తుచ్ఛకామప్రవృత్తిలో దొరలుకంటె,
విమలపరిపూర్ణ నీలాంబుదములలోని
మధురబిందువుగ్రావు సంపదఘనంబు!

౪

అవిరళస్వేచ్ఛవిషయ మోహాంధుఁడగుచు
సనవిహరించి సంతసంబందుకంటె,
పాపనాసల జ్వాలలోపలను, ఒక్క
నాల్కయై శోకములను జెండఁగ ఘనంబు!

# వ్యావహారిక శాసన శకములు

(చింతలపాటి బుచ్చి వేంకటేశ్వర శర్మగారు బి.ఏ.ఎల్.టి.)

| వరుస సంఖ్య | శకము పేరు | సూత్రము:—క్రీస్తు శకము లోనికి మార్చు పద్ధతి. | చైత్రాది లేక కార్తికాది | అమాంతము లేక పూర్ణిమాంతము | ప్రస్తుతము వాడుకలో నున్న లేక యిదివరలో నుండిన ప్రదేశములు. | రిమార్కులు ఇతరవివరములు |
|---|---|---|---|---|---|---|
| 1 | కలియుగ | గత సం=3102 క్రీ.పూ. సం॥<br>లేక =క్రీ.శ.సం+3101 | సౌరమానము మేషాది, చాంద్రమానము చైత్రాది |  | హిందూదేశమంతటను— |  |
| 2 | సప్తఋషి | వర్తమాన సం=క్రీ.శ.సం+76 | చైత్రాది | పూర్ణిమాంతము | ఇదివరలో ముల్తాను తద్ఇతర రాష్ట్రములలో, ప్రస్తుతము కాశ్మీరములో | క్రీ.శ 1910= సప్తర్షి 1986 సామాన్యముగా ,,86 సప్తర్షి ''యని వాడబడును. |
| 3 | విక్రమ లేక మాలవలేక సంవత్ | గత సం॥=క్రీ.శ.సం+57 | గుజరాతులో కార్తికాది, ఉత్తరహిందూస్థానములో చైత్రాది | అమాంతము<br>పూర్ణిమాంతము | గుజరాతులోను, బెంగాలు తప్ప ఉత్తర హిందూస్థానమందంతటను. | ఇతర పేర్లు:— 'మాలవశకము' 'సంవత్' |
| 4 | శాలివాహనశకము | గత సం॥=క్రీ.శ. సం॥—78<br>వర్తమాన సం॥=క్రీ.శ.సం॥—77 | సౌరమానము మేషాది, చాంద్రమానము చైత్రాది | సామాన్యముగా అమాంతము. ఉత్తర హిందూస్థానములో పూర్ణిమాంతము | హిందూ దేశమందంతటను పూర్వము, ప్రస్తుతము | శాసనములలో వర్తమాన సంవత్సరము దహరింపబడుచుండెను. |
| 5 | కొల్లము | వర్తమాన సం॥క్రీ.శ.సం—824 | ఉత్తర మలబారులో కన్యతోను, ద॥మలబారులో సింహముతోను— |  | క్రీ.శ 825 నుండి మలబారు, కొచ్చిన్ తిరువాన్కూరు |  |
| 6 | బెంగాలి సాన్ లేక సేన్ — | వర్తమాన సం॥క్రీ.శ.సం—593 | సౌర సంవత్సరము మేషాది. |  | బంగాళా దేశము. |  |
| 7 | చేదిలేక కలచూరి | వర్తమాన సం॥క్రీ.శ.సం—247 | అశ్వియాది. | పూర్ణిమాంతము | ప్రస్తుత మెచ్చటనులేదు. పశ్చిమ, మధ్యహిందూస్థానములలో కలచూరి రాజుల కాలమ్ములో నుండెను. |  |
| 8 | గుప్త | వర్తమాన సం॥ క్రీ.శ.సం—319 | చైత్రాది | పూర్ణిమాంతము | ప్రస్తుత మెచ్చటనులేదు. క్రీ శ 4 మొదలు 7 శతాబ్దములవరకు. మధ్య ఇండియా, నేపాలులో నుండెను— | క్రీ.శ 500=181 వర్తమానము గుప్త |

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 9 | వలభి | వర్తమాన సం॥ క్రీ.శ.సం—318 | కార్తికాది | అమాంతము లేక పూర్ణిమాంతము | ప్రస్తుతమెచ్చటను లేదు. క్రీ.శ 4 మొదలు 13 వ శతాబ్దము వరకు, కథియవాడ్, దాని ప్రాంతములలో నుండెను. | |
| 10 | విలా[illegible] | వర్తమాన సం॥ క్రీ.శ.సం—592 | సౌరకన్యాది. | సంక్రాంతి దినములు నెలలకు మొదలు | ఇప్పుడు ఒరిస్సాలో | |
| 11 | అమ్లి | వర్తమాన సం॥= క్రీ.శ సం—592 | భాద్రపద శు॥ 12 అనగా కన్యాసంక్రాంతికి కొద్ది రోజులు ముందు లేక వెనుక | | ఒరిస్సాలో వాడుకలో నున్నది. | |
| 12 | ఫసలీ | వర్తమానసం॥=క్రీ.శ. సం—592 | పూర్ణిమాంతము ఆశ్వీన్యాది | | బంగాళాదేశము, ఉత్తర హిందూస్థానము. | |
| 13 | దక్షిను ఫసలీ | వర్తమానసం॥= క్రీ. శ. సం—593 | | | | |

క్రీ. శ. 1556 అనగా ఫసలీ సం॥ 963 వరకు అట్లు వాడుకలోనుండెను. అప్పటినుంచియు బెంగాల్ సేను సంఖ్యయే దీనికి గూడయున్నది. బొంబాయి మొదలయిన ప్రదేశములలో సూర్యుడు మృగశిర నక్షత్రమందు ప్రవేశించునపుడనగా సుమారు 7 లేక 8 జూన్ తో మొదలగును. దీనిని నెలలు, వాటిప్రారంభము రోజులు మహమ్మదీయ (calendar) వలెనే యుండును.

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 14 | ఫసలీ మద్రాసు | వర్తమానసం॥= క్రీ శ. సం—590 | | | | జూలై 1910 30 జూన్ 1911= ఫసలీ 1320 |
| 15 | మహారాష్ట్రసూరసేన్, షాహూర్ సేన్ లేక అరబి సేన్ | వర్తమానసం॥= క్రీ. శ. సం—599 | సూర్యుడుమృగశిరా నక్షత్రమందు ప్రవేశించినపుడు సుమారు 8వ జూన్ | | మహారాష్ట్ర చక్రవర్తుల కాలములలో చాలచోట్ల వాడుకలో నుండెను. ఇప్పుడుగూడ అచ్చటచ్చట వున్నది. | |
| 16 | హర్ష కాల శకము | వర్తమానసం॥= క్రీ. శ. సం—606 | | | కనోజ్ లోని మథురలోను, నేపాలులోను యుండెను. | |
| 17 | నేవారశకము. | గతసం॥= క్రీ. శ. సం—879 | కార్తికాది | అమాంతము | నేపాలలో క్రీ. శ. 878 నుండి 1768 వరకు వాడబడెను. | |
| 18 | చాళుక్య శకము. | గతసం॥= క్రీ. శ. సం1076 | | | క్రీ శ. 1079 నుంచి 1162 వాడుకలో నుండెను. | శాలివాహనశకపు నెలలు, పక్షములు వలె నుండును. |



రెడ్డివిద్యార్థి వసతిగృహము ౧.



రెడ్డివిద్యార్థి వసతిగృహము ౨.
(క్రొత్తగ కొనినట్టిది.)



రెడ్డివిద్యార్థి వసతిగృహము 3.



కీ॥ శే॥ వేంకట లక్ష్మారావు బహద్దరుగారు
( జటప్రోలు సంస్థానాధీశులు )

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 19 | లక్ష్మణసేన | గతసం॥= క్రీ. శ. సం—1108<br>గ సం॥= క్రీ. శ. సం—1119<br>(కీల్ హారన్ దొరవారు వ్రాసినప్రకారము) | కార్తికాది | అమాంతము | శాలివాహన, విక్రమ శకములతో పాటు 'తిర్హుటు' 'మిథిల' లో వాడుకలో నున్నది. | |
| | | కీల్ హారన్ దొరవారి శకము క్రీ. శ. 1194 నుండి 1551 వరకు వాడుకలో నుండెను. వారు వ్రాసిన ప్రకారము సూత్రము గత సం=క్రీ. శ. సం—1119. | | | | |
| 20 | మహారాష్ట్ర రాజ శకము. | వర్తమానసం॥= క్రీ. శ. సం—1673 | జ్యేష్ఠ శు ౧౩ | | | శివాజిపట్టాభిషేకముతో ప్రారంభమయ్యెను. |
| 21 | తారిఖు యి. యిలాహి | | 14వ ఫిబ్రివరి 1556 | | | అక్బరు పట్టాభిషేకముతో ప్రారంభమయ్యెను. |

షాజహాన్ తరువాత వాడుకలో లేదు. అధిమాకసములు లేవు. రోజులు నెలలు సౌరమానము.



# కుట్మలము

వేలూరి శివరామశాస్త్రిగారు

క. బంగారునీరు తీసిన
శృంగార గృహంబువోలెఁ జెలఁగు గవుసెనన్.
బొంగినగపాలు మరల భు
జంగి యనఁగ సందుఁజొఱఁగఁజనెదే వీణా!

గీ. పంచబాణుని బాణముల్ పల్లవములు
గాంచి కూర్చుండి కోకిలని పంచమంబు
ముగియజేయకె కోయిలా పోయెదేల?
కేలు జాఁచంగ బెట్టెదు కోలవోలె.

క. కన్నులనున్ నృత్యంబున
మన్నించి కులాయములను మాటుపడెదరే
వన్నియ జక్కవలారా!
అన్నన్నా తెరమఱుంగు లగు నటులగతిన్.

సీ. తావిమాత్రమునాది దళములన్నియునీవె
యను పారిజాతమ్ముకైన నొల్ల
పొదుగుమాత్రమునాది మోముదంతయునీదె
యను కామధేనువునైన మేప
పండ్లుమాత్రము నావి నిండుఁజెట్టది నీదె
యను కల్పవృక్షంబునైనఁ జేర
కాంతిమాత్రమునాది ఘనతయంతయునీదె
యను నింద్రనీలంబునైనఁ ముట్ట

ఆ. నీవు ప్రసవ్వతెమ్మ నేనూఁకతెచ్చెద
నీవుమెల్లనూదు! నేను తిందు
అన్నరీతికాదె యారసి చూడుమా
కుటిలకౌశలంబ కుట్మలంబ!



# వేములవాడ భీమనకవి

(శ్రీ శేషాద్రిరమణ కవులు)



ఇతఁడు నిజామురాష్ట్రములోని కరీంనగరు జిల్లా వేములవాడనివాసి. దీనినే వేములవాడ యని వ్యవహరింతురు. ఈకవి గోదావరి మండలములోని దాక్షారామ వాసి యనియునటఁ గల వేములవాడ మాతృస్థానమని యుఁ గొందఱందురు. గాని యది విశ్వసనీయము కాదు. భీమకవిసంస్కృతమున వ్రాసిన జ్యోతిష గ్రంథము నొకకవి తెలిఁగించుచు,

,,సీ. శ్రీకరంబై ధరఁ జెలువుఁ గాంచినయట్టి
భీమపురంబునఁ బ్రేమమీఱ
భీమేశ్వరుండును బ్రియముతో భక్తుల
కోర్కెలొసంగుచుఁ గొమరు మిగుల
నొకనాఁడు తిత్వరి యువతులు కొందఱు
భక్తి భీమేశ్వరు భవనమునకుఁ
బోయిపుత్రులవేఁడ ముగ్ధత్వనొక్క
విధవకుమారుని వేడ్కఁగోర
నాలేమముగ్ధత కపహసించుచు నల
భీమేశ్వరుఁడు పుత్రుఁ బ్రీతినొసఁగె
నాకాంతగర్భిణియై గాంచె తనయుని
గలియుగాదిని బ్రేసుగడలుకొనఁగ

* * * * * *

వెలిపెట్టిరకాంత విధవ పుత్రుని గాంచె
వని నిందమోడఁగట్టి యఖిలజనులు
నంతఁదత్తనయుండు నైదేండ్లబాలుఁడై
పురిబాలకులతోడఁ బొసఁగనాడ
జనులెల్ల గోళకుండని నిందఁజేసిన
ఘోషించి యాతండు దూషితుని

తాయెత్తి తల్లిపై వేయబోయిన నది
భీమేశ్వరుఁడు తండ్రి వేయుమనిన
వెసఁజనియాతని వేయనుంకించిన
భీమేశ్వరుఁడు దయపెద్దగలిగి
ప్రత్యక్షమై వత్సరమ్మని తగుజీరి
పశుపక్షిమృగములఁ బ్రాణికోట్ల

* * *

గలిగించుశక్తియుఁ గరమొప్పజనులకు
బిడ్డలనాయువు పెంపుదనర
సంపదలొసఁగెడి సామర్థ్యమునుమఱి
కానిది యౌనని యైనచెల్ల
గాదనియట్టులఁ గావించుబలమును
మునురాఁగలుగు నదియును దెలుపఁగ
బ్రావీణ్యమునునిచ్చి ప్రబలుము నీవని
వరమిచ్చెఁబదియాఱు వర్షములకు
నాతనికి సహాయమై సరస్వతియును * *

* * *

నతఁడెట్లు చెప్పినట్లు చేయుచునుండె
సరిలేని కీర్తిచే జగతి వెలసి.''

నిట్లు వ్రాసియున్నాఁడు. భీమకవి భీమపురి నివాసియనియుఁ గలియుగాదిని జనించెననియు నీ కవి వ్రాసినది ప్రమాదము. భీమకవి జన్మాదికమును గూర్చి కొంచెమించుమించుగ నిట్టి కథయొకటి వాడుకలో నున్నది. ఇది కవి యమానుష ప్రజ్ఞాధురీణుఁడనుటకు లోకులు కల్పించినకథ కావచ్చును.

, వేములవాడలో సుప్రసిద్ధుఁడగు భీమేశ్వరుని సంతానాకాంక్షిణులగు స్త్రీలు ప్రదక్షిణాదులచేఁబూజించెడిరి, ఒక వృద్ధ సువాసినియు సంతానాపేక్షతో

పెద్దకాల మాభీమేశ్వరునకుఁ బ్రదక్షిణాదు లొనరించుట నా గ్రామమందలి యొక బ్రాహ్మణ వితంతువుగాంచి పరిహాసమునకు భీమేశ్వరుని సన్నిధికిఁ బోయి, భీమేశ్వరా నాకుఁ బురుషసంతానము బ్రసాదింతువేని నీనామమె పెట్టుకొందునని మ్రొక్కెఁ జుట్టుపక్కలనున్న సువాసినులు వితంతువునకు సంతానప్రాప్తి యెట్లని పరిహసించిరి. అంతనా వితంతువు కాలము దీరిన సువాసినికి సంతానము ప్రసాదించు భీమేశ్వరుఁడు కాలము దీరని వితంతువునను గ్రహింపఁడా యనినందఱు నవ్విరి. పిదప నా వితంతువు భీమేశ్వరు ననుగ్రహమున గర్భవతియై యొక మగబిడ్డను గనెను. అది మొదలు సాటి బ్రాహ్మణులందఱు వితంతువు దుస్సాంగత్యమున సంతానముఁ గాంచెనని గర్హించుచుండ నామె బహిష్కృతయై తనయునకు భీమేశ్వరుఁడను పేరుఁబెట్టి తానె యక్షరాభ్యాసమొనరించి సాకఁ దొడంగెను. యుక్తవయసు వచ్చినకా బ్రాహ్మణ కుమారుఁడు భీమేశ్వర కృపాలబ్ధ కవితాధురీణుఁడై ప్రఖ్యాతి నార్జింపఁ దొడంగెను. ఒకనాఁడు భీమకవి తన గ్రామమున జరుగుచున్న బ్రాహ్మణ సంతర్పణమునకుఁ బోవనచటి వారందఱు నీవు రండా పుత్రుడవు. అపాంక్తేయుఁడవని నిరాకరించి నెడలఁగొట్టిరి. భీమకవి యపుడలిగి మీ యన్నము సున్నముగాను మీ పప్పు కప్పలుగాను మీ పిఱుదులకుఁ బీటలంటుకొను గాకయని శాపింప భోజనముచేయు బ్రాహ్మణుల విస్తరులనిండ నన్నము సున్నమై యుండెను: పప్పు కప్పలుగ మారి గంతులు వేయసాగెను లేవఁబోవఁ బిఱుదులకుఁ బీటలంటుకొనెను. అపుడచటి బ్రాహ్మణ బృందమంతయు ఘొల్లుమని భీమకవిని డాసి శాపముపసంహరింపుమని ప్రార్థింప నుపసంహరించెను. నాఁడు మొదలు బ్రాహ్మణులందరు భీమకవి దైవ సమానుఁడని తెలిసికొని యుపనయన వివాహములొనరించి తమ కులములోఁ గలుపుకొనిరి. పిమ్మట దేశాంతరమునకేగి భీమకవి తన యసాధారణ నిగ్రహానుగ్రహశక్తిచే లోకమును సమ్మోహనమొనరించుచుఁ బలువుర శపించుచుండ నాతని బాధను సహింపక కొందఱు వెశ్యలు మాయోపాయముచే భీమకవిని మఱి యొపసంచి [illegible] భీమ

కవి వశ్యవాక్కుఁ గలవాఁడగుటచే వెంటనే మసియై పోయెను''

భీమకవి జన్మమునకు భీమేశ్వరుఁడే కారకుఁడనియు మరణమునకు వైశ్యులే కారకులనియుఁ జెప్పికొను నీ కథయెంత విశ్వాసపాత్రమొ చర్చించుట యనవసరము. ఇందు సత్యమున్నను లేకున్నను భీమకవి పేరు విన్నవారందఱు నీ కథ వినిన వారె గానఁ జర్చితస్థము చేయవలసి వచ్చినది. భీమకవి విషయములో నిట్టి కథలుండియా నిట్టి గాటువుల నుండియుఁ దక్క చరిత్రాధారములు గ్రంథాధారములు లభించుట మిక్కిలి యరుదు.

మ॥ ఘనుఁడన్ వేములవాడ వంశజుఁడ
దాక్షారామ భీమేశనందనుఁడన్
దివ్యవిషామృత ప్రకటనానా కావ్య ధుర్యుండ
భీమన నాపేరు వినంగ జెప్పితి§
కళింగాధీశ; కస్తూరికా
ఘనసారాది సుగంధ వస్తువులు
వేగన్ దెచ్చి లాలింపురా॥

ఈ పద్యము నాధారము జేసికొని భీమకవి గోదావరి మండలములోని ద్రాక్షారామము చెంతగల వేములవాడ నివాసియని కొందఱు చరిత్రకారులు వ్రాసియున్నారు. కాని నిజాము రాష్ట్రములోని వేములవాడయే భీమకవి నివాసమనుట విశ్వసనీయము.

"క॥ వేములవాడను వెలసిన
భీమేశ్వరు కరుణగల్గు భీమ సుకవినేఁ
గోమటి శేచన మీఁదను
నేమహిమ పులెన్న ఛందమెలమి రచింతున్"

## —కవి జన్మాశ్రయము అవతారిక—

పై పద్యము వలన వేములవాడలో వెలసిన భీమేశ్వరుఁడే భీమకవికి వరప్రదాతయని తెలియుటచేతను గోదావరి మండలములోని వేములవాడలో భీమేశ్వరా

---

§ కొందఱు వెలుంగాధీశయనియుఁ దెలుంగాధీశయనియుఁ ద్రిలింగాధీశయనియుఁ గల పాఠములఁ దీసికొనిరి. కాని యిచటఁ గళింగాధీశ పాఠమే సమంజసము.

లయము లేక దూరముగనున్న దాక్షారామములో నుండ వలను భీమకవి భీమేశ్వరాలయము గల నిజాము రాష్ట్రములోని వేములవాడ నివాసియనియే విశ్వసింపవలయును. వేములవాడ ప్రాచీన శాసనములలో లేమ్బులవాడ యని వ్యవహరింపబడియున్నది. క్రమముగ వేములవాడగ మారి వేములవాడయను నూతన నామ మేర్పడియున్నది. తాళపత్ర గ్రంథములలోఁ గొన్ని చోటుల వేములవాడ యనుటకు లేములవాడ యని కలదు. నిజాము రాష్ట్రములోని వేములవాడను లేములవాడయనియు వ్యవహరింతురు కావున "ఉ॥ వేములవాడ భీమకవి వేగమజూచి కళింగగంగు" అను పద్యమునకు ఉ॥ లేములవాడభీముడవ లీలగఁజూచి కళింగగంగు" అను పాఠము సైతము కలదు,

మ॥ ఘనుఁడన్ వేములవాడ వంశజుఁడ దాక్షారామ భీమేశనందనుడన్ * * *

పై పద్యములోని భీమేశ్వరుఁడు వేములవాడ (నైజాములోని) భీమేశ్వరుఁడెగాని వేఱుగాదు. భీమేశ్వరాలయ భాగము దక్షుఁడు యజ్ఞము గావించిన భాగమని యుఁగాననే దాక్షారామ మనఁబడుననియు నా క్షేత్ర మాహాత్మ్యమునఁ గలదు.

శ్లో॥ జనయామానతుస్త్ర త్రిశివలింగం సనాతనం
  దక్ష్యవాట్యాంభీమలింగం యత్రరాజేశ్వరశ్శివః
  అస్యలింగస్య మాహాత్మ్యం దృష్ట్వాసర్వేపివిస్మ్మఖాః
  పుపూజ స్సర్వకామైశ్చ వీరభద్రస్య సన్నిధౌ

ఇతిశ్రీ భవిష్యోత్తర పురాణే రాజేశ్వర మాహాత్మ్యే శివస్వరూప దర్శనం నామచత్వారింశోధ్యాయః

దీనింబట్టి విచారింప భీమకవి నిజాం రాష్ట్రములోని వేములవాడనియు దానికి దాక్షారామమని నామము కలదనియుఁ దెలియుచున్నది. వేములవాడలో గొప్ప భీమేశ్వరాలయము కలదు. ఈభీమేశ్వరుఁడె భీమకవికి వరప్రదాతయని గ్రామవాసులు పరంపరఁగఁ జెప్పుకొనుచున్నారు. కవి జనాశ్రయము రేచనయనువాని కంకితము గావింపఁబడినది. కవి రేచనను వణిగ్వంశ చూడామణియనియు జనమతహితుని సంభోధించుటచే రేచనవైశ్యుఁడనియు జైనమత సంబంధియనియుఁ దెలియుచున్నది.

క్రీ. శ. ౧౩ శతాబ్దికిఁ బైకాలమున జైనమతము నిజాము రాష్ట్రమున వ్యాప్తముగ నున్నటుల గ్రంథాధారములు గలవు. లేములవాడలో జైనవిగ్రహములు జాలఁగలవు. ఇప్పటికి ప్రాంతమునగల జగిత్యాల చుట్టుప్రక్కల జైనవైశ్యులు పెక్కండ్రు గలరు. కాన జైన వైశ్యున కంకితము గావింపఁబడిన భీమన ఛందస్సు నిజాము రాజ్యములోని లేములవాడలో బుట్టినదనుట మొదటి నిర్ణయమునకుఁ దోడు కాఁగలదు. కవినివాసమునుగూర్చిన చర్చ నింతతో ముగించి కాలము కృతికర్త్రాద్యము ను విచారింతము.

భీమకవి కాలనిరూపణమునఁ జరిత్రకారు లేకాభిప్రాయులుగ లేరు, కాలనిరూపణమునకుఁ జాలినన్ని గ్రంథాధారములు సైతము లేవు. ఒకఁ పేటికిఁ దీసిన మతి యొకటి కోటికిఁ దీయు చాటుపద్యములతోఁ గవికాలముల నిర్ణయించుట ప్రమాదము శ్రీనాథ మహాకవి కాశీఖండములో

సీ. వచియింతు వేములవాడ భీమునిభంగి
  యుద్దండ లీల లొక్కొక్కమాటు"

నిట్లు మండె. వేములవాడ భీముని ప్రశంసించుటచే నొక చరిత్రకారుఁడు భీమన నన్నయభట్టారకునికంటె బూర్వుఁగ నిర్ణయించుటకుఁ జాల శ్రమచేసెను. ఆంధ్ర కవులు పూర్వకవిస్మరణమున పౌర్వాపర్యమును బాటించుటాచారముకాదు కావున భీమకవి కాలనిరూపణమునకు శ్రీనాథుని పద్యభాగము దృష్టాంతరము కాఁజాలదు. భీమకవి రచితములని పెక్కుపద్యములు వాడుకలో నున్నవి. ఇవియన్నియు భీమకవి కృతము లనుటకుఁ బ్రమాణములు లేకపోఁగా నన్నియు నొక శతాబ్దములోనివని తెలుపుటకు వీలుకాకున్నవి, అందుఁ గొన్నిటి నుదాహరించుచున్నారము.

మ. ఘనుఁడన్ వేములవాడవంశజుఁడ దాక్షారామభీమేశనందనుఁడన్ దివ్యవిషామృత ప్రకటనానాకావ్యధుర్యుండభీ
  మననా పేరువినంగఁ జెప్పితిఁ దెలుంగాధీశ! కస్తూరికా
  ఘనసారాదిసుగంధవస్తువులు వేగన్ దెచ్చిలాలింపురా,

ఈ పద్యమునకుఁ గళింగాధీశయను పాఠము కానవచ్చుచున్నది. కళింగాధీశ! యనుటయే యుక్తమైనట్లు సది

విశేషణముగాఁ గళింగాధీశుఁ డేకాలమువాఁడో యథార్థనామ మేదియో తెలిసికొనుట దుస్తరము. తెలుగురాయలు కస్తూరిదానమునకుఁ బ్రశస్తికెక్కినటుల శ్రీనాథ మహాకవికృతమగు

శా. అక్షయ్యంబగు సాంపరాయని తెలుంగాధీశ కస్తూరికా
భిక్షాదానము చేయు రాసుకవిరాట్ బృందారక శ్రేణికిన్
దాక్షారామపురీ విహారవరగంధర్వాప్సరో భామినీ
వక్షోజద్వయకుంభికుంభములపై వాసించు నవ్వాసనల్.

సీ. రంభఁ గూడెఁ దెనుంగు రాయరాహుత్తుండు
కస్తూరికేరాజు ప్రస్తుతించు

ఈపద్యమువలన శ్రీనాథుని కాలములో నొక తెలుఁగురాయలు కస్తూరిదాత కలఁడు గాని యతఁడు భీముని కాలములో సైతము కలఁడని తలంచుట కును భీముని కాలములో వేఱొక తెలుఁగు రాయలు కస్తూరిదాత కలఁడని యుఁ జరిత్రసిద్ధము కాదు గాన భీమకవి కాల నిరూపణమునకీ పద్య ముపయోగింప నేరదు. శ్రీనాథుఁడే భీముని ప్రాచీనునిగఁ బ్రశంసించియుండ శ్రీనాథుని కాలములో నున్న తెలుఁగురాయలు భీముని కాలములోనివానినిగఁ దలంపరాదు. రామవిలాసములో

క. అమాచనృపతిసుతుఁడును
హేమహుఁ డెఱ పోతనక్ష్మాధీశ్వరుఁడా
శ్రీమంతు సుతులు జగదభి
రాములు శ్రీతెలుఁగురాయ రామనరేంద్రుల్.

అని గృష్ణాతీరమండలి గుడిమెట్టపాలకుఁడగు నెఱపోతన కుమారుఁడొక తెలుఁగురాయలు కలఁడు; ఇతఁడు పదునేడవ శతాబ్దమున నున్నాఁడు. ఇంతియకాక రామవిలాసములో

మ. అచలాధీశ్వర ధీర శేక పరిషద్గ్రాహ్యధ్యక్షు విద్వేషిరా
ట్ప్రచయోద్వేల బలావలేపతిమిర ప్రద్యోతనుల్ గ్రమ
ర్కచరిత్రోత్తమ కావ్యనాయకుని వేడ్కం బ్రస్తుతిం
(పం దగున్
సుచరిత్రాఢ్యుని వత్సవాయ తెలుఁగుక్షోణీశ చూ
(డామణిన్

వేఱొక తెలుఁగురాయలు కీర్తింపఁ బడియున్నాఁడు. ఇతఁడు శ్రీనాథునికి మిగుల దఱువాతవాఁడు. జ్ఞానవాసిష్ఠ రామాయణమున

క. కూనయ ముప్పనృపాలుని
సూనుండగు దెలుఁగువిభుని సుందరిమల్లాం
బానందనుఁ డగుముప్పది
భూనాథుని సుకవివరుఁడ బుధసన్నుతుఁడన్.

అను పద్యమువలన క్రీ. శ. ౧౫౫౦ ప్రాంతమున ముప్పదినాయకుని తండ్రి గురిజాల తెలుఁగురాయలు కలఁడు. ఈ తెలుఁగురాయలలో భీమకవికిఁ గస్తూరిదాత యెవ్వఁడో తెలియుటకు మాతృకలోని తెలుంగాధీశ యను పాఠమునకుఁ గళింగాధీశ యను పాఠము బదులుగఁ దీసికొనుట యుక్తము. ఈచాటువలన భీమకవి కాలము తెలియుటలేదు.

భీమకవి యొకమాఱు వేఁగిదేశమునకుఁబోయి యాదేశము పాలించు కళింగగంగు సన్నిధికిఁబోఁగా భీమకవి ప్రసిద్ధాను లెఱింగిన వాఁడయ్యు దర్శనమునకు వీలు కాదనెనఁట] అపుడు భీమకవి విసికి

† ఉ॥ "వేములవాడ భీమకవి
వేగమ జూచి కళింగ గంగుతా
సామముమాని కోపమున
సందడిదీఱిన రమ్మపొమ్మనెన్
మోమునుజూడ దోషమిఁక
ముప్పదిరెండు దినంబులావలన్
జామున కర్థమంతయని
సంపద శత్రులఁ జేరఁగావుతన్

అని శపించెను. తరువాత కళింగగంగు సర్వ రాజ్యము శత్రుభూపాలురచే నపహృతముకాఁగా గతిచెడి బిచ్చగాఁడై దేశము భ్రమించుచు నొకయింటికిఁ జీకటిలో భిక్షార్థియై వచ్చి యటనున్న గోతిలోఁ గూలెను. ఆయింట విడిసిన భీమకవి పాదప్రక్షాళనార్థము బయటికి వచ్చి గోతిలో మూలుగుచున్న వానిని నీ వెవఁడవని ప్రశ్నింపఁ గళింగఁ గంగుతాను భీమకవి చేసిన జోగినసి చెప్పుకొన నాతని వృత్తాంతము గ్రహించి దయాళుఁడై భీమకవి

---

(† వేములవాడ భీము "నకలీల" యని పాఠాంతరము కలదు.)

ఉ॥ వేయి గజంబులుండఁ బది
వేలు తురంగము లుండ నాజిలో
రాయలఁ గెల్చి సజ్జ నగ
రంబునఁ బట్టము గట్టుకొనెడిన్
రాయకళింగ గంగకవి
రాజభయంకర మూర్తి చూడఁదాఁ
బోయెను మీనమాసమునఁ
బున్నమపోయిన షష్ఠినాటికిన్

అని శాపము పసంహరించి యాశీర్వదింపఁ గళింగగంగు సంత
సించి చాటునుబట్టిపోవు భాగవతులతోఁ గలసి సజ్జ నగర
మునకుఁ బోయెను. అచ్చటి రాజు భాగవతులఁ బిలిపించి
కళింగ గంగు రాజ్య విచ్యుతి నాటకముగా నాడు మని
కోరఁ గళింగగంగు ప్రాతమున కశ్వము ఖడ్గము కావల
యునని ప్రభువును నమ్మించి తెప్పించి కళింగగంగున
కొసంగ నాతఁడా యశ్వము నధిష్ఠించి కరవాలమును
జేకొని ప్రజలందఱు మన ప్రభువే కళింగ గంగయని
యానందించుచుండ ఖేలనముఁ జూచుచున్న శత్రురాజును
ఖండించి సింహాసన మధిష్ఠించెనను కథకీ రెండు పద్య
ములు సంబంధించి యున్నవి. కవిజనాశ్రయ పరిశోధకు
లగు బ్రహ్మశ్రీ జయంతి రామయ్య పంతులు వారీరెండు
పద్యముల నాధారముగ స్వీకరించి కవి కాల నిరూపణ
మారంభించిరి.

శ్లో॥ శాకాబ్దే నందరంధ్ర గ్రహగణ
గణితే (౯౯౯) సంధి సంస్థేధినేశే
శుచేపక్షే తృతీయాజిరవిజ
దినేరేవతీ ధేన్యయుగ్మే
లగ్నే గంగాన్వవాయాంబుజ
వనదిన కృద్విశ్వ విశ్వంభరాయా
శ్చక్రం సంరక్షితుం సద్గుణ నిధి
రధిపశ్చోడ గంగోభిషిక్తః॥

అను శాసన శ్లోకము నుదాహరించి జయంతి
రామయ్య పంతులు వారు కళింగ గంగ నామ మనంత
చోడ వర్మయను నామాంతరముఁ గల యాతనికే యన్వర్థ
మగుననియుఁ గళింగ గంగించు మించుగా నలువది సంవ
త్సరములు రాజ్యముఁ బాలించెఁ గాన భీమకవి యాతని
యంత్యదశ యందున్న చో ౧౨ శతాబ్దము వాఁడగునని
నిరూపించిరి. నన్నయ బట్టారకునకుఁ బూర్వము రాజ్య
మేలిన చోడ రాజులలో నెవనికి గంగ నామము కానరాక
పోవుట వలన రాజనరేంద్రుని పుత్రుఁడగు కులోత్తుంగ
చోడదేవుని దౌహిత్రుఁడగు కళింగ గంగే భీమకవి కాల
ములోని వాడని వీరేశలింగము పంతులువారు విశ్వసిం
చిరి. ఈ చోడ గంగే కళింగ గంగైన పక్షమున క్రీ.శ
౧౦౮౮ లో రాజ్యమునకువచ్చి పిమ్మట రమారమి ౧౧౩౩
వఱకు నలువది సంవత్సరములు రాజ్యమేలెఁ గాన భీమకవి
యీ చోడ గంగు కాలములోని వాఁడైన మొదల
క్రీ. శ. ౧౧౫౦ కిఁ బూర్వుఁడు కాఁజాలఁడు. భీమకవి
రచించెనని వాడుకగల తక్కిన చాటువులకంటె నింద
తిశయము కానరాదుగాన భీమకవి కాలనిరూపణమునకీ
చాటువులు ప్రమాణములు కావనియు నైనచో రామయ్య
పంతులు వారు వీరేశలింగము పంతులువారు తలంచి
నట్టుల పండ్రెండవశతాబ్దారంభములోని వాఁడు కాక
నదునొకండవ శతాబ్ద మధ్య భాగమున నున్నటుల
స్పష్టము.

చోళక్ష్మాపాలుఁడొకనాఁడు మల్లె పందిరి
చెంత వినోదగోష్ఠి నెఱపుచు చెంతనున్న శాపానుగ్రహ
దక్షుఁడగు భీమ కవీశ్వరునిం జూచి యీపందిరి కొయ్యలఁ
జివురు పెట్టునటులఁ జేయుమన భీమకవి.

శా॥ అసితాభ్యుపదాన శృంఖల పదా
భ్యాలంబిత స్తంభమా
నేనే వేములవాడ భీమకవినే
నిన్ జిత్రకూటంబులో
ధ్యానవ్యాపిత పల్లవోద్భవ మహా
పుష్ప గుచ్ఛంబులన్
నానాకల్ప ఫలప్రదాయివగు మా
నా కల్ప వృక్షాకృతిన్॥

అను నీ పద్యమును రచింపఁ దత్క్షణము పందిరి
శాఖోపశాఖలు లేచి చివిరించి మునుపటి వృక్షాకృతిఁ
దాల్చెను. చోళక్ష్మాపుఁడా స్తంభములకు స్వరూపమును
దయచేయుమని వేఁడ భీమకవి యిటులఁ జెప్పెను

ఉ॥ శంభుఁ వరప్రసాదకవి
సంఘవరేణ్యుఁడనైన నావచో
గుంభనచేయ నెంతొ యను
కూలము నొంది తనూనభావనన్
గుంభినిఁ జోక్కనామనృప
కుంజరు పందిటి మల్లె సాలకున్
స్తంభము రీతి నీతనువు
దాలిచి యెప్పటియట్ల యుండుమా॥

ఇటులఁ జెప్పినంతఁ బందిరి తంబములు పూర్వ రూపము ధరించెను. ఈ చోక్కనృపాలుఁడు సామంత రాజని తోఁచుచున్నది. చోక్కనృపాలుని కాల నిర్ణయమున కప్ప కవీయములో భీమకవి చాటుధారయని యుదాహరింపఁబడిన యీ పద్యము తోడ్పడఁగలదు.

ఉ॥ చక్కదనంబు దీవియగు
సాహిణిమారఁడు మారుకైవడిన్
బొక్కపడంగలండు చల
ముంబలముంగల యాచళుక్యపుం
జొక్కనృపాలుఁడుగ్రుఁడయి
చూక్కల మంటలురాలఁ జూచినన్
మిక్కిలి రాజశేఖరుని
మీఁదికి వచ్చినరిత్తఁబోవునే॥

ఈ పద్యము వలన సాహిణి మారన చోక్కనృపాలుఁడు నొక్కకాలమువారని తేలుచున్నది. సాహిణి మారన ప్రతాప రుద్రుని సేనా నాయకుఁడని సోమదేవ రాజీయాదులలోఁ జెప్పబడి యున్నది. ఇదియె సత్యమైన పక్షమున భీమకవియుఁ జోక్కనృపాలుడును సాహిణి మారుఁడును క్రీ. శ. ౧౩౫౧ ప్రాంతముల నున్నటులఁ దలంపవచ్చును.

చం॥ గరళపు ముద్దలో హిమవ
గాధపు వాళవిలోల్లు సమ్మెటల్
హరునయనాగ్ని కొల్మియుర
గాధిపుకోరలు పట్టుకార్లు దిక్
కరటి శిరంబు దాయలయ
కాలుఁడు కమ్మరివైరివీర సం
హరణ గుణాభిరాముఁడగు
మైలమ భీమనఖడ్గ సృష్టికిన్

ఈ చాటూక్తి భీమకవి కృతమని యప్పకవీయమునఁ గలదు. మైలము భీమన శాసన మహారావతిలో నున్నటులను అధికారి ౯-౨౫ అయినట్లు **Elliot Mardles** అను గ్రంథమున నున్నటుల గురుజాడ శ్రీరామమూర్తిగారు వ్రాసియున్నారు. ఇది భీమకవి రచితమే యైనచో నితఁడు క్రీ. శ. ౧౧౦౧ లో నుండి యుండును. ఇటీవల నీ వంశీయులు మైలము భీమనలు కలరేమో తెలియుటలేదు.

భీమన చాటువులని కవి కాలనిరూపణమునకనుకూలమైన చాటువులింక రెండు గలవు. గాని యవి భీమకవి కృతములు గావని తలంచుటకు బలవత్తరములగు నాధారములు పైతము కలవు

చ॥ హయమదినీత పోతపసు
థాధిపుఁడారయ రావణుండని
శ్చయముగ నేను రాఘవుఁడ
సహ్యజవారధి మారుడంజనా
ప్రియతనయుండు అచ్చన వి
భీషుఁడా గుడిమెట్ట లంక నా
జయమును బోతరక్కసుని
చావును నేడవ నాఁడు చూడుఁడీ.

ఈ పద్యము కల్లూరి తిరుమలయ్య చెప్పినటులప్ప కవీయమునఁ గలదు గావున నీ పోతరాజెవఁడు ఏ కాలమువాఁడని చర్చించుట యకాండ తాండవము గాన విసర్జించితిమి. ఈ పోతరాజు శ్రీపతి రాజా! సాగిపోత రాజా! యను చర్చ ప్రకృతమునకు దూరము.

సీ. గడియలో పలఁదాఁటిగడఁగిముత్తునియుగాఁ
దిట్టిన మేధావి భట్టుకంటె
రెండుగడెలబ్రహ్మదండి ముండ్లన్నియు
దుల్లదిట్టిన కవిమల్లుకంటె
మూఁడుగడియలను మొనసియొత్తిగండి
పసులఁదిట్టిన కవి భానుకంటె
నరజాములోపలఁ జెటువుసిల్లింకంగఁ
దిట్టిన బడబాగ్ని భట్టుకంటె
గీ. నుగ్రకోపినేను నోఁపుమశపియింపఁ.
గ్రమ్మజింపశక్తి కలదు నాకు

వట్టిమాన జీవురుఁ బుట్టింపగిట్టింప
బిరుద వేములాడ భీమకవిని.

ఇప్పద్యము లక్షణ గ్రంథములలో నుదాహరింపఁ బడియున్నను భీమనకవి కృతమని విశ్వసింపవీలులేదు. వేములవాడయనుటకు వేములాడ యనుటయు స్వాతిశయములు చెప్పుకొనుటయుఁ జూడ నెవరో యప్రౌఢకవి రచించి భీమనకుఁ గర్తృత్వము నారోపించినటులూహింపవచ్చును. మొదటి పాదమునఁ జెప్పఁబడిన మేధావి భట్టైన సాళువ పెదతిమ్మ భూపాలుఁడు.

క౦. సాళువ పెదతిమ్మమహీ
పాలవరుఁడు వీఁడె వచ్చె పద్యము వ్రాయక
నేలను లేదాలోక్కటి
తాళమము త్తునియలగుచు ధర వ్రాఁ బడుమా."

ఈ మేధావిభట్టు [తిమ్మరాజు] క్రీ. శ. ౧౫౦౦ ప్రాంతములోనివాఁడు. భీమకవి యాకాలమునకు మిగులఁ బూర్వుఁడు కాన విమర్శనీయాంశము కాను. రెండవపాదములోని కవిమల్లు ప్రౌఢకవి మల్లనయని సంప్రదాయజ్ఞుల యభిప్రాయము.

క. గుడియన్న నృపతి పాడగన
నడుచంగాఁ గొండపల్లి నగరిపడమటక్
గుడిరొడమమ డమగాడినఁ
జెడుముండులు బ్రహ్మదండి చెట్టునడుల్లుక్.

ఈ పద్యమునకుఁ గర్తృత్వ మారోపింపఁబడిన ప్రౌఢకవి మల్లన క్రీ. శ. ౧౫౨౦ ప్రాంతములవాఁడు కావున భీమకవి మల్లనకెంతయో పూర్వుఁడు. ఇటులెత్తిక్కిన యంశములు చరిత్ర విరుద్ధములు కావున నాపద్యమెవరో కల్పించి భీమకవికిఁ గర్తృత్వము నారోపించియుండురని తలంపవలయును.

ఇప్పటికి భీమకవి రచితములను చాటువుల కాలము నిర్ణయించుకొంటిమి. వీటిని సమన్వయించి గ్రంథాధారములతోఁ గవికాలము నిర్ణయించుట యావశ్యకము. జ. రామయ్య పంతులువారు కళింగ గంగుచాటుపద్యము నొక్కదానిని బలవత్తరమగు నాధారముగఁ దీసికొని భీమకవి పండ్రెండవ శతాబ్దమువాఁడనిరి. వీరేశలింగము పంతులువారు మఱికొన్ని చాటువుల నాధారముఁజేసి కొని పదమూఁడవ శతాబ్దికిఁ దరువాత వాఁడనిరి. గురుజాడ రామమూర్తి పంతులువారు నన్నయభట్టునకుఁ బూర్వుఁడనిరి. మువ్వురు నేకాభిప్రాయులు కామిచే నన్నింటిని సమన్వయించి యిందెవరు నిరూపించిన కాలము గనుక చూపరి శీలింతము.

[సాధారణముగ సర్వత్ర యీ చరిత్రమున క్రీ. శకమె చెప్పఁబడును. క్వాచిత్కముగ శాసనములగూర్చి తెలుపవలసి నపుడు శాలివాహన శకము తెలుపఁబడును.]

కళింగ గంగు చాటువువలనఁ బదిరెండవ శతాబ్దములోనివాఁడనియు, సాహిణిమారన చొక్కనృపాలుని చాటువులవలనఁ బదమూఁడవ శతాబ్దము వాఁడనియుఁను దెలియును.

బసవ పురాణములోఁ బిడుపర్తి సోమనాథుఁడు భీమకవి బసవ పురాణము రచించినటుల నుండనది కర్ణాటబసవ పురాణమెయనియు నాభీమకవి వేములవాడ భీమకవియనియు నిర్ణయించి భీమకవినిగూర్చి వ్రాసినది విమర్శనీయమై యున్నది.

సీ. విరచించె జైమిని వేదపాదస్తవం
బొక పాదమునను వేదోక్తి నిలిపి
హరభక్తి వైదికంబని శ్రుతులిడి చెప్పెఁ
బ్రతిభ సోమేశుఁ డారాధ్యచరిత
సరవి శ్రీనాథుఁడా చరిత పద్యప్రబం
ధముఁ జేసె ద్విపదలు తెలుచు నిలిపి
యాతండు పద్య కావ్యముఁ జేసె నైషధ
మంచి తిహర్ష వాక్యములఁ బెట్టి
తే.గీ. సోముగురువాక్యములఁ బెట్టి భీమసుకవి
గరిమ బసవపురాణంబు గణనఁ జేసెఁ
గానఁ బూర్వకావ్యము వేఱుగతి రచించు
వారికాదికావ్యోక్తులు వచ్చునెగడు.

భీమకవి వేములవాడ భీమకవియే యనియు నా బసవపురాణము కర్ణాట బసవపురాణమె యనియు విశ్వసింప వీలులేదు. కర్ణాట భీమకవి తాను ద్రాక్షారామభీమేశ్వర పుత్రుఁడననిగాని వేములవాడ వంశజుఁడననిగాని చెప్పుకొననపుడీ యూహయించుకేనియు నిలువఁజాలదు. దీనికి బాధకములు పెక్కులవు.



*Photo printed by C K. Press, Hyd.-Dn.* *By the Courtesy of the Archaelogical Department.*

చార్ మినార్ హైదారాబాదు



*Photo printed by C K. Press, Hyd.-Dn.* *By the Courtesy of the Archaelogical Department.*



ಚಾಂದಮಿನಾರು ದೌಲತಾಬಾದು

విమల సద్గురు సేవేయలి జం
గమభజనెయలి లింగనిష్ఠా
సమతెయలితను మనధనంగళ నిత్యభవభక్తి
సమయవార్ధి వివర్ధనోత్స్వజ
హిమగుశివ కవి దేవనాత్మజ
సుమతి భీమనుభయకవిత్వ సమర్థను సురనడె.

బసవ పురాణములోని యీ భామినీషట్పది పద్యము వలన భీమకవి యాంధ్రుఁడను కొనవీలులేదు. ఈ భీమకవి యొక్క యుభయకవితాసామర్థ్యము కర్నాట సంస్కృతములయందు గానను. ఇతఁడు శివదేవకవి పుత్రుఁడు కావునను, దాక్షారామ భీమేశ పుత్రుఁడు వేములవాడ వంశజుఁడు సంస్కృతాంధ్ర పరిచితుఁడనగు భీమకవిగాక వేఱు భీమకవియనియె భావింపవలయును. భీమకవితండ్రి శివకవియని పై పద్యమునఁ గలదు గదా! ఆ శివకవి నాంధ్రకవులెటఁ జేర్పఁ నశేను. అతని గ్రంథము లాంధ్ర వాఙ్మయమున లేవుగాన కర్నాట బసవపురాణ కర్తయగు భీమకవి వేఱనియు వేములవాడ భీమకవి వేఱనియు స్పష్టమగును. కర్నాట భీమకవి శివలెంక మంచన పండితుఁడు గురు మల్లికార్జున పండితుఁడు ప్రసాదించిన యుద్దండమతితోఁ గవితరచించుచుంటినని యన్నాడు. కర్ణాట కవి చరిత్రకారుఁడీ భీమకవి నారాధ్యుఁడని చెప్పియున్నాఁడు కాన నితఁడు వేములవాడ భీమన కాఁజాలఁడు.

ఇనుసకళ మహేశ్వరావళి
పదపయోజ సరాగమదష
ట్పదయెని పాల్కురికె సోమేశ్వరన కారుణ్యా
ఒదవిదఖిలకశాస్త్ర పూరిత
హృదయభీమకవి ప్రణీతా
భ్యుదయ బసవపురాణః ధెయను.

ఇప్పద్యములవలన భీమకవి పాల్కురికి సోమేశ్వర కారుణ్యాస్పదుఁడు మహేశ్వరుని భక్తుఁడని తెలియును. కాన శైవుడు, బసవపురాణాంతమునఁ గవి కాలమును దెలుపు పద్యము సైతము కలదు.

శోవిదరుకేళొళ్ళి తెనలుడు
దేవనిధివయనేందు సంఖెగ
ళోవిశకవరు షంగళాగలు సౌమ్యవత్సరద.

శ్రావణబహుళ పక్షదశమీ
జీవవారదొళాది వృషభేం
ద్రావతారద బసవచరితె సమాప్తియాయితు.

వృషభేంద్రావతారమగు బసవచరితము ౧౨౯౧ శా. శకవర్షమునఁ బూర్తి చేయఁబడినది. అనఁగా క్రీ. శ. ౧౩౬౯ లో బసవపురాణము పూర్తి చేయఁబడెను. కాన భీమకవి క్రీ. శ. ౧౩౬౯ మొదలు గ్రంథరచనమునొకటి ముగించి యితర గ్రంథ రచనశక్తుఁడై యున్నటుల ద్యోతకమగును గాన భీమకవి (కర్ణాటకవి) ౧౩ శతాబ్ది అంతమునున్నటుల నిర్ణయింపవచ్చును. వీరేశలింగము పంతులువారు బసవపురాణ రచనము ౧౩౬౯ అని నిర్ణయించి (కర్ణాట) భీమకవి ౧౩౪౦–౫౦వ సంవత్సర ప్రాంతముననుండి యుండి యున్నాఁడని వ్రాయుట సందర్భశుద్ధముగాలేదు ఈ నిర్ణయముచే బసవపురాణ కర్త పదమూఁడవశతాబ్దమధ్యభాగమునుండి యా శతాబ్ద చివర వఱకు జీవించినటులఁ దెలియును. మనవేములవాడ భీమకవియంతవాఁడు కాఁడు. కర్ణాటభీమకవి బసవపురాణము వేములవాడ భీమకవి కృతముగ విశ్వసించుటచే నీ ప్రమాదము తటస్థించినది. వేములవాడ భీముని నుతించిన వారిలో నాద్యుఁడు శ్రీనాథుఁడని చెప్పవచ్చును. శ్రీనాథునికంటె వేములవాడ భీమన ప్రాచీన తరుఁడని సైతము విశ్వసింపనాధారము కాశీఖండ కవిస్తుతిలోఁగలదు.

శ్రీనాథుని కాలముఁదెల్పు ప్రథమాధారము. పొన్నుపల్లి ప్రకృతమున కుపయుక్తమగు శాసనాభాగము. పఠింతము.

శ్లో. సోయం వేమ మహీపాలో భూపాలపరమేశ్వరః
భూదాన వీరమార్గన్యోధీరో దాత్త గణోత్తరః
ఖరామరామేంనుమితే శాకాబ్దే సర్వధారిణే
ఉపరక్తే సహస్రాంశౌ మాసేచాశ్వయుజాహ్వయే

* * *

తస్మై కాశ్యపగోత్రాయ సింగనార్యాయ ధీమతే
శాంతాయ శివభక్తాయ యజురామ్నాయవేదినే
ప్రాదాత్ త్రిలింగ విషయే వెల్నాడోర్విసీమని
కృష్ణవేణ్యాస్తరంగిణ్యాః ప్రతీరే పర్యవస్థితం

* * *

శ్రీనాథభట్టశాసన ప్రాచార్యదక్షిణ—భాగంపు కటి

* * *

శ్లో. విద్యాధికారీ శ్రీనాథోపిరశ్రీ వేమభూపతేః
అకరోదాకరో వాచాం నిర్మలం ధర్మశాసనం॥

ఈ ధర్మశాసనము శాలివాహన శకము ౧౩౩౧ సరి యగు క్రీ. శ. ౧౪౦౯లో వ్రాయబడినది. అప్పటికే శ్రీనాథమహాకవి అనవేముని సంస్థానములో విద్యాధికారి గనుండెను. శ్రీనాథుఁ డనవేముని విద్యాధికారియని సంతానసాగర శాసనమున సైతముకలదు. కర్ణాట భీమకవియో క్రీ.శ. ౧౩౬౭ లో బసవపురాణము ముగిం చెను కర్ణాట భీమకవి బసవపురాణ రచనాంతరమునఁ బదునేను సంవత్సరములు జీవించినచో శ్రీనాథుఁడు పొన్నుపల్లి శాసనమునకు వెనుకఁ బదునేను సంవత్సరములు నుండిగూడ విద్యాధికారిగ నున్నచో భీమకవియు శ్రీనాథుఁడు సమకాలికులె, కారణకొన్న మధ్యగల వ్యత్యాసము నలుబది సంవత్సరములె. పొన్నుపల్లి శాసన దివసమె శ్రీనాథుఁడు విద్యాధికారిగఁ బ్రవేశించినవాఁడనియు బసవపురాణము పూర్తిచేయఁబడినరోజు భీమకవి నిధనకాలమని యెవఁడేని చెప్పసాహసించునా? కాన శ్రీనాథుఁడు భీమకవి సమకాలికులే. శ్రీనాథుని సమకాలికుఁడగు భీమకవి వేములవాడ భీమకవి యెన్నంటికిఁగాఁజాలఁడు. చూడుఁడు,

సీ. వచియింతు వేమువాడ భీమనభంగి
నుద్దండలీల నొక్కొక్కమాటు
కాశీఖండము, ఆశ్వా ౧ ప౧౩

బసవపురాణ కర్తయే వేములవాడ భీమకవియైనచో శ్రీనాథుఁడు సమకాలీనుఁడగు భీమకవినంత ప్రాచీనునిగఁ బ్రథమున నందఱు కవులకంటెముందుఁ బ్రశంసింపఁడు. కానఁ గర్ణాట భీమకవిని వేఱుగను వేములవాడ భీముని వేఱుగను భావింపవలయును.

భీమకవి రచితగ్రంథములలో నొక కవిజనాశ్రయము దక్క యితర గ్రంథములు నేఁడు నష్టములైనవి. ఆ కవిజనాశ్రయమైనను శ్రావకాభరణాంక రచితమని గద్యమునగలదు, ప్రత్యంతరములలోని [illegible]

గర్తృత్వము రేచనకారోపింపఁబడినటులఁ దెలియుచున్నది.

క. ఆచంద్రతారకంబుగ
భూచక్రములోన సుకవి పూజితమగుచున్
ఈఛందమమరుచుండును
నాఛందమునీదుపేర నమరును రేచా.

క. నినునివెపాగడువైఖరి
నొనరించెదఁ దెనుఁగుఁ బాసనొప్పఁగ ఛందం
బును గనక కైతఁజెప్పిన
వినవేలచ్చనమువాఁడ వెంగలి రేచా.

లోనగు భీమేశ్వర పురాణావతారికా పద్యములవలన రేచనకుఁ గర్తృత్వమారోపించి కవిజనాశ్రయము భీమకవి రచించినటులఁ దెలియుచున్నది. తనను దానే రేచన పొగడుకొనునటుల భీమకవి కవిజనాశ్రయము స్వయముగ వ్రాసినటులఁ గడపటి పద్యమువలన దెలియుచున్నది. గాన గద్యమున భీమకవిపేరు లేకున్నను భీమనఛందమనఁబడు కవిజనాశ్రయము వేములవాడ భీమకృతమని విశ్వసింపవచ్చును. కవిజనాశ్రయమునకుఁ గర్తృత్వముగల రేచన వైశ్య వంశ్యుఁడు. జైనమత ప్రవిష్టుఁడు. గ్రంథమునఁగల విశేషణముల నన్నింటిని పరిశీలింతుమేని రేచన గ్రంథ కర్తృత్వము నారోపింప జేసికొనెననియే తోఁచును. కవిజనాశ్రయమున సైతముగల

క. పరగినవిమల యశోభా
సురనిరతుఁడ భీమనాగ్రసుతుఁడఖిలకళా
పరిణతుఁడయ్యెను భూసుర
వరుఁడు ప్రసాదోదితబుధ శ్రీయుతుఁడై.

క. అసమానదాన రవితన
యసమానోన్నతుకు యావకాభరణుఁడు ప్రాణసమానమిత్రుఁడీకృతి
కి సహాయుఁడుగా నుదాత్త కీర్తి ప్రీతిన్.

అను నీ రెండు పద్యములవలన భీమనాగ్రసుతుఁడనియు రేచనకుఁ బ్రాణమిత్రుఁడనియుఁ గృతికి సహాయుఁడనియుఁ దెలియుచున్నది. ఇంతియగాక

క. జననుత భీమతనూభవ
[illegible]

అను పద్యము వలన భీమపుత్రుఁడే భీమకవియని విశ్వసింపవలయును. ,,దాక్షారామ భీమేశనందనుఁడఁ'' అని స్వయముగఁ జెప్పి కొనెఁగదా కృతిరచనమునను సహాయము చేసెననుట విశ్వసింపఁజనదు. కవి జనాశ్రయము రేచనకృతము కాదనుటను రేచన ఛందమని యా గ్రంథమునకుఁ బేరు లేకపోవుటయు నొక కారణమే. ఆంధ్రకవులెవ్వరు రేచనను గవిగా నింతవఱకుఁ జెప్పియుండరు. కవి జనాశ్రయమున రేచన గవియని తెలుపు విశేషణములు కలవు.

గాని ధనలోభముచేఁ గవులు చేయనిపనులు లేవు గదా! రేచనకుఁగవి జనాశ్రయమునఁగల యీ విశేషము లఁ బరిశీలింపుఁడు.

,,అరవిందజసదృశ కవిజనాశ్రయ పరమోప కారధరణీ సురవరసురభూజ సుగుణ సుందర తరుణీ స్మరనిభ''

,,స్వఃకాంతా సమమోషిత రఃకృతరవిచిహ్న'' ,,వార స్త్రీ వల్లభ'' ,,జగదేకమిత్ర'' ,,శ్రావకాభర ణాంక'' ,,కవిజనాశ్రయ'' ,,శ్రావకాభరణాంక'' ,,సుందరీ వశ్యవిద్యామణీ'' ,,వార స్త్రీ సంసేవ్యవక్ష'' ,,కవిజనాశ్రయుండు'' ,,చంద్రాస్య! కవిజనాశ్రయక వీంద్రా''

ఈ విశేషణములన్నియుఁ గవి జనాశ్రయమునంటి యుత్తమగ్రంథము వ్రాయు కవి తన్నుఁగూర్చి తాను వ్రాసుకొనునా? స్వహస్త రచితంస్తోత్రం...శక్రస్యాపి శ్రియంహరేత్. అని పెద్దలు చెప్పుచురుగద పరకాంతా ప్రియుడనియు వారవధూలంపటుఁడనియు మారనకవి మార్కండేయ పురాణమున గన్నసేనానిని బొగడియున్నాఁడు. వారు వీరవనేల ఏకవియుఁదన్నుఁగూర్చి యిటులతిశయోక్తి వ్రాసికొనఁడు. కవిజనాశ్రయమున రేచనకుఁగల విశేషణములు సౌందర్యోద్బోధకములు ముఖస్తుతి భూయిష్టములుఁగాని సహజములైనవి కావు. రేచనకుఁగవి జనాశ్రయ బిరుదమున్నటుల రెండుచోటులను శ్రావకా భరణాంక బిరుదమున్నటుల రెండుచోటులను గవి జనాశ్రయమునుండి చూపితినిగదా! ఆ రెండునామములు బిరుదనామములో౯ గవిజనులభిమానించి పిల్చువిశేషణములో నిర్ణయింప వీలుకనుపట్టదు. రేచనకుఁ గవిజనాశ్రయవిశేషణముకలనుగాన నాతనిఁగూర్చి చెప్పినదిగానఁ గవిజనాశ్రయమైనది. రేచనకు శ్రావకాభరణ బిరుదము (విశేషణము) కలదుగాన శ్రావకాభరణాంకరచితమన గ్రంథకర్తృత్వానామము రేచనకు సంబంధించిన విశేణములెగాన రేచనయే కవిజనాశ్రయ కర్తయని స్థూలదృష్టికిఁదోఁచుగాని యందలి విశేణముల సందర్భముచూడఁగర్తృత్వ మారోపితమని తోఁపకపోదు. ఇఁకఁగవి జనాశ్రయ మెవరు రచించిరో తెలుపుటయే ప్రకృతము. లిఖితపుస్తకములన్నింటియందును భీమనఛందస్సను నామమె కానవచ్చుచున్నది. ఇప్పటికి మూఁడువందల సంవత్సరముల క్రింద నున్న అప్పకవి. సైతమప్పకవీయములో

,,వికట కవులు కొన్ని వింతలు గల్పించి
కవిజనాశ్రయమునఁగలిపినారు.
ఎఱిగి యెఱిఁగి భీముఁడేల చెప్పు''

అని కవిజనాశ్రయము భీమకవి కృతమని చెప్పియున్నాఁడు. కవిజనాశ్రయములోని విశేషణములు భీమన స్వయముగ వ్రాసినవేగాని రేచనకృతములు కావు. వీనినన్నింటిని సమన్వయించి యవతారిక పద్యములు పరిశీలించితిమేని కవిజనాశ్రయము భీమకవి కృతమనియేతోఁచును.

గద్య—ఇది వాదీంద్రచూడామణి చరణ సరసీరుహ మధుకరాయమాన శ్రావకాభరణాంక విరచితమైన కవి జనాశ్రయమనుఛందము కవి జనాశ్రయము శ్రావకాభరణాంకవిరచితమని గద్యములో నున్నను శ్రావకాభరణాంకము రేచనకున్నను రేచన గ్రంథకర్తగాఁడనియిది వఱకు నిరూపించితిమి. మానవపల్లి రామకృష్ణకవిగారు ఆంధ్రపత్రికా సంచికలో వ్రాసిన దనువదింపుమఁ బ్రతాపరుద్రుని కాలములోన వర్ధమాన పురముఁబాలించిన భీమరాజు తమ్ముడగు గోకర్ణుఁడే కవిజనాశ్రయము రచించి కల్యాణపురాధీశ్వరుఁడైన జగదేకమల్లుని సేనాపతి రేచ భూపాలున కంకితముఁ గావించెననియు వేములవాడ భీమకవి నృసింహపురాణము మాత్రమే రచించెఁగాని కవి జనాశ్రయము చెప్పియుండలేదని చిలుకూరి వీరభద్రరావు గారు ఆంధ్రుల చరిత్ర రెండవభాగములో వ్రాసియున్నా

రు, కవిజనాశ్రయము మొగము గాని నృసింహ రాపుణము మొగము గాని చూడక వ్రాసిన యీ వింతయు పేక్షింప దగినది. కవిజనాశ్రయకర్తృత్వముఁగల రేచన వైశ్యుఁడు అతనికిఁగల విశేషణములైశ్వర్యశాలి, స్వర్ద్రూపి, కవితా ప్రియుఁడని, బోధించినవియే గాని సేనానాయకుఁడని గాని ప్రభువని గాని గోకర్ణరచితమని గాని బోధింపవు. వీరభద్ర రావుగారు దుర్బలమగు నీనిర్ణయము నిరాధారముగఁ బ్రకటించుట సమంజసముకాదు, మానవపల్లి రామకృష్ణకవి గారు కవిజనాశ్రయము సంయుక్త యతిలక్షణమున ,, భాస్కరకుల విలసిత వార్ధిచంద్ర గోకర్ణనృపా ''యని యుంటయే కవి జనాశ్రయము గోకర్ణకృతమనుటకుఁ జాలినంత నిదర్శనము అని వ్రాసిరి, ముద్రిత కవి జనాశ్రయములో నీపాఠము కానరాదు. పరిశోధకులు పరిశీలించినయే ప్రతిలోని పాఠము కానరాదు. బహుశః ఇది రామకృష్ణకవి గారి ప్రతిలో ప్రక్షిప్తమై యుండును. కవిజనాశ్రయములో సంయుక్తాక్షరయతి యందు

క. వరకృతులకు సంయుక్తా
క్షరములలో నెద్దియైనఁ జనువడియుడఁగా
గురుబుధజన వరదాయక
స్మర సన్నిభ సుభగ మూర్తి మల్లియరేచా.

అను పద్యము రామయ్యపంతులు వారు పరిశీలించిన యన్ని ప్రతులలోఁగలదు. బ్రౌను దొరవారు వ్రాయించిన ప్రతిలో మాత్రము

క. వెలయఁగ సంయుక్తాక్షర
ములలో నెద్దియును జనును మును కొనివడిగా
నిలుపందగుఁ బాదంబుల
నలఘుపరాక్రముఁడ రేచ అసదృశవిభవా.

ఈ పాఠము కలదు. ఇందెందు గాని రామకృష్ణకవి గారు చెప్పిన గోకర్ణుని కర్తృత్వము బోధించు పాఠము లేదు. గ్రంథమున నెచటనైన గోకర్ణరచితమను నాధారము గాని రేచన ప్రభువను దృంష్టాంతరము లేమగాన నీ నిర్ణయము నిరాకరింపఁదగియున్నది. కవి జనాశ్రయగ్రంథాదిలో జైన సంప్రదాయముగ సరస్వతీస్తుతి యుంటయు జినమతహిత యను విశేషణముంటయుఁ జూడ రేచనజైనవైశ్యుడని తెలియును. భీమకవి నివాసమగు వేములవాడ ప్రాంతమున నిప్పటికి జైనవైశ్యులు కలరనియుఁ జెప్పియున్నారము. గోకర్ణునివంటి ప్రభువు రేచనవంటి సేనాపతికి గ్రంథముకృతియిచ్చుటయు యుక్తియుక్తము కాదు గాన కవిజనాశ్రయమునకుఁ గూర్చిన యితర కర్తృత్వము సర్వవిధముల నిరాకరింపఁ దగినది.

భీమకవి కాల నిరూపణమునకుఁ జాటువులకంటెఁ గవిజనాశ్రయమునె ప్రమాణముగఁ దీసికొనవలయును. అట్లు దీసికొని నిర్ణయించి ప్రకాశకుల రెండారములును జాలసమంజసముగ నున్నవి. వాని ననురించియు కవి కాలనిర్ణయము చేయ వలయుఁగాని వేఱుత్రోవ కానరాదు. కవిజనాశ్రయ పీఠికలో జ. రామయ్యపంతులవారు వ్రాసినదిట నుదాహరించుచున్నారము.

,, గ్రంథనిర్మాణకాలమును నిర్ణయించుటకుఁగొంత వఱకనుకూలపడు నంశములు రెండు కవిజనాశ్రయమునం దెగలవు. ఈ గ్రంథమునందుఁ బదివిధములగు యతులు చెప్పబడినవి. కావ్యాలంకార చూడామణియందుఁబది రెండువళ్లు చెప్పఁబడినవి. అనంతుఁడిఱువదినాల్గు విశ్రమములు నామీఁదఁగొందఱు కవి గ్రామణు లిఱువదియేడు విశ్రమముల జెప్పినట్లప్పకవి చెప్పియున్నాఁడు. యతులసంఖ్య కాలక్రమమున వృద్ధియైనటుల దీని వలనఁ దేలుచున్నది. జాలఁదక్కువది కావున నా గ్రంథమెయన్నింటిలోఁ బ్రాచీనమైదని యూహింపవచ్చును.

మఱియు నీ గ్రంథమున మధ్యాక్కరకుఁ బ్రతిపాదమునందు నాల్గ గణము మొదటయతి విధింపఁబడినది. ఇది యాధునిక మతము. నన్నయ భట్టు కాలమున యతియైదవ గణము మొదటనుండినట్లు భారతమువలన విశదమగును. తిక్కన సోమయాజి కవిత్వములో మధ్యాక్కరలు నాకుఁ గనుపడలేదు గాని యెఱ్ఱాప్రగడ కృతమగు నారణ్యపర్వశేషమందు యతి చతుర్గణాదియందే యున్నది. ఈ మార్పు నన్నయభట్టునకు నెఱ్ఱాప్రగడకు మధ్యకాలములోఁ గలిగి యుండవలయును.''

ఈ యాధారములవలనఁ గవిజనాశ్రయము ఆంధ్రచ్ఛందోగ్రంథములలో మొదటిదిగఁ బరిగణింపవచ్చును. సరియగు గ్రంథాధారము దొరికిన భీమకవి కాలము స్థిరపడు వఱకు శ్రీనాథుఁడు క్రీ. శ. ౧౪౦౦ లోనుండి మిగులఁ బ్రాచీనునిగ భీముని ప్రశంసించుట వలనను, క్రీ. శ. ౧౩౨౦

లోనున్న విన్నకోట పెద్దన కావ్యాలంకార చూడామణి లోనికంటె యతులు కవిజనాశ్రయమునఁ దక్కువగా నుంటవలనను క్రీ. శ. ౧౧౨౦ లోగల నన్నయభట్టు అక్కరలకంటెఁ గవిజనాశ్రయములో నుయక్కరల లక్షణము భిన్నముగ నుండుటవలనను భీమకవిజనాశ్రయమును వ్రాసిన రామయ్య పంతులు వారు నిర్ణయించినటుల క్రీ. శ. ౧౧ శతాబ్ది వాఁడని నిర్ణయింపవచ్చును. అక్కరల లక్షణములవలన నన్నయభట్టారకునికంటె భీమన యీవలి వాఁడని తెలిసికొనవచ్చును.

భీమకవి కృతములగు నితరగ్రంథములేమియు నింతవఱకు లభింపలేదు. అప్పకవీయములో భీమకవి చరిత్ర మీరీతిగఁగలదు.

తే.గీ. భారతముఁదెనిఁగింపుమంచాదరించి
నట్టిరాఘవ పాండవీయమునడంచె
ఛందమునడంపనీ ఫక్కి సంగ్రహించె
ననుచు భీమనయొంతయు నడచెదాని!

తే.గీ. రాజరాజనరేంద్రతనూజుఁడార్య
సఖుఁడు సారంగధరుఁడు శైశవమునందు
నన్నయ రచించు నెడఁబత నంబొనర్చె
నన్యులెవ్వరెఱుంగరీ యాంధ్రఫక్కి॥

ఇదియె నహోబల పండితీయములో నిటుల సంస్కృతీకరింపఁబడి యున్నది.

శ్లో. సోయంకృతిశ్వేములవాడభీమ
ప్రబంధకర్తా హితమత్సరేణ
గోదాజలేనాశమ వాపితాభూ
దిత్యుద్గతాసీన్భువి కింవదంతి॥
రాజరాజతనూజాతః సారంగధరబాలకః * *
జగ్రాహావ్యాకృతిం

ఈపద్యముల ననుసరించియొక కట్టుకథకలదు. భీమకవీంద్రుఁడు రాఘవ పాండవీయము నాంధ్రవ్యాకరణము రచించి రాజరాజనరేంద్రుని దర్శనమునకుఁ బోవుచు ముందుదానిని నన్నయభట్టారకునకు జూపెను. నన్నయభట్టుగ్రంథములను జూచి రాఘవ పాండవీయము తనభారతమున కంటెను. ఆంధ్ర వ్యాకరణము తన వ్యాకరణము కంటె బాగుగ నున్నదనియు దీనిని గాజ రాజనరేంద్రుఁడు చూచెనేని రాజ సమ్ముఖమునఁ దన గౌరవము నశించి భీమకవి గౌరవ మతిశయించునను దురుద్దేశముతో నా రెండు గ్రంథముల నశింపఁజేసెను. అంత భీమకవి కినిసి అరణ్య పర్వము వ్రాయుచున్న నన్నయభట్టు నరణ్యములఁబడి పొమ్మని శపించి యక్కడికిఁ గోపముఁదీఱక నన్నయ కృతమగు నాంధ్ర శబ్దచింతామణిని గోదావరిలోఁ బాఱవేసెను. సారంగ ధరుఁడు మాత్రము బాల్యమున దానిని పఠించెను. పిదప నది యొలకూచి బాల సరస్వతికొరకు సిద్ధుని వలన లభింప నాతఁడు వ్యాఖ్యనముఁ గావించినాఁడు. నన్నయ భీమనలు సమకాలికులు కానందునను, ఆంధ్రశబ్ద చింతామణి నన్నయ భారతమునకుఁ దరువాత నెంతొకాలమునకో రచింపఁబడినటులఁ జరిత్ర కారులు నిర్ణయించుట వలనను, నీకథ విశ్వాస నీయము గాదు. భీమకవి రాఘవ పాండవీయము రచించిన ట్లు భారతము అరణ్య పర్వము మధ్యనాపఁ బడినట్లు తెలిసినవారే మహాను భావులో నీ కథను సృష్టించి యుందురు. క్రమముగ గ్రంథములకు సైత మీకథ సర్వ విషయ నతెలెగఁ బ్రాకినది.

భీమకవి గ్రంధకర్తృత్వమును గుఱించి యింకను విచారింప వలసి యున్నది. ఇతఁడు నృసింహ పురాణము, శతకంఠ రామాయణము రఘువ పాండవీయము, రచించినటులఁ దెలియునేగాని యందే గ్రంథము నింతవఱకు లభ్యములై యుండలేదు. ఇతఁడు తిట్టుకవి యగుట చేతనో శైవ మతాభిమాని యగుటచేతనో యాంధ్రులీతని గ్రంథముల వ్యాప్తిలోనికిఁదే మానిరనియు నందువలన నశించి యుండుననియుఁ దోఁచు చున్నది. భీమకవి యుత్కృష్ట గ్రంథములలో నొక కవిజనాశ్రయము మాత్రము ముద్రితమై యున్నది. అది లక్షణ గ్రంథ మగుటచే గవితా ప్రాశస్త్యము నిర్ణయింప వీలులేదు. శ్రీనాథుఁడు భీమ కవికవిత యుద్దండలీలలు గలదని చెప్పియున్నాఁడు. అతని గ్రంథరాజము లాంధ్రుల కెన్నంటికి లభింప నున్నవో యంతవఱకు భీమకవి జీవిత చరిత్రము నసంపూర్ణముగానె భావింపవలయును.

భీమకవి రాఘవపాండవీయము పింగళి సూరకవి నాటికి (౩౫౦ సంవత్సరము క్రిందటె——) నశి

చినటుల రాఘున పాండవీయములో నిటుల వ్రాయబడి యున్నది.

ఉ॥ "భీమనతొల్లిఁ జెప్పెనను పెద్దల
మాటయెగాని యందు నొం
డేమియునే నెఱుంగ నిలుచు
టెవ్వరుగాన రటుండనిమ్మనా"

పింగళి సూరకవి నాఁటికి భీమ కవిరాఘువ పాండవీయము రచించి నాఁడను వాడుకఁ దప్పనందలి యొక పద్యము సైతము కానరాలేదని తెలియుచున్నది. ఏలక్షణ గ్రంథములోనైన రాఘవ పాండవీయము భీమకృతమని యు నందలి పద్యము వియనియు నెవ్వరుదాహరించి యుండరు. నిజముగ భీమకవి రాఘవ పాండవీయము రచించియే యున్న పక్షమున నది కొలఁది కాలమునకె నశించెనని తోఁచుచున్నది.

నృసింహ పురాణమును వేములవాడ భీమ కవి రచించినట్లు వ్రాయుచు నొక లక్షణ గ్రంథములో నీ రెండు పద్యములు నృసింహ పురాణములోనివిగ నుదాహరింపఁబడెనని మానవల్లిరామ కృష్ణకవి గారు ప్రభాకర శాస్త్రిగారు వ్రాసి యున్నారు

ఉ॥ వాండిమినల్ల సిద్ధిజన
వల్లభుఁడోర్చిన రాజు భీతుఁడై
యాంధ్రను గానకుండ వృష
భాంకము బెట్టికొనంగఁజూచితో
నేండిదిరేమి నీవనుచు
నెచ్చెలులెల్ల హసింపనంతలో
మూండవ కంటితోడి దొర
మూర్తివహించిన మ్రొక్కిరంగనల్॥

కం॥ ఈక్షితికి వచ్చివేగమ
దాక్షారామమున వారతరుణుల నృత్యం
బీక్షించియఁ దలకంటెను
దక్షిణమున పార్శ్వరంభతగ వేర్పడఁగన్॥

ఉ॥ వెన్నెలవెల్లి సాల్కడిలి
వ్రేకదనంబునఁ జేర్చిదిక్కులన్
మిన్నునుముంచియంగురజ
నీకరబింబము కుండలీభవ
త్పన్నగతల్ప కల్పనము
భంగిఁదనర్చెఁదదంతరంబునన్
వన్నెనిభంగిఁ జూడ్కులకు
వేడ్కయొనర్చెఁగలంకమత్తరిన్.

ఈ కడపటి పద్యము నన్నెచోడుని కుమార సంభవములో రామకృష్ణ కవిగారుదాహరించి యున్నారు. సమగ్రముగ నృసింహ పురాణము లభించువరకు శైవుఁడగు భీమకవి వైష్ణవసంబంధ గ్రంథము తెలిఁగించెనని మేము విశ్వసింపఁ జాలము. లేక భీమకవి యుభయమత వర్తియే యొయును సంశయము సైతము నిర్ణయింపఁజాలము. భీమ కవి శతకంఠరామాయణములోని వనియు నొకానొకలక్షణ గ్రంథములో నుదాహృతములనియు వీరేశలింగము పంతులువారు ఈక్రింది పద్యములను ఆంధ్రకవుల చరిత్రములో వ్రాసియున్నారు.

కం॥ భువిపుట్టి పీఁచమడఁచెను
దివిజారాతుల దినేశదీప్తులడర రా
ఘవుఁడనుచుమునులు పొగడిరి
దివినిదివౌకసులుమిగుల దీవించిరొగిన్.

ఉ॥ కలఁగకఁడీన భల్చరులు
కంపమునొందకుఁ డెప్పుకిన్నరుల్
తలఁకకుఁడుచ్చరల్ మునులు
తత్తరమందకుఁడేను వచ్చిమీ
యలజడులెల్లమాపి మిము
నందఱఁగాచెద నంతవట్టుమీ
గలిబిలిమానియుండుఁడని
కైటభమర్దనుఁ డొలిపల్కినన్.

లక్షణ గ్రంథములలో నుదాహరింపఁబడిన యీ కొలఁది పద్యములవలన భీమకవి శక్తిసామర్థ్యములు ద్యోతకము కాఁజాలదు. సంపూర్ణ గ్రంథము లభించినగాని భీమకవి సంపూర్ణజీవితము వ్యక్తము కాఁజాలదు: భీమ కవి చాటువులలోఁ గొన్నింటిని కాలనిరూపణము చేయు చో నుదాహరించితిమి. ఇంకగొన్ని కలవు.

ఉ॥ నవ్యవిలాసరమ్య నలినంబని
బాలము ఖాబ్జ సౌరభా
(రంగరాట్ఛందమునుండి)

ఉ॥ వారక వారకామినుల
వర్తులచారు కుచోపగూహముల్
(అప్పకవీయమునుండి)

చం॥ బిసరుహగర్భు వ్రాతయును
విష్ణునిచక్రము వజ్రివజ్రముల్
(అప్పకవీయమునుండి)

ఉ॥ రాముని మోఘబాణమును
రాజశిఖామణి కంటిమంటయున్
దాశరథీవి వ్రాతయును
దారకవిస్ఫుష ఘోరశక్తియున్
భీమగదా విజృంభణము
వెన్నునిచక్రము వజ్రివజ్రమున్
వేములవాడ భీమకవి
భీషణవాక్యము రిత్తవోవునే.
(చాటుధార)

కవిజనాశ్రయము కేవల లక్షణగ్రంధ. మగుటచే గవితా నైపుణ్య ప్రదర్శనమున కాగ్రంధ ముపయుక్తకము కాకపోయినను కేవలకవితా పరిశీలనమున కుపయుక్తము లగు పద్యముల నుదాహరించెదము.

కం॥ కడుకవితామహిమకునిధివి
రెడుకవికిచ్చునవు తెలుఁగెతింగినఁగాకె
క్కడనుండినప్పు బెడఁగడ
రెకుకబ్బముఁజెప్పనురు పరిజ్ఞానమిలన్.

కం॥ పరమాత్మముఖారుణ సర
సిరుహ వినిర్గత సమస్త సిద్ధాక్షర పం
క్తిరసానహ మృదుపద సుం
దరతర కృతిరచనలీవుకను దయమాకున్

కం॥ జినసుత ధర్మమహింసయ
యనుమతమునవితతముగ గజాసురఁ శాపం
బనిచంపఁడెయ్యె నీశ్వరుఁ
డనని డెయాగమ విరోధమనిరి కవీంద్రుల్॥

కం॥ వినుకరహీనుఁడు తగవ్రా
సినపాత్రము తెచ్చియొక్క చెవిటివినఁగ బో
రన జదివె మూఁగ సభలో
ననలోక విరోధ దోషమనిరి కవీంద్రుల్॥

ఈ పద్యములు పరిశీలింప శ్రీనాథుఁడు చెప్పిన టుల భీమకవి కవితయుద్దండ లీలలు గలదని తోఁపక పోదు. అప్పకవి చెప్పినటులఁ గవిజనాశ్రయము నిండఁ గా వ్యాలంకార చూడామణి నుండి యితరచ్ఛందో గ్రం థములనుండి యాధుక కావ్యముల నుండి లక్ష్యములను దాహరింపఁబడి యుఁటచే మూలగ్రంధ మెంతవఱకో నిర్ణయిం ప నింతవఱకు వీలైనదికాదు. బ్రహ్మశ్రీ జయంతి రామయ్యపంతులు వారు సంపూర్ణపరిశోధనముఁ గావించి యాంధ్రసాహిత్య పరిషత్పత్రికమునఁ బ్రకటించిన కవిజనా శ్రయమువలన లక్ష్యలక్షణములు భీమకవి కృతములనియు నితర గ్రంధోదాహృతములనియు అప్పకవి చెప్పినటుల వికటకవులు చేర్చినవనియుఁ దెలిసినది. కవిజనాశ్రయము ప్రకటించిన జయంతి రామయ్య పంతులువారాంధ్రుల కృతజ్ఞతకుఁ బాత్రులు



# ఎలిఫెంటా గుహాలు

—సురవరము ప్రతాపరెడ్డిగారు

## హిందువులందు శిల్పములు



ఇప్పటి కాలమునఁ బాశ్చాత్య పండితులకేది యత్యంతాశ్చర్యము కలిగించుచున్నదో కాలాతీతముచేతను, క్రూరహస్తములచేతను నేదినాశనముకాగా మిగిలిన యాశేషమునుజూడ ప్రపంచముయొక్క నాలుగు దిక్కులనుండి జనులు వచ్చుచున్నారో, యట్టి శిల్పరాజములు మన హిందూస్థానమందు కాక మతెచ్చట కలవు? పూర్వము మన యార్యులలో శిల్పులకిచ్చిన గౌరవము బ్రాహ్మణులకుఁ గూడ నియ్యలేదు. శిల్పకారుని నత్యంత పూజ్యునిగా భావించుచుండిరి. వాస్తుశాస్త్రములు సంస్కృత భాషయందనేకములు. బహుపురాతనకాలమందే లిఖింపబడెను. దేవతల యొక్కయు, మనుష్యుల యొక్కయు స్త్రీలయొక్కయు, తిర్యగ్జాతులయొక్కయు వివిధరూపము లేయే విధములనుండవలయునో మయవాస్తువంటి గ్రంథములందు విరివిగా చర్చింపఁబడెను. మహారాజుల నాదినుండియు శిల్పకారుల మన దేశమందు విశేషముగా సన్మానించుచుండిరి. వారినివాస గృహముల నిర్మించుటయందేమి, వారి కోటలఁ గట్టుటయందేమి, దేవాలయముల స్థాపించుటయందేమి, రాజులునిరంతర మీశిల్పులకే యావత్కార్యముల విడుచుచుండిరి. పూర్వపు శిల్పులు తాముచేయుచుండిన పనులందుఁ బూర్ణముగా దమమనస్సులఁ లయింపజేయుచుండిరనిచెప్పుట యతిశయోక్తి కాదు. ఆకాలపు గట్టడములును, ఆకాలమునుండివచ్చిన లోకప్రతీతియు దీనికి ప్రబల సాక్ష్యములు అనంతశయనమందలి పద్మనాభ స్వామి దేవాలయమును గట్టునపుడొక శిల్పితన కార్యమందత్యంతముగా నిమగ్నుడై తన ప్రక్కన రాజుగారుండినదియు గుర్తింపక యతడు తనచేతి క్రిందిమనుష్యుడేయని తలచి యొక సాధనము నందిమ్మని యాజ్ఞాపించెనఁట. రాజుగారు తనగాంభీర్యము చెడెననిగాని తనగొప్పతనమునకు లోటుకలిగెననిగాని విచారింపక- తానును విశాలహృదయుఁడగుటచే జంకుగొంకులేక వెంటనే కోరినవస్తువును దెచ్చియిచ్చెనఁట. ఇచ్చునపుడు చేతినిజూచి రాజును జూచి శిల్పిభీతుఁడై తన యపరాధమేమియు లేదని రాజతనితో జెప్పినను వినక యాతప్పుకై తన చేతినికోసుకొని ప్రాయశ్చిత్తము పెట్టుకొనెనట. ఇట్టియంశములు వెదకు వారికనేకములు గోచరించును.

పూర్వపువైభవము, పూర్వపు శిల్పనైపుణి యార్యుల స్వాతంత్ర్యముతోడనే యంతరించెను. పూర్వపు కోటలను దేవాలయములను ఋషి సంతతివారనుపించుకొనిన మనమిప్పుడును చూచిన యాకట్టడములు మనుష్యులుకట్టరాలేక యక్ష గరుడ కిన్నరాదులవంటి మనుష్యాతీతులైన వారెవరైన కట్టిరాయను భ్రాంతినిబుట్టించు



త్రిమూర్తి విగ్రహము (ఎలిఫెంటా) 3.



అర్ధనారీశ్వర (ఎలిఫెంటా) ౪.



పార్వతీ పరిణయము (ఎలిఫెంటా) ౫.



ద్వారపాలకులు (ఎలిఫెంటా) ౬.

చున్నవి. పూర్వపు శిల్పముల ప్రకారము కట్టునారింకను దక్షిణ హిందూస్థానముననున్నారని భారతదేశమునకంతయు వంద్యులైన ఇ. బి. హెవెల్ దొరగారు నుడువుచున్నారు. కాని యీ శిల్పు లనుదినము క్షీణించుచున్నారు. దానికి కారణము మనమే. మనలో పూర్వపుగట్టడములలోని సౌందర్యమునుజూచి మెచ్చుకొనుశక్తి క్షీణించినది. అప్పటి విధానములు మనకు రుచించవు. మనదేశభాషలందెల్ల మనమితరుల జూచి వారి ననుకరించుచున్నామో యిట్టిశాస్త్రములందును మనకితరులే గురువులు. క్రొత్తదొక వింత, ప్రాతదొకరోత యను సామెత నేడు మన యందొక రీతి విచిత్రముగా నొప్పియున్నది. నవనాగరికులని తలంచుకొను వారికి బూర్వపు శిల్పములు రుచింపవు. ఇప్పటి మహారాజులుగాని నవాబులుగాని పూర్వపుహిందూ బౌద్ధ శిల్పములనుగాని, మొగల్ రాజపుత్ర శిల్పములగాని క్రొరక గాథిక్, శార్జర్. మున్నగు నానాశిల్పముల యొక్క సమ్మేళనముచే సంకరములైన పద్ధతిపై తమ బంగ్లాలను గట్టించుకొనుచున్నారు. పాశ్చాత్యులు మనవేషములే మన భాషలే, మనపూర్వశాస్త్రములే మేలైనవని శ్లాఘించుటయే కాక నాచరించుచుండగా, మనము పాశ్చాత్యులవే మంచివని వాదించుట విచిత్రము. "పడమటి" గాలి విశేషముగా వీవ దొడంగినది.

## ఎలిఫెంటాద్వీపము

బొంబాయినుండి సముద్రములో నోడపై యేడు మైళ్లు ప్రయాణముచేసిన ఎలిఫెంటాద్వీపమును చేరవచ్చును. ఈ ద్వీపము ౪ మైళ్ల చుట్టుకొలతకలది. దీనిలో నొకగట్టు ౧౪ మైలు పొడవును ౫౦౭ అడుగుల యెత్తును గలదై యున్నది. ఈ ద్వీపములో జనులు నివసించుచున్నారు. వరి మున్నగు కొన్ని పంటలు బండించుచున్నారు. ఈ ద్వీపమును మున్ను గిరిపురి (పర్వతముపైనయుండుపురి) యని వ్యవహరించుచుండిరి. దీనికి ఎలిఫెంటాయని పోర్చుగీసువారు పేరిడిరి. పలనన నీద్వీపమందొక రాతియేనుగు ౧౩ అడుగుల పొడవును ౭౪ అడుగుల యెత్తునుగలది యుండెను. ఈ యేనుగు కొంతకాలమునకు శిథిలమయ్యెను. దానిని ౧౮౬౪ సం. లో బ్రిటిషు ప్రభుత్వవారు బొంబాయికిఁదెచ్చి విరిగిన భాగములనతికించి విక్టోరియా తోటలోనుంచిరి. ఇప్పటికిని నిది యాతోటలోనే యున్నది. (చూడుము పటము ౧)

ఈ ద్వీపములో క్రీ. శ. ౩వ శతాబ్దమున బౌద్ధ స్తూపములు కట్టినట్లుగొన్ని శిథిలములనుండి యూహింపఁబడుచున్నది. మఱియు నందలి గుహలు క్రీ. శ. ౮వ శతాబ్దమున నిర్మింపఁబడినట్లూహింపఁబడుచున్నవి. ఈ గుహలవిషయమై యితర హిందూక్షేత్రములవలె స్థానికులు వివిధ గాథలను జెప్పుచుందురు. కొందఱు వీనినిపాండుపుత్రులు కట్టిరనియు, కొందఱు బాణాసురుని కూతురగు ఉషాకన్య నిర్మించెననియు చెప్పుదురు. కాని చరిత్ర వేరుగా బోధించుచున్నది.

ఈ ద్వీపము మౌర్యరాజులయొక్క రాజధానిగాఁ గొంతకాలముండెను. పిమ్మట యిది చాళుక్యులచేత, రాష్ట్రకూటులచేతను, యాదవులచేతను, పరిపాలింపఁబడెను. క్రీ. శ. ౧౬వ శతాబ్దమందిది మొగలుపాలనములోనికి వచ్చెను. తురకలు సాధారణముగా విగ్రహనాశకులని పాశ్చాత్య చరిత్ర కారులు వ్రాయుచుందురు. కాని యీ ద్వీపవిషయములో నింపల

కుఁబాలైన ముసల్మానులవలన నేయపకారము నుజరుగలేదు. క్రీ. శ. ౧౫౩౪ వ సం॥లో నీద్వీపము పోర్చుగీసు (బుడుతకీచులు) వారి స్వాధీనమయ్యెను. సుమారు ౨౦౦ సంవత్సరముల వఱకీగుహ లీదుష్టుల స్వాధీనమందుండెను. వీరిచే నివినాశనముచేయఁబడెను. పోర్చుగీసు లీవిశాల మంటపములలోఁ దమ పశువులను మేపుకొనుచుండిరి. ఈ సిపాయీ లిచటి ప్రతిమ్తలను బరీక్షింప నెంచి తమ పిరంగులతో నీ యాలయమును గాల్చిరి. దాన ననేక విగ్రహములును, స్తంభములును గూలిపోయెను. ఈ బుడుతకీచులకు విగ్రహము లసహ్యముగా నుండెను. కావున వారు ప్రత్యేకముగా శ్రమించి యీ విగ్రహములను తుపాకుల తోడను పిరంగుల తోడను పగులఁగొట్టిరి. హిందువుల శిల్ప కళకును, నీ పరంగీ జాలి పిరంగుల శిల్ప కళకును నెంతటి ఘోర తారతమ్యమున్నదో కనుఁడు.

మన దొరలగు నింగ్లీషువారి హస్తగతమైన తర్వాతకూడ ౧౮౬౨ నుండి ౧౮౬౮ వఱకు నీ గుహల వినాశన కార్యమందు నింగ్లీషు పోర్చుగీసుల పాటికి నిలచిన వారైరి. అనేక సంవత్సరములిది బ్రిటిషువారి సైన్య విశ్రామ స్థలముగా నుండెను. సర్వ లలిత కళలకు విరోధులైన సైనికులు నాశనము చేయుటకుఁగాక యింకేమిచేయ సమర్థులు. తుదకు ౧౯౦౯ వ సంవత్సరము నుండి యీ గుహలను బ్రిటిషు ప్రభుత్వమువారు సంరక్షింపఁ బూనుకొనిరి.

## గుహా శిల్పము

హిందూస్థానములో క్రీ. పూ. ౩౦౦ సంవత్సరములనుండి (అనగా నేఁటికి ౨౨౦౦ సం॥ ల క్రితము) పర్వతములలో గుట్టలలో పెద్ద సురంగములు చేసి వానిని చైత్యములుగను, విహారములుగను, దేవాలయములుగను, హిందూ బౌద్ధులుపయోగించినట్లు తెలియుచున్నది. మొట్టమొదలు అశోక చక్రవర్తి యీ పద్ధతి నవలంబించినట్లు ఫర్గూసన్ గారు వ్రాసియున్నారు. "గుహాశిల్ప నిర్మాణములో బౌద్ధులే నిస్సంశయముగా మొదటివారు" అని ఫర్గూసన్ గారు సెలవిచ్చినారు. పిమ్మట జైనులు, హిందువులు (సాధారణముగా క్రీ. శ. ౬ వ శతాబ్దమునుండి) గుహా శిల్పములకుఁ గడంగిరి. ఉత్తర హిందూస్థానములోని బారబర్ గుహలును, ఒరిస్సాలోని కారక్ గుహలును, నిజాము రాష్ట్రములోని ఎల్లోరా, అజంటా గుహలును, మహారాష్ట్ర దేశములో కార్లా, జోగేశ్వరి, ఎలిఫెంటా గుహలును సుప్రసిద్ధములైనవై యున్నవి.

## ఎలిఫెంటా గుహలు

ఈ గుహలు క్రీ.శ ౮ వ శతాబ్దమందు నిర్మింపఁబడెనని యింతకుముందె నివేదించియుంటిని. ఇందు శైవ సాంప్రదాయపు గాథలే చిత్రింపఁబడినవి. ఇచ్చట ప్రధానమైనవి మూడు గుహలు. ఇయ్యవి దూరమునుండి చూచినచో మూడు గొప్ప సురంగములవలెఁ గనఁబడును. (చూడుడు ౨ వ పటము)

ఈ గుహలలో ప్రధానమైనది మధ్యనునున్న గుహయే. ఇది ౧౩౩ అడుగుల పొడవును ౧౩౦ అడుగుల వెడల్పును—ఇంచుమించు చౌకముగా నున్నది.

అందు ౧౦ మాత్రమే మంచి స్థితిలోనున్నవి. ఇందు ౨౬ స్తంభములున్నవి. ఈ గుహను ౧౭ అడుగుల లోతుగా రాతినుండి తొలిచినప్పుడా రాతిలోనే యీ స్తంభములను వదలియున్నారు. వీనిని నేర్పుతో నేర్పాటు చేసియున్నారు. ప్రే

ప్రేక్షకుడు గుహ యెదుట నిలిచినంతనే తన యెదుట దూరమందు (౧౩౩ అడుగులు) త్రిమూర్తి విగ్రహము కనఁబడును. ఉభయ పార్శ్వములందు నందేడేసు స్తంభముల వరుసయున్నది. మధ్య గుహా ముఖమున నిలిచినంతనే నీ యుభయ పార్శ్వముల స్తంభముల మధ్య త్రిమూర్తి విగ్రహము ప్రేక్షకుని కగపడును.

## విగ్రహములు

ఇప్పటి శిల్పకారులనేకులు తమ పూర్వుల విద్యలన్నింటిని మఱచి యడ్డాదిడ్డి యిండ్లను గట్టు విధానము మాత్రము తమ జీవనార్థముగా నుంచుకొని పూర్వ శిల్ప వైభవమును గుఱించి ముచ్చటించిన నా కాలము వారొక పసరును దెచ్చి శిలలపై రుద్దిన శిలలన్నియు మైనమువలె నగుచుండెననియు నప్పుడు తాము కోరినట్టి రూపములఁ దీర్చుచుండిరనియుఁ జెప్పుదురు. నేటికిని కంచి మున్నగు ప్రదేశములందుఁ జరుగుచున్న శిల్పనిర్మాణములఁ జూచువారికీ విషయమబద్ధమని తోఁపకపోదు. అయినను నీ యెలిఫెంటా గుహలలోని యత్యంతోన్నత విగ్రహములను దిలకించునతనికిఁ బైకథలు నిజమోయేమోయను భ్రమ సుజనించును. ప్రప్రథమున మనకు గోచరించు నీ త్రిమూర్తి విగ్రహము నగము మాత్రమే (bust) చెక్కఁబడియున్నది. ఇది సుమారు ౧౮ అడుగుల యెత్తున్నది. ఈ విగ్రహమందుండు మధ్య శిరస్సు బ్రహ్మ, దానికి కుడిప్రక్క విష్ణు శిరస్సును, నెడమ ప్రక్క రుద్ర శిరస్సును నున్నవి. ఈ త్రిమూర్తి విగ్రహము యొక్క శిరస్సులు కిరీటములచేతను, కంఠములనేకహారములచేతను, కర్ణములు కుండలములచేతను నలంకరింపఁబడియున్నవి. ఇంతలో మహాను నదసరములు మహాను విధములగు కళలచే నొప్పారుచున్నవి. (చూడుడు ౩ వ పటము)

## అర్ధనారీశ్వర

త్రిమూర్తి విగ్రహము ప్రక్కన నెడమ ప్రక్కన అర్ధనారీశ్వర విగ్రహమున్నది. ఈ విగ్రహమున కిరుపార్శ్వములందు బ్రహ్మ, విష్ణు, కుబేరేంద్రాది దేవతలున్నారు. ఈ విగ్రహములోని ఎడను భాగము స్త్రీ భాగమని చూపరులకు వెంటనే స్ఫురించును. ఈ భాగమందలి యొక స్తనమును, కర్ణభూషణములును, సన్నని మధ్య భాగమును, నెత్తైన పిఱుఁదును, నతిసుందరముగా శిల్పకారుని సామర్థ్యమును వెలిబుచ్చుచున్నవి ఈ విశేషములు విహములే యొక్క కుడి భాగమునచూడుడు (౪ వ గవు. పటము)

## పార్వతీ పరిణయము

త్రిమూర్తికి దక్షిణ భాగమందు గుహకు దూరముగా పార్వతీ పరమేశ్వరుల వివాహ ఘట్టము నిరూపింపఁబడియున్నది. ఇందు నీశ్వరుని కుడి ప్రక్కనఁ బార్వతి నమ్రవదనయై యున్నది. ఆమె వెనుక కన్యాదాతలగు మేనకా హిమవంతులున్నారు మేనక వెనుక చంద్రుడు అమృత కుంభమునుబట్టికొని నిలిచియున్నాడు. ఈశ్వరుని పాదముల దగ్గఱ పురోహితుఁడగు బ్రహ్మయున్నాడు. పై భాగమందుఁ బెండ్లికిఁ జుట్టములుగాఁ బ్రేక్షకులుగా వచ్చిన దేవతలున్నారు. ఇందు ముఖ్య పాత్రములైన పార్వతీ పరమేశ్వరుల విగ్రహములతి సుందరముగా వినయ గాంభీర్య గుణ యుక్తముగా నున్నవి. కాని బుద్ధిహీనులచట మన శిల్ప నైపుణ్యము ను మార్చి తమ శక్తిమీఱి తామ్రాదికృత్యమును

శాశ్వతముగాఁ జాటియుండుటచేఁ బ్రేక్షకులకుఁ జాల విషాదము సంఘటించుచున్నది. (వివాహ కాలములందు నాశ్వలాయన శాఖీయులలో భార్య పురుషుని కుడిప్రక్క నుండును. తర్వాతి కాలములందు నాశ్వలాయనులలో నాపస్తంబీయులందువలె భార్యభర్త కెడమ ప్రక్క నేయుండును. ఈ పటమందు భార్య భర్తకుఁ గుడి ప్రక్క నున్నది.) (చూడుడు పటము ౫.)

## ద్వారపాలకులు

త్రిమూర్తి విగ్రహమునకు సుమారు ౭౦ అడుగుల దూరమున గుహయందే యొక గుడి నిర్మించి యున్నారు. అందొక లింగమున్నది. ఆ గుడి నాలుగు ప్రక్కలలో నిద్దఱిద్దరు ద్వారపాలకులున్నారు. ఈ ద్వారపాలక విగ్రహము లొక్కొక్కటి రమారమి ౧౬ అడుగుల యెత్తున్నవి. ఇంత యెత్తుండినను విగ్రహముల యొక్క యవయవముల పరిమితి [Proportion] చెడకుండ యున్నది. (చూడుడు ౬, ౭, పటములు) ఇందలివిగ్రహములలో సాధారణముగా ద్వారపాలకులకుండునని భావింపఁబడు గర్వక్రౌర్యాది చిహ్నము లేమియు లేవు. ముఖముల పై సౌకుమార్యము, మార్దవము విశేషముగాఁ గనపడుచున్నవి. ఇందలి విగ్రహములుకూడ నితర విగ్రహములవలెఁ బ్రయత్న పూర్వకముగా పోర్చుగీసుదుండగీలచే రూపుమాయింపఁబడినవి.

## గంగావతరణము

ఈ విగ్రహములో నీశ్వరుడు పార్వతిప్రక్కకును, పార్వతి యీశ్వరుని ప్రక్కకును వ్రాలి యున్నారు. చుట్టును దేవతలున్నారు. ఈ ఘట్టముకూడఁ జాల శిథిలమై పోయినది. (చూడుడు ౮ వ పటము)

ఈ గుహలో శివలీలా కథలింకను ననేకములు నిరూపింపఁబడినవి. సతీదేవియొక్క నిర్యాణానంతర విశ్వేశ్వరుడు యోగియై తపస్సు చేసినదియు, పార్వతీదేవి నాహ్లాదింపఁ దాండవమాడుటయు, రుద్రావతారియైన దక్షాధ్వరధ్వంసమొనరించుటయు, ప్రణయ ప్రకోపముచేఁ బార్వతీ పరమేశ్వరులు కలహించుకొనుటయు, రావణుఁడఖిల జగద్రావణుండైన పిమ్మట తన చేతుల తీట పోఁగైలాసగిరి నెత్తుటయు నఖిల ప్రపంచ నేతయైన హైమవతీ నాథుఁడు లీలగా నాతని గర్వనిర్వాపణ మొనర్చుటయునగు నీ శైవ సాంప్రదాయపుఁ గాథలిందుఁ జెక్కఁబడి యున్నవి.

ఇంతవఱకు నివేదింపబడిన విషయములన్నియు మధ్యదియుఁ బెద్దదియునగు గుహా సంబంధములు. ఈ గుహకిరుపార్శ్వములందును రెండు గుహలున్నవి. పెద్ద గుహకును వీనికిని మార్గములున్నవి. ఈ రెంటను జేర్కొనదగిన వస్తువులు లేవు. కుడి ప్రక్కనుండు గుహలో నొక చిన్న పుష్కరిణి కలదు. అందు నిరంతరము పానయోగ్యమగు జలముండును. ఎడమప్రక్కన నుండు గుహయొక్క ముంగలి భాగమున నొక యంగణమున్నది. దానియెదుట శివాలయమున్నది.

ఈ రెండు గుహలుగాక వీనికి తూర్పుదిక్కున నాలుగు గుహలున్నవి. ఇందు కొంత శిథిలితములును గొంత పరిపూర్తికానివియును నున్నవి.

సముద్ర పరివృత ద్వీపమందుండుటచేత నేమి, మౌర్య, రాష్ట్రకూటాది హిందూరాజ్య పరిపాలన స్థానముగా నుండినవగుట చేతనేమి, సుందరతర విగ్రహములచే ప్రాచీనార్య శిల్ప కళా

వై దుష్య ప్రకటనము చేతనేమి, తుదకు బుడత కీచులవలని దుండగముల చేతనేమి యీ గిరిపుర గుహాలు చారిత్రికములై, యానందదాయకము లై, దర్శన యోగ్యములైయున్నవి.

ఈ గుహాలందొక కాలమున నజంటాలో వలెఁ గొంతవఱకు చిత్రములుగూడలిఖించియుం డిరని చెప్పుదురు. కానియవియిప్పుడు కానరావు.

ఈ గుహాలను గుఱించి ౧౫౩౯ క్రీ.శ నాటి కేడాంజోడీకాస్ట్రో యను నతడివి మనుష్య మాత్రులు నిర్మించినవేయై యుండిన నింత సుందర ముగా నుండుటెట్లు సాధ్యమని శంకించెను. ఇంచుమించా కాలము వాడేయగు లిఁషోటెఁ వీనిని హిందువుల యౌన్నత్య సూచకములు గా భావించెను



# ఆంధ్రకవీశ్వరుఁడు

డోమా వేంకటస్వామి గుప్తగారు

(శతావధాని)

చ. తెలుగున సంస్కృతంబునను దీటగునేరుపు నందియుండియుఁ
జెలువుగఁ బూర్వసూరులు రచించిన కబ్బములందు నంద మి
ట్లొలసెడి దేశరీతులకు నొప్పిన పద్ధతినేర్పరించి కై
తల నొనరించి కీర్తిఁగను ధన్యత నాంధ్రకవీంద్రుఁ డొందెడిఁ"

చ. అతనికవిత్వమందుఁగన నచ్చపుఁ దెల్గుపదంబులేని, సం
స్కృత పదజాలమేని, గడుఁ గావలెనంచును వేసినట్టుగా
క తగినరీతిగా రపవికానముఁ గొల్పుచుఁ బట్టుకుచ్చు న
ట్లొ తనరునట్టి సత్కవి కడింది యశంబుగడించుఁ దెల్గునన్."

మ. కవనంబాంధ్రము, పద్యమంతయును దీర్ఘంబౌ సుధాభుగ్వచ
స్సువిలాసోరు సమానయుక్తమగు, నాచో నెప్పిన, నక్కృతి తె
ల్గవునా! సంస్కృత మంచనన్ వలదె: యాలాగున్ విచారించి, మే
లవుఫక్కిన్ విరచించి యాంధ్రకవి యుల్లాసంబుఁ గొల్పుంధరన్.

మ. అరవిందంబుల్గఁ దేనెసోనలు కరంబందంబుగా జాలువా
ఱు రకంబొప్పఁ, గరంబుడంబుగబుధుల్ మాపొందు నానందబం
ధురభావంబును జెంద, జెల్వలరనై తోరంబుగా లోక వి
శ్రుతదంచత్కృతులందె సత్కవితనాఁ బొల్పారు భూమండలిన్!

సీ. ఇదమిత్థమని వచియింపలేదేవుని। దివ్యప్రభావంబుఁ దేటపఱచు
విహరింపఁ జేయు కవిక సత్కుసుమవనీ। విహరణ సౌఖ్యంబు వెలయఁజేయు
వీనుల వినిపింపలేనవ్య విమలగాం। ధర్వగాన శ్రవణంబుఁ గల్పు
కన్నులఁ గనఁజేయఁ గయ యతిలోక సౌం। దర్యవస్తువులఁ గానంగఁజేయు

గీ. మఱి యనిర్వచనీయ భావములెన్నొ। మానసాంబరమందు నింపాఱఁ జేయు
సుకవి, తత్కోకిలయె సుకవిమాకు। నచ్చె, నతఁడిహపరముల సాధుజనము!

మ. ధనమా? గర్వసమాన; మూర్విసుఖవిస్తారత్వమా? కంటనేఁ
గనఁబోవం; డెదురైనవాఁడు హరుఁడే కాఁతఁడు మదిన్ లెక్కలే
దనికెంబుఁ జగతీప్రమోదకవితా వ్యాపారమే కార్య; మి
ట్టిసిరాడంబరు, నాంధ్రభవ్యకవిమౌళిన్ మిమ్ము గీర్తించెదన్.





# రాష్ట్రసమాఖ్య

## (The League of Nations)

ప్రొఫేసర్ శిరుగూరి హనుమంతరావుగారు [ఎం. ఏ. ఎల్. టి.]

నాగరకత మిగులఁ బ్రాచీనమైనది. మనుజుడు తన హృదయము వికసించినకొలఁది స్వార్థపరతఁ ద్యజించి సర్వహితవాంఛను గొనుటయే తన యుత్కృష్ట జన్మఫలమని తెలిసికొని తన జీవితమును బవిత్రముగ గడపుచు వచ్చెను. వేలసంవత్సరముల క్రిందటనే మనుజుఁడు సంఘమునం దుండవలెనని యును, సంఘాభ్యుచ్ఛ్రయమునకు శాంతిసౌహార్దములు ఆవశ్యకములనియు గ్రహింపఁగలిగెను.

ప్రప్రథమమున గ్రీసుదేశమిట్టి యున్నతాశయములఁ గాంచి పాశ్చాత్య నాగరకతకు మాతృస్థానమలంకరించినది. తూర్పుననుండి యాసియా నేతాదృశ మహోదారాశయములఁ బోషించి ప్రాచ్యనాగరికత కాలవాలమని వాసిగాంచినది. కాలక్రమమున మానవుని హృదంతరాళము విశాలమైనకొలఁది ప్రత్యేకమానవుఁడేమి, రాష్ట్రములేమి స్వార్థపరతఁ ద్యజించి భ్రాతృవాత్సల్యమునకుఁ బాటుఁబడినవి. గ్రీసుదేశీయులు, రాష్ట్రాంతరముల రక్తము ప్రవహించుచున్నను, తమదేశము క్షేమముగనున్నఁ జాలునని తమరాష్ట్రమునందు శాంతి చెడకుండుటకై కొన్ని యొడంబడికలఁ జేసికొనిరి. అవిరముగనే రోమనులు కేవలము తమ రాష్ట్రక్షేమమునే కోరి కొన్ని న్యాయచట్టములఁ గావించికొనిరి. మెడీవల్ [Medaeval Europe] యూరపున జనులు తమతమ గురువుల శాసనమునకులోనై సంఘక్షేమమును గాపాడుకొనిరి. ప్రకృతకాలమున నంతకంటె విశాలహృదయముతో సర్వరాష్ట్రముల క్షేమమునుగోరి సంధులు మైత్రులు మొదలగునవి చేసికొనఁబడుచున్నవి, కనుక మొట్టమొదటఁ దాక్షేమముగనున్నఁ జాలుననుకొనిన మానవుఁడు సంఘక్షేమమునకును బాటుపడినట్లు, దేశములు రాష్ట్రములుగూడ క్రమముగ సామంతరాష్ట్రముల యొక్కయు, రాష్ట్రాంతరముల యొక్కయు క్షేమమునకై కృషిసల్పినట్లు తెలియుచున్నది.

శాంతి యొక్క ప్రాముఖ్యత వేదములయందేమి, యుపనిషత్తులయందేమి వేనోళ్ల వక్కాణింపఁబడియున్నది. బుద్ధుఁడు శాంతియు క్షమయు బోధించియున్నాఁడు. అశోకుఁడు, హర్షుఁడు, కనిష్కుఁడు మున్నగు హైందవ చక్రవర్తులనేక మత సఖ్యతఁ గావించి తమతమ మాధ్యస్థ్యము నుద్బోధింపఁజేసిరి. మొగలాయి చక్రవర్తులలో నగ్రేసరుఁడక్బరు క్షమాత్మకుఁడై ధర్మములఁ జాటియుండలేదా? మహారాజ్ఞియగు విక్టోరియా మతవిషయిక స్వాతంత్ర్యమును బరిపాలించినది. ఈ యుదాహరణము వలనఁ బాశ్చాత్యదేశములే గాక ప్రాచ్యదేశీయులు సైతము పూర్వమునను శాంతి సౌహార్దములు

ప్రత్యేక వ్యక్తులకేమి, సంఘములకేమి, రాష్ట్రములకేమి, ప్రపంచమునకేమి, యావశ్యకములనియు క్షేమ జనకములనియు గ్రహించినటుల స్పష్టమగుచున్నది.

ఏతాదృశ మహోదారాశయముల ప్రత్యేక వ్యక్తులేమి రాష్ట్రము [illegible] మేణ మలచుటయు, మఱచినపుడెల్ల నట్టి భావముల జ్ఞప్తికిఁ దెచ్చుటకేదియో మహావిప్లవమొకటి దటస్థించుటయు సహజమై యున్నది. ౧౯౧౪ వ సంవత్సరమునఁ దటస్థించిన భయంకర మహాసంగ్రామము దీనికిఁ దార్కాణము. ఈ మహా యుద్ధము వలనఁ బాశ్చాత్య నాగరికత పంచబంగాళమైనది. మహోత్తరమైన పాశ్చాత్య నాగరకత, ప్రపంచమును పూర్వ విప్లవమునుండి రక్షింపఁ గలిగెనా? ఐరోపా మహాసామ్రాజ్యములగు జర్మని, ఆస్ట్రియా హంగరీ, రష్యా — ఈ మూఁడింటికిని మహా పతనము సంభవించి యూరపు మధ్యమున నసంఖ్యాకములైన నవీన రాష్ట్రము లేర్పడినవి. సంగ్రామాంతమున నందుఁ బాల్గొనినవారును, వారి హితులును భావికాలమున యుద్ధముల కవకాశము లేకుండఁ గొన్ని యేర్పాటులఁ జేసికొనుటయుఁ దటస్థించినది.

ఇట్టి యుద్యమములో నగ్రగణ్యుఁడు కీర్తిశేషు లగు వుడ్రో విల్సను గారు. విల్సను గారప్పు డమెరికా సంయుక్త రాష్ట్రముల యధ్యక్షుఁడుగ నుండెను. అతఁడు గొప్ప పండితుఁడును, నాదర్శ పురుషుఁడునునై యున్నాఁడు. ఇతని దూరదృష్టి నిరుపమానము ప్రజాప్రభుత్వాధ్యక్షుఁడగుట నాతఁ డందఱ నొప్పించి యీ యుద్యమమువలన ప్రపంచ మందంతటను శాంతిని నెలకొల్పఁ బ్రయత్నించెను. శాంతి సభ యందందఱును విల్సను గారి యభిప్రాయముతో నేకీభవించి యీ యుద్యమమునకు, "కవెనెంటు (Covenant of the League of nations) ఆఫ్ ది లీగ్ ఆఫ్ నేషన్సు" అని పేరిడి దానిని పీస్ ఆఫ్ వెర్సైలిస్ (Peace of Versailles) లో నంతర్భాగముగాఁ జేర్చిరి. దీనిలోఁ బాల్గొనిన వారందఱును వివాదములఁ బంచాయతీ మూలముననే నిర్వర్తించుకొనుటకును, యుద్ధములఁ జేయకుండుటకును, నొడంబడిక చేసికొనిరి. ౧౯౨౨ వ సంవత్సరమున ఈ సమాఖ్య[illegible]

యందు ౪౨ మంది సభ్యులును, ప్రస్తుతము ౫౫ మంది సభ్యులును కలరు. ౧౯౨౦ వ సంవత్సరమున నాస్ట్రియాయు, ౧౯౨౬ వ సంవత్సరమున జర్మనియు నిందులోఁ జేరినవి. అమెరికా రష్యా, టర్కీ, అఫ్గనుస్థానము ఈజిప్టు మున్నగునవి ఇంతవఱకు నిందులో చేరలేదు. అవియు నగ్రముగా నేకీభవింప నిచ్చునని తోచుచున్నది.

ఈ సమాఖ్యకు మూఁడు శాఖలు ౧. ఎక్జిక్యూటివ్ శాఖ. ౨. న్యాయశాఖ, ౩. కార్మిక శాఖ వీనిలో ప్రధానమయినది, ఎక్జిక్యూటివ్ శాఖ ఈ శాఖలకు మూఁడవయవములు 1 అసెంబ్లీ [Assembly] 2 [Council] కౌన్సిలు 3 సెక్రిటేరియట్ [Secretariat]

౧ అసెంబ్లీ:- సమాఖ్యలోఁ జేరిన ప్రతి రాష్ట్రము నుండియు మువ్వురు ప్రతినిధులకీ యసెంబ్లీలో నవకాశము కలదు. ౧౯౨౭ వ సంవత్సరమున నిండియా నుండి పంపఁబడిన ప్రతినిధులలో నొకరు సర్ శ్రీ॥ పి॥ రామస్వామయ్యరుగారు. ఈ సభ సెప్టెంబరు నెలలో జనవా పట్టణమున సమావేశమగును. ప్రపంచమునకు శాంతిఁ గూర్చుట దీని ముఖ్యోద్దేశము.

౨ కౌన్సిలు:- దీనిలో శాశ్వత సభ్యులుగానున్న బ్రిటిషు సామ్రాజ్యము, ఫ్రాన్సు, ఇటలీ, జపాను, జర్మని కాక, ఇతర రాష్ట్రముల నుండి కొందఱు సభ్యులు మూఁడు సంవత్సరములకొక పర్యాయము అసెంబ్లీ వలన నెన్నుకొనఁబడుదురు. ప్రస్తుతము టెంపరరీ మెంబర్లుగ నున్నవి, పోలాండు, చిలీ, రొమేనియా, చైనా, కొలంబియా, నెదర్లేండ్సు, కనడా, క్యూబా, ఫిన్లేండు, దీనిని బట్టి చూడ కౌన్సిలులో పాశ్చాత్య రాష్ట్రములకు వలె జపాను చైనా మున్నగు ప్రాచ్య రాష్ట్రములకు నైతము సమాన ప్రతిపత్తి కలదని స్పష్టమగుచున్నది. బ్రిటిషు సామ్రాజ్యము శాశ్వత సభ్యత్వము కలదైనను కనడా టెంపరరీ మెంబరుగ నెన్నుకొనఁబడినది. ఇండియా మెంబర్లు సమర్థులైనచో కౌన్సిలులో సభ్యులుగ నెన్నుకొనఁబడుటకెట్టి యాటంకము లేదు. శాంతికై కృషిసల్పుటయే, కౌన్సిలు యొక్క ప్రధాన కర్తవ్యము. ౧౯౨౮ [illegible] సమయముల యుద్ధ



*Photo printed by C. K. Press, Hyd.-Dn.* *By the Courtesy of the Archaelogical Department.*

బారాదరీ తారామతి (గోలకొండ)



నాగనాథ దేవాలయము ( ఔంధా ) దక్షిణ భాగము



*Photo printed by C K. Press, Hyd.-Dn.* *By the Courtesy of the Archaelogical Department.*

ఔంధా దేవాలియము ఉత్తర భాగము

ము నాపుచల చేసికొనుచున్నది. అనాగరకుఁడు రక్తపాతముచే వివాదమును వారింపఁ బ్రయత్నించుట మిక్కిలి క్రూరమును హేయమునునైన పని. అట్లే రాష్ట్రములును పోరాడి తగవుల మాన్పఁజూచుట కడు శోచనీయము. ఈ విషయమునఁ బ్రపంచమంతయు నేకీభవించినఁగాని సంగ్రామము నిశ్శేషముగా నాపుటకు వీలులేదు.

3. సెక్రెటేరియట్—పైని సభలలో నిర్ధారణ చేయబడిన విషయముల నాచరణయందుఁ బెట్టుట దీని ప్రధాన కర్తవ్యము.

రెండవ శాఖ కోర్టు ఆఫ్ ఇంటర్నేషనల్ జస్టిస్ [Court of International Justice] ఇది హేగ్ పట్టణమున సమావేశమగును. దీనిలోఁ బది నైదుగురు నిపుణులగు న్యాయాధిపతులు గలరు. ఇంతవఱకు పదునేడు దేశములీ కోర్టువారి తీర్పునకు లోబడుట కంగీకరించినవి ౧౯౨౬ సం॥ సెప్టెంబరు వఱకీ కోర్టు ౧౩ సలహాలనిచ్చి, ౭ తీర్పులఁ జేసియున్నది.

మూఁడవ శాఖ మఱియు రాష్ట్ర సమాఖ్య యొక్క ప్రధానమైన మూఁడవ శాఖ, ఇంటర్నేషనల్ లేబర్ ఆర్గనైజేషన్ [International Labour organization] ఇది సమాఖ్య యొక్క మొదటి శాఖకంటె నెక్కుడు ప్రజా పరమై యున్నది. ఇందలి సభ్యులు సమాఖ్యయందు మెంబర్లై యుండవలసిన యావశ్యకతలేదు. దీనికి మూఁడవయవములు కలవు ౧. వార్షిక సభ. దీనికిఁ బ్రతి రాష్ట్రము నుండియు నల్గురు ప్రతినిధులు పంపఁబడుదురు. వీరిలో నిరువురు దొరతనమువారిపక్షము వారును. ఒకరు యజమానుల [Employers] పక్షమువారును, మఱియొకరు లేబరర్సు [Labourers] పక్షము వారునై యున్నారు. ౧౯౨౭ వ సంవత్సరమున ఇండియా నుండి ప్రతినిధిగాఁ బంపఁబడిన సర్ అతుల్ ఛటర్జీగారేకగ్రీవముగ వార్షిక సభ కధ్యక్షులుగ నెన్నుకొనఁబడిరి.

౨. పరిపాలనా సంఘము [Governing body] దీనియందుఁగల యిరువది నల్గురు సభ్యులలో పండ్రెండు మంది దొరతనము వారి పక్షమువారును, ఆఱుగురు యజమానుల పక్షము వారును, నాఱుగురు లేబరర్సు పక్షమువారును. దీనియందుగూడ ఇండియాకు ప్రాతినిధ్యమొసంగఁబడి యున్నది.

3. కార్మిక స్థానము [International labour office] ఇందలి యుద్యోగియులన్ని రాష్ట్రములనుండియు నేర్చుకొనఁబడియున్నారు.

ఈ శాఖ ప్రపంచమందంతటను గార్మిక పరిస్థితులు సమానముగ నుండునటులఁ జేయఁ బ్రయత్నించును.

ఈ రాష్ట్ర సమాఖ్యయొక్క మఱియొక ముఖ్య లక్ష్యము; ప్రిన్సిపిల్ ఆఫ్ మేండేట్సు [Principle of mandates] పూర్వము జేత తనచేఁ జయింపఁబడిన దేశమందలి ప్రజల నిరంకుశముగఁ బరిపాలించుచు ననేక రీతుల వారిని హింసించుచుండెడివాఁడు. కాని యీ చట్టమును బట్టి జయింపఁబడిన దేశపు బ్రజల నాగరకులుగ నుండిరేని వారినిఁ గ్రమముగ నభివృద్ధికిఁ దీసికొని వచ్చి స్వరాజ్యార్హులుగఁ జేయుట జేత యొక్క ప్రధాన కర్తవ్యమైయున్నది. సమాఖ్య యందలి ప్రతి మెంబరునకును జేత తన రక్షణయందున్న ప్రజల యౌన్నత్యమునకై కృషిచేయుచుండెనో, లేదోయని విచారించుట కధికారము కలదు. ఈ మాండాటిరీ పద్ధతిని బట్టి జేత యొక్క సంరక్షణ యందున్న ప్రజల పరిస్థితులు, నిరంకుశ పరిపాలనయందలి బ్రజల స్థితిగతులకంటె చక్కబడిన వని చెప్పవచ్చును.

కాని యీ లీగులో కొన్ని లోపములు లేకపోలేదు. ఇది చేయతగినంత పని చేయలేదు. దొరతనము వారి క్రొత్త కల్పనలు, వాని ననుసరించి జనులలో నెక్కుడు మందికి ననుభవ సిద్ధములైనఁగాని యనుష్ఠానార్హములు కానేరవు. పౌరధర్మ మెఱుఁగని ప్రజలు కల రాష్ట్రమునఁ బ్రజా ప్రభుత్వము హాస్యాస్పదము కాక మానదు. అటులనే దేశ ద్రోహమువలె సంఘ ద్రోహము కూడ నరక హేతువని ప్రజలెఱుంగు వఱకు రాష్ట్ర సమాఖ్య నిరర్థకమే యగును.

ఈ వ్యాస మింగ్లీషునుండి గరికిపాటి లక్ష్మీకాంత శాస్త్రిగారిచే నాంధ్రీకరింపబడినది.



# క్షయ

(డాక్టర్. యస్. రామకృష్ణా రెడ్డిగారు ఎల్. ఏం. అండ్. యస్.

క్షయ ప్రపంచమంతటను నెల్లెడల విస్తరిల్లి యనేక ప్రాణములను బలిగొనుచున్నది. ఇయ్యది కొందరిచే ,,తెల్లనిప్లేగు ,, యనియు పేర్కొనబడినది. ఇది ముఖ్యముగా వంపుస్థలములయందును, బహుజనసంకీర్ణమైన పట్టణములందును మురికిపల్లెలందును చూచుచున్నారము. ఇట్టిస్థలములందు సూర్యరశ్మి, పరిశుభ్ర వాయువు తగుభోజనము లేకుండిన మరియు వీధులలో దుమ్మును, జనులలో బలహీనత విశేషమైన నీజాడ్యము నతివేగముగా యభివృద్ధియగును.

ఈవ్యాధి ,,ట్యూబర్ కులస్ బ్యాసిలెస్ అను నొక సూక్ష్మక్రిమిచే సంభవించుచున్నది, దీనిని రాబర్టు కాకుగారు క్రీ. శ. ౧౮౮౨ నందు కనిపెట్టిరి దీనియందు రెండువిధముల క్రిములు కలవనియు అందొకటి క్షయ రోగి నేలపై యుమియునపుడు అతని గల్లయెండి యందలి క్రిములు దుమ్ములోకలసి గాలియందుండు క్రిములతోకూడ అవాయువును పీల్చినపుడు శ్వాసకోశములయందవి ప్రవేశించి నిజమైన క్షయ కలుగజేయుచున్నవి.

రెండవవిధమగు క్రిములు పాలు మున్నగు భోజన పదార్థముల మూలమున దేహమునందు ప్రవేశించి అస్థిపంజరమునను, మరియు నితరావయవములందు వ్యాపించుటచే వివిధరూపముల క్షయ గలుగుచున్నదని కాకుగారు నిర్ణయించిరి

పాశ్చాత్యదేశములందు కొన్ని శతాబ్దములనుండి యీవ్యాధి జనులకు విశదమై యున్నది. ఇటీవలవారు తగుపద్ధతుల ననుసరించుటచే మరణసంఖ్య తగ్గినది. మరియు వ్యాధికూడ యరుదగుచున్నది. అదేరీతిగా భారతదేశమునందుగూడ తగుపద్ధతుల నవలంభించి శీఘ్రముగా దాని రూపుమాపవలయును.

మన భారతదేశమునందు తగు ఔషధాలయములు లేకుండుటచేతను, ప్రజలలో విద్యావిహీనత యుండుటచేతను, బీదరికముచేతను, నీవ్యాధి మనకు సరిగా వివరములు తెలియవచ్చుటలేదు. కాని ముఖ్యముగా గోషాస్త్రీలయందు, దుర్బలులందు సదారోగులయందును మరణసంఖ్య హెచ్చని స్పష్టముగ చెప్పగవచ్చును.

## వ్యాధి ప్రబలుటకు కారణములు

పైన వివరించినట్టి క్రిములు రోగి దగ్గినపుడుగాని ఉమియునపుడుగాని ననేకములుగా వెలువడును. రోగియుండు గదియొక్క వాయువు నాకీటకములచే నిండియుండుటవలన యితరులకు కూడ నీవ్యాధి సంభవించుటకు కారణములైయున్నవి.

ఈదిగువ పేర్కొనబడినవికూడ వ్యాధిని పెంపొందించుచున్నది,

౧, అలవాట్లు

౨. బీదతనము, జనబాహుళ్యము

3, సాంఘికాచారము

(క) పరదా పద్ధతి

(చ) బాల్యవివాహములు

(ట) ప్రసవములు

౪. వృత్తులు, వ్యాపారములు

౫. భోజనములయందు పరిశుభ్రత

ఈదౌర్బల్యములను క్రమముగా వివరించెదను,

౬. మోటారుబండ్లు

### ౧. అలవాటు

మన భారతదేశీయులలో కొన్ని దురభ్యాసముల వలన వ్యాధి ప్రబలుచున్నది. ముఖ్యముగా నిరాటంకముగా నెట్టిసలములయందును గాని యుమివేయుట యొకటి యైయున్నది. ఇందుచేతనే మనదేశమందు దూపిరితిత్తుల క్షయచే వ్యాధిగ్రస్థులైనవారు లెక్కకు మిక్కుటముగా నున్నారు. ప్రపంచమునందలి యితర ప్రాంతములయందు అస్థిపంజరముల, కండరముల, చర్మముల క్షయ యెక్కువగా నున్నట్లు నగుపడుచున్నది. రెండవ విధమగు క్షయ పాలవలన కలుగుచున్నదని నిదివరకే తెలుపబడినది. ఇండియాదేశపుపశువులలో మొత్తమున నిట్టివ్యాధి ప్రబలినట్లు తోచదు. మరియు నట్టిపశువు లున్నప్పటికిని భారతదేశీయులు కాచినపాలు పుచ్చుకొనుటచేత నాబాధనుండి కొంతవరకు తప్పించుకొనుచున్నారు.

క్షయరోగాల పుండ్లు మొదలగునవి సూక్ష్మక్రిములు కలిగియుండుటచేత నాపుండ్లు నంటిన చేతులు శుభ్రముగా కడుగుకొనక భోజనపదార్థములు ఆరగించినచో నాపదార్థములతో క్రిములు దేహమునందు నిమిడి వ్యాధి చిహ్నములు పొడచూపును. మఱియు పలువురు నొకేగదిలో కిటికీలు, ద్వారములు మున్నగునవి మూసి నిద్రించుటచేతను, నొకేగుడ్డ పలువురు ముఖమునిండుగా కప్పుకొనుటచేత నొకరుపీల్చినవాయువు మరొకరు పీల్చి, తిరిగి పీల్చుటచేత దేహారోగ్యము చెడును. ఇట్టి పడకటింటియందు నొకరు క్షయవ్యాధి కలవారున్నచో మొత్తముపైన నాయింటివారందరికిని క్షయ కలుగవచ్చును.

### ౨. బీదతనము— జనబాహుళ్యము

ఇతర దేశములయందు పేదతనము వలన జనసంఖ్య పట్టణ సమీపము నుండుటచేత శుద్ధవాయువు లేకపోవుటచేత రోగగ్రస్థు లగుచున్నారు, కాని భారతదేశమునందు పట్టణములకన్న గ్రామము లెచ్చుగా యుండుటవలనను, ప్రజలు వ్యవసాయదారులగుటచేతను నిదియొక ముఖ్యకారణము కాకపోవచ్చును. కాని క్షామములతోడు జనులలోదౌర్బల్యముండిన రోగ మతిశీఘ్రముగా వ్యాపించును.

పాఠశాలలయందు నొక బాలుడు క్షయరోగ పీడితుడైనచో నితరబాలురకు కూడ నంటవచ్చును.

కొన్ని గ్రామాములయందు మంటిగోడల యిండ్లలో నివసించెదరు. క్షయరోగులు దగ్గుచు, గల్లగోడలపైన యుమియుట వలనను గాలివీచినపుడుగాని యితరబాలురు చేతులతో రాచినపుడుగాని యాగల్లనుండి క్రిములు గాలిలో రేగి వాయువును పీల్చుటచేత వ్యాధి సంభవించుచున్నది. అందుచేత ప్రతిపాఠశాలల బాలురను బాలికలను వైద్యును పరీక్షించవలసిన ఆవసరము కలదు.

### ౩, సాంఘికాచారములు

[క] గోషాపద్ధతి నవలంభించుట వలనను స్త్రీలు రేయింబవళ్లు గృహమునందే బంధింపబడిన వారివలె నుండుటచేత శుద్ధవాయువులేక, సరియైన సూర్యరశ్మిలేక బలహీనత జెందుదురు. ఇందుకతోడు కటికచీకటి గదులయందు ప్రసవములు జరిగినచో నవలీలగా నెట్టిరోగము గాని పెంపొందును. ఇట్టికారణములబట్టి స్త్రీమరణసంఖ్య హెచ్చుగానున్నదని నిశ్చయమగుచున్నది.

ఈజాడ్యములవలన కలకత్తాలో ప్రతిసంవత్సరము స్త్రీలలో మరణములు పురుషులకన్న నారింతలు హెచ్చని లెక్కల వలన విదమగుచున్నది.

గ్రామములయందు గృహములు దూరదూరముగా యుండుటవలన శుద్ధ వాయువు, సూర్యరస్మి యెక్కువగా లభించుచున్నది అందువలన నీవ్యాధి పట్టణములకంటె గ్రామములలో తక్కువగా నున్నట్టు నగుపడును.

ఇంతియకాక గ్రామవాసులు చక్కని దృఢదేహము కలిగి యుండుటచేత రోగము పెంపొందజాలదు.

మొత్తముపైన నిట్టివ్యాధి సాధారణ స్థితి యందుండు జనులలోననే విశేషమగుచున్నది. ఎలననగా బీదలే మాత్రమును ఆటంకములేక బయట తిరుగుదురు. ధనికులు తమ యుద్యానవనములయందు విహరింతురు గాని మధ్య స్థితి వారికి తోటలాలేవు మఱియు వీరి స్త్రీలు సిగ్గుచే వెలుపలరారు. అందుచేత గృహమునకు బంధింప బడినవారై హెచ్చుగా రోగపీడితు లగుచున్నారు.

## ౮. బాల్యవివాహములు

మన భారత దేశమున బాలికలకు చిన్నతనముననే వివాహము చేయు నలవాటు పడినది. ఇందుమూలమున పసికూనలు బాల్యముననే పిల్లల తల్లులగుచున్నారు. చిన్నతనముననే తల్లులగుటచేత వీరికి అనారోగ్యము గలుగును. సంసార భారముకూడ నధికమగును. శిశుపోషణ చేయలేనందున తమ పిల్లలు బలహీను లగుదురు. చిన్నతనమున పెండ్లిచేయుటచేత నవయవములు వృద్ధికావు. మఱియు ఉల్లాసము కలుగజాలదు. ఇందువలన రోగము నిట్టి బాలికలను ఆకర్షించుటచేత రోగమునుండి తప్పించుకొనలేక రోగపీడితు లగుదురు. ఈ కారణము వలనకూడ మరణసంఖ్య హెచ్చుచున్నది.

## కాన్పులు

సాధారణముగా ప్రసవమునకై మనదేశమునందు వెలుతురు, గాలిలేనిగదిని నుపయోగించెదరు. ఇట్టి కార్యమునకు శుద్ధవాయువు, సూర్యరశ్మి యత్యావసరమని జనులనుభవింపకపోవుట కడు శోచనీయము. కొన్ని స్థలములయందు ప్రసవించిన స్త్రీలకు తుదకు లంఘనము పెట్టుదురట.

ప్రసవముచే రక్తముపోయి బలహీనతను కలుగజేయును. అట్టిచో వెలుతురు గాలిలేని స్థలమునందు సూక్ష్మక్రిమి పెరిగి యతిశీఘ్రముగా వీరిలో వ్యాధిని కలుగజేయును.

మరొక విషయము గమనింప దగినది. ప్రసవ సమయములయందు నేవో కొన్ని పనికి రానట్టి గుడ్డల నుపయోగింతురు. అట్టి గుడ్డలయందు ననేక సూక్ష్మజీవులుండుట చేత దేహమునందు ప్రవేశించి రోగమును కలుగచేయును. కనుక చినిగిన గుడ్డలైనప్పటికిని దానిని శుభ్రముగా నుంచవలెను.

ఇవి క్షయకు కారణములు కాకపోవచ్చును గాని బలహీనత, అపరిశుభ్రత యనునవి క్షయ కనుకూలమగు సాధనములు.

## వాణిజ్యములు- వ్యాపారములు

ఇవి క్షయరోగమును స్వయముగా కలుగజేయకున్నను వ్యాధికి తోడుపడుచున్నవి. పశ్చిమ ఖండమునందు క్షయ వివిధ నామములను బొందియున్నది. గాజు ముక్కలతో పనిజేయువారు సన్నని పొడుము గాలిలో యుండగా నా గాలిని పీల్చుటచేత నీ గాజుపొడి శ్వాసకోశములయందు చేరి వ్యాధిని కలుగజేయుచున్నది. ఇట్టి వ్యాధిగ్రస్తులకు క్షయరోగము శీఘ్రముగా నంటును.

హిందూస్థానములో బీడీలు, సిగిరెట్లుజేయు స్థలములయందు పొగాకు ధూళిచే దగ్గును, ఉబ్బసమును కలుగజేయుట చేత క్షయకు తావు ఏర్పడు చున్నది.

మనదేశమునందు ప్రత్తిపంట చాలయగుటచేత ప్రత్తి పరిశ్రమలందు పనిచేయువారి ఆరోగ్యము చెడి వారు రోగపీడితు లగుచున్నారు.

కటికవాడు క్షయవ్యాధి గల పశువులను కోయునప్పుడు తన హస్తము తెగినచో వానికి కండరముల క్షయ కలుగుచున్నది. ఇట్లే యనేక విధముల క్షయ మొందగుచున్నది.

## ఆహారపదార్థములందు అజాగ్రత్త

క్షయను కలుగజేయు సూక్ష్మక్రిములు గాలిలో దుమ్ములో నుండునట్లు నిదివరకే నివేదించబడినది. ఇట్టి దుమ్ముగాని క్షయరోగి యెంగిలిపై వ్రాలిన యీగ గాని మన భోజన పదార్థములపై వ్రాలినచో వాటి రెక్కలకును కాళ్ళకును నంటుకొని యుండు క్రిములు భోజన వస్తువులయందు విడువబడుటచే క్షయవ్యాధి కలుగు

చున్నది. మనము శ్రద్ధవహించి పరిశుభ్రముగా నుంటచే యుండుకొనుటకు ప్రయత్నించుచుందుము కాని సిద్ధపరచిన వస్తువులను మరింత జాగ్రతగా మూసియుంచి కాపాడవలయును. ఇట్టి విధమగు క్షయ పేగులవంటి కడుపునొప్పి విరేచనములు కలిగించును.

క్షయరోగి గృహమునందున్న యెడల యతనికి త్రాగుటకును భుజించుటకును పాత్రలు ప్రత్యేకముగా నుంచక వాని నితరులుకూడ నుపయోగించుట వలన క్షయరోగము కలుగుచున్నది.

## మోటారుబండ్లు

ప్రతిదినము మోటారు బండ్లసంఖ్య హెచ్చుచున్నది. ఈ బండ్లు పోవునపుడు దుమ్మును గాలిలో రేగింపజేయుచున్నవి. ఆదారి నడచి పోవువారు దుమ్ములోనిలిచి వాయువును పీల్చుటచేత పైన వివరించినట్లు క్షయ కలుగుచున్నది.

## రోగ చిహ్నములు

రోగోపచారమునకంటె రోగము తగలకుండును పాయముల నవలంబించుటయే మిక్కిలి అవసరమని గ్రహింపవలెను.

వ్యాధి యొకరియందు ప్రారంభింపగానే ఉపచారమునకే కాక శాంతికొలుపుట కొరకు కూడ గుర్తించవలయును,

ఈ దిగువ వివరించినవి నొకరియందు పొడచూపిన శీఘ్రముగా తగిన వైద్యుని చూచి ఔషధమును సేవింపవలయును.

౧. ప్రతిదినము సాయంత్రము సన్నని జ్వరము వచ్చుట.

౨. రాత్రులయందు ఒడలు చెమ్మగిల్లుట.

౩. పొడిదగ్గుకాని లేక దగ్గులో గల్ల వచ్చుట.

౪. భోజనము రుచి అజీర్ణత పలుచని విరేచనములు.

౫. అప్పుడప్పుడు నోటినుండి రక్తము పడుట.

౬. దినక్రమేణ చిక్కిపోవుట.

౭, అప్పుడప్పుడు రొమ్ములో నొప్పికలుగుట. పై చిహ్నములు కనబడినంతనే వైద్యునిచే పరీక్షించుకొనుట మంచిది,

చిన్నపిల్లలందు క్షయ మెడలయందు చంకలయందు గడ్డలుగా గ్రంథులు, నేర్పడును. లేక కీళ్లనొప్పులుగలిగి అస్థిపంజరమున నగ్నివలె క్షయ అంటిజనుల పీడించుచున్నది.

దినక్రమేన వ్యాధి హెచ్చగు కొలది రోగి చిక్కియేమియు జీర్ణించుకొనలేక దగ్గు మొదలగు వానిచే బాధపడి చిట్టచివరకు మరణించవచ్చును.

సాధారణముగా ఈ వ్యాధి కలవారు మొట్టమొదట సామాన్య జ్వరమని అశ్రద్ధవహించి కడపటి సమయమున ఔషధముల వలన సహాయము కలుగని సమయమున వైద్యుని దర్శించుదురు. కనుక యట్లుచేయరాదు.

## ఉ ప చా ర ము

క్షయరోగిని బాగుచేయ వలయుననిన దేహమునకు పుష్టికలిగించు పద్ధతుల నవలంభించవలయును. అవి యెట్టివనిన విశ్రాంతి, సూర్యరశ్మి, శుద్ధిగల వాయువు, అవలీలగా జీర్ణించునట్టి వస్తువులును కలిగియుండవలెను.

## నిరోధక పద్ధతులు:

ఇదియే ముఖ్యముగా గమనింప దగిన విషయములు, వీటిని రెండు భాగములుగా భాగించేదము.

౧. స్వయం రక్షణ,

౨. ప్రజారక్షణ.

## స్వ యం ర క్ష ణ

సాధ్యమైనంతవరకు పైన వివరించినట్లు క్షయక్రిములు గల వస్తువుల నంటకుండుట. వాటి వివరము తెల్లన క్షయరోగి గదియందు నిద్రించకుండుట, ఆగదియందునే పనియును చేయకుండుటయు, అందు రోగి తప్ప యితరు లెట్టి పదార్థములను భుజింపరాదు,. మరియు రోగి యుపయోగించిన పాత్రలను.నితరు లుపయోగించరాదు. క్షయరోగులు జనులు సమావేశమగు స్థలములకు పోడలకూడదు.

దేహము ఎల్లప్పుడును ఆరోగ్యముగా యుంచుకొనవలయును. పలుమారు జలుబు, దగ్గు, ఎరస జ్వరము మొదలగునవి వచ్చుటచేత దేహపటుత్వము తగ్గును. నిట్టిస్థితియందు క్షయ జయప్రదము నొందును.

రక్తములో తెల్లని కణములు కలవు. అవి దేహమునందు నెట్టి విషపదార్థము లున్నను పాడుచేయ ప్రయత్నించును. ఇట్టి ప్రయత్న నీకణములు దేహ మారోగ్యముగా నుండిననే బాగుగా పనిచేయును. కనుక ఆరోగ్యముగా నుండుటకు పైన వివరించినట్లు మంచిగాలి, భోజనము, దేహపరిశ్రమ కలిగియుండ వలెను, మనోవ్యాకులత, మత్తువస్తువులు స్వీకరించుట, సదా రోగియగుట, యీ విషయములనుండి ప్రతివాడును తప్పించుకొని తిరుగవలెను.

(క) ప్రజారక్షణ

రోగిని కనిపెట్టి వాని నితరుల నుండి దూరముగా నుంచుట మొదటిపని.

ప్రథమముననే రోగిని గుర్తించిన రోగమును బాగుజేయుటసు వీలుకలదు. మఱియు వ్యాధి నితరుల నంటకుండునట్లు పద్ధతుల నుపయోగించిన క్షయలేకుండు నట్లు జేయుటకు మార్గము యొసంగుచున్నది.

ఇతరములగు అంటువ్యాధులలో చేయునట్లు క్షయరోగిని దూరముగా నుంచవలయును. సాధ్యమైనంతవరకు ప్రత్యేక క్షయ వైద్యశాలలయందు ఉపచారము చేయుట ఉత్కృష్టమైనది. స్వగృహమునం దుంచినచో బాగుగా వెలుతురు, ఎండ, గాలి వచ్చు గది నుపయోగించవలయును. ఇట్టి గదియందు రోగికి కావలసిన వస్తువులు తప్ప మరేవస్తువు లుండరాదు. గది శుభ్రపరచు నపుడు నేలను కారుబాలిక్ లోషనుతో గాని, నీళ్ళతో గాని, చిలుకరించి దుమ్ము లేకుండునట్లు యూడ్చవలెను.

రోగి యుమ్మి వేయుటకు ప్రత్యేకముగా నొక పాత్రయందు కొంత లోషన్ నుంచవలయును. నిట్టి గదిలోనికి బాలురను, పోనీయరాదు. రోగివాడు కొను బట్టలను తగురీతిగా నుడుక బెట్టి వాడుకొనవలయును. పడక బట్టలు ప్రతిదినము రెండుగంటలు ఎండలో వేయవలయును. మలమూత్రములు నుడక బెట్టిగాని కారుబాలిక్ లోషన్‌లో కలిపిగాని పారవేయవలెను. మలమూత్రములు నీటిసమీపమున విసర్జించరాదు.

(చ) గల్ల

క్షయరోగి గల్లయందు ననేక క్రిములుండుట చేత రోగి ప్రత్యేక పాత్రయందు తప్ప యితర స్థలములయందు గాని, వెలుపలగాని, యుమ్మియగూడదు. పాత్రపై కప్పుండవలయును. లేని యెడల యీగలు వ్రాలి యితరులకు వ్యాధిని కలుగజేయును. ఆ పాత్రయందు కారుబాలిక్ లోషన్ గాని తుదకు నీరుగాని యుంచుడు. గల్ల యెండక మునుపే ఎండిన గడ్డిపై వేసి తగలబెట్టుడు. లేనిచో గల్లయెండి దుమ్ముతోగూడ గాలియందు కలిసి యుండును. ఆ గాలిని పీల్చువారు వ్యాధిని పొందుదురు.

వెలుపల పోవునపుడు నొక గట్టిగా దట్టగల సీసానుగాని, కారుబాలిక్ లోషన్‌లో నడిపిన చేతిరుమాలుగాని వాడుకొన వలయును. పిమ్మట దానిని కాల్చవలెను లేదా అరగంట కాలము నుడక బెట్టి తిరిగి వాడుకొన వలయును.

ప్రస్తుతము బజారులందు నూనెతో నమర్చబడిన కాగితపు సంచులుచిక్కుచున్నవి. అవి యుమివేయుటకు వాడుకొని కాల్చినచో మిక్కిలి మంచిది.

క్షయరోగులు దగ్గునపుడు వారి చేతిగుడ్డ నోటికడ్డము పెట్టుకొనుట మంచిది.

పాలవలన కూడ క్షయ నంటుటచేత గోవులకు ఏ వ్యాధిని యుండకుండునట్లు చూడుడు. పితికిన పాలను యీగలు పడకుండు నట్లును, దుమ్ము వ్రాలకుండు నట్లును కప్పియుంచుడు. పాలు యుంచబడు పాత్రలను ప్రతిదినము శుభ్రపరిచి అరగంట కాలము నుడకపెట్టుడు. పశువులు యుండు స్థలము శుభ్రముగా యుంచుడు.

# నిజాం రాష్ట్రము గ్రామ్యభాష

(మాడపాటి హనుమంతరావుగారు)

సుమారు ఇరువది సంవత్సరముల క్రింద మదరాసు రాజధానిలోని తెనుగు జిల్లాలలో ముఖ్యముగా ఉత్తర సర్కారులని పిలువబడు గుంటూరు, కృష్ణా, గోదావరి, విశాఖపట్నము గంజాము జిల్లాలలో—గ్రామ్య భాషను గ్రంథస్థము చేయవలయునని యొక యుద్యమము ఆరంభమైనది. అనగా ఆంధ్ర దేశములోని యున్నత తరగతుల వారు సంభాషణలలో వాడుకొను భాషలోనే గ్రంథములు వ్రాయుట చాల ఉపయోగకరముగానుండుననియు, దీనివలన మన భాష కెంతో యభివృద్ధి యగుననియు, ప్రస్తుత కాలములో మన వాఙ్మయము విస్తరిల్లుటకు గ్రాంథిక భాషలోనే గ్రంథములు వ్రాయవలయునని నిర్బంధము ఆటంకముగా నున్నదనియు, భాషాభిమానులగు కొందరు మహాశయులు వాదింప నారంభించిరి. ఇట్టివారిలో కీ. శే. గురుజాడ అప్పారావుగారు చాల ముఖ్యులు. బహుశః ప్రథములు. వారి తరువాత నీ విషయములో వాద వివాదములను సిద్ధాంతములను చేయుచుండినవారుగు గ్రామ్యభాషాభిమానమున విఖ్యాతి గాంచినవారును విద్వద్వర్యులగు శ్రీరావు సాహెబు గిడుగు వేంకట రామమూర్తిగారు. ఎట్లైననేమి గ్రామ్య భాషాభిమానము క్రమ క్రమముగా పెంపొందుచునే యున్నది. చాలకాలము గడచినందున కాబోలు ఈ విషయమున వాద వివాదములును తగ్గినవి. ఇప్పుడు విఖ్యాతములగు మాస పత్రికలును, కృష్ణా పత్రికవంటి యుత్కృష్ట వారపత్రికయును, సాధారణ వ్యాసముల విషయములలోనేగాక ప్రధాన వ్యాసములందును [illegible] గ్రామ్య భాష (వాడు[illegible]క భాషకు తావిచ్చుచున్నవి. ఒక్క రాజ్యాంగ విషయమున తప్ప, తక్కిన విషయములన్నియు, సమిష్టిగా ఆంధ్ర దేశమునకంతటికిని వర్తించునవియే. కనుక నిజాం రాష్ట్రములోని ఆంధ్రదేశము కూడ గ్రామ్యభాషా ప్రభావమునకు లోబడవలసినదే యైనది.

"ఇరువది, యేండ్లనుండి జరుగుచున్న యీ నూతనోద్యమ ప్రభావము నిజాం రాష్ట్రమును ఇంతవరకు పూర్వమాకర్షించి యుండకపోవుటకు ఏమి కారణము?" అని కొందరికి ఆశ్చర్యము తోపవచ్చును. యథార్థము విచారించినచో, గ్రామ్య భాషా సంబంధమైన యుద్యమము మదరాసు రాజధానిలోనైనను, పైన చెప్పబడిన జిల్లాలు తప్ప యితర జిల్లాల వారి నంతగా ఆకర్షించినట్లు కనుపడదు. దత్త మండలములందీవిషయమున వాద ప్రవాదములు జరిగినట్లు కానరాదు. గ్రామ్య భాషా గ్రంథములు అచ్చటినుండి వెడలినట్లును నాకు జ్ఞప్తి లేదు. ఇట్టి స్థితిలో నిజాం రాష్ట్రములోని ఆంధ్ర జిల్లాల గూర్చి చెప్పవలసిన పనియే లేదు. ఈ రాష్ట్రములోని జిల్లాల వైశాల్యము మొత్తము ఆంధ్ర దేశములో మూడవ భాగముగ నుండినప్పటికిని—ఇచ్చటి జనసంఖ్య ఆంధ్రదేశ జనసంఖ్యలో దాదాపు అట్టిమానమునే కలిగియుండినప్పటికిని—విద్యా విషయములందే కాక, విజ్ఞానమున కేమాత్రమైనను సంబంధించిన సర్వ విషయములందును, వెనుకబడియే యున్నది. ఆంధ్రదేశ శరీరములోని మహాదుర్బలమగు నొక యంగముగానీ నిజాం రాష్ట్రాంధ్ర దేశము పరిగణింపబడు చున్నది. అట్లు పరిగణింపబడదగియే

యున్నది. గడచిన యిరువది సంవత్సరములలో ఈ రాష్ట్రము, ఆంధ్ర వాఙ్మయ వికాసమునకై చేసిన తోడ్పాటు అత్యల్పము. గ్రంథరచన జరుగనే లేదని చెప్పినను చెప్పవచ్చును. వాఙ్మయ విషయమున దేశము నెదుర్కొను చున్న సమస్యలకు ఈ రాష్ట్రవాసులు సమన్వయించుటకు ఎట్టి ప్రయత్నములును చేసినట్లు లేదు. ఆరు సంవత్సరములకు ముందు ఇచ్చట తెనుగు పత్రిక లున్నవనుటకు వీలే లేదు. ఇట్టి పరిస్థితులలో ఈ రాష్ట్రవాసులు ఆంధ్ర వాఙ్మయ సంబంధికములగు గ్రామ్య భాషా విషయమును గూర్చి యాలోచించుటగాని అభిప్రాయము స్థాపించుటగాని ఎట్లు సంభవించును?

ఇప్పుడు నిజాంరాష్ట్రములోని తెలుగుజిల్లాలస్థితి కొంచెము మారినదని తలచుట కభ్యంతరము లేదు. గడిచిన యారు సంవత్సరముల కాలములో తెనుగుపత్రికల వ్యాప్తి ఇచ్చట కొంత హెచ్చినది. వాచక ప్రపంచము కొంత విశాలమైనది. పక్ష, వార, అర్ధవార, మాసపత్రికలు వెలువడసాగినవి. ఈ పత్రికాధిపతులకును, వీనికి వ్యాసములు వ్రాయు నీప్రాంతములందలి యాంధ్రులకును, ఆదర్శము మదరాసు రాజధానిలోని వృద్ధిమార్గమునందున్న ఆంధ్రజిల్లాలే. ఇచ్చటి యాంధ్రుల కొద్దిపాటి యుద్యమములకు ఆ జిల్లాలలోని మహోద్యమములే మార్గదర్శకములు. కనుక గ్రామ్యభాషా విషయమున గూడ నీప్రాంతపు టాంధ్రులకు ఆజిల్లాలలోని ఆంధ్రసోదరుల వాద చిహ్నములే అనుకరణీయము లనుట నిర్వివాదాంశము.

మద్రాసు రాజధానిలోని మన యాంధ్రసోదరులైన ఆనగా గ్రామ్యభాషాభిమానులగు నాంధ్రసోదరులైన వారు వాడుక భాషను వ్రాయువిధమునందు ఏకాభిప్రాయులుగా కాన్పించరు. „ఉదా“ వెళ్లెదను, అను శబ్దమునకు 'వెళ్తారు' అని కొందరును, „వెళ్తా“ అని కొందరును, వ్రాయుచున్నారు: కొందరు అనివర్ణీకరణముతో కూడ పనిలేదు. ఒక లేఖకుడే ఒక వ్యాసములో ఒకవిధముగను మరియొక వ్యాసములో మరియొక విధముగను వ్రాయుట సంభవించుచున్నది. ఇంతేకాదు. ఒక వ్యాసములోనే ఒకచోట ఒకవిధముగను, వేరొకచోట మరియొక విధముగను శబ్దము వ్రాయబడుట కానవచ్చుచున్నది. గ్రామ్యభాషా రచనయందు విఖ్యాతకుడగు నొక లేఖకుడు వ్రాసిన యొక కథ. గ్రామ్యభాషాభిమానియగు నొక మాసపత్రికాధిపతి వద్దకుబోయి వారివలన కొంత దిద్దుబాటును పొంది వచ్చియుండగా నేను చూచుట సంభవించినది. కథారచయిత „వుంటాడు“ అని వ్రాసినదానిని పత్రికాధిపతి 'ఉంటాడు' , గాను, యిల్లు' అని యున్నచోట „ఇల్లు“ అనియును ఇట్లే యెన్నియోచోట హల్లులకుమారు అచ్చులను వ్రాసియు వేరుమార్పులు చేసియు, మూలరచనను దిద్దినట్లును, కొన్నిచోట్ల సంస్కృత సమాసములనడుమ వచ్చిన తెనుగుశబ్దముల తొలగించి దానికి మారుగా సంస్కృతశబ్దము పెట్టి దిద్దినట్లును దృగ్గోచరమైనది. „నువ్వు“ అని స్పష్టముగా వ్రాసినదానిని , నీవు' అని దిద్దుట కానవచ్చినది. కేవలము గ్రామ్యభాషలో వ్యాసమొకటి వ్రాయుచు , 'తచ్ఛాస్త్రిలు“ (ఆశాస్త్రములు అను నర్థములో) వ్రాసియుండుట చూడనైనది. 'చేయాలి' అని యొకచోటు వ్రాసి నాల్గువాక్యముల తర్వాత „చేయవలె“ యనిగాను కొంతదూరమున „చేయవలెను“ అని వ్రాయుటయు, కనుపడినది. ఇట్టి వివరములు చెప్పబూనినచో గ్రంథవిస్తరమగును, కనుక మొత్తముమీద గ్రామ్యభాషావాదులగు లేఖకులలో రచనావిషయమునను' శబ్దప్రయోగము విషయమునను నియమబద్ధత ఏమాత్రము కానవచ్చుటలేదు.

మరియొకసంగతి: గ్రామ్య భాషావాదులగు మన సోదరులు—మద్రాసు రాజధానిలోని తెనుగు జిల్లాల వాస్తవ్యులలో సోదరులు— తమరచనలందు ఇతర భాషా శబ్దములను వాడునప్పుడు కొంత వైచిత్ర్యము కనపడుచున్నది. „'గవర్నమెంటు“ అను శబ్దమునకు „గవనరు మెంటు“అని వ్రాసినారు. „షికారు“అను ఫారసీశబ్దము „సికారు“ అనివ్రాసినారు. ఇట్టివెన్నో చూపవచ్చును. ఇవి ఉచ్చారణను మార్చినందుక కుదాహరణములు కొన్ని కలవు.ఒక విఖ్యాతరచయిత„నశ్వరము“ (నశించునది) అను సంస్కృత శబ్దమును తన గ్రామ్యభాషా రచనలో „అశ్వరము“ అని మార్చుటను కన్నులార గాంచితిని. ఇది ఉచ్చారణా సౌకర్యముకొరకో, లేక మరెందుకో రచయిత దర్శనమైనపుడు తెలిసికొందమని తలచితిని.



ఎఱుక బాలుర పాఠశాల

ప్రారంభోత్సవము.

ERUKALA'S SCHOOL (GIRLS SCHOOL)



మ॥రా॥రా॥ మాడపాటి హనుమంతరావు గారు

హైకోర్టు వకీలు.

MADAPATI HANUMANTH RAO.





పి. యన్. శర్మగారు.

బి. ఏ. ఎల్. ఎల్. బి.

సుజాత పత్రికా సంపాదకులు.

P. N. SARMA.

నిజాంరాష్ట్రములో నివసించుచున్న నాయంటివానికి మన సోదరుల గ్రామ్యభాషా రచనలో మఱియొక సంగతి కానవచ్చును. అదికొంత సార్థిక్యాస్థ కలిగించు నదిగా నున్నందున దానిని వివరించవలసి వచ్చినది. ఫారసీ శబ్దములు కొన్ని గ్రామ్య భాషావాదుల రచనలలో తప్పుడర్థములందు కానవచ్చినవి. ఉదా: ,,వేట'' యను నర్థముగల ',షికారు'' శబ్దము ,,విహారము'' అను నర్థమందు ఉపయోగపడుచున్నది. ',విచారము'' అను నరముగల ,,ఫికరు'' శబ్దమును ,,సందేహము'' అను నర్థమును, ,,తరగతి'' యను నర్థముగల ,,దర్జా'' అను శబ్దమును, దర్పము [?] అను నర్థమునను, ,,సహాయుడు'' అను నర్థముగల ,హామీ' యను శబ్దము ,నమ్మకము' అను నర్థము నందును, ,వాది' యను నర్థముగల ,ముద్దయీ' అను శబ్దమును ,ప్రతివాది'యను నర్థమునందును, ,హుష్యారు' అను శబ్దమును 'వుషారు' గా మార్చి దాని యర్థమగు ,తెలివిగలవాడు' అను నర్థమునుండి hint ,అను' ఆంగ్ల శబ్దమునకు సమానార్థక పదముగాను, ఇట్లే ఎన్నియో చిత్రవిచిత్రములగు నర్థములలోననే శబ్దములను, పరభాషా శబ్దములను వ్రాసియుండుటను చూచియున్నాను. ఇందునకు బహుశః కారణము లేఖకుడు వసించుచున్న ఆంధ్ర ప్రాంతములో పైశబ్దములట్టి మార్పుగల యర్థమున వాడబడుచుండుటయే యని తోచుచున్నది. ఈ శబ్దములు మహమ్మదీయపాలన కాలమున వాడుకభాషలో ప్రవేశించి ఫారసీభాషప్రచారము ఆంధ్రప్రాంతములలో లేనందున కాలక్రమమున తప్పుటర్థములలో వాడబడుచే, నేటికి గ్రామ్య భాషాభిమానుల రచనల ద్వారమున ప్రచారమునకు వచ్చుచున్నవని తలచుచున్నాను. ఈ శబ్దములు తప్పుటర్థమున వాడుకయందున్న భాగమున వింతగా దోపక పోవచ్చును. కాని ఫారసీభాషా సంబంధము ఇంకను వీడకయున్న నిజాంరాష్ట్రములోని ఆంధ్ర జిల్లాలలో ఇట్టి శబ్దముల ప్రయోగము వైచిత్ర్యమును కోలుపోవుటలేదు.

ఇప్పటి కాలమున ఆంధ్ర వాఙ్మయమున ప్రవేశించుచున్న గ్రామ్య భాషా రచనలన్నియు విశేషముగ గోదావరి జిల్లా, కృష్ణా జిల్లాలలోని జనుల వాడుక భాషయందలి ప్రయోగములు కలవై యున్నవి, కొన్ని ప్రయోగములు విశాఖపట్టణము జిల్లావి కూడా అప్పుడప్పుడు వచ్చుచుండుట కానబడుచున్నది. దత్తమండల వాసులగు ఆంధ్ర సోదరులకీ వాడుకభాష యెట్లు రచించుచున్నదో తెలిసికొనజాలను, కాని నిజాం రాష్ట్రములోని తెలుగు జిల్లాలలో మాత్రము ఈ ప్రయోగములు నూతనములు ఇక్కడ ఈ రచన వాడుకభాషగా మాత్రము కాన్పింపదు ఉదా ,,పోవాలి రావాలి,, అని గాని ,,చెప్పు'' అని గాని ,,వస్తోంది'' అనిగాని పెట్టకూడదు ,,ట్రా అని గాని ,ఇరవై చేసానూ?,, అని గాని ,,కూచుని ,అని గాని, ,ఉన్నాయి, అనిగాని 'ఉంది, అనిగాని ,గౌరమ్మని, లేక ,సీతమ్మకి, అనిగాని బుల్నాయు అనిగాని వాడుక భాషలో ఎవరును ఈప్రాంతములలో వాడుచున్నట్లు కానరాదు. ఇట్టి స్థితులలో ప్రస్తుతము గ్రామ భాషలో వ్రాయబడుచున్న వ్యాసములు, కథలు. ఈ రాష్ట్రములోని వారికి క్రొత్త భాషగా స్ఫురించుచున్న దనుటలో ఆశ్చర్యమేమి?

అట్లయినచో, మన రాష్ట్రములోని యాంధ్రుల వాడుక భాష యనునదొకటి గ్రాంధిక భాషకు కొంతవరకు భిన్నమైనది. ఉన్నదా, లేదా; యని యాలోచించిన పక్షమున ఉన్నది, యనియే జవాబు చెప్పవలసి వచ్చుచున్నది. అయినను, ఈ రాష్ట్రమువారి వాడుక భాషకు గోదావరి జిల్లాలోని వాడుకభాషకు చాల భేదమున్నదను విషయము మాత్రము అంగీకరింపక తప్పదు. ఉత్తర సర్కారులవారు నిజాం రాష్ట్రములోని జిల్లాలందు సంచరించుట సంభవించిన పక్షమున వారికీ భేదము పూర్తిగా బోధపడగలదు. ఈ రాష్ట్రమునందయినను ఉత్తమ తరగతుల వారు మాట్లాడుభాష అన్ని ప్రాంతములలో ఒక విధముగా లేదు. మహారాష్ట్ర దేశపు సరిహద్దులలో నున్న నిజామాబాదు, ఆదిలాబాదు జిల్లాల భాష మహారాష్ట్ర ప్రయోగములతోను, సగము మహారాష్ట్రముగా మార్పబడిన అపభ్రంశములగు తెలుగు శబ్దములతోను, మహారాష్ట్ర జాతీయముల యొక్కయు, సామెతల యొక్కయు భాషాంతరీకరణములతోను నిండియుండును. ఉదాహరణారము:—

,,ఇదే ప్రమాయ్ రెండు దిన్సలు అయ్, సాలెకుపోవు. నీకు సదువు ఎప్పుడి తోడమే వున్నది? ఇదేమి దైవము!''

,ఏన్గుసాంగడము రేదిరా? కాకను మావుళి భేటీ కాలేదు.'

ఇక మహబూబు నగరము, అత్రాబపుబల్దా జిల్లాలలోని కొంత భాగము కర్ణాటక జిల్లాల సరిహద్దులందున్నది. అచ్చటి భాష కన్నడములో కలసి, కన్నడధ్వని కలదై అచ్చటి జాతీయములతో గూడి యుండును. ఉదాహరణార్థము;

,,మాసణ్ణ పిల్లకు పెసరబేడలు పట్టవు. ధొడ్డపిల్లిచే కైనంత తిండది''

ఇక సర్కారువారి కార్యాలయములలో ముఖ్యముగా తాలూకా కచేరీలో, వాడబడుభాష ఉర్దూభాషతో కలిసి ఎంతో విచిత్రముగా నుండును. ఇదియు విశేషముగా ఉత్తమ తరగతులవారి భాషయని చెప్పట తర్కముకు అంతగా దూరముకాదు. ఉదాహరణార్థము.

,,యీమొకద్దమాలో చలాయించిన కార్యవాయి సాలింజాలీది. సాహెబు జిలా జారోమోఖ్ఖాకుపోయి, తనఖ్ఖీచేసి తహరీరు చేసినాడుగదాక, దరఖాస్తు గుజారు, దావా బిల్కులు నాజాయజు వున్నది. అయిందాయీతార్న కారవాయిచేసిన సూరతులో మాఖూలు తదారుకు చేయటంకాగలదు. ఫఖ్తు. మర్కూం ఛంచు పదహారో ఖుర్దాదు సన్ తేరాసౌ బారా ఫసలి''

వరంగల్లు జిల్లాలోని మధిర తాలూకాయందు సరిహద్దునందున్న కృష్ణాజిల్లావారిభాష వాడుకయందున్నదని చెప్పవచ్చును. ఆట్లే రాయచూరు జిల్లాలోని అలంపూరు ప్రాంతము దత్త మండలముల కంటియున్నందున అ ప్రాంతములవారిభాష దత్తమండలములవారి భాషవంటిదిగనే యుండుట సహజము. ఇవి పోగా మిగిలిన ఆంధ్ర ప్రాంతములందలి భాషయు గోదావరీ కృష్ణాజిల్లాలలోని భాషవంటిదికాదు. ఎంతో భిన్నముగా నున్నది. ఈ ప్రాంతములలోని వాడుక భాషయందు ఆంధ్రదేశమందలి ఏయితర భాగములలోను వాడబడని అచ్చుతెనుగు మారు మూలపదములు కానవచ్చును. వాని నన్నిటిని వివరించుటను గ్రంథవిస్తర భీతిచే మానుచున్నాను.

పై యంశములను దృష్టియందుంచి చూచినచో, మన రాష్ట్రమునందు గ్రామ్యభాషారచనకు ఎట్టిస్థానముండదగును? గ్రామ్యభాషను వాడుటయే తప్పనివిధియైనచో ఏస్వరూపమును ప్రయోగములోనికి దెచ్చుట ఉచితము! మన రాష్ట్రములో నిప్పుడున్న వివిధ స్వరూపములను వదలి విద్యావంతులగు ఉత్తర సర్కారులందున్న ఆంధ్రుల వాడుకభాషనే మనము వాడుదమా? అట్లైనచో గ్రాంధికభాష యొకటియుండ, మనరాష్ట్రములోన వాడుక భాషలు వివిధవిశేషములను దాల్చినవియుండ, ఈ క్రొత్త తెనుగును మనము నేర్చుకొనుటఆవసరమా? గ్రామ్యభాషయొక్క తత్త్వమునుబట్టి చూచినచో క్రొత్తభాషను నేర్చుకొనుట కాదుకదా? గ్రాంధిభాష కఠినము కనుక జనులకు తెలియువాడుక భాషలోనే గ్రంథరచనము జరుగవలయుననియే కదా మన గ్రామ్య భాషాభిమానులగు సోదరుల యుద్దేశము? కనుక ముందు మనరాష్ట్రమువారే పద్ధతినవలంబింపవలనియుందురు? ఈ సమస్యను ఆంధ్రభాషావ్యాప్తిని గోరు నిజాంరాష్ట్రవాసులు చక్కగ నాలోచించుట యుక్తము. పత్రికలకు వ్రాయువారైనను, ఏదేని యొక సూత్రమును దృష్టియందుంచి దాని కనుగుణ్యముగా రచించుట ఉపయోగకరముగ నుండును. కాని చేతికివచ్చినట్లువ్రాసి, నోటికి వచ్చినట్లు భాషించినచో, భాషాభిమానము, పఠనాశక్తి యిప్పుడిప్పుడే కొంచెము కొంచెముగా నారంభమైన ఈ ప్రాంతములవారిని చిక్కులందు బడవేసిన వారమగుదు మేమోయని సందేహించుచున్నాను. దేశసోదరులందు ఆలోచన జరుగుగాక!



# రైతులు—విద్యావంతులు

శ్రీయుత కొ. పద్మనాభ అయ్యంగారు

ఈ వ్యాసములో రైతుల నుద్బోధించక విద్యాధికుల సంబోధింపఁ బూనినందుకు నన్ను మన్నింతురుగాక. ఇటులఁ జేయుటకు నాకుఁ గారణము లేకపోలేదు. రైతులు ప్రాయికముగ విద్యాహీనులు, పామరులు, చెప్పినసంగతిని సులభముగ గ్రహించగల శక్తి వారికి లేదు. కావుననే లోకములో నెందఱో మతప్రవక్తలు జనుల నుద్బోధించుటలో తీక్ష్ణబుద్ధుల సంబోధించిరేగాని మందబుద్ధుల సంబోధించ లేదు. లోకములో నెందఱో సాంఘికోపన్యాసముల నిచ్చుచున్నారు. వీరు కుశాగ్రబుద్ధుల సభచేసి యుపన్యసించిరేగాని మందమతుల ప్రబోధింపఁ బూనుకొనలేదు. ఇటులనే ఎన్నెన్నో కమిషనులు, కమిటీలు, కాంగ్రెసులు, కాన్ఫరెన్సులు, కాంగ్రిగేషన్లు, కన్వెన్షనులు, మొదలగు సభలన్నియు జదువుకొన్నవారినే యుద్బోధించుచున్నవి. లోకములో నింతవఱకు నేను మహాప్రవక్తయుఁ జేయ సాహసింపని పనిని నేను బూనుకొనుట తగునా? నేనంత శక్తిమంతుడను గాను. కాననే యీవిషయములో విద్యావంతుల సహాయమును గోరుచున్నాము. ఈసహాయమును జేయుఁడు.

2. వ్యవసాయ శాఖవారుండఁగ మనమేల నీపనికిఁ బూనుకొనవలయునని యనకుఁడు. వ్యవసాయశాఖ చాల మితసంఖ్యగల సిబ్బంది గలది. ఈకొద్దిమంది యీరాజ్యములోని 70 లక్షల వ్యవసాయకుల నుద్బోధించుటెట్లు? పత్రికల మూలమున నేర్పుదమన్నను, వీరు చదువనేర్చినవారు కారే! విద్యావంతులు నాగలిపట్టి నేర్వ నవసరములేదు. వ్యవసాయశాస్త్రనిపుణులు ఉపన్యాసముల మూలమునను, పత్రికల మూలమునను, తెలుపగలవ్యవసాయ సాంప్రదాయములను, వాని తత్వములను, ఆర్థికసూత్రములను ముందుగ గ్రహించి రైతులనాప్రకారము చేయునటుల నుద్బోధించుటలో తోడుపడుదురేని యీకార్యము కడుత్వరితముగను జయప్రదముగను నెరవేరును.

ప్రతిగ్రామములోను గొందఱు చదువఁగలవారుండక పోరు. వీరలకు వారివారి గ్రామములలో పలుకుబడి ఎక్కువ. రహబర్ మజారయిత్‌లోను, ముఫీదుల్ మజారయిత్‌లోను ఇతర పత్రికలలోను వెలువడుచుండు వ్యవసాయ సంబంధములగు వ్యాసములను తమ తీరుబడి కాలములో గ్రామములలోని రైతులకు బోధించ బూనుకొందురేని ప్రతిగ్రామమున నొక

వ్యవసాయ శాఖ యుండిన నెంతపని చేయగలదో అంతకంటె నధికముగ పని చేయఁగలుగుదురు. వారి పలుకుబడియు వృద్ధి యగును.

3. రైతులకు మనమేల సహాయము చేయవలయు నని యనకుడు. కాలిలో ముల్లుగ్రుచ్చుకొనినయెడల నాముల్లు తీయఁబడువఱకు దేహములోని ప్రతిభాగమును కాలునకు సహాయపడుట లేదా? ఒక కుటుంబములో సంపాదించువాఁడు జబ్బుపడునెడల కుటుంబములోనివారందఱు ఆరోగి బాగుపడుటకై ఎంతశ్రమ తీసుకొననదియు అందఱకు వ్యక్తమేగదా? అటులనే దేశమను కుటుంబములో నేతరగతివైనను హీనస్థితియం దుండునెడల దక్కిన తరగతులవారందఱు నా హీనతరగతివారిని బాగుపరచుట కర్తవ్యముగాదా? అందుచేత మనకాహారము పొందించుచుండు తరగతి వారిని శక్తివంతులఁ జేయవలసిన విషయమై విద్యాసంపన్నులకు నొక్కి చెప్పవలయునా? దేశము దేహము వంటిది. అందులో నేభాగము వృద్ధిఁ బడకున్నను దేహమునకు వలె దేశమునకును నష్టమే.

4. రైతులకు విద్యావంతులు చేయఁగలుగు సహాయము మన రైతులకు విద్య లేనందున వారు గుడ్డివారి వంటివారు. గుడ్డివారిని సులభముగ మోసపుచ్చగలుగు విధమున కొందఱు స్వార్థపరులగు విజ్ఞానవంతులు వారి నన్నివిధముల మోసముచేసి తాము దోచుకొనుటయే గాక, బందిపోటు వారికి దొంగలు సహాయపడు రీతి ఇతర దేశములు కూడ వీరిని కొల్లగొట్టునటుల సహాయపడు చున్నారు. వీరికి దోచుకొన వలయునను ఉద్దేశము లేకున్నను ఫలితమటులనే పరిణమించు చున్నది. మన రైతులెటుల దోచుకొనఁ బడుచున్నదియు, దానివల్ల దేశమెటుల క్షీణత నొందుచున్నదియు, అంకెల (statistics) సేకరించవలసిన ఆవశ్యకతను గురించియు, విద్యావంతులు దేశక్షీణత నెటుల నాపఁ గలుగుదురో అందు విషయమును గురించియు, కొంత గోల్కొండ పత్రిక మూలమున విద్యావంతులకు విన్నవించుకొనఁ బడెను. వానినిట మరల వివరించుట కాలహరణము గాన, దాని నుడువక విరమించు చున్నాను.

ఆపత్రికలో పేర్కొనఁ బడని సంగతులఁ గొన్నినిటఁ బొందుపరచెదను. రైతులు విద్యావంతులు కాకపోవుటచే రైలు మార్గములు, బాటలు, తపాలు, తంతి మొదలైనవి వారికి లాభకరము లగుటకు మారుగ, వారిని గొల్లగొట్టుటకు స్వప్రయోజన పరులగు కొందఱు విజ్ఞానవంతుల కుపయుక్తము లగుచున్నవి. రైతుల వలన మనము ఆహార పదార్థములను ఇతర సౌకర్యములను బొంది వానికిఁ దగిన ప్రతిఫలము వారికిఁ జెందునటులఁ జేయక పోవుటచే వారికి ద్రోహ మొనర్చువారమగుట అటుండనిండు. మన రైతులు కష్టపడి సిద్ధముచేయు ఆహారాది పదార్థములను ఇతర దేశస్థులు పొందునటులఁ జేసి వానికిఁ దగిన ప్రతిఫలము మన రైతులు బొందుటకుఁ దగు సదుపాయములు (అనగా విజ్ఞానము ఆర్థికవిద్య మొదలగునవి) వారికిఁ గలుగఁజేయనందున మనము బందిపోటు దొంగలకు దేశమును దోచుకొనుటలో సహాయము చేసినట్లుగ లేదా? ఇది దేశద్రోహము కాదా? ఇటులఁ జేయుట మన వెనుకటి సంతతి వారిని దౌర్భాగ్యులఁ జేయుట కాదా? కాన రైతు లేవిధమునను నష్టపడకుండు నటులను, వారు లాభమును పొంది అభివృద్ధి యగునటులను వారికిఁ దగిన



వ్యవసాయ కళాభవనము (పూనా)



సింధీ ఆవు (పూనా)

విజ్ఞానమును బొందించుట విద్యావంతుల కర్తవ్యము.

5. రైతుల విజ్ఞానవంతులఁజేయు విధానము, మనమెల్లప్పుడును రైతులకు అవసరమైన విషయములను దెలుపుచు వారిని కనిపెట్టుకొని యుండలేము. బలహీనులను మనము సహాపోషించు చుండుట కంటె, వారిని తమకు తామే పోషించుకొనఁ గలుగునటుల శక్తివంతులఁ జేయుట సంభావ్యము. కాన వారిని విజ్ఞానవంతులఁ జేయుటకు వారికి వ్యవసాయ విద్యయు ఆర్థిక విద్యయుశాస్త్ర రీతిఁగాఁ గఱపఁ బడవలయు. దేహమును మెదడును బిగుసు పారిన పెద్దవాండ్రకీ విద్యను నేర్పుటకంటె, వారి పిల్ల వాండ్ర కీవిద్య నేర్పిన యెడల, సులభముగను శాశ్వతముగను పట్టుపడును. కాన నీవిద్యల నన్ని గ్రామములయందు పాఠశాలలలోను నేర్పఁ బడునటులఁ జేయవలయును. విద్యావిషయములో మన సర్కారువారు సంవత్సరమున కిపుడే 70 లక్షల రూప్యముల వఱకు వ్యయము చేయుచున్నారే. ఇంతకంటెనధికముగ ఖర్చుపెట్టగలరా అని యనకూడు. తగిన కృషి సలిపిన యెడల నీ మొత్తములో ననే మనకుఁ గల కోరికలన్నియు నీడేరగలవు. ఇప్పుడుండు విద్యావిధానము పరాన్న భుక్కులగు మేలుతరగతి వారికి మాత్రమే అనుకూలముగఁ జేయబడినది. బ్రిటిషు ఇండియాలో జరుపఁ బడుచున్న సాంప్రదాయమున కిది యొక నకలు గాని దేశావసరముఁ బట్టి యేర్పర్చబడిన విధానముగాదు. ఈ విధానము వలన సర్కారి యుద్యోగములకు గుమాస్తాలు తయారు చేయఁబడుదురే గాని దేశోన్నతికి నాధార భూతులగు సాంకేతిక విద్యల నేర్చిన పారిశ్రామికులు తయారు చేయఁబడుటలేదు. ఈ రాజ్యములోని 125 లక్షుల జనులలో, 70 లక్షలు వ్యవసాయ వృత్తియు, 18 లక్షలు చేతిపనులును, 13 లక్షలు వర్తకమును జేయువారు. అందఱికంటె గొప్ప సంఖ్యగల వ్యవసాయవృత్తి వాండ్రకు వ్యవసాయ శాస్త్రమును నేర్పు పాఠశాల యొకటి యైనను లేదు. వ్యవసాయమువల్లను, పరిశ్రమల వల్లను, వర్తకము వల్లనే గదా దేశ సమృద్ధవంతమగును. ఇవియే గదా సకల జనులకు అన్నవస్త్రముల నిచ్చుచున్నవి. ఇవియే గదా సర్కారువారి రాజడికిని పరిపాలనకును ఆధారములు. ప్రభుత్వ శాఖలలో నీ విషయమై గమనించువారు గాని ఈ విషయమై తగు శ్రద్ధతీసి కొనువారు గాని లేరు. వ్యవసాయ పారిశ్రామిక, సాంకేతికాది పాఠశాలలను ప్రత్యేకముగా ప్రతి గ్రామమునను నెలకొల్పుట సర్కారువారికి భారమే. కాని ఇప్పుడుండు పరితి ప్రాథమిక మాధ్యమిక పాఠశాలయందు ప్రతి తరగతిలోను, పిల్లి, ఎలుక, చిలుక మొదలగు పాఠములవంటి పాఠములు గల 1,2,3,4,5 వాచక పుస్తకములకు బదులు, వ్యవసాయిక, పారిశ్రామిక, ఆర్థిక సంబంధములైన తేలికపాఠములు గల వాచక పుస్తకములను ఆయా ప్రదేశము లందలి బాల బాలికల వృత్తులకు తగినట్టు చదివించఁ బడుచు దేహపరిశ్రమ కాలమపుడు ప్రతి బాలునకును, ప్రతి బాలికకును వారి వారి వృత్తికి సంబంధమైన పరిశ్రమను వ్యాయామ మునకు బదులు చేయించిన, చిన్నతనమునుండియే అభ్యాసము గలిగి ఆయా వృత్తులలో వారికి ఆసక్తి యేర్పడి నిపుణు లయ్యెదరు. ప్రత్యేక పాఠశాలల అవశ్యమును ఉండదు. ఖర్చును ఉండదు. వీరికి (Advanced Course) గాను కేంద్రస్థానములలో ఆయా వృత్తులకు సంబంధించిన ఉన్నత విద్యాశాలల స్థాపించ వచ్చును. ఈ విధానము పంజాబు, జ

పాను, ఫిలిప్పైను దీవులు, అమెరికా సంయుక్త రాష్ట్రములు మొదలగు చోట్ల నాచరించఁ బడుచున్నది ఈ విషయమై ప్రభుత్వమువారి నుద్బోధించవలసినది. విద్యావంతుల కర్తవ్యము. ఇప్పుడుండు విద్యావిధానమే జరుగనిచ్చిన యెడల పరిశ్రమలు క్షీణించుకొలఁది కేవలము గుమాస్తాపనులకుఁ దగిన విద్యావంతులు మితమునకు మించి వృద్ధియై పనులు దొరకక "యాచకస్య యాచకశ్శత్రుః" అనునట్లు పోటా పోటీలు జాస్తియై, జీవయాత్ర గడువక, తుదకు అంతః కలహములకుఁ గారణ భూతులగుదురు. అన్ని వృత్తులు నేర్పఁబడిన యెడ, దేశములోని ప్రజలకందఱకుఁ జాలినంత పని కలిగి దేశమును, జనులును అభ్యున్నతికి రాఁ గలుగుదురు.

6. విద్యార్థికులు దేశమును విజ్ఞానమతముగావించుటలోఁగల నొక లోపము :- దేశములోని జనులలో విద్యాసక్తిని గలిగించుటలోను, విజ్ఞానపు సారమును గావించుట యందును విద్యాభివృద్ధికై పాటుపడుట యందును, సంఘ ప్రబోధము నందును, ప్రభుత్వము వారికిఁ తోడ్పడుచుండు శ్రీయుతులు మా. హనుమంతరావు ప్రభృతులును, దేశపత్రికలును చేయుచుండు కార్యములను దలఁచుకొను నపుడెల్లను నాకు సంతోష ముప్పొంగుచుండును. వీరు చేయు దేశసేవలో శతాంశమైనను నేను చేయలేనందులకు నాకు చింతకలుగు చుండును. ఇందులో నొక కొఱఁత యున్నదని విన్నవించు కొనుటకు నాకనుజ్ఞనీయ వేడెదను.

లోక చరిత్రను గమనింతురేని బాబిలోని యా చీనాదేశము పురాతన హిందూదేశము అరేబియా, గ్రీసు, రోము మొదలగు దేశములు ఆయా కాలములలో నితర దేశములలో సామాన్యముగ లేని యేదో యొక క్రొత్త విధమగు విజ్ఞానము నలవరించుకొని దానిమూలమున నితర దేశములమించి ఆయా విజ్ఞానములలో పోటీ చేయలేని దేశములు క్షీణించు కొలఁది నివి యభివృద్ధికి వచ్చినవని తెలియఁగలదు. అటులనే మన దేశ మిపుడు నష్టపడుచు, అది నష్టపడు కొలఁది యితర దేశములు వృద్ధియగుచుండుట మనయందలి యొక విధమైన విజ్ఞానలోపమే. దేశసభలును పత్రికలును కేవలము సారస్వత (సాహిత్య (Literature) విజ్ఞాన విషయమై వాపోవుచున్నవే గాని వ్యవసాయము, పరిశ్రమలు, ఆర్థికములు మొదలగు శాస్త్రీయ (Scientific) విషయములఁ జర్చించు సభలుగాని పత్రికా వ్యాసములుగాని అంతఁగాఁ గానరావు. ఈ విజ్ఞాన లోపము వలన దేశములోని మూలద్రవ్యము తఱుగుచుండుటయే గాక ఏటికి ఏడు భూసారము ను తగ్గిపోవుచున్నది. ప్రతివస్తువునకును, ఇతర దేశములపై నాధారపడవలసి వచ్చుచున్నది. కాన విద్యార్థికులును, పత్రికాధిపతులును, ఈ సంబంధమలైన కొంత విజ్ఞానమును వ్యవసాయ శాఖవారి మూలమునను వ్యవసాయ పుస్తకముల మూలమునను, వ్యవసాయ నిపుణుల మూలమునను గ్రహించి, పత్రికల మూలమునను, సభల మూలమునను ప్రజలను ప్రభుత్వమును నుద్బోధించి దేశపతనమును అరికట్టి దేశాభ్యున్నతికిఁ దోడ్పడుదురని ప్రార్థన.

7. భూసారము తగ్గుటకుఁ గారణము, దాని నరికట్టు నుపాయము. లొకటిరెండు చర్చించి యీ వ్యాసము నింకటితో ముగించెదను. మన దేశమునుండి ఎగుమతి చేయఁబడు సామానులకుఁ దగిన ప్రతిఫలము మనకుఁ జెందక దేశ మెల్లగ నష్టపడు చుండుటయు ఈ విషయమైన

అంకెల (Statistics) సేకరించి నష్టము నావుటలో ప్రభుత్వమువారికిఁ దోడ్పడు విధమును గురించియు గోలకొండ పత్రికలో వివరింపఁబడియుండెను. ఇట మఱికొన్ని యుదాహరణార్థము వివరింపఁ బడును.

భూమి చదురముగ నుండకుండిన వర్షము పడినతోడనే నీరంతయు భూమిపై పైననే పారి, పైనుండు మెత్తని మన్నును, ఎరువును, వ్యవసాయకులకుఁ జాల ముఖ్యములగు జీవాణువులును, వాని బీజములును, అవి సేకరించిన భూసారమును నీటితోఁ గొట్టుకొనిపోవును. నీరు నిలువని తావున నుండు పైరు నీరుచాలక నెండిపోవును. నీరు జాస్తియై నిలిచియుండు పల్లపు ప్రదేశమున పైరు వేలిపోవును. కాన భూమిని చదురము జేసి వర్షపు నీరు పారిపోకుండునట్లు చుట్టు వరిమళ్ళకువలె వరముల వేయించిన యెడల భూసారమును జీవాణువులును యేటికి యేఁడువృద్ధియై భూమి రానురాను సస్యవంత మగుచుండును.

వ్యవసాయకులకు కట్టె నాగండ్ల వాడుటలో విశేషనష్టము గలుగుచున్నది. తరి నేలలకు (Meston) నాగలివంటి నాగలియు ఖుష్కి నేలలకు (Monsoon) నాగండ్లవంటి నాగండ్లను వాడినయెడ మూఁడంతల పని నెరవేరి, మూఁడంతల కాలమును మూఁడంతల ఖర్చును కలసివచ్చును. లోపలివున్న పైకిఁ దేఁబడి ఎండగాలి తగులుట వలన నధిక సారవంత మగును.

కాయధాన్యములలో నత్రజని నూటికి మూఁడువంతునను, తృణధాన్యములలో నూటికి ఒక భాగమునుపచ్చి పేడ, గడ్డి, చొప్ప, పచ్చియాకు ఎరువు, మొదలగు వానిలో వేయింటికి మూఁడు పాళ్ళును ఆముదపుపిండి, గానుగపిండి మొదలగువానిలో నూటికి అయిదుపాళ్ళును ఎముకలలో నూటికి మూఁడుపాళ్లును ఔరుప్పు (Nitrate of potash saltpetre) లో నూటికి పదిపాళ్ళును (Sodium Nitrate) సోడియం నైట్రేటులో నూటికి పదునైదు పాళ్ళును (Ammonium Sulphate) అమ్మోనియం సల్ఫేటు లో నూటికి యిరువది పాళ్ళును గలదని అందాజాగ లెక్కవేసికొని ఎరువుల వాడుటలో మీలాభనష్టముల గణించగలరు. కృత్రిమ ఎరువులకంటెను, స్వభావ సిద్ధములైన ఎరువులే భూమిని సారవంతము చేయుటలో శ్రేష్ఠములైన వనియు, మిక్కిలి చౌకయైనవనియు భూమికి నష్టము తేకుండునవి యనియు గ్రహించునది.

దేశమునుండి దూది, చక్కెర, క్రొవ్వు పలువిధములగు నూనెలు, బొగ్గు, కట్టెలు ఇట్టి [Carbo hydrates and hydro carbons] ఉష్ణ దాయకములగు సామానులెంత మెగుమతి యైనను భూసారమునకు నష్టము లేదు. ఇవి కేవలము ఉష్ణమును బుట్టించు పదార్థములు. వృక్షవర్గము, దానికిఁ గావలయు వరకు ఉష్ణమును సూర్యాతపమునుండి గ్రహించఁ గలదు. కండ బుట్టించు పదార్థములును(Proteins and albuminoids)ఎముకలను బుట్టించు పదార్థములును [Phosphates] అట్టివి గావు అవి దేశమును విడిచి పోయిన భూమి మిగుల బలహీనమగును. కాని, ఎముకలును, గోధుమవంటి ధాన్యములును, పప్పు దినుసులును, నూనెగింజలును గానుగపిండి ఆముదపు పిండి మొదలగు వస్తువులును దేశమునకు వచ్చు విధము మిక్కిలియు కష్టము గనుకను ఒకవేళ వచ్చినను వాని నితర దేశముల కంపినందువలన మనకు వచ్చు వెలకంటె మిక్కిలి యధికమైన వెల ముల్ల తెప్పించుకొనుట

కివ్వవలసి వచ్చుచుండుట చేతను మనకుఁ జాలన ష్టము కలుగును. కాన నిట్టి సరకుల నెగుమతి ని నిరోధించుటకుఁ దగిన సుంకముల విధించున టుల ప్రభుత్వము వారిని గోరవలయును.

ఒక రైతున కిక్కడ నొకయకరము, అక్కడ రెండు యకరములు ఇటుల నుండుటచే భూమిని సేద్యము చేయుటలోను కాపుదలఁ జేయుటలోను విచారించుకొనుటలోను మిక్కిలి వ్యయ ప్రయాసములు కలుగుచుండును. ఇటుల నతని కుటుంబము సంవత్సరమంతయుఁ గష్ట పడినను ఆభూమిలోవచ్చు పంట ఆకుటుంబమునకే చాలదు. ఒక కుటుంబము సుఖముగ జీవించుటకు కనీసము యెనిమిది యకరముల తరి నేలగాని 16-20 యకరముల ఖుష్కి నేలగావి కావలసి యుండును. కనుక భూమిని ఈ విస్తీర్ణముకంటెఁ జిన్న చిన్న విగఁ జేసిన వ్యవసాయకునకును, దేశమునకును, నష్టముగాన, నీవిస్తీర్ణముకంటె జిన్నచిన్న భిన్నములుగఁ జేయఁ బడకుండు నటుల శాసనములఁ జేయించవలయును. ఇతర దేశములలో నిట్టి యేర్పాటు లిదివరకే జరిగి పోయినవి. బ్రిటిషు ఇండియాలోను చేయఁబడుటకు ప్రయత్నములు జరుగుచున్నవి.

భూముల పడావు పెట్టుట:— దేశములోఁ జాలమందికి తాము సాగుఁజేయఁగల విస్తీర్ణమునకంటె, జాస్తి భూమియున్నది. దానికి దండుగ శిస్తు యిచ్చుచుండురేగాని దానిని ఉపయోగమునకుఁ దెచ్చుటలేదు. భూమిలోఁ బంటలు పండిన భూమి ఖామందునకే గాక, దేశమునకంతయు లాభకరమై ధరలు చౌకయగును. భూమిమీఁద చెట్లయిన నున్నయెడల ఉష్ణము తగ్గి దేశమంతయు సౌఖ్యపడును. వంటచెరుకు కట్టెలు కలప చౌకమై దేశమునకంతే లాభ యకమగును. కాన భూమిని పడావు పుంచిన, భూమి కామందు వద్దనుండి శిస్తును మాత్రమే గాక, పడావు పెట్టకుండునటుల శిక్షయుఁ గూడ విధించిన దేశము వృద్ధికి వచ్చును.

ఇతర నాగరక దేశములలోఁ జెట్లను అడవులను వృద్ధిఁజేయు చుండగా మన దేశములో ఉన్న చెట్లను సహితము తాత్కాలిక లాభము కొరకు నాశనము చేయుచున్నారు. అందువలన సూర్యోష్ణమును గ్రహించుటకుఁ జాలినన్ని వృక్షములు లేక ఎండవేడిమి అతిశయించి, దేశము అనేక రోగములకుఁ దావిచ్చు చున్నది. వర్షములు జక్కగఁ గురియక కాలక్రమమున దేశము సహారా ఎడారిగ మారుచున్నది. నీరు పైపైననే ప్రవహించుటచే భూమిలో దిగక ఊటలు ఎండిపోయి త్రాగుటకు సహితము నీరులేక, దేశములోఁ బహుభాగములు పరితపించు చున్నవి. ఇవిగాక ఎండలవలన గలుగు నీరసజాడ్యములను శమింపఁ జేయుటకు ఫరసములు మిగుల నుపయోగము అట్టి ఫలవృక్షములను బైరుజేయుట తగ్గిపోయినందున పండ్లను బైటి దేశములనుండి ప్రతియేడుఁ దెప్పించవలసి వచ్చుచున్నది. కాన దేశములో ఫలవృక్షములను ఇతర వృక్షములను పెంచునటుల జనుల ప్రోత్సహించుటకుఁ దగిన శాసనములఁ జేయునటుల ప్రభుత్వము వారిని గోరవలయును.

ఇప్పటికే చాలకాల మతీతమైనందున నిందుతో విరమించు చున్నాను. తక్కినవి పత్రికల మూలములమున విన్నవించుకొనెదను. ఇఁక నైనను వ్యవసాయ విషయములలో విద్యావంతులు తగినశ్రద్ధను వహింతురా?



వ్యవసాయ ప్రదర్శనస్థలము (పూనా)



పశువుల కొట్టములు (పూనా)



వాములు (పూనా)



అపోలో బందరు (బొంబాయి)




# సౌగంధి

ఆదిరాజు వీరభద్రరావు గారు

౧



సౌగంధి చక్కని యువతి, అవివాహిత. సత్కుటుంబమునందు జనించినది. ఆమె తలిదండ్రులు చిన్నతనముననే కీర్తిశేషులైనందున, పిఠాపురము మహారాజా వారి యనాథ శరణాలయమున పెరిగినది. తత్కారణముననామె బ్రాహ్మమతసారముసుగ్రోలి సంస్కార ప్రియురాలైయుండెను. అచ్చటనే చక్కని విద్యనుగూడ గడించినది. శ్రీ మహారాజా వారు దయచేసిన పారితోషికముతో నామె ద్రాక్షారామమునందు నివాస మేర్పరచికొని స్వయంకృషిచే జీవనముచేయుచున్నది.

ద్రాక్షారామమునం దామె గృహము ఒకానొక మూలమలుపున నుండెను. వివిధకుసుమ లతాఫల భరితమగు సుందరోద్యానము మధ్య నామె చిన్న కుటీరము గలదు

వసంతఋతువునం దొకనాఁటి సాయంకాలము హాలులోని మేజాబల్లను తన తోఁటలోని గున్నమామిడి క్రిందఁ బెట్టి యామె యచ్చట నుపహారము బుచ్చుకొన నుద్యమించెను. తనయ పాత్ర [illegible] మేజా బల్లపై నుండెను. ఆమె గృహములోనుండి భోజన పదార్థములు తెచ్చువరకు సుందరుఁడగు నొక యువకుడు బల్లదగ్గ కూర్చుండియుండెను. అతఁడు చాలదూరము మోటరుసైకిలు మీఁద ప్రయాణముచేసిబడలియున్నట్లును, పిపాసాతురుఁడై యున్నట్లును గనఁబడుచుండెను.

వానిఁజూడఁగనే సౌగంధి నిశ్చేష్టురాలయ్యెను. ఏమి మాటాడుటకును దోఁచలేదు ఆమె యేమిచేయగలదు? ఎవ్వరేమి చేయగలరు?

ఫలహారము తెచ్చినావా? చాల సంతోషము. నిజముగా నీవీనాఁడు ఒక యువకుని ప్రాణమును గాపాడినావు” అని యాయువకుఁడు పలికెను.

ఆమె యేమియుఁ బలుకలేదు. అతఁడు పిచ్చివాఁడా? లేక యిది యొక తులువతనమా?

అతఁడిట్లు మాటాడసాఁగెను:

“బూకెలా! ఇదిచాల విచిత్రముగా నున్నదే? నాకుఁ గావలసిన దేదియో నీవు బాగుగ గ్రహించినటులున్నది. నీకు శ్రమయేల నేనే తేఁయగిన్నెలో పోసికొనెదనులే. అబ్బబ్బా! ఏమి రుచ్చి? ఏమియొండ! నీకు మిగుల కృతజ్ఞుఁడను”

అని యామె చేతిలోని పళ్లెరమును గైకొని బల్లపై నుంచెను. అతఁడు పిచ్చివానివలెఁ గనఁబడుటలేదు. అతని ప్రవర్తనయు హద్దుమీరిన వానిదిగా నుండియుండలేదు. ఇంతయేల. అతని సంభాషణము కాపట్యరహితముగను, స్వభావసిద్ధముగను నుండుటచే, ఆతనిది యవినయ దోషముగా భావించుటకు సౌగంధికిఁ గారణములు గనుపించలేదు. ఈ తోఁటలో పానీయము నొసంగఁబడునని యాతఁడు నిజముగా భావించియుండునా? ఆయూరిలో బాటసారులకు, పిపాసాతురులైన ప్రయాణీకులకు దాహశాంతి గావించు ప్రదేశము గలదు. జయరాముని తల్లి యింటియెదుట, గాలి యొడలఁ జెదిరిపోయిన యక్షరములలో నొక ప్రాతబల్ల

తేనీరు

బాటసారులకుఁ బ్రాణదాయిని అను కథలో నొకటి యుండియుండుట యామెకప్పుడు జ్ఞాపకమునకు వచ్చెను.

జయరాముఁడు మందమతియగు బాలుఁడు; కుంటి గుడ్డిము తోఁటపనియందు సౌగంధికి సహాయము చేయుచుండును.

"అదృష్టవశమున మీ యింటిముందరి బల్లచూచుట తటస్థించినది" అని పలుకుచు సుందరుఁడు ఉపహారములను మ్రింగసాఁగెను.

"బల్లా?" అని సౌగంధి యాశ్చర్యముతో నడిగెను.

"అవును, అచ్చట, ఆతోట ద్వారమునొద్ద," అని యాతఁడు తెలనాడించెను.

సౌగంధి తన విశాల నేత్రముల నొక్కమ్మడి యటువైపు ద్రిప్పిచూచెను. నిజమే! ఆద్వారములోపల గోడవెంబడి ఒక పాడుగాటి గడము, దానిపై నొక ప్రాతబల్లయు నుండెను. ఆబల్లపైనున్న వాక్యజాలము వీధివైపుండెను. అయినను దాని యర్థమును గూర్చి సంశయములేదు. అట్టిదే జయరాముని తల్లి యింటియెదుట నుండెను. ఎవ్వఁరుదాని నచ్చటఁ బెట్టియుందురు? ఎవఁడైన హాస్యగాఁడూరిలోనికి వచ్చి యుండలేదుగదా? అట్లెన్నడు గాజాలదు. బ్రాహ్మణుల వారలు వికట హాస్యములతో వినోదించువారు కారు.

ఇంతలో వాయువుత్సుకుఁడు ఆబూరెలను భుజించెను. తేనీరు త్రావెను. ఆ యాహారమువల్లనే యాతని ప్రాణము నిలిచినట్లు చూపట్టెను. అతనిని వదిలించుకొనుట కే యైనను జేయవలయును.

"నీవద్దికి చాలమంది బేరగాండ్రు వచ్చుచుందురా" అని యతడడిగెను.

"నా—నా వద్దకా?" యని యామె గొణిగెను.

"ఆదివారములందు మాత్రమే యనుకొనెదను." అని మాట ఏకొసగ మెల్లఁగ ననెను. ఆతడు తన దృక్కులను పుష్పఫల సమన్వితమగు నాసుందరోద్యానపు నల్దిక్కుల నొక్కసారి ప్రసరింపఁజేసి,

"ఓహో! ఏ చెట్టి సుందరవనము! నీకు దీనియందత్యధికమైన ప్రేమగలదా?"

"చూడండి, నేను—"

"సరే. సరే. నేను చాలదూరము పోవలయును జనులు అమృతమని, సుధయని యేమేమో పల్కుచుందురు. కాని నేనెప్పుడు వచ్చినను, తేనీరు బూరెలు మాత్రమే యొసంగుము. అందమైన మందిరము, ఆస్వాదయకరమయిన తేనీరు. దీనికంతయు నేనేమిచ్చుకొనవలయును."

"మీరేమియు నిచ్చుకొన నక్కరలేదు. ఇది పానీయములమ్ము గృహముకాదు." అని యామె చిరచిరను బలికెను.

"ఆఁ! ఏమి?"

"మీరు త్రాగినది నాకొఱకుఁ దెచ్చుకొన్న తేనీరు,"

"అనఁగా, నీవు తేనీరిచ్చుదానవు గావా?"

"నాకొఱకు మాత్రమే."

"అయితే—ఆబల్ల—"

"ఎవరో హాస్యమునకు దాని నచ్చటఁ బెట్టియుందురు. ఎవరు పెట్టియుందురో నే నూహింప జాలకున్నాను. నిజముగా జయరాముఁడట్టి పని చేసియుండఁడు"

"జయరాముఁడా జయరాముఁడు బొర్రకడుపు, బూరెలవంటి బుగ్గలుగలిగి, విచిత్రముగానుండు బాలుఁడే నా?"

„అవును. వాఁడు అప్పుడప్పుడు నాతోఁటలోఁ బని చేయుచుండును. వాఁడొక యమాయకుఁడు”

„అమాయకుఁడా’ కపటివేషమ. నేను గ్రామము లోనికి వచ్చుచుండఁగాఁ దారసించినది వానినే కాఁబో లు” వాఁడే నాకిక్కడ తేనీరు దొరుఁకగలదని సలహా చెప్పినాఁడు. నాకు చాల విచారముగా నున్నది. అయితే నేనేమిశేయుదు? బల్ల వ్రేలాడుచుండెను. ఇచ్చట బల్ల మీద తేనీరుపాత్రె యుండెను. ఈ కలవు కాలములో చాలమంది స్త్రీలు—”

సౌగంధికి నవ్వువచ్చెను.

„పూటమాలి పెద్దమ్మగా నన్ను మీరు భావించి నందులకు నాకుఁ గోపములేదు. మీమాటల భావమంత యేనా? నాకావశ్యకమయిన యెడల, నట్టిస్థితి యవలం బించుటకు నేనెంతమాత్రము సంకోచింపను. కాని యిప్పుడది గాదు. మిమ్ములనట్లు తేనీరు త్రాగనిచ్చిన చెందుకనఁగా మీరెంతో బడలియున్నట్లును, దప్పికిఁగొని యున్నట్లును గనఁబడుచు—

‘ ఏమీ నీమంచితనము! ముఖ్యముగా నేనట్లు వికటముగా ప్రవర్తించిన తరువాతనూ. ఇది—”

„మీరట్లు విచారపడఁబోకుము. నేను స్వయం కృషిచేతనే జీవనము చేయుచున్నాను. నేను అత్తరువు లను తయారు చేసెదను. ఈ కుటీరమునకు” సౌరభకుటీర మని పేరు

‘ సౌరభకుటీరము!” అని యాయువకుఁడు తిరిగి యుచ్చరించెను. „నామములోనే యెంతో యర్థమున్న దే.”

‘చూడుఁడీ యిల్లేమో వీధికోణమందున్నది. ఇచ్చటనో పూలచెట్లు చాల పెరుగుచున్నవి. కావున అది యొక మంచి నామమే, అవునుగదా; నేనుఅత్తరువుల తయారుచేసి పట్టణములోని యొక గొప్ప కార్యాలయము వారికమ్మెదను.”

„ఓహో! ఇది చాల యానందకరముగా నున్నదే. అదెట్లు తయారుచేసెదవు?

“ కొన్ని కొన్ని ద్రవ్యములుగలిపి. అది నేను గని పెట్టిన పద్ధతియే. మీరిట్లడుగుట విచిత్రముగానే యున్నది. ఏలయన నావద్ద యత్తరువులుగొను కంపెనివారుగూడ ఆమర్మమును దెలిసికొనఁ గోరుచున్నారు.

„అయ్యో, అలాగా! నేను నీచర్త రహస్యమును దెలిసికొన నుద్దేశించి యడిగియుండలేదు. అయితే వీరు నీరహస్యమును గనుఁగొనఁ బ్రయత్నించుచున్నారు కదా”? ‘అవును. నేనారహస్య పద్ధతిని వెల్లడించిన యెడల, గొప్ప మొత్తము నిచ్చెదమనికూడ ఆశపెట్టినారు. కాని నేనట్లు చేయఁదలఁచుకొనలేదు.’

‘అట్లు చేసినయెడల నీకు మంచిలాభమే కదా!’

‘ధనమే చూచుకొన్నయెడల నది లాభకరమేయని యొప్పుకొనక తప్పదు. కాని నేను నాపరిశ్రమ నెంచులకు మానవలయును? నాదంత గొప్పపరిశ్రమ కాకపోవచ్చును. కాని యది నేను కనిపెట్టినది. అది నావృత్తి. ప్రపంచము లోని ధనరాశిఁ గలిగియుండుటకంటె, ఏదోపని చేయుచుండుటయు, అందులో ఉత్సాహాభిమానములుగల పని చేయుచుండుటయు మిగుల మంచిది.

ఈ మాటలు పల్కుచున్నప్పుడు సౌగంధి నేత్రములు ఆమె దృఢవిశ్వాసమును బ్రకటించుచు, ప్రకాశించుచుండుట యాతఁడు గనిపెట్టెను.

‘శహబాష్. ఆమాటమీదనే నిలువుము. నీరహస్య పద్ధతినిఁ గనుగొనఁగోరు నాక్రూరులను లక్ష్యపెట్టకు. ఇది పరిశోధక కథగానున్నది. నీకాలము నెంతో యిదివరకే యాక్రమించియున్నాను. అబాలుఁడే దానినచ్చట పెట్టియుండును. చెడ్డపిల్ల, సరే. సెలవు’

‘చిత్తము,’ అని సౌగంధి మందహాస వదనముతో బలికెను. అతఁడు తన మోటారుసైకిలు వద్దికి వచ్చెను. అదియొక త్రుప్పుపట్టిన ప్రాఁతది. దానిపై కూర్చుండి యెన్నోసారులు త్రొక్కెను. అది పట్టి ప్రళయధ్వనులు చేయుటయేగాని నడుచుటకు బూర్తిఁగ దిరస్కరించెను.

‘ఈయూరిలోఁ గమ్మరియున్నాఁడా’ అని యువకుఁడడిగెను.

సౌగంధి తలయూపెను. ఒక్కఁడే కమ్మరియున్నాఁడు. కాని వాఁడిప్పుడూరిలో—’

‘చాలు. చాలు దీనినిఁ బాగుచేయుట కెంతకాల ముపట్టును. ఈ ... సుందరముగా వచ్చున కాఁబోలు ఇచ్చట హోటలేదైనఁ గలదా?’

'ఆనందభవనము' కలదు. దానినిఁగూర్చి నాకంతేఁగాఁ దెలియదు. కాని మీరచ్చట నడిగి చూడండి.'

'ఓ! తప్పక యడిగెదను. ఇచ్చట తసీలా కచేరి యున్నదా?'

'అవును, ఉన్నది. కమ్మరియింటి కెదురుగనే యున్నది.'

'మంచిది. సెలవు.' అని యా యువకుఁడు ఆ మోటారుసైకిలును నెట్టుకొనుచు వీధింబడి యదృశ్యుఁడయ్యెను.

౨

ఇంటిముందర వ్రేలఁగట్టియున్న యాబల్లను గూర్చిన మాయ యింకను విడివడలేదు. ఆ వ్రాతబల్ల

తేనీరు

బాటసారులకుఁ బ్రాణదాయిని

అను నక్షరములతో నచ్చటనే యుండెను. ఆమె దానినొక్క యూపూపెను. అది చులకనఁగా నూఁగివచ్చెను. ఆమె తిరిగి తోఁటలోనికి వచ్చెను. ఆవిచిత్ర సంఘట్టనము కొంత వినోదకరమగను, కొంత విపరీతముగను ఆమెకుఁ గాన్పించెను. అది ముగిసినది. ఆమె తన పటీరమును, ఆతోఁటనుజూచి, తనకట్టి యాస్తి యున్నందులకు గర్వపడసాగెను. ఆతోఁటలోని కుసుమ సౌరభము, ఆసాయంకాలపు వాయువందు లీనమైయుండెను. ఆమె యాపూలచెట్లలో నుండెను. ఆమె యాక్రొత్తవానికిఁ జెప్పినవానికంటె, ఆయుత్తరువుల సంబంధమున నెంతో విషయము గలదు.

ఆతోఁటలోఁ బలువిధ పుష్పజాతులు గలవు. మల్లె, గులాబి, మొగలి, పొగడ, మాలతి, పారిజాతము మొదలగు నవెన్నియో గలవు. ఇంతకంటె నానందకరమైన వృత్తి యామె యేదియోరియుండదు. ఏదో మోటుగానైనను అపరిశ్రమయగు దాసక్తితో నూరి, ఎడవోసి ఆత్తరువులను సిద్ధముచేయుటలో, ఆమెకొకసారి టిటాలున చక్కఁగ పొల్లుకుదిరి, ఇప్పటి నాగరికతకు అనుకూలమగురీతి సువాసనగల యత్తరువుచేయుట సంభవమయ్యెను.

ఇందులో విశేషాంశమేమనగాఁ బ్రత్యేకమయిన యీ యత్తరును, సిద్ధముచేసిన దంతయును, పటణములోని గొప్ప వర్తక కార్యాలయమగు 'ఫ్లోరెంటు కంపెనీ' వారికి విక్రయింప గలుగుటయే. ఫ్లోరెంటు కంపెనీ వారే దీని రహస్యమును దెలుపఁగోరిరి. లేచిపో నామెయొద్దనుండి యొక కొనగంటు వారి కోరికను నిర్లక్ష్యభావముననామె పరిష్కరించి నుంచుటు నిజమేగాని, వారు పట్టిన పట్టును విడువక ఆచరణలోనికిఁ దెచ్చినచో, ఆమె గతియేమి? ఇంతవిరివిగా క్రయముచేయు నింకొకనిఁ గనుగొనుట మిగుల కష్టము. ఇంతవఱకు జరిగిన పద్ధతి యామెకెంతో యనుకూలముగా నుండెను. వీరేల యామెనిప్పుడిట్లు నిర్బంధించుట!

మఱునాఁటి టప్పాలో ఫ్లోరెంటు కంపెనీవారి నద్దినుండి మరియొక యుత్తరము వచ్చెను. అందలివారి ధోరణి మరింత తీవ్రముగను, వెగటుగను ఉండెను. వారికి నామె వ్రాసిన ప్రత్యుత్తర మందినట్లును, వెనుక తాము వ్రాసిన దానికంటె నిప్పుడెక్కువ వ్రాయనవసరము లేదనియు, దెలిపిరి. ఇదివరలో వ్రాసినపద్ధతి కామె యంగీకరింపనిచో, తాము వ్రాసిన ప్రకారమాచరించుట తప్పనివిధియగునని సూచించిరి. ఇదియే కడపటి జాబుగా నెంచవలయును. ఆమె విశ్వాసపాత్రులమని యుత్తరము ముగించిరి.

'దుష్టులు!' అని యామె కాఫీగిన్నెతోఁ జెప్పి తోఁటలోనికిఁ బోయెను. వసంతఋతువు ప్రభాతకాలమందలి సన్ననికాంతిలో నాయుద్యానవనమెంతో మనోహరముగా నుండెను. పూలతావులు నలిదిక్కులఁ బ్రసరించుచుండెను. తోఁటలో నొకమూల జయరాం త్రవ్వుచుండెను. పుష్పముచుండెను. సౌగంధి యచ్చటకు రాఁగనే, వాఁడు తలయెత్తి, పిటికగాఁ జూడసాఁగెను. వాని మొగమున గళా కాంతులులేవు.

'జయరాం. నిన్నమధ్యాహ్నము మీయింటిముందరి బల్లగొయ్యతో నేమిచేయుచుంటివి?' అని సౌగంధి కఠినముగా నడిగెను.

'బల్లగొయ్యాండి! నేనాండి.' అనివాఁడు అజ్ఞానియగు శిశువువలె యడిగెను.'

'అవును. జయరాం నీవే. నేనడిగిన సంగతి తెలియనటుగా నటించకు.'

'తెలియదండీ!'

"అయితే మీయమ్మయింటి ముందరనుండే,' లేని రుబల్ల' నిన్న మధ్యాహ్నము నాతోఁటలోని కెట్లువచ్చినదో చెప్పుము."

'అయితే అమ్మా! అబద్ధపు నేమాట లేకుండ నిజం చెప్తాను. ఇక్కడ తోట్ల్వైన తరువాత మాయింటికె ళ్ళాను. మాఅమ్మ చెప్పింది, 'ఆదయగల అమ్మగారిచ్చిందే జాం పండ్లను ఆవితీసికొని (అమ్మగారవఁగా తమరేనండి)'

'దయగల అమ్మగారి మాటటుండినీ' అని వాని మాటల కాపె యడ్డము వచ్చెను.

"మాఅమ్మ చెప్పింది, యీబల్ల దీసొక్కపోయి వడ్లవాడి యింటికిపోయి బాగుచేయించుకొని రమ్మని చెప్పిందండి. దానికి రంగు కూడ వేయించుకో రమ్మన్నదండి. కాబట్టి నేనండి వడ్లవాడింటికి, రంగువేసేవాడింటికి బయల్దేరానండి. ఇంతలో అకస్మాత్తుగా దున్నపోతండి.'—

'ఏదున్నపోతు?' సౌగంధి ప్రశ్నించెను.

'ఎక్కడిది? మాదున్నపోతేనండి నేను చెప్తూన్నానుగా, ఆబల్లకొయ్య బుజానపెట్టుకొని వడ్లవాడియింటికి వెళ్లుతూ, ఆదున్నపోతునండి చెరువుకాడికి తీసుకపోతూ,'—

'ఓరీ తెలివితక్కువ వెధవా! దానికి దున్నపోతుకు నేమి సంబంధమురా.

'అమ్మగారూ! మాచారుగదూ, ఆమోటారు సైకిలు వెనుక నే గరగరలాడుతూ వస్తూవుంటే.—

'ఎవరి మోటారు సైకిలు?'

'ఆయనెవరో నాకు తెలియదండి, కాని ఆమోటారు సైకిలు ఆ మూలమలుపున వచ్చేవరకూ, ఆదున్నపోతు బెదిరి గుంజుకొపోగా, నేను ఆబల్లకొయ్యను అక్కడపడవేశానండి. దాన్ని చూడటానికదే యాఖరుసారి. మాదున్నపోతింతవరకు దొరకలేదండి.'

'ఇట్టి విపరీతపు కథను నేనెన్నడు వినియుండలేదు,' అని కోపముతో పలికి 'నీకొకసారి బుద్ధివచ్చునట్లు. అందబద్ధంమాటలేద

'అంతా నిజమేనమ్మా!

మ్మా' అని జయరాంతన నిర్దోషత్వమును జాటుచు చేతులాడించెను.

'సరే నాకేమియు దోఁచుటలేదదియెట్లు?'

గేటు దీసిన చప్పుడాయెను. సౌగంధి మోముటు త్రిప్పి చూచెను. ఒక యువకుఁడా దారినే వచ్చుచుండెను. నిన్నటికన్న పరిశుభ్రమయిన వసనములను ధరించియుండెను. అతఁడు వినయముగా మాటాడసాగెను.

'ఏమమ్మా? రావచ్చునా? నేను'

'అయితే మీమోటారు సైకిలు కమ్మరి నిన్న బాగు చేయలేదా?' అని సౌగంధి యడిగెను.

'లేదు' అతఁడు బిగ్గరగ నవ్వెను. 'నిన్న నీవు చెప్పిన యాచక్కని ఆనందభవనమునందు రాత్రి నిద్రించినాను, కాని నిన్నటి నా అసామాన్యమైన పొరపాటునకై వచ్చియున్నాను. నన్నుగూర్చి నీవు దురభిప్రాయ'—

'మిమ్ములనుగూర్చి నేను తిరిగి ఎంతమాత్రము తలంచనేలేదు.' అని యామె పలికెను.

'అలాగా. చాలవిచారము. నేను రాత్రంతా నిన్ను బాధపెట్టుచున్న ఆకంపెనీ వారినిఁగూర్చి యాలోచించుచుంటిని. ఏదీ? ఆకంపెనీ పేరేమి? నికే విధముగా సహాయము చేయవలయునాయని యోచించుచుంటిని.

సౌగంధి సంభ్రమచిత్తముతో,

'అది మీ దయావిశేషము. కాని మీరెట్లు సహాయపడఁగలరో నాకుస్ఫురించుటలేదు. అయినను నిమిష కాలము కూర్చుండి విశ్రాంతిఁ జెందెదరా' అనిపలుకుచు, పారిజాత వృక్షముక్రింది శిలాకుట్టిమమును జూపెను.

ఆయువకుఁడు అచ్చట కూర్చుండెను. అతఁడు నిమిషముకంటె నెక్కువకాలము కూర్చుండుట కభిలషించుచున్నట్లు గనఁబడుండెను.

'ఆకంపెనీ పేరేమని చెప్పియుంటివి?' అని యతఁడడిగెను.

'ప్లోరెంటుకంపెని'

'బ్రాంచివారా?'

'అట్లనుకొనను. పట్టణములో వారి కార్యాలయము గలదు.'

'అలాగా! విదేశములతో వర్తకము చేయుటకు స్వదేశీయులు క్రొత్త పేరులను పెట్టుచున్నారులే. అలాగే, మీరును ఈ యత్తరువులకు సంబంధముండునట్లుగా, నట్టి శృంగార నామకరణముచేసియుందురు. అవర్తకుల యింటి పేరు భృగుబండ—లేక యట్టిదేయొక కఠోరపదమని తలంచెదను.'

సౌగంధికి నవ్వువచ్చెను.

'అదేమిమాట? భృగుబండ పదము నాకంత వెగటుగాఁగన్పించదు' అని యామె పలికెను.

'అవును.' అని యువకుఁడు తనలోఁదాను వితర్కించుచు 'భృగుబండ మబ్బువిడిచినయెండ, కంపమండ అత్తరువుల కొఱకు ఇట్టి భృగుబండవారిని ఎవ్వరైన గోరుట నేనెన్నడు కని వినియుండలేదు, అయితే, అఫ్లోరెంటు కంపెనీవారు నిజముగా నీరహస్యమును దెలిసికొని, నీ వ్యాపారమును భగ్నమొనరించుటకుఁ దలంచి యున్నారుగదా?' 'అవును, నేఁటి యుదయము వారికడ్డనుండి తిరిగి యుత్తరము వచ్చినది. అందు వారు తమ ద్రావ్యస్వమును బూర్తిగ వెల్లడించినారు. వారిషరతుల నేనంగీకరింపవలయునఁట నికనాతో వ్యాపారము సాఁగించరట'

'అలాగా! వారి సందేశమును నీవు పూర్తిగాఁ దిగస్కరించిన యెడల, ఇంకొక కంపెనీలో సంబంధము గలిగించుకొనఁ గలవా,'

'అదియసాధ్యము కాకపోయినను, మిక్కిలి దుర్లభముకాని'

'నీవంగీకరించినచో, ద్రవ్య విషయముగా నాలోచించిన లాభప్రదముగా నుండదా?'

'అవునుకాని'—

'ఎందుకంగీకరింపఁ గూడదు?'

'మీరు దానిని గ్రహింపలేరు. ఫ్లోరెంటుకంపెనీ వారివలెనే మీరును వర్తకులయి యుందురు. వస్తువులను విక్రయించుటయు. ధనము నేకత్రించుటయునే మీదృష్టి వలెనున్నది. మీరు స్వయముగాఁ గనిపెట్టినది ఒక విధముగా మంచిఫని యనుటచే సౌఖ్యానందముల నొడగూర్చునదియగు ఏపనియైనను మీరు చేయుచుండుటలేదా? ఈ యత్తరువును నేనే సిద్ధముచేయుచున్నాను. నేనేయీ పుష్పజాలమును బెంచుచున్నాను. వస్తువులను కాచివడబోయుటకు అచిన్న కుటీరమును నిర్మించుకొన్నాను. స్వయముగాఁ గృషిచేసెదను. ఇట్లే సార్వకాలము కృషి చేయుచుండుటకుఁగోరెదను. ఇది పూర్తిగా నాస్వంతపని. మీవును నన్ను జూచి నవ్వుచు పరిహసించుచున్నారని నాకు తెలియును.'

'నిజముగా లేదమ్మా! నీవు పలికిన దంతయు యోగ్యముగను, అందముగనున్నది. కాని వ్యాపారము'—

'అయ్యో! వ్యాపారము! వ్యాపారము! ఎల్లప్పుడు వ్యాపారమనుటయే. వ్యాపారకారణమున మిక్కిలి విలువగా భావించినదానిని, అమ్మి, ధనము మాత్రమే సంపాదించ వలయునా?' అని యించుక కోపోద్రేకముతోఁ బలికెను.

'దైవసాక్షిగా నట్లుగాకూడదు.' అని యాతఁడు ద్రేకములో శిలపై గ్రుద్దెను. శిలపగులునాయని పించెను.

నీవు చిత్రమైనదానవు నీపేరు'—

'సౌగంధి' అని యామె నుడివెను.

'అవును. నీవద్భుతమైన నారీమణివి. నీమాట మీదనే నిలువుము. ఈ ఫ్లోరెంటు కంపెనీవారిలోఁ బోరాడుము. వాండ్ల మొగము మండనియ్యి, నీకు నేను సహాయముచేయఁగలను. ఈ విషయములోనే వ్యాపారము ప్రారంభించిన యొకానొకని నేనెఱుగుదును. అతఁడు నీ— అదేమి? ఆపోరగానికి ఏమివచ్చె?'

'అయ్యో ప్రారబ్ధమా! వాఁడు జయరాముఁడే వాఁడు పిచ్చివాఁడయినటులున్నది.' సౌగంధి యరచెను.

అబాలుఁడకస్మాత్తుగా నున్మాదుఁడయినట్లు కనఁబడుచుండెను. దోకుడు పారనొక చేతితోఁగైకొని, గొంతు పగిలేటట్టు కేకలు వేయుచు, అతోఁటలో నిటునటు పరుగెత్తుచుండెను, వాని యరపుల యర్థమేమో తెలియుటలేదు. థుర్ ర్—థుర్ ర్—అను శబ్దమునే పలుమారు ఉచ్చరించుచుండెను.

'ఏమిటిరా అది' అని యువకుఁడు కేక వేసెను.

'థుర్ ర్ రాత్రి తప్పించుకొని పోయిన మాయ

 పోతున్నా

నండి. గేటువద్దిర నిలువబడండి, మనము మెల్లగాపోయి పట్టుకుందాము.'

పాదలమాటున గడ్డిమేయుచు ముసలిదైన నిద్రమత్తు దున్నపోతొకటి యుండెను. దానిని జూచిగా మెల్లగ గదలుటకుదప్ప నేమియుఁజేయఁ జాలనట్లుండెను. పొంచి పొంచి, అత్యధిక జాగ్రతనునటించుచు, జయరాముఁడు దాని వెనుకకుఁబోవుచుండెను. దాని వెనుకకాళ్లకు ఒకటి రెండంగుళములదూరములలో సమీపించు వరకు అంతయు బాగుగనే యుండెను. తరువాత, భయంకరాగ్రహ సూచకముగానది బుసకొట్టుచు వెనుకటికాళ్లనెత్తి, తన్నుచు, వీధి వెంటబడి పరుగెత్తెను.

'పట్టుకొండి, పట్టుకొండి. పోనీయకండి' అని జయరాముఁడు గొంతెత్తి యరవసాగెను.

దున్నపోతు ఆవీధి మూలమలుపున కట్లు పరుగెత్తి వరకొక బండి యడ్డమువచ్చెను. దున్నపోతు కేమియుందోఁచలేదు. ముందుఁబోయిన బండితగలును; వెనుకకు మరలిన జయరాముని చేతిలోఁ బడవలయును. కావున నాక్లిష్ట పరిస్థితినుండి తప్పించుకొనుట కది 'సౌరభకుటీర'పు ద్వారముందూరిఁ తోటలోఁ బ్రవేశించెను.

పూలమొక్కలను ద్రొక్కి పాడుచేయుచున్నదే యని విచారములో సౌగంధిచేతులు పిసికికొనసాగెను. విచారపడవలదని యామె కభయమిచ్చి, యాయువకుఁడు తన కోటునువిడిచి, యా శిలావేదికపైనిడి, దానిని బట్టుకొనుటకై బయలుదేరెను. అతఁడు నిశ్శబ్దముగ. మెలకువతో దానిని సమీపించి, దాని కొమ్ములనుండి వ్రేలాడుచుండిన త్రాటినిఁ బట్టుకొనెను. అదియునిక లాభములేదని కాఁబోలు ఆయువకుని వెంట నడిచెను. ఆత్రాటిని జయరామునకిచ్చి 'ఓరీ! చెడ్డవెధవా? నీ దున్నపోతును దీసికొని వెళ్ళుము. ఇఁక నాకుఁ గనఁబడనీయకు' అని మందలించెను. వాఁడును పండ్లికిలించుచు వెళ్ళిపోయెను.

యువకుఁడు తనకోటును దిరిగిధరించి, ముఖముపైనున్న స్వేదబిందువులను తలరుమాలుతో తుడిచివైచెను.

'ఇది మిగుల వినోదముగా నున్నదికదూ? ఆమూర్ఖ వాఁడు పిచ్చివానివలె నున్నాఁడు. తనియెడల వానిచే న్లేమి కష్టము గలుగును' అని యువకుఁడనెను,

'వానినిఁక వదిలించుకొనవలసినదే. మీకేమి— అని సౌగంధి యనునంతలో

'నాకేమి బాధకలుగలేదు. అయినను నేను శీఘ్రముగా వెళ్ళవలసియున్నది. ఆయుత్తరువుల కంపెనీవారితోఁ జెప్పినదానిని మార్చకుము. నేను చెప్పిన మనుష్యుఁడు నీకు వ్రాయునట్లుగా ఏర్పాటు చేసెదను. మంచిది సెలవు.'

'చిత్తము. నమస్కారము'— అని సౌగంధి కృతజ్ఞతా సూచకముగ బలికెను.

పూలచెట్ల మధ్యనుండి యామె నడచుచున్న తరి, యామెచిత్తము పరిపరివిధములఁ బరుగెత్తసాఁగెను. ఆ సుందర యువకుఁడామెకు చిరకాల పరిచయుని వలెఁ గాన్పించెను. అతని సహాయము, అతని మంచితనము స్తుతిపాత్రముగా నుండెను. అతడిచ్చిన సలహా ఎంతో గుణతరముగా నుండెను. ఆ యుత్తరపు సంఘటనము సంభవము గాకుండినచో, నాతనిదర్శనమే యామెకు గాకుండెడిది. ఇప్పటికైన నాతఁడెవ్వడోఁ అతని పేరేమో యామెకు తెలియదు.

అట్లు నడుచుచుండఁగా నా పారిజాత వృక్షచ్ఛాయను, ఆశిలావేదిక ప్రక్కను, ఆగడ్డిలో మెరయుచున్న వస్తువొకటి యామెకు దృష్టిగోచర మయ్యెను. అది యేమయియుండును? దానిని బరీక్షించుటకై యాగెను. అదియొక చక్కని తోలుసంచి, దానిమూత తెరచియుండెను. దానిని చేతఁగైకొని పరీక్షింపఁగా నందలి మూఁడుత్తరములు ఆమె దృష్టిపథమునఁ బడెను. అంతలో నామె చేయి వణకెను. పైనున్న యుత్తరముమీఁద ఆమె స్వదస్తూరీలో ఫ్లోరెంటు కంపెనీ చిరునామా యుండెను. మిగత రెండు ఉత్తరములపైనను 'భృగుబండ శోభనాద్రి, ఫ్లోరెంటు కంపెనీ' అని యుండెను.

మెరుపు మెరిసినంత కాలములో జరిగినదంతయు ఆమెకు నర్థమయ్యెను. [లేక యర్థమైనట్లు ఆమె భావించెను.] ఆవంచకుని మాయవేషమును గ్రహింపలేక పోయిన సుందమతి కామెయే బాధ్యురాలు. ఆమెయొక్క రహస్యములను గనుగొనుటకైయే, ప్రత్యేకముగాఁ బాపల ... ఎంత

పిచ్చిదయ్యెను! అతని యందసహ్యమును, తృణీకార బుద్ధియు నామెకు జనించెను.

అప్పుడొక మోటారుకారు వీధిని వచ్చుచున్నది. అది యాతోట గేటువద్ద నాగుచున్నది. ఆసుందర యువకుఁడు దానిలోనుండి దిగుచున్నాడు. సౌగంధి మౌనముతో, ప్రశాంతముతో నాశిలా వేదికమీదనే యాసీనయైయుండెను. ఆయువకుఁడా యుద్యానపథముల ననుగమించుచు నామెను సమీపించెను. అప్పుడిట్లు వారిద్దరకు సంభాషణ జరిగెను.

''చాల విచారముగా నున్నది. నాదొక వస్తువును నేనిచ్చట పారవేసికొనినట్టు లున్నది.''

సౌగంధి—(బిగువుగా) అవునండి భృగుబండ శోభనాద్రిగారు.

శోభ—అవును, మాయింటిపేరు భృగుబండవారు నాపేరు శోభనాద్రియే. పేర్లు భయంకరముగా నున్నవి కదా?

సౌగంధి—(కోపముతో) ఏల యీపరిహాసము. మీరు గర్హ్యముగను, దారుణముగను ప్రవర్తించియున్నారు. నేనేమగవాని నైనట్లయితే—

శోభ—(ఆమెమాటలకడ్డమువచ్చి) నేనుజేసిన నేరమేమి?

సౌ—అబద్ధములు, శుద్ధాబద్ధములు నాతో బల్కియున్నారు, అంతేగాక—

శో—(వినయముగా) నేనట్లు తలంపను నాకట్టి యభిప్రాయము లేదు. నిన్నటిదినము నిన్ను దర్శించితిని అది యసత్యము కాదు నేటియుదయము నేను—

సౌ—'మీరు విషయమును గప్పిపుచ్చి మాటాడు మిమ్ములను హేయముగాఁ జూచుచున్నాను. మీసిచత్వము'—ఇక మాటలురాలేదు. ఆమె గద్గదకంఠ యయ్యెను.

శో—దయచేసి, దయచేసి నేను జెప్పుకొనునది వినుము. ఈయుదయము నీపనినిగూర్చి నీవంత పట్టుదలతో వాదించునప్పుడు, ప్రపంచములోనికలా శ్రేష్ఠురాలును, ధైర్యశాలినియునగు కన్యారత్నము నీవేయని నేను గ్రహించితిని. స్వప్రయోజనమున కొంత విరుద్ధముగ నుండినప్పటికిని, నిన్ను శ్లాఘించుచునుండెడి వాఁడనే అయితే ఇంకొక కంపెనీతో నీకు ఏర్పాటు చేయఁగలనని పలికియుంటినిగదా? అట్లేచేసెదను. ఇఁక ముందునుండియు, యథాప్రకారము అంతచక్కఁగ పని నీవు చేసికొనఁగలిగెదవు.

సౌ—ఏకంపెని?

శో—'నేనే' (అని తేటతెలుఁగులో చెప్పెను.

సౌ—మీరు ఫ్లోరెంటువారు కారా?

శో—అవును. కాదు, యువతీ! నేనే వివరించిచెప్పెదను. తరువాత నీవేమిచేసినను సరియేకాని దుఃఖింపకుము. ఫ్లోరెంటు కంపెని చాలభాగము మాపినతండ్రిది. అందు శోభనాద్రికి గొంత సంబంధము కలదు. నీకృషి రహస్యముం దెలిసికొనుటకుఁ బ్రయత్నించుచున్న వీఁడొక సత్యశీలుఁడగు యువకుఁడునను? కంపెనీవారి షరతులకుఁ నిన్నొప్పింపఁజేయఁ గలుగుదునేమో యని కంపెని పక్షమున నేనిచ్చటకు వచ్చితిని. నేను—ఇంతలోనే అనేక కార్యములు సంభవించినవి. మొట్టమొదలు నామోటారు చెడిపోవుటయు, నందుచే కిరాయిమోటారు సైకిలుమీదఁ బ్రయాణముచేయుటయు, తరువాత తేనెకు సంబంధమైన బల్లనుగూర్చిన యద్భుతకథ. ఆబాలుఁడు నాకట్టి యాలోచనను సూచించినాఁడని చెప్పినప్పుడు, నాభావమేమనగా—

(కఠినముగా)

సౌ—సరే. కానీయండి.

శో—నేను నీతోటలోనుంటిని. నిన్ను దర్శించితిని. మనము సంభాషణలోనికి దిగితిమి. నాకు—నాకు—ఎల్లకాలము నీతోఁ బ్రసంగించుచునే యుండఁ గోరిక కలిగెను.

క్రోధమానసయై యున్నను, సౌగంధి నవ్వెను.

సౌ—ఆపనియే మీరిప్పుడు చేయుచున్నటులున్నది. కాని, మీరు వివరించెదమన్న విషయము.

శో—దానికేవచ్చుచున్నాను. నేనయిదు నిమిషములుమాటలాడఁగనే మాపినతండ్రి (ఆపెద్దబండ!) కోరికప్రకారము నిన్ను బలవంతముగా నొప్పించుటకుఁ బూను



*Photo printed by C. K. Press, Hyd.-Dn.* *By the Courtesy of the Archaelogical Department.*

ముషీరాబాదు మసీదు



*Photo printed by C. K. Press, Hyd.-Dn.*

*By the Courtesy of the Archaelogical Department.*

టోలీమసీదు.

కొనజాలకపోయితిని. మాస్వంత కంపెనీతో సంబంధము వదలుకొనుటకైనను సాహసించితిని. వారిషరతులంగీకరించనిచో, నీకింకొక కంపెనీ కావలసియుండెను. కావున నేనెంతో కాలమునుండి యోచించుచున్న విషయమునుగూర్చి స్థిరనిశ్చయము చేసికొంటిని. అనఁగా నాస్వంత వ్యాపారమును నేసాగించుటకుఁ గృతనిశ్చయుఁడనైతిని. ఇఁక నీవు.—

సౌ—కాని మీ పినతండ్రి యాగ్రహింపఁడా?

శో—ఆగ్రహమా? ఒక వారము దినములవఱకు దలచించుకొనును, తన్నుకొనును. తరువాత „ఈపని నిదివఱకే చేయఁగలయునను జ్ఞానము నీకేల లేకపోయె" ననిమాత్రము పలుకును. అతఁడో భాగ్యవంతుఁడు. కొంచెము పోటీ జరిగినంతమాత్రమున అతనికంతనష్టముండదు. కావున, దానినిఁబాటించనవసరములేదు. భృగుబండ శోభనాద్రికి నీవు అత్తరువుల నమ్ముట కంగీకరించినచో.—

సౌ—దానినిఁగూర్చి నేనాలోచించుకొనవలయును.

శో—సరియే. బాగుగనున్నది. మనము వివాహము చేసికొన్నప్పుడు.

(ఆశ్చర్యముతో)

సౌ—వివాహము?

శో—అవును. ఈ యుదయము నన్ను వివాహము చేసికొనుటకు స్పష్టముగా నంగీకరించి యున్నావు!

సౌ—చూడఁగాఁజూడఁగా మీరుపిచ్చివారుగానున్నటులున్నది.

శో—అప్లైన్నటికింఁగాను. నాచేతి గడియారము ప్రకారము. పదిగంటల యిరువది మూడు నిమిషములసమయమున, ఈ యుదయము భృగుబండయను నామమునకు నీవంగీకారమునుజూపలేదు. నీమాటల యర్థమంతిదియేయని నేను నిశ్చయముగ భావించుచున్నాను. బాగుగానాలోచించుకో. నీకృషినిఁగూర్చి నీవుమాటాడిన విధమునుబట్టి నిన్ను ప్రేమించుచున్నాను. మన మిద్దఱము బ్రాహ్మసమాజికులము. ఈ లోకములోఁ బ్రణయము. పని—

(మృదువుగా)

సౌ—అవును, పనిమరియు—మరియు—

శో—ఓ! మన్మనోహారిణీ! ప్రియురాలా! నీవు—

రసాలవృక్షములపైనుండి కోకిల కూ—ఊ, కూ—ఊ అనెను. సుగంధవాయువులు వీచెను. పారిజాత కుసుమములు సుందరీ సుందరులపై జల్లున రాలెను.

ఒక ముద్దమొగపు సన్యాసి ఆచెట్లచాటునుండి మెల్లఁగఁ దలయెత్తెను. జయరాముని కంఠధ్వని వినవచ్చుచుండెను.

„ఓ! దొరగారూ! చిత్తంసామి! మాయమ్మకే ఆతేనీరు పలక కావాలనంట. అయితే మీరివ్వాళ్ల నన్ను తమాషాగా ఆడించారు. కావున మీరింకొక పావలా దయచేయిస్తే, దాన్ని మీకు పెట్టమన్నచోట పెడ్తానండి."

# అల్లసాని పెద్దన: సమకాలీన భావ ప్రతినిధి

దువ్వూరి రామిరెడ్డిగారు



సమకాలీన భావములు సాంఘిక పరిస్థితులు కావ్య దర్పణము నందుఁ బ్రతిఫలించుచుండును. కవి స్వతంత్రుడయి పూర్వాచార బద్ధుఁడు కాక పోయిన యెడల రచనా పద్ధతి యందును గావ్యవస్తు నిర్ణయమునందును భావ ప్రకటనమునందును దన కాలమునందు వ్యాప్తిలోనుండు పద్ధతులను గ్రహించును. లేక క్రొత్త భంగుల నావిష్కరించును. లక్షణములు ప్రతిభావంతులైన కవులరచనల పరిశీలనము వలనఁ దేలిన సామాన్య ధర్మములే కావున, అట్టి కవులను అన్యలక్షణములు బంధింపలేవు. ఒకొక్కప్పుడు వారి రచనలు పూర్వ సంప్రదాయముల కన్న భిన్నములుగనుండి మార్గదర్శములగును. ఒక్కొక్క కాలమునకు ఒక్కొక్క సంప్రదాయ మురూఢమై యుండును. ఒక కాలముయొక్క సృజనశక్తి తగ్గినయనంతరము సంప్రదాయము కరుడుకట్టును.

శాస్త్రము కాని శిల్పముకాని ఏ కాలమందైనను అప్పటికన్న నభివృద్ధిచెందుటకు వీలు లేక పరిపూర్ణత చెందియుండదు. నిర్దోషత ... సంపూర్ణతయు ఈ లోకమునకు సంబంధించిన గుణములు గావు. కవి కేవలము క్రొత్త పద్ధతులను గనిపెట్టవలయునను దీక్షతో పద్మాసనము వేసికొని కూర్చుండడు. ప్రాచీన సంప్రదాయములు నిస్సారములయి పండిన పండ్లవలె కాలక్రమమున వృంతచ్యుతములగును. కాలారఁ దిరుగ నేర్పిన బిడ్డ రక్షకత్వ గర్వము వహించిన ముసలి దాది పట్టియుంచినను పెనగులాడి పట్టు వదలించుకొనునటుల స్వతంత్రమైన కవి హృదయము సంకుచిత నియమ బద్ధము గాక యెదురు తిరుగును. అసంతృప్తి కలిగినప్పుడు అజ్ఞాతముగనే కవి ప్రతిభ అనుకూలమైన ప్రచలనావరణము నేర్పరచుకొనును. ఈ కార్యమాతని యందు అప్రయత్నముగనే జరిగి పోవుచుండుటవలన స్వాభావికముగ నుండును. కవి నిరంతరము నేకసంప్రదాయ బద్ధుఁడే యైన యెడల రచనల యందు వివిధత్వముండదు. ఇట్లనుటచేత కవి నియమరహితుడని చెప్పుటగాదు. స్వయంకల్పిత నియమములు కలవు. నియమ బద్ధముగాని శిల్పమునందు ఔచిత్యముండదు. అరాజకత్వముండును. స్వాతంత్ర్యముకూడ నియమ బద్ధమె.

జాతీయ జీవిత ప్రవాహమును ఆనకట్టలు కట్టి నూతన మార్గముల మరలింపఁగల నాయకులు, కవులు, చారిత్రక మహాపురుషులు ప్రతిదినమును పుట్టుచుండరు. అట్టి వారిని సృజించుటకుఁ బ్రకృతి కూడ కొంత కాలము వేచియుండి శక్తిని సంపాదించుకొనవలయును.

అట్టి ప్రతిభావంతులు పుట్టినపుడు ఆకాలమునకు వారి వాక్కు ప్రాతినిధ్యము వహించును.

ఆంధ్రదేశ రాజకీయ చరిత్రమునందుఁ గృష్ణదేవరాయల రాజ్యకాలమొక సువర్ణ ఘట్టము. హరిహర రాయలచేఁ బ్రారంభింపఁబడిన విజయనగర సామ్రాజ్యము కృష్ణదేవరాయల నాటికిఁ బరిపూర్ణత నొంది భోగ భాగ్యములఁ దులఁదూగుచు నడిమింటి సూర్యునివలెఁ బ్రకాశింపఁ జొచ్చెను. తెలుఁగు శౌర్యము, తెలుఁగు కీర్తి నల్లడలఁ బ్రసరించెను. ఆ కాలమునందు ఆంధ్ర సారస్వతమును గళలును విశేషముగ వృద్ధి చెందినవి. "గులాబి పూవులంతటను అమ్మఁబడుచున్నవి. ఆ ప్రజలు గులాబి పూలను ఆహారముకంటె ఆవశ్యకములయినవిగా భావించుచుండిరి." ఇఁక విజయనగర ప్రజల నాగరకతయు సౌందర్య ప్రీతియు భోగలాలసత్వమును వేఱుగ జెప్పవలయునా?

పరస్పర భిన్న ప్రకృతులుగల రెండు నాగరకతలకు సంబంధము గలిగినప్పుడు రెంటి యందును గొంత మార్పు కలుగును. బలిష్ఠమగు నాగరకత దుర్బలమగు దానిని మ్రింగివైచి తన యందు జీర్ణించుకొనును. అట్లుగాక రెండును దుల్యబలయుతములయ్యేనేని ఇచ్చి పుచ్చుకొనుటలు, అనుకరణములు, ఆత్మీకరణములు జరుగుచుండును. భిన్న నాగరకతల సంఘర్షణము అభివృద్ధికి అత్యంతావశ్యకము ఈ కాలమున ఆంధ్రదేశమునందు హిందూ మహమ్మదీయ నాగరకతలకుఁ గొంత సంబంధమును స్పర్ధయుఁ గలిగినది. "ప్రాతయొక రోత, క్రొత్త యొక వింత" యనునట్లు మొగలాయీల భోగప్రియత్వము విజయనగర ప్రజలకు వచ్చినది. మహమ్మదీయ స్త్రీల వలువలు సొగసులు ఆంధ్ర కాంతల మనముల నాకర్షించినవి.

విజయనగరము సుమారు నూటనలుబది చదరపు మైళ్ల వైశాల్యముగల గొప్ప పట్టణము. ఆంధ్రసామ్రాజ్యమునకు రాజధాని. సింహళమునుండికూడ సామంత నృపాలురు రాయలకు కప్పములను చెల్లించుచు రాయబారులను పంపుచుండిరి. పోర్చుగీసు సిపాయిలు కూడ కృష్ణదేవరాయల దండయాత్రలందు పాల్గొనుచుండిరి. వ్యాపారము నిమిత్తము వివిధదేశముల ప్రజలు ఆపట్టణమున నివాస మేర్పఱచుకొని సుఖజీవనము సల్పుచుండిరి. చక్కని నీటి వసతి యేర్పడుట వలన ఎచ్చట చూచినను పైరుపచ్చలు చెట్టుచేమలు ద్రాక్షతోఁటలు బలిసి యుండినవి. విజయనగరమను మూసయందు వివిధసంప్రదాయములు, ఆచారములు, నాగరకతలు కరఁగి నూతన నాగరకతగ కరుడు కట్టుచుండినది. కృష్ణదేవరాయల దండయాత్రలలో పాల్గొనని కుటుంబము విజయనగరమున నుండి యుండదు. విజయనగర మొక వంకయు, విరోధి పట్టణములు కొల్లగొట్టుటవలన ప్రాప్తించిన ద్రవ్యమొక వంకయుఁ బ్రజల ఆత్మగౌరవమునకు సుఖజీవనమునకు సాయపడుచుండినవి. దేశానురాగము స్వభాషానురాగము పొటమరించినది. తెలుగు మాటకుఁ జెల్లుబడి హెచ్చినది. "దేశభాషలందుఁ దెలుఁగు లెస్స" యను నానుడి పుట్టినది.

ఇట్టి సందర్భములలో సంఘమునందు స్వాతంత్ర్య ప్రీతియుఁ బూర్వాచారవైముఖ్యమును హెచ్చినదనుట యతిశయోక్తి గాదు. ఈ మార్పు ఆనాటి సారస్వతమునందును గోచరించవలయును. రాయల యాస్థానమునందు అల్లసాని పెద్దన, నంది తిమ్మన, అయ్యలరాజు రామభద్రుఁడు, పింగళిసూరన, ధూర్జటి, మాద[illegible], తెనాలి రామలింగన రామరాజభూషణుఁడు,

# అల్లసాని పెద్దన: సమకాలీన భావ ప్రతినిధి

దువ్వూరి రామిరెడ్డిగారు



సమకాలీన భావములు సాంఘిక పరిస్థితులు కావ్య దర్పణమునందుఁ బ్రతిఫలించుచుండును. కవి స్వతంత్రుఁడయి పూర్వాచార బద్ధుఁడు కాకపోయిన యెడల రచనా పద్ధతియందును గావ్యవస్తు నిర్ణయమునందును భావ ప్రకటనమునందును దన కాలమునందు వ్యాప్తిలోనుండు పద్ధతులను గ్రహించును. లేక క్రొత్త భంగుల నావిష్కరించును. లక్షణములు ప్రతిభావంతులైన కవులరచనల పరిశీలనము వలనఁ దేలిన సామాన్య ధర్మములే కావున, అట్టి కవులను అన్యలక్షణములు బంధింపలేవు. ఒక్కొక్కప్పుడు వారి రచనలు పూర్వ సంప్రదాయములకన్న భిన్నములుగనుండి మార్గదర్శములగును. ఒక్కొక్క కాలమునకు ఒక్కొక్క సంప్రదాయము రూఢియై యుండును. ఒక కాలముయొక్క సృజనశక్తి తగ్గినయనంతరము సంప్రదాయము కరుడుకట్టును.

శాస్త్రము కాని శిల్పముకాని ఏ కాలమందైనను అప్పటికన్న నభివృద్ధిచెందుటకు వీలు [illegible] సంపూర్ణత చెందియుండదు. నిర్దోషత్వము సంపూర్ణతయును ఈ లోకమునకు సంబంధించిన గుణములు గావు. కవి కేవలము క్రొత్త పద్ధతులను గనిపెట్టవలయునన్న దీక్షతో పద్మాసనము వేసికొని కూర్చుండఁడు. ప్రాచీన సంప్రదాయములు నిస్సారములయి పండిన పండ్లవలె కాలక్రమమున వృంతచ్యుతములగును. కాలారఁ దిరుగ నేర్చిన బిడ్డ రక్షకత్వ గర్వము వహించిన ముసలి దాది పట్టి యుంచినను పెనగులాడి పట్టు వదలించుకొనునటుల స్వతంత్రమైన కవి హృదయము సంకుచిత నియమ బద్ధముగాక యెదురు తిరుగును. అసంతృప్తి కలిగినప్పుడు అజ్ఞాతముగనే కవి ప్రతిభ అనుకూలమైన ప్రచలనావరణము నేర్పరచుకొనును. ఈ కార్యమాతని యందు అప్రయత్నముగనే జరిగిపోవుచుండుటవలన స్వాభావికముగ నుండును. కవి నిరంతరము నేకసంప్రదాయ బద్ధుఁడే యైన యెడల రచనల యందు వివిధత్వముండదు. ఇట్లనుటచేత కవి నియమరహితుడని చెప్పుటగాదు. స్వయంకల్పిత నియమములు కలవు. నియమ బద్ధముగాని శిల్పమునందు ఔచిత్యముండదు. అరాజకత్వముండును. స్వాతంత్ర్యముకూడ నియమ బద్ధమె.

జాతీయ జీవిత ప్రవాహమును ఆనకట్టలు కట్టి నూతన మార్గముల మరలింపఁగల నాయకులు, కవులు, చారిత్రక మహాపురుషులు ప్రతిదినమును పుట్టుచుండరు. అట్టి వారిని సృజించుటకుఁ బ్రకృతి కూడ కొంత కాలము వేచియుండి శక్తిని సంపాదించుకొనవలయును.

అట్టి ప్రతిభావంతులు పుట్టినపుడు ఆకాలమునకు వారి నాక్కు ప్రాతినిధ్యము వహించును.

ఆంధ్రదేశ రాజకీయ చరిత్రమునందు గృష్ణదేవరాయల రాజ్యకాలమొక సువర్ణ ఘట్టము హరిహర రాయలచేఁ బ్రారంభింపఁబడిన విజయనగర సామ్రాజ్యము కృష్ణదేవరాయల నాటికిఁ బరిపూర్ణత నొంది భోగ భాగ్యములఁ దులఁదూగుచు నడిమింటి సూర్యునివలెఁ బ్రకాశింపఁ జొచ్చెను. తెలుఁగు శౌర్యము, తెలుఁగు కీర్తి నల్లడలఁ బ్రసరించెను. ఆ కాలమునందు ఆంధ్ర సారస్వతమును గళలును విశేషముగ వృద్ధి చెందినవి. "గులాబి పూవులంతటను అమ్మఁబడుచున్నవి. ఆ ప్రజలు గులాబి పూలను ఆహారముకంటె ఆవశ్యకములయినవిగా భావించుచుండిరి." ఇఁక విజయనగర ప్రజల నాగరకతయు సౌందర్య ప్రీతియు భోగలాలసత్వమును వేఱుగ జెప్పవలయునా?

పరస్పర భిన్న ప్రకృతులుగల రెండు నాగరకతలకు సంబంధము గలిగినప్పుడు రెంటియందును గొంత మార్పు గలుగును. బలిష్టమగు నాగరకత దుర్బలమగు దానిని మ్రింగివైచినయంత జీర్ణించుకొనును. అట్లుగాక రెండును దుల్యబలయుతములయ్యేనేని ఇచ్చి పుచ్చుకొనుటలు, అను కరణములు, ఆత్మీకరణములు జరుగుచుండును. భిన్న నాగరకతల సంఘర్షణము అభివృద్ధికి అత్యంతావశ్యకము ఈ కాలమున ఆంధ్రదేశమునందు హిందూ మహమ్మదీయ నాగరకతలకుఁ గొంత సంబంధమును స్పర్ధయుఁ గలిగినది. "ప్రాతయొక రోత, క్రొత్తయొక వింత" యనునట్లు మొగలాయీల భోగప్రియత్వము విజయనగర ప్రజలకు వచ్చినది. మహమ్మదీయ స్త్రీల రవికెలు పావడలు ఆంధ్ర కాంతల మనముల నాకర్షించినవి.

విజయనగరము సుమారు నూటనలుబది చదరపు మయిళ్ల వైశాల్యముగల గొప్ప పట్టణము. ఆంధ్రసామ్రాజ్యమునకు రాజధాని. సింహళమునుండికూడ సామంత నృపాలురు రాయలకు కప్పములను చెల్లించుచు రాయబారులను పంపుచుండిరి. పోర్చుగీసు సిపాయిలు కూడ కృష్ణదేవరాయల దండయాత్రలందు పాల్గొనుచుండిరి. వ్యాపారము నిమిత్తము వివిధదేశముల ప్రజలు ఆపట్టణమున నివాస మేర్పఱచుకొని సుఖజీవనము సల్పుచుండిరి. చక్కని నీటివసతి యేర్పడుట వలన ఎచ్చట చూచినను పైరుపచ్చలు చెట్టుచేమలు ద్రాక్షతోఁటలు బలిసియుండినవి. విజయనగరమను మూసయందు వివిధసంప్రదాయములు, ఆచారములు, నాగరకతలు కరఁగి నూతన నాగరకతగ కరుకట్టుచుండినది. కృష్ణదేవరాయల దండయాత్రలలో పాల్గొనని కుటుంబము విజయనగరమున నుండి యుండదు. విజయగర్వ మొక వంకయు, విరోధి పట్టణములు కొల్లగొట్టుటవలన ప్రాప్తించిన ద్రవ్యమొకవంకయుఁ బ్రజల ఆత్మగౌరవమునకు సుఖజీవనమునకు సాయపడుచుండినవి. దేశాను రాగము స్వభాషానురాగము పోటముంచినది. తెలుఁగు మాటకుఁజెల్లుఁబడి హెచ్చినది. "దేశభాషలందుఁ దెలుఁగు లెస్స" యను నానుడి పుట్టినది.

ఇట్టి సందర్భములలో సంఘమునందు స్వాతంత్ర్య ప్రీతియుఁ బూర్వాచారవైముఖ్యమును హెచ్చినదనుట యతిశయోక్తి గాదు. ఈ మార్పు ఆనాటి సారస్వతమునందును గోచరించవలయును. రాయల యాస్థానమునందు అల్లసానిపెద్దన, నంది తిమ్మన, అయ్యలరాజు రామభద్రుఁడు, పింగళిసూరన, ధూర్జటి, మాదయగారి మల్లనార్యుఁడు, తెనాలి రామలింగ

న్న, అను అష్టదిగ్గజములుండిరని ప్రతీతి కల దు. వీరి సమకాలీనతలోఁ గొంత కాలవిపర్యా సదోషమున్నది. ఒక వేళ ఉండిరను కొన్నను వీరిలో నెవ్వరి రచనయందు ఆనాఁటి పరస్పర భిన్నాదర్శక సంఘర్షణమును నూతన దృక్పథము నుగనఁబడు చున్నది. పెద్దనమనుచరిత్రమునందు కృష్ణదేవరాయలకుఁ పెద్దనపైఁ బ్రీతిగౌరవములు మిక్కుటము. కావుననే:

సీ. "ఎదురైనచోఁదన మదకరీంద్రముడిగ్గి
కేలూఁతయొసఁగి యెక్కించు కొనియె;
మనుచరిత్రంబందుకొను వేళఁబురమేఁగఁ
బల్లకిఁదన కేలఁబట్టియెత్తె;
బిరుదైన కవిగండ పెండెరమునకీవె.
తగుదని తానాదు పాదమునఁదొడిగె;
...గోకట గ్రామాద్యనేకాగ్రహారము
లడిగిన సీమల యందునిచ్చె;

గీ. ఆంధ్రకవితా పితామహ యల్లసాని
పెద్దనకవీంద్ర! యని నన్నుఁబిలిచె—"

ఇట్టి సత్కారమును గౌరవమును కృష్ణదేవ రాయలు మరేకవికినిఁ జేసియుండలేదు. పెద్దన రాయలకుఁ బ్రియస్నేహితుఁడు కూడ. రాజు వేటకు వెడలునప్పుడు కవీంద్రుని వెంటఁబెట్టు కొని పోవుచుండెనఁట. గూడూరులో సబ్ రిజి ష్ట్రారుగానున్న నీలంగోవిందరాజులు నాయఁ డుగారు బి. ఎ, బద్వేలి యందున్నప్పుడు ఆ సరస్సును దర్శించిరని నాతోఁ జెప్పిరి. వారి యొద్ద పెద్దన వంశవృక్షముకూడ కలదు. కడప జిల్లా బద్వేలియందొక సరస్సుగలదు. పెద్దన వేటకు వచ్చినప్పుడా సరస్సులో స్నానము చే యుచుండెనని యచ్చటి ప్రజలు చెప్పుకొను చుందురఁట.

"ఆంధ్రకవితా పితామహుఁడ"ని కృష్ణదేవ రాయలు పెద్దనను సంబోధించుట కేవలము ప్రీ తి మూలకమనియుఁ, దక్కినవారి రచనలకన్న అందుముఖ్యముగా నందితిమ్మన కవిత్వమున కన్న పెద్దన కవిత్వమేమంత రసమంతమనియు గొందఱు వితర్కింతురు. అది కేవలముఁ బ్రీతి మూలక సంబోధనముగాదు. పెద్దన కవిత్వము నందు సౌకర్యము తెనుఁగుమాటల తియ్యందన ము తేలిక మాటలలో నిమిడించఁ బడిన భావ గాంభీర్యము, ప్రకృతి రామణీయక ప్రీతియు నవ్యతయుఁగలదు. పెద్దన ప్రబంధపు నమూనా ను సృజించినవాఁడు కాక పోయినను ఆంధ్రకర ణముగాక స్వతంత్రకథావస్తువును గ్రహించి కావ్యమురచించిన నూతన సంప్రదాయ మేర్ప ఱచెను. శ్రీనాథుని నైషధము ఆంధ్రీ కరణ మయ్యును స్వతంత్ర ప్రబంధమువలె నొప్పారు చుఁ బెద్దనకు మార్గము సిద్ధ పఱచెను.

ఇతి వృత్తము మార్కండేయ పురాణము నుండి గ్రహింపఁబడినది. తన మనమును ఆం దోళించుచున్న భావయుద్ధమును ద్వైవిధభావ మును బ్రతిఫలింపఁజేయుట కనువైన కథనే కవి యేర్పఱచు కొనెను. మూర్తీభవించిన రెం డు ఆదర్శకములు మన కన్నుల యెదుటఁ బొ డకట్టుచున్నవి ఒకటి, హృదయములేని నైతి క కర్కశత్వము. , రెండుభోగలాలసత్వము. మొదటిదానియందు ఆచార పరాయణత్వము ను రెండవదానియందు మానుషత్వమును గలవు. కవి యీరెండు ప్రకృతులను సృజించి శీలపోషణమునందుఁ దారతమ్యము చూపించి యొకదాని కొకటి భిత్తిగ నొనరించెను.

ఆంధ్రదేశమునందు భిన్నమతములు ప్రబలు టవలన వైదిక మతమునందును వర్ణాశ్రమధర్మ

ములందును ప్రజలకుఁ గొంత అశ్రద్ధ జనించినది. మాధవ శాయణులు వేదభాష్యమును రచించియు రాజకీయ విషయములందుఁ బాల్గొనియు వైదికమతమును గొంతవఱకుఁ బునరుద్ధరించిరి. కాని కాలక్రమమున ఆయుద్యమము గూడసన్నగిల్లినది. దేశపరిస్థితులు సౌమ్యముగ లేవు. మాటిమాటికి యుద్ధములు, కొల్లలు, సర్వజన సామాన్య కష్టములు కలుగుచున్న సమయములందు నీతులు ఆచారములు వర్ణాశ్రమధర్మములు నిర్వర్తింపఁ బడుటకు వీలులేదు. యుద్ధకాలములందు వర్ణసాంకర్యము సామాన్యము.

ఒక జాతిగాని సంఘముగాని బల శౌర్యములు గలిగి పరాక్రమవంతమై యితర జాతులపై దండయాత్రలు వెడలి జయముగాంచినప్పుడు ఆ విజయఫలము ననుభవించుచు వారు భోగసరాయణులయ్యెదరు. వైరాగ్యము మందునకైన లభింపదు. గృహస్థ జీవితమె ఆదరణీయమగును మతము అభ్యాసవశమున అర్థములేని యాచారముగ మాఱియుండునేగాని దైనందిన జీవితమునందుదాని యావశ్యకత యంత ముఖ్యముగ దోఁపదు. కృష్ణదేవరాయల రాజ్యకాలమునందొకప్పు డిట్టిపరిస్థితులు సమకూడినవి. పెద్దన హృదయమును వంశపారంపర్యముగ వచ్చు ఆచారప్రీతి యొకవంకయు నూతన గతులు మఱొక వంకయు ఆకర్షింపజొచ్చినవి. ఈ గుంజులాటమె వరూధినీ ప్రవరుల వ్యవహారమునందు మనకు గోచరించును.

కవికి ఎవరిపైఁ బ్రీతియెక్కువ? వరూధిని యందా లేక ప్రవరుని యందా? ఈ విషయము గనుఁగొనుటకు సాధ్యమగునా? ఈ రెండుపాత్రలను కవి చిత్రించిన విధము [illegible] మేని ఈ రహస్యము బయలు పడును. కవులకిట్టి పక్షపాతముండునా? ఏల యుండకూడదు? వారును మానవులే వారికిని రాగద్వేషములు కలవు. ఇష్టానిష్టములు కలవు. మానవుని లోపత్వమునందును అసంపూర్ణతయందును కవికి సానుభూతి కలదు. అప్పుడే యాతఁడు మానవస్వభావమును గుర్తించిన వాఁడగును. పీడించుటయు వేధించుటయు నీతియుతమైనను నీతి బాహ్యమైనను సార్ద్రహృదయుని చిత్తమును గాయము సేయును. "ధర్మము నిర్వర్తింప వలయును. పరధర్మముకంటె స్వధర్మము శ్రేయము" అని చెప్పఁబడినది. ఎఱుకలవాని ధర్మము పక్షులను జంపి జీవించుట. అయినను వాని కఱకుటమ్మునకు గుఱియైన క్రౌంచముయొక్క దుస్థితిని జంటపక్షియొక్క శోకావేగమును గాంచినప్పుడు నవనీత సదృశమైన వాల్మీకి చిత్తము కరఁగి ధారలు ధారలుగ స్రవించినది. యజ్ఞము సేయుట అధర్మముగాదు. బలిపీఠము యొద్దకుఁ దీసికొని పోబడుచుండిన గొఱ్ఱెపిల్లను బుద్ధుఁడు చూచినప్పుడు ఆమహాపురుషుని హృదయము కరుణారస తరంగితమై దానిని కాపాడుటకుద్యుక్తుఁడాయెను. ధర్మము హృదయములేని యంత్రము. మానవుడు హృదయముగల యంత్రము. రాముఁడు స్వప్రయోజనమును సాధించుటకొఱకు అక్రమముగ వాలిని సంహరించెను. వాల్మీకి యీ విషయము నెఱుంగును. ఆ క్రోశనినాదముచే దిక్కులు మాఱుమ్రోగించుచున్న తారపై ఆమహాకవికి మిక్కుటమైన సహానుభూతి కలిగి, రాముఁడు, జవాబుచెప్పుటకు వీలులేని ప్రశ్నలను ఆమెచేతను వాలిచేతను నడిగించెను. తరువాత రాముని ధర్మైక పరత్వమునకు హాని కలుగుననిశంకించి తాను వత్తాసివచ్చి రాముఁడు దేవుఁడు గావున ఆయనచేసినదంతయు ధర్మమని

చెప్పి పైపెచ్చు వాలిచేతగూడ నొప్పించెను! వ్యాసుఁడు పాండవ పక్షపాతి వారు ఇడుములు పడిరన్న కనికరముచే వారి తప్పులకు సున్నపు పూఁతలుఁగొట్టి మాలిన్యమును మాయించెను. తమ సృష్టులను తామె మోహించినవారు కూడ కలరు! వీరిలో పైగ్మ్యలియన్ అను గ్రీకు శిల్పి ముఖ్యుఁడు. అతఁడొక రమణీయవతియగు స్త్రీ విగ్రహమును చలువఱాతితో నిర్మించి ఆసౌందర్యమునకు ముగ్ధుఁడయి మోహించి తనపడకటింటఁ బెట్టుకొనెనఁట!

ప్రవరుఁడు నీతి శాస్త్రమునందు నిర్ణయింపబడిన కొలఁతలకు సరిపోవునట్లు కత్తిరింపఁబడిన తోలుబొమ్మ. వరూధిని విద్యుల్లతవలె మన కన్నుల యెదుట సంచరించు జీవన్మూర్తి! ఒయాస్కోప్ చిత్రము! వరూధిని చైతన్యము పరిస్ఫుటముగ గోచరించుటకు ప్రవరుడు సృజింపఁబడెను. కవి కాతనిపై సానుభూతి లేదు. "బుద్ధి జాడ్య జనితోన్మాదుల్ గదా శ్రోత్రియుల్" అని ప్రవరుఁడు తన లోక జ్ఞానశూన్యతను ఆత్మదూషణప్రాయముగ ఒప్పుకొనెను. ఈవాక్యము వేఱుసందర్భమునఁ జెప్పఁబడినప్పటికిని ఆతనిశీలమును ఆవాక్యార్థము నిరంతర మాపాదించియే యుండును. పాదలేపము కరఁగిపోయిన యనంతరము తన నిస్సహాయతను గుఱించి దుఃఖించునప్పుడు మన కథానాయకుని సంగతులు మఱికొన్ని బయలుపడును. తల్లి దండ్రులకుఁదానొక్కఁడె యల్లారుముద్దుబిడ్డ పెండ్లియయి శిష్యులకుఁ బాఠముచెప్పు వయస్సువచ్చినప్పటికిని, దన్నుఁజూడనిదె తండ్రియొక నిమిషమైన యోర్చుకొని యుండలేఁడు. అసరసందె వేళ ఈ బిడ్డ బయట కాలు పెట్టిన యెడల బూచులు పట్టుకొనునను శంకచే వాకిలి దాటనీయక తల్లి యెల్లప్పుడు రక్షించుచుండును. ప్రవరుఁడు తల్లిదండ్రుల ప్రేమాతిశయముచేతను అనావశ్యకమగునంత జాగ్రత్త చేతను నిస్సహాయుఁడును లోకజ్ఞాన రహితుఁడుగ జేయఁబడినను అమాయకుఁడు. వరూధిని చెలికత్తె యాతఁడు "గోల్యర్బాలుఁడు" అని కనిపెట్టినది.

ప్రవరుఁడు మృగమదసౌరభము మోసికొనివచ్చు మందమారుతము వలన అచ్చోటు జనాన్వితమని తెలసికొని చేరఁబోయి యొకదేవకన్యకనుగాంచెను. ఆమెయె వరూధిని. ఆ యువతి యసమాన రూపలావణ్యవతి. సౌందర్యమునుగాంచి యానందించుటయు దానిని మెచ్చుకొనుటయు అనీతికరముగాదు. కాని మన నీతిమంతుని చిత్తము సౌందర్య ప్రతిరోధకమైన కవచమునందు మగ్గిపోయినది. పాషాణత్వమె ధీరత్వమైనయెడలఁ ప్రతిమంటప స్తంభమును ధీరుఁడే!

నిరుపమాన సౌందర్యవతులైన కామినుల యెదుట లోకమె యెఱుఁగని ఋశ్యశృంగునివంటి ఆజన్మ మునీశ్వరులును, అపార సంకల్పశక్తిసంపన్నులైన విశ్వామిత్రులవంటి యోగీశ్వరులును చలించిరి. ఇంతయేల "బమ్మకైనఁబుట్టు రిమ్మతెవులు" ఇట్లు చిత్రించినవారు మానవస్వభావముయొక్క లోతుపాతుల నెఱింగిన మహాకవులు నీతిశాస్త్రమునకు వెఱచి శిల్పమును త్యజించినవారుగారు. ఆ కాలమునందు ఆర్యసంఘమింతటి యాచరబద్ధముకాదు కాఁబోలు!

ప్రవరుఁడెట్లు చిత్రింపఁబడి యుండినఁ బ్రాణవంతుఁడుగనుండెడివాఁడు? ఆయన యింతకుముందెన్నఁడును వరూధిని వంటి యందకత్తెను జూచి యెఱుఁగఁడు. చూచినప్పుడు ఆశ్చర్యపడి యుండవచ్చును. అనంతరము మానవ ప్రకృతి సహజముగ కోరిక పుట్టియుండవచ్చును. మఱి

క్షణమునందె "ఆలి మగనికి అన్యకాంతలపై మనసు తగులుట సౌభాగ్యము కాదు. తుచ్ఛ సుఖములు "మీసాలపై తేనియ" విరక్తి పుట్టి యుండవచ్చును. మరల ఆలతాంగి రామణీయకమునకు వశుఁడయి, "అప్సరస, అందునునేను వలపింపలేదు, తానె నన్ను వలచినది. అనన్య గృహీత. నేనేల భోగింపరాదు" అని తనమనమును సమాధాన పెట్టుకొని యుండవచ్చును. మఱునిముషమునందె 'ఇంతకాలము అవిచ్ఛిన్నముగ నెఱవేర్పఁబడిన నావ్రతము నేల నేఁడు భగ్నము చేసికొన వలయును? అని నిరతము తన మనములో వర్తించు అనుకూలవతియైన యిల్లాలిని అన్యాయము సేయుటగా తలంచి, ప్రయత్న పూర్వకముగ, దన కోరికలఁ జిక్కఁబట్టవచ్చును. ఇట్టి పరస్పర భావసంఘర్షణమునుండి ధీరుని సంకల్పము నిర్మలమయి దృఢమయి యెట్టకేలకు జయము నొందును. ప్రవరుని యీమనోనాటకము మనకుఁ జూపట్టిననే యాతని పై మనకు సానుభూతి కలుగును. లేకయున్న అతఁడు పాషాణ హృదయుఁడని దూషింతుము.

పెద్దన కీశిల్ప నైపుణ్యము కొఱవడి యుండినదా? కొఱవడియుండిన అంతటి కార్య సంచలనము, అంతటి లలిత భావోద్రేకము అంతటి మానుషత్వముగల వరూధిని నెట్లు సృజింపఁ గలఁడు? అట్లయినఁ బ్రవరుని ఏల యిట్లు యంత్రవిగ్రహముగఁ దీర్చెను? ఒకటి రెండు కారణములు కలవు. పెద్దన రాజసము కలవాఁడు. "రమణీ ప్రియదూతిక తెచ్చి యిచ్చు కప్పుర విడెమాత్మకింపయిన భోజనము య్యెలమంచము" కావలసిన భోగప్రియుఁడు. పోతనవలె "హాళికులైననేమి" యని స్వశ్రమార్జితము పట్టెడన్నము తినుటకు వలయు త్యాగశక్తి కలవాఁడు కాఁడు. కావుననే రాజాశ్రితుఁడు. పూర్వాచార ప్రియమైన పండితాభిప్రాయమును భోత్తిగ నిరసించుటకు వీలులేనివాఁడు. అందువలన పండితలోకమును సంతృప్తి పఱచుటకు ప్రవరుని ఆవిధముగఁ జిత్రించెను. 'జీవితయాత్ర సునాయాసముగ జరిగిపోవుట కిట్టిరాజీ యవసరమేమో! ఉమ్రఖయ్యాముకూడ సమకాలీనులతో నిట్టిరాజీ యొకటి చేసికొనెను. తాను పూర్వాచార విరోధియని తెలిసిన యెడల మహమ్మదీయ మతావేశపరులచే దనకు అపాయమును శంకించి మక్కాయాత్రచేసినఁదన పైనద్భావము పుట్టవచ్చునను తలంపుతో కాబాను దర్శించెను. తరువాత కొన్నిదినములకు అచ్చటి నల్లరాతిని గుఱించి తన యభిప్రాయమిట్లు వచించెను:—

చ. కలపయు మట్టి ఱాలనిడి కట్టిన దేవళమందు, నీకునే ఫలములభించు; ప్రేమరసభావయుతుండవయ్యేని, గామినిఁ వలచుము; ప్రాణహీనమగు బండలు వేయికిన్న శ్రేష్ఠమై యలరుఁగదా మనుష్యహృదయంబు ప్రతిప్రణయామరకర్తల్. పానశాల.

పెద్దన ప్రవరుని అంతటి కర్కశహృదయునిగ సవరింపకపోయిన యెడల మనుచరిత్ర అధమకావ్యమని దూషింపఁబడి యుండెడిది. వరూధిని పైఁగసి కరము చూపెనని యిప్పటికిని పెద్దన పైఁగత్తి నూఱు నీతి మంతులు గలరు!

"కలంచునే సతులమాయల్ ధీరచిత్తంబులన్" మన యాలంకారిక సంప్రదాయ ప్రకారము ఒకవేళ ప్రవరుఁడు ధీరుఁడైనఁ గావచ్చునేమొకాని పాపము! వరూధిని మాయలాఁడి యెట్లయినది? మాయలాఁడి యయ్యును సతియయ్యేనేని దోషము లేదుగదా. తెలుగు కవులు [illegible] కవులవలె పెద్దన పద ప్రయోజనము

పాటించు వారుకారనియు, పెద్దన ‚‚సతి"ని
కేవలము స్త్రీ పర్యాయ పదముగ వాడెన
నియు సమాధానము చెప్పుకొన్నను వరూధిని
పన్నిన మాయలేవి? ఆమె వలచినది. వలచుట
మాయలాఁడి తనమైన యెడల ఆమెయుమాయ
లాఁడియె పెద్దన గారాబపుతిట్లు తిట్టుచున్నా
ఁడు కాఁబోలు! లేక మొగమాటపు తిట్లా!

వరూధిని కన్యక. అనన్య గృహీత. నిష్క-
ల్మషమైన ప్రేమగలది, మొట్ట మొదట యెవ్వ
రిని ప్రేమించెనో అతనినే వివాహమాడినది.
(గంధర్వుని మోసము తెలియదు గావున)
ధనమార్జించుటకొఅకుఁబ్రవరుని ప్రేమించుట
లేదు. లేనిప్రేమనటించుటలేదు. జారిణికి ఇంత
టి గాఢానురాగ మెక్కడిది? ‚‚ఇందుని భాస్య
వాఁడనఁగ నింద్రుఁడో చంద్రుఁడో యాయుపేం
ద్రుడో" అని చెలికత్తెలు అతనిపై లాఘవము
పుట్టించుటకు యత్నించుచునను," పూఁతపసింటి
నంటి వలపుంబచరించుకులంబునీతికిఁ లేఁతగద
మ్మ" అని దుర్నీతులు బోధించినను చెవినిబెట్టక
ప్రవరునే వరించినది. ఆమె యచ్చర కాలమున
నుద్భవించినను ప్రవర్తనము భిన్నము. తుదకా
పేశల హృదయ ఆత్మహత్యకూడ చేసికొన ప్ర
యత్నించినది. సార్వోచిషమనువునకుఁ దల్లి
కాబోవు ఉత్తమాంగన మాయలాడియా? వ
రూధిని ప్రవరుని వరించునప్పటికిఁ గన్యాత్వము
చెడినదికాదు." ఆవధూటి ప్రథమసురతంబు
గంధర్వఫలిగరంచె;' అని చెప్ప బఁడియున్నది.

వరూధినీ ప్రవగుల సంగమము తనకిష్టము
య్యును కవి వదలివేసెను. అందుకు పరిహార
ముగ మాయాప్రవరుని మూలమునఁగొంతరహ
స్య సంతృప్తిగాంచెను. కవిచంద్ర వర్ణనమునం
దు (సందేహమునకుఁ దావుండదు గదా! కవి)
తన యభిప్రాయమును వెల్లడించెను. "ప్రకృతి
నచ్చుండైన సన్మార్గి యెన్నటికింగూటమిపంక
నచ్చు వికృతిఁ మగ్నుండుగానేర్చునే" ప్రవరుఁ
డు శుద్ధప్రకృతికి కలిగినవాడే యైన యెడల
వరూధినీసంగమము వలన వచ్చు వికృతికి భ
యపడవలసిన యవసరముండదు. అది తృణక
ము. ప్రవరుఁడు అసంతప్త హృదయును సంతో
షపెట్టి యోదార్చి పోయియుండవచ్చును.

రావణుఁడు సీతనెత్తుకొని పోయినప్పుడు రా
ముఁడుపలవించెను. అశోక వేదనకుఁ జెట్లుకూడ
తలలువాంచి యల్లాడెను. ప్రకృతియంతయుఁ
గన్నీరు నించెను. పెద్దనకూడ దుఃఖితయగు
వరూధినిపైఁ బ్రకృతి కనికరించిన దని వర్ణించె
ను. కర్మసాక్షియగు సూర్యభగవానుఁడు ప్రవ
రుని పాషాణ హృదయత్వమునకు వెక్కసమం
ది రోషభీషణ స్ఫురణ వహించెను.

చ. తరుణినినన్యకాంత నతిదారుణ పుష్ప శిలీము
ఖ వ్యథా, భరవివశాంగి సంగభవు
ఖారికి నగ్గము నేసిక్రూరుఁడై, యరిగె మహీ
సురాధముఁ డహంకృతితో ననిరోషభీషణ,
స్ఫురణ వహించెనోయన నభోమణి దాల్చెఁ
గషాయదీధితిఁ."

ప్రవరుఁడు క్రూరుఁడు — మహీసురాధముఁడు —
అహంకార యుతుఁడు — శెబాష్! పెద్దనా, ము
సుఁగులోదాగుకొని నీఅక్కసు వెళ్లఁబుచ్చినావు!
కసిదీర్చు కొన్నావు! ఈ సహానుభూతియె, యీ
హృదయ వైశాల్యమె నిన్ను మహా కవిపట్టము
నకు అర్హుని చేయుచున్నది.

వరూధిని ప్రశ్నలలో వాద నైపుణ్యము మె
ఱయు చున్నది. ప్రవరుని చప్పిడి జవాబులు
వరూధిని ప్రముఖయ్యాము శిష్యురాలు. ‚‚యజ్ఞ



*Photo printed by C K. Press, Hyd.-Dn.* *By the Courtesy of the Archaelogical Department.*

అజంటాగుహలు, రాచనగరములోని దృశ్యము.



*By the Courtesy of the Archaelogical Departmet.*

ఔంధా దేవాలయము శిఖరము.

కోట్లుల్లడి బావను లాటకుర్ ఫలము నూకౌఁగిళ్ల సుఖంచు కేగదా" క్రతువుఁగొనరించుట స్వర్గభోగములకొఱకు స్వర్గమునందు అవశ్యాను భోక్తవ్యమును ధర్మ్యమును యోగ్యమునైన రంభాది భోగములు ఇచ్చుటయేల నిషిద్ధములయ్యెను? అశ్రమముగ సశరీర స్వర్గసుఖము సమకొనియుండ వ్రతోపవాసములఁ గృశుఁడవయి ఆత్మ నలచుట యెందుకు? అని వరూధిని ప్రశ్నించుచున్నది. ఉమ్రఖయ్యాముకూడ ఇట్టి సవాల్లే వేసెను.

ఉ. మాటికి మాటికిం దెలివిమాలి తలంతువు స్వర్గమంచు న, చ్చోట నిలింపకామినులుఁ జొక్క పుటాసవముర్ గులాబిపూఁ, దోఁటలు నుండునన్న భ్రమతో మన కేలనో యవ్వియియ్యెడర్, నీటిలఁ; జేతి వెన్నవిడి నేతికిఁ బోదురు మూఢమానవుల్.

పానశాల,

పెద్దనకశానై పుణ్యమును గుఱించి యొకటి రెండు విషయములు సూచించి యీ వ్యాసము ముగించెదను. ఈ కవికిఁ బ్రకృతి రామణీయకప్రీతి విశేషముగనున్నది. పదలాలిత్యము అందుముఖ్యముగ (తెలుఁగుమాటల తియ్యనిపోకడలు ఈతని యొద్ద నేర్చుకొనవలయును. "అల్లసాని వాని యల్లిక బిగియును" అను పూర్వ విమర్శకాభిప్రాయము నానుడియై యున్నది. పెద్దన కవిత్వము లలితముగఁ దీర్చి దిద్దఁబడి యున్నదనుటకు సందియము లేదు. "నిలుకడ వలయుఁ గృతికి" అను అప్పకవి వచనమునందుఁ గళాకహాస్యమున్నది. ఒక మనుచరిత్రమే కాదు కొంచెమించుమించు పూర్వకావ్యములలో చాలవఱకు నిలుకడగా రచింపఁబడినవె. ప్రత్యేక దిన ప్రబంధఘటికా సవ్యశ్శత్త్గ్రంథకల్పన" అని రామరాజ భూషణుఁడు తన్ను గుఱించి చెప్పకొని యున్నను వసుచరిత్రము ఒక్కదినములో వ్రాయఁబడిన ప్రబంధముకాదు. కథపట్టి సవరణ యయిపూర్తి యయినదనుటకుఁ గొన్ని సంవత్సరములు పట్టియుండును. అనగా ప్రతిదినము నందు రెండుమూడు కావ్యములకన్న నెక్కువగ రచించి యుండడు. (నెఱవడి క్షుద్రుపట్టై వ్రాయబడు కాపీ పుస్తకముల వంటివి, మెన్నియేని నుండవచ్చును. అవి లెక్కలేదు) ఆకాలమున రాజాస్థానములె కవులకు శరణ్యములు. ఆస్థానపండితులు స్థిరశిల్ప పరీక్షచేయు బిరుసు విమర్శకులు. ఇట్టి అగ్ని పరీక్షలోఁదేరి తెప్పరిల్లిన కావ్యములె గౌరవ యోగ్యములగుచుండెడివి. ఇట్లనుట వలనఁ బూర్వకావ్యములన్నియు నీతరగతికి చెందినవని కాదు.

ఇప్పటి పరిస్థితులు వేఱు. వార్తాపత్రికలు మాసపత్రికలు ప్రబలినవి. ఆపత్రికల పుటలు నిండుటకు విషయములుకావలయును. కవులును, వ్యాసకర్తలకు, ఏదో యొక మొగమోటమిచేత ఏదియైన కొంత (కాగితములు నిండుటకు) వ్రాసి పంపవలసి యుండును. కాగితముపైని సిరాతడి యారకముందె ఖండకావ్యమువోస్టులోఁబడును (పూఫులు సరిచూడక పూర్వమె (అవకతవకగా చూచియని అర్థము) పత్రికలలో ముద్రింపఁబడును. పత్రికాధిపతులుమంచి సెబ్బరలు పరిశీలించి ముద్రించుటకు వీలులేదు. అట్లయిన వారి పుటల నియమమునకు హాని గలుగును. ఇట్టి పరిస్థితులలో "నిలుకడ" నియమమెట్లు కొనసాగును? తన గ్రంథము తొంబరగ ప్రకటింపఁబడ వలయునను అక్కఱ పెద్దనకుండి యుండదు.

 

Take time for thinking;
never work in haste
And value not yourself
for writing fast;
A rapid poem with such
fury writ,
Shows want of judgement
not abounding wit.

*   *   *   *

A hundred times consider
what you have said;
Polish, repolish,
every colour lay,
And, some-times add,
but oftener take away.
(John Dryden.)

అను ఇటువంటి రచనా నియమమును పెద్దన చాల జాగరూకతతోఁ బాటించినట్లున్నది.

ద్రౌపది, కైకేయి, చిత్రాంగి మున్నగువారివంటి నాయికలు మన సారస్వతమునందు అరుదు. కొంచెమించుమించు నాయికలందరు ముగ్ధలు. మౌగ్ధ్యము రమణీయముగ నుండవచ్చును. కన్యకలందరు ముగ్ధలుగ నుందురను ప్రకృతి నియమము లేదు. వరూధిని ప్రాగల్భ్యముగల కన్యక. తానే వలచినది. ఎట్టకేలకు "నిక్కముదాపనేల ధరణీసురనందన యింకనీప యింజిక్కెమనంబు" అని తన భావమును బహిరంగముగ వెల్లడించెను. ఇట్లుచెప్పుట స్త్రీసహజమా? కాంతలు తమ ప్రేమాతిశయమును హావభావములచే సూచింతురు. పాపము, వరూధినిస్సైతమట్లె చేసినది. కాని ప్రవరుని మనస్సు ఒత్తిడిపడునదిగాదు. ఆలసించినయాతఁడు మోరకించుకొని పోవచ్చునను అనుమానముచే ప్రేమను వచించినది.

వరూధిని ప్రవరునివలె కర్కశహృదయగాదు. భావోద్రేకము కలది. మేలైన మనస్సు.

సౌందర్యపిపాసమిక్కుటము. ప్రవరుని సౌందర్యమునకచ్చెరువందినది. వర్ణించినది. ఇంకను తనివినక యాతని ప్రేమించినది. వరూధినీ ప్రవరుల సందర్శనమును కవి అద్భుతముగ వర్ణించెను. వరూధిని "అబ్బురపాటుతోడ నయనాంబుజముల్ వికసింప కాంతి, పెల్లుబ్బ కనీనికల్ వికసితోత్పల పంక్తులఁ గ్రుమ్మరింపగా, గుబ్బమెఱుంగుఁజన్గవ గగుర్పొడువన్" ప్రవరుని గాంచినది. మఱియు "ఝళంఝళత్కటకి సూచితవేగపదారవిందయై, లేచి కుచంబులుం దుఱుము లేనడుమల్లల నాడనయ్యెడం, బూచిన యొక్క పోఁకనును బోదియఁజేరి విలోకన ప్రభా, వీచికలం బదీయ పదవీకలశాంబుధి వెల్లిగొల్పి" నది. ఇంకను "ఆ నున్ పుట్టెడు కొంకు లౌల్యము నిరర్ మోదంబు విస్తీర్ణతం, జొను పంగోర్కులు క్రేళ్లు ద్రిప్ప మదిమెచ్చ్ఁల్ తెప్పలల్లార్పన త్యనుషంగస్థితి జిచ్చ పాటొనఁగ నొయ్యారంబునం జంద్రికల్ దనుకం జూచి"నది. ఈ పద్యములందుఁ బ్రతిక్షణ వ్యాప్తమైన కార్యచంచలనము జీవకళావిలసనమునిబిడీకృతమైయున్నది. ఇట్టి పద్యములుఆంధ్రసారస్వత మకుటమునందుఁ బ్రకాశించు జీవమణులు. ఈ చాకచక్యమునందుఁ బెద్దన తిక్కనకు మాత్రమె రెండవవాఁడు.

నిర్జన ప్రదేశమునందుఁ బ్రవరునిఁ గాంచినవుడు వరూధినికి మొట్టమొదట కన్యా సహజమైన సిగ్గుపుట్టినది. పుట్టి, పూచిన పోకఁచెట్టు చాటునకు పోయినది! ఇంక నేచెట్టుచాటునకుఁబోయినను ఆమె సౌందర్యము ప్రవరుని కగపడదు. కావుననే సిద్ధహస్తుఁడగు కవి సందర్భానుసారముగఁ బోఁకచెట్టును దెచ్చిపెట్టినాఁడు.

"ఇంతలు కన్నులుండ" అను పద్యమునందు ఆసక్తియుఁ జమత్కారమును, ధ్వనితముగ

ప్రవరుని నేత్రసౌందర్యమును వర్ణింపఁ బడినది. పద్యములోని మాటలు తేట తెలుఁగైనను భావముగంభీరముగను ప్రౌఢముగ నున్నది.

పొంగిపొరలివచ్చు ప్రేమప్రవాహమును ఆపుకొనలేక వరూధిని ఆఛందసుని "పాలిండ్లు పొంగారఁ బైయంచుల్ మోవఁగ" గాఁగిలించుకొనినది. ఆ బ్రాహ్మణుఁడు ఓరమోమిడి హా! శ్రీహరీ! యని అంసద్వయమంటి పొమ్మని త్రోసిపుచ్చెను. వీలైనయెడల అంసద్వయమంటి యుండఁడు! సమయమునకుఁ జేతికఱ్ఱ మఱచి వచ్చెను. పాప మావనజగంధి మేని జవ్వాజి పసఁగందంబించునొడలుగడిగికొని పాప పరిహారముగ సంధ్యవార్చినాఁడు. వరూధిని మొక్కయీయస్త్రముకూడ నిరుపయోగమైనది. తన సౌందర్యము నిరాకరింపఁబడినందుకుఁగోపమును, కోరికతీఱనందుల కసహనమును, స్త్రీజన సహజమైన అలీకనిందారోపణ నైపుణ్యమును, కొంచెము లేతపాకములోఁబడిన గయ్యాళితనమును, కసిదీర్చుకొను నిచ్చయుఁ వరూధిని మనమునందుఁ జెలరేఁగి ముప్పిరిగొన్నవి. దుఃఖము పొరలించుకొని వచ్చినది.

"పాటునకింతు లోర్తురె కృపారహితాత్మక నీ
వు ద్రోవ, నిచ్చోట భవన్న ఖాంకురముసోఁ
కెఁగనుంగొనుము"

తన యమ్ములపొదిలోని మన్మథాస్త్రము లన్నియు వ్యయమైనవి. తుట్టతుదకీ యస్త్ర మొక్కటి నిలిచి యుండినది. ఇది యమోఘము కావచ్చును. అయ్యో! దేవుడా యీయస్త్రము కూడ ఆ జాతిపై దగిలి మొక్కవోయినది!

"ఇచ్చోట"—ఎచ్చోట? భుజముల యంచుః. పాలిండ్ల మోరల. మగజాతి బొమ్మకైన మొడలు పులకరించును. పెద్దనకు పులకరించినది. పాఠకులకుఁగూడ!



## తన్మయము

(ఊటుకూరు సత్యనారాయణరావు బహద్దూర్.)

ఆగభీరాంధకారని • శీర్థభాగ
సమయమున, కీచురాళ్లు పలి • శాంతవిశ్వ
గర్భము ధ్వనింప రవళించి • కలచువేళ
హృదయతంత్రులు తెగిపోవె; నీ దురంత
దుర్భరమదీయ వేదనా • దూయమాన
జీవిత విపంచి ...

ప్రేమగీతిక నికనాల • పింపలేక
పరిళయకాల పతుంబుల • పైన దేలి
పోయి, నిను జేరి నీపదాం • భోజయుగళి
నస్మదీయ విశుద్ధాత్మ • అణువులోన
నణువుగచు అటనె జీర్ణించి •యంతరించు.




# శ్రీమహర్షి స్వామి దయానంద సరస్వతి

(శ్రీ. ఆదిపూడి సోమనాథరావుగారు)

సీ॥ బాలుర బాలికల్ ♦ బ్రహ్మచర్యముఁబూని
వివిధ విద్యలఁ నేర్చి ♦ వెలయుఁడనియె
ప్రౌఢావివాహముల్ ♦ బరిపాటికిందెచ్చి
మంచిసంతతిఁగాంచి ♦ మించుఁడనియె
అభిరుచిగల వృత్తు ♦ లందు ప్రవేశించి
న్యాయ్యార్జనము చేత ♦ నలరుఁడనియె
సకల మతంబులఁ ♦ జక్కఁగాఁ బరికించి
పూతమౌ ధర్మముల్ ♦ పూనుఁడనియె

గీ॥ భుక్తినొసఁగెడు దేశముల్ ♦ ముక్తినొసఁగు
దైవముల భక్తిఁగొలుచుచుఁ ♦ దనరుఁడనియె
ఇదియె వైదిక ధర్మమై ♦ యెసగుననియె
ఆదయానంద యోగి ధ ♦ ర్మానురాగి. 1.

సీ॥ పరమేశ్వరుని మది ♦ భక్తినర్చించుటే
బ్రహ్మయజ్ఞంబని ♦ పలికినాఁడు
ఓషధీతతులచే ♦ హోమ మొనర్చుటే
దేవయజ్ఞంబని ♦ తెలిపినాడు
తల్లిదండ్రులను స ♦ ద్భక్తి సేవించుటే
పితృయజ్ఞమని నిరూ ♦ పించినాఁడు
అతిథులైనట్టి మ ♦ హాత్ములఁ గొల్చుటే
నరయజ్ఞమని తేట ♦ పఱచినాడు.

గీ॥ తనవలెనె సర్వజీవులఁ ♦ దలఁచిహితము
సలుపుచుండుటె భూత య ♦ జ్ఞంబటంచుఁ
జాటినాఁడు భవాబ్ధిని ♦ దాఁటినాఁడు
ఆ దయానంద యోగి ధ ♦ ర్మానురాగి. 2.

సీ॥ బలవీర్యములచేతఁ ♦ ప్రబలంగవలెనన్న
బాల్యవివాహముల్ ♦ వదలుఁడనియె
భగవంతు గుణములఁ ♦ బడయంగ వలెనన్న
ప్రణవారాధన ♦ సలుపుఁడనియె

ప్రేమచే హృదయంబు • వికసింపవలెనన్న
మద్యమాంసములను • మానుడనియె
విద్వేషములుమాని • వెలయంగ వలెనన్న
మాధవివిశ్వాసముల్ • వీడుడనియె.

గీ॥ స్వర్గరాజ్యంబు భూమిపై • వలయుననిన
దురితకార్యంబులం దుండి • తొలఁగుడనియె
మానవాళి హితమ్మునే • మదిదలంచి
ఆ దయానంద యోగి ధ • ర్మానురాగి. 3.

సీ॥ ధాత్రినెచ్చటనున్న • ధర్మాత్ములందఱు
నార్యనామమునకు • నర్హులనియె
ఎల్ల రీశ్వరునకుఁ • బిల్లలమైయుంట
ధరణి నందఱము సో • దరుల మనియె
స్త్రీలు మహోన్నత • స్థితిని వర్ధిల్లుటే
దేశసౌభాగ్యముల్ • దెలుపుననియె
ఆయు రారోగ్యమ్ము • లమరఁ జేసెడునట్టి
సత్కార్యమునె సదా • చార మనియె.

గీ॥ సత్యముల్ న్యాయముల్ దయా • శౌచములను
దాల్చి మెలఁగుచునుండుటే • ధర్మమనియె
పరుల కపకృతి సేయుటే • పాపమనియె
ఆదయానంద యోగి ధ • ర్మానురాగి 4.

సీ॥ పరితపించుచు నుండు • బాలవితంతుల
పాలికిఁ దండ్రియై • పరఁగినాడు
తల్లిదండ్రులులేని • పిల్లల పాలికిఁ
బ్రియమైన మాతయై • వెలసినాఁడు
చదువెరుంగని నిమ్న • జాతులపాలికి
నెంతయు గురువయి • మెసగినాఁడు
ప్రాణముల్గోల్పోవు • పశువుల పాలికి
నాప్త బాంధవుఁడయి • యలరినాడు.

గీ॥ సర్వతో ముఖవృద్ధికి • సర్వజనుల
మేలుకోరెడు మిత్రుఁడై • మెలఁగినాడు

పావనంబగు చిత్తజీ • వనమువాఁడు
ఆదయానందయోగి ధ • ర్మానురాగి. 5.

సీ॥ లోపముల్ చూపినఁ • లోకులు పైఁబడి
కొట్టితిట్టిన నోర్చు • కొన్నవాఁడు
సత్య మన్వేషింప • సంచార మొనరించి
పడరాని కడగండ్ల • పడినవాఁడు
ఉన్నత స్థితిఁ బాసి • యున్న దేశముఁ జూచి
కన్నులఁ దడివెట్టు • కొన్నవాఁడు
మన దురాచారముల్ • మాన్పంగ సమకట్టి
కడవఱకును బాటు • పడినవాఁడు.

గీ॥ విషముఁ బెట్టినఁ గూడను • విడువకుండ
ధర్మ మార్గానువర్తియై • తనరుచుండి
శాంతముగ ప్రాణమును వీడి • చన్నవాఁడు
ఆ దయానందయోగి ధ • ర్మానురాగి.






## ఉపోద్ఘాతము

ఈ సుప్రసిద్ధమగు వృక్షము వికారపు చెట్టనియు, సర్వవిధముల నసహ్యమైనదనియు ననర్హమగు నిందకు పాత్రమైనది. అయినను హిందూస్థానపు తోటలలో నింతకన్న సుందరమైనదియు సాధారణముగా నుపయోగమైనదియునగు వృక్షమును మఱొకటి యున్నదాయని ప్రశ్నింపవచ్చును.

౨. ఈ వృక్షముయొక్క ఆర్థికలాభమును గుఱించియు, సాధారణముగా నందఱకు దెలియనట్టి దీని వైద్యసంబంధ తదితర గుణముల గుఱించియు, దీని ఫలముల యొక్క యాహార ప్రాముఖ్యతను గుఱించియు లోకులకు దెలియపఱచుట యీచిన్న పొత్తమును బ్రచురించుటకు గారణములు.

౩. ఈక్రింది కారణములచేత దీనిని విశేషముగా పండించుటకై జనులయం దభిరుచి కలిగింపజేయుట మా ముఖ్యోద్దేశము. ఇది త్వరగానే దిగివచ్చును. బహువిధలగు నేలలలో, వివిధములగు పరిస్థితులలో నల్పశ్రమచే ని పండింపవచ్చును. ఇది చాల తక్కువ స్థలము పట్టుకొనును. చాల త్వరగా ఫలించును. మఱియు దీని పరిశ్రమలవలన వస్తువుల సిద్ధముచేయవచ్చును. ఈ యమూల్యమగు ఫలవృక్షముల గుఱించి మేము సమకూర్చినట్టివియు, మాకు వేద్యములైనట్టివియు, మాయనుభవ జన్యములైనట్టివియునగు విషయములను జనులకు నివేదించుకొందుము. దీని యవలోకనము వలన మాయీ యుద్యమము యొక్క యావశ్యకత వెల్లడియగునని నమ్ముచున్నాము.

౪. మంచివిగాజూచి వేరుపఱచిన చిన్నచెట్లు మాతోటలలో పెంచబడుచున్నవి. దీని కృషిచేయ నెంచువారికి శ్రేష్టమైన విత్తనములు, మొలకలు అందింపజేయుట నేర్పాటులు చేయబడుచున్నవి.

## పొప్పడకాయ

### దీని కితరమైన పేరులు

ప్రకృతి శాస్త్రములో :— ప్యాసిఫ్లోరీ

:— క్యారికాపాయా

ఉర్దూలో :— పపాయి

మరాటీలో :— ,,

కన్నడములో :— [illegible]

పపాయి

ఇంగ్లీషులో :— పపయా పొప్పాయి

### జన్మదేశములు

దక్షిణ అమెరికా, పశ్చిమ ఇండియా దీవులలో మొదటినుండియు వృద్ధియగుచున్నది. హిందూస్థానములోగూడ పూర్తిగా వృద్ధికాజొచ్చినది,

## ఫలము

పపయి పండు సాధారణముగా ఖేరిపండువలెనుండును. మఱియు పెంకాయ యంత పెద్దగానుండును. ఆకుపచ్చరంగుతో నుండును. దీనిని కోసి చూచిన నాకర్షణీయముగా నారంగిపండు వర్ణపు కరుబూజుపండువలె గనబడును, ఈ పండులోని చిన్నని విత్తుల సువాసన కొందఱకు ప్రీతికరమైయున్నది. మఱియు నీవిత్తులు చాలయారోగ్యకరములని భావింపబడుచున్నవి.

ఇది పెఱుగు స్థలంబులందెల్లను అత్యంతారోగ్యకరమగు ఫలములలో నొకటిగా బరిగణింపబడుచున్నది. ధనికులుకాని, దరిద్రులుకాని, అందఱకు సులభమును. ఆనందమును గలిగించుటలో నీపాప్పాయికన్న లాభకరమైన పండింకొకటిలేదు. ఇది చాల తక్కువ శ్రమచే, శీఘ్రముగా, అన్ని విధములగు నేలలలోను, పరిస్థితులలోను పండును. మఱియు దీనికి లెక్కింపదగిన జాడ్యములుగాని, పురుగు తగులుట గాని లేవు. ఇది విశేషస్థలము నాక్రమించుకొనక పోవుటచేతను, త్వరగా ఫలించుటచేతను హిందూస్థానపు సర్వ భాగములలోను సాధారణముగా ప్రతియింటిలోను, తోటలలోను పెంచబడుచున్నది. తగిన స్థలములలో దీనిని పెంచినచో వాస్తాకారపు పెద్ద యాకులతోకూడిన కాడలుగల దీని చక్కని పొడవగు మూలమున వ్రేలాడునట్టి పుష్పముయొక్క సౌరభమునుగాని పసిమిగా నుండునప్పుడు ముఖమునకు వన్నెకూర్చుటకు గాను, పండినతర్వాత నేపుపండ్లవలె భోజ్యవస్తువుగాను పనికివచ్చు దీని ఫలమును చూచినవారు, మెచ్చుకొనకపోరు.

పాప్పాయిచెట్టు ఉష్ణప్రదేశములందు దప్ప యితర ప్రదేశములందు వృద్ధికిరాదు. చలికాలమందు ఉష్ణము తక్కువగుటచేత చెట్టు విశేషముగా పెఱుగకుండుటయు, పండ్లు త్వరగా పక్వముకాకుండుటయు ఫలములు తక్కువగా కాచుటయు సంభవించుచుండును. ఉన్నతప్రదేశములందు పండించు చెట్లయొక్కయు, చలికాలములందు ఫలించు చెట్లయొక్కయు ఫలములరుచి తక్కువ.

వర్షముగాని నీరుగాని ఎక్కువయైనను నీవృక్షము నారంగి పండువలెకాక సర్వపరిస్థితులందును పెరుగుచుండును. అయినను నీవృక్షమునకు క్రమముగా నీరుపోయుట మంచిది నీరు ఇముకని భూములలో నీవృక్షము మొద్దుపాఱును. మఱియు దీనియాకులు త్వరగా రాలిపోవును. ఉన్న యాకులు సహితము పసుపురంగుగా మారును. దీనివలన వృక్షము అనారోగ్య స్థితియందున్నదని గ్రహింపవలెను.

గాలినీరు బాగుగా తగులుచుండిన నెట్టిభూమిలోనైన పప్పాయి పండును.

## పెంచుట

సాధారణముగా ఫిబ్రవరీ, సెప్టంబరు నెలలలో పాప్పాయివిత్తులు నాటినచో, ౧౦ మాసముల లోపలనైనను లేక ౧౦ అడుగుల యెత్తుగల వృక్షమై ఫలింప మొదలిడును. మంచిచెట్లయొక్క విత్తనముల నేరి నాటుట మంచిది. విత్తులను పండునుండి తీసి వానిపైనుండు బంక పోవునట్లు కడిగి బూడిదిలో కలిపి నీడలో నెండించవలెను. ఆరినతర్వాత వెంటనే నాటకుండినచో సీసాలలో నుంచి బిరడా పెట్టవలెను. పక్వమైన పండ్లనుండి తీసినవిత్తనములను వెంటనే నాటవచ్చును. బాగుగాతడిసినభూమిలో లేక మట్టినినింపిన పెట్టెలలో విత్తనముల నాటుటమంచిది. రెండవ వారమునుండి ౭ వారములవరకు మొలచును. మొలచిన యొక నెలపిమ్మట నీ మొలకల వేరే తొట్లలో నుంచవలెను. తొట్లలో మరల నొక నెలయుంచి, పిమ్మట తోటలో నాటవలెను. మారునాటు నప్పుడీ మొలకలు వాడిపోకుండ చూచుకొనవలెను. జూను నెల నుండి డిసెంబరు నెలవరకీ మొలకలను తొట్లనుండి తీసి భూమిలో నాటుటకు మంచి సమయము.

భూమిలో నాటునప్పుడు భూమిలో ౨౺ కాని 3 అడుగులు గాని ఘనపరిమాణముగల గుంతను త్రవ్వవలెను. (అనగా లోతు, వెడల్పు, పొడవుసమానముగా నుండవలెను). ఈ గుంతలను రెండు మూడు గంపల యెరువు కలిపినమట్టితో మరల నింపవలెను. గుంత గుంతకు ౧౦ అడుగుల యెడముండవలెను. పాప్పాయి పీవుగల చెట్టగుటచే నిది యారోగ్యముగా నుండవలెననిన నీరు బాగుగా కట్టుచుండవలెను, ఎండకాలములో దీనికి నీరు

సమృద్ధిగా పోయుచుండవలెను. తోట్లలో మొదట పెరిగిన చెట్లకు తర్వాత భూమిలో నాటిన పిమ్మట తడియారకుండునట్లు బుడముదగ్గఱ నంతగా దాపువేయ నక్కఱలేదు. కాని గాలి విశేషముగా వీచు ప్రదేశములలో తేమ త్వరగా నారిపోకుండుటకై దాపుచేయుట మంచిది. ముఖ్యముగా చలికాలములలో కొరుకుడు పురుగులచే చెట్లు నాశనము కాకుండ మూసుకొనవలెను.

### తడికట్టుట

సాధారణముగా కొద్దిగా నీరు కట్టినను బొప్పాయికి మంచిపండ్లు కాయును. కాని మంచి నేలనీరు సమృద్ధిగా కట్టిన దానిపండ్లు పెద్దవిగను తూకము కలవిగను నుండును. ప్రకృతమందు వివిధ పరిస్థితులను గమనించి నపో ఏ చెట్టునకు నీరేమాత్రము పోయవలయును? అను విషయమును నిర్ణయింపజాలము. కాని యింతకు ముందు చెప్పినట్లు నారంగిచెట్టునకు కావలసినదానికన్న నీరు తక్కువగానే యుండవలెను. దీని మొలకలు భూమిలో నాటినప్పుడు కొన్ని వారములవరకు నీరు ప్రతిదినము కాని రెండుదినముల కొకతూరి గాని కట్టవలయును. ఏలనన వేరులుండువరకు భూమిపైభాగము చాలత్వరగా నారిపోవుచుండును.

### కొమ్మల నఱకుట

బొప్పాయి చెట్లను కత్తిరింప నవసరములేదు. కొన్ని చెట్లకు శాఖలేర్పడుట కూడ కలదు. ఈ శాఖలను చెక్కివేయవలెను. లేకున్న మూలవృక్షము యొక్క ఫలముల వృద్ధి తక్కువగును. బొప్పాయి వృక్షము రెండు మూడు సంవత్సరములు ఫలించిన తర్వాత దానిని నరికివేయవచ్చును. దాని మూలము చెట్టు పెఱిగిన మొలకలు వృద్ధియయి యందుబాటులో పండ్లుకాయును. దీని పుష్పములొకే జాతికి చేరినట్టివి. ఫలములు కాయవలయుననిన మంచి యెరువు పెట్టవలయును. ఎరువు పెట్టనివి పండవు, కాన వానిని పోతుచెట్లందురు.

పోతుచెట్టును మీదమీద చెక్కుటచే పెంటిచెట్టుగామారును. మొగ్గలను త్రుంచి వేయుటచేత గాని లేక యాకులక్రిందుగానుండు పైభాగమునంతయు నఱకుట చేతగాని కొన్నిసమయములలో నీప్రకారము మార్పుకలుగును.

### ఎక్కువ పండ్లను త్రుంచుట

చెట్టునకు పెఱిగిన యాకు పైభాగపు మూలములో పండ్లను పండించుటలో చాకచక్యము కలదు. కొన్ని చెట్లలో ప్రతియాకు దగ్గఱను నొక పండ్ల గుత్తి యుండును. మఱికొన్నిటిలో నొక్కొక్క ఫలమె కానవగును. గుత్తులుగా కాయు చెట్లపండ్లలో కొన్నింటిని త్రుంచి వేయకున్న పండ్లవృద్ధికాదు మఱియు నొకదాని నొకటి యొత్తుకొని వికారముగా నుండును. ఒక కత్తితో నీపండ్లు కసుగాయలుగా నుండినప్పుడు చెక్కివేయుట మంచిది.

### క్రొత్త మొలకలు పెంచుట

బొప్పాయి చెట్లప్రమాణము కొలది పాటిది. కొన్ని వృక్షములు ౧౫ సంవత్సరములు అంతకన్న నెక్కువ కాలము కూడ ఫలించినవి కలవు. కాని లాభకారి యగు ఫలితపు కాలము మూడు నాలుగు సంవత్సరముల కన్న నెక్కువకాదు.

### పండ్లకాపు

తోటలో మొలకల నాటినపిమ్మట సుమారొక సంవత్సర కాలములో మొదటికాపు కాయును. అటు పిమ్మట సంవత్సరమంతయు ఫలవృక్షములు కాయుచుండును. సాధారణముగా దీనిపంట చాల సమృద్ధి. చలికాలములలో పండ్లు త్వరగా పక్వముకావు కనుక ధరలు కూడ హెచ్చుగా నుండును. బజారున నమ్మవలసిన బొప్పాయిపండ్లను పసుపురంగు వచ్చినవెంటనే త్రుంచవలయును. కొన్ని వృక్షములలో ముఖ్యముగా పొడువుపండ్లుగల వృక్షములలో పండు పండ్లను కొంచము ఆకుపచ్చరంగు వచ్చినప్పుడు పండ్లు పక్వమైనవని తలంచవలెను. కొన్ని రకముల పండ్లకు కొంచముపాటి పసుపురంగు వచ్చినవెంటనే యుపయోగమునకు తగినవని యెంచవలెను. బొప్పాయిపండ్లు పెద్దవగుటచేతను, బరువుగలవ

గుటచేతను పెట్టెలలో పెట్టి పంపునప్పుడే మెత్తనివైన యెడల నమ్మువరకు వి మంచిస్థితిలో నుండుట యగుదు. మరియు పండుకు దెబ్బ దగలనట్లుగా శ్రద్ధతో పండును చూచుకొన వలయును.

## విధములు

బాగుగా విచారించిన పొప్పాయిలో నానావిధము లైన భేదములేవు. ఈ రకముతో నితరరకములు పుష్ప ముల ధూళి సమ్మేళనముద్వారా కలసిపోకుండునట్లు భద్రప రచుటచే కలుగును. దీనినే „పొడుగు జాతి యనియు గుండ్రటి జాతి" యనియు చెప్పుదురు. ఈ రకములో స్త్రీ పురుషజాతి వృక్షములు రెండును కలిసియుండును. తక్కిన సాధారణజాతిలో నీరెండుజాతులు వేర్వేరుగా నుండును. అయితే వృక్షముయొక్క జాతిని వృక్షము పుష్పించువరకు గుర్తింపజాలము. కావున పుష్పించిన తర్వాత మనము నాటినచెట్లలో విశేషభాగము పురుషజాతి వైన మనకు కాలహరణమగుటయు స్థలము వృధాయగు టయు సంభవించును. "పొడుగుజాతి" యొక్క విత్తులవ లన పెరిగిన వృక్షములు విశేషముగా ఫలవంతమగు వృక్ష ములుగా నుండును.

అలంకారార్థ మీవృక్షముల పెంచగోరువారు వీనిని తగిన స్థలములలో నితర తీగెల మధ్య నాటవలెను. మఱియు పురుషజాతి వృక్షములను పొడవైన గుత్తులుగా వ్రేలాడును, సువాసననిచ్చు పుష్పములుకలవై యుండు ను. చెట్లు కొన్ని యడుగులు పెఱిగిన పిమ్మట పుష్పిం చును. అప్పుడే మనము కావలసిన చెట్లను ఏరుకొనుట మంచిది. పండ్లకొరకై చెట్లను పెంచువారైన యొక నూరు స్త్రీజాతి వృక్షములకొక పురుషజాతి వృక్షమును పెంచ వలయును. స్త్రీజాతి పుష్పము పురుషజాతి పుష్పముకన్న ను పొడవుగను, చిన్నని కాడగలదిగను నుండును. మఱియు నా పుష్పముల మధ్యభాగము (బొడ్డు) గుండ్రగానుండును.

## పొప్పాయిపండు—ఆహారము

రసాయన శాస్త్రానుసారముగా ఈక్రింది విభజన మువలన పొప్పాయిపండులో నేయేవస్తువులుండునది విశ దమగును.

| | | | |
|---|---|---|---|
| నీరు | ——————౧౦౦ కి——————— | ౯౦.౭౫ | పాళ్లు |
| ప్రోటీన్ (మాంసకృత్తు) | | .౬ | ,, |
| క్రొవ్వుపదార్థము ,, | | .౧ | ,, |
| నార ,, ,, | | ౧.౦౯ | ,, |
| నత్రజని (సారజనర్దము) Free extact | | ౭.౨ | ,, |
| Ash [బూడిద] ,, | | .౯౮ | ,, |

పొప్పాయియొక్క పక్వఫలములను సర్వ సాధా రణముగా భుజింతురని చూపించియుంటిమి. దీనిని నిడివి గా ముక్కలు గా కోసి విత్తులు తీసివైచెదరు. విత్తులతో గూడ నుండు బంకను మనము గీరవలసిన యవసరములేదు కావున విత్తులను తీసినపిమ్మట చాల రస ణీయముగా నుండును. శ్రేష్ఠమైనపండ్ల ననేకులు వేరే యే వస్తువును గలుపక యట్లే తిందురు. కాని కొందరు కొంచ ము నిమ్మరసమునుగాని, పులుపునారంగి రసమునుగాని, పెద్ద నిమ్మపంటి రసముగాని చేర్చుకొని తిందురు. మఱికొందరు ఉప్పుమిరియాలు లేక చక్కెరకూడ దీనితో వాడుకొం దురు.

దీనినుండి మంచి యూరగాయలు తయారుచేయుట సులభము. ఆకుపచ్చచాయతో నుండు పండును చల్లనీళ్ల లో కడిగి దానిని బట్టతో తుడుచవలెను. దానిని, నిడివి గా తుంటలువలెకోసి పైతోలును తీసివేయుము. విత్తు ల నెత్తివేయుము ఈ తుంటను నొక్కొక్క యంగుళము పరిమాణముగా చెక్కు ము. దీనిలో ఉప్పు కలుపుము, ఒకవారము వరకు తట్ట లలో నీతునకలను ఎండలోబెట్టి యెండించవలెను. సాయంకాలము తర్వాత దీనిని బయటపెట్టకుము. మరియు నీతునకలకు నీరుగాని, చెమ్మగాని తగులకుండునట్లు భద్ర పఱచవలెను. వారము పదిదినముల తర్వాత, వీనిలో ఆవాలు, పచ్చిమిరపకాయలు, అల్లము, లవంగము, పసు పు కలిపి కూజాలలో నుంచుము. కూజాలోపెట్టిన తర్వా త ఉడుకుగానుండు (Vinegar) ను తునకలన్నియు మునుగునట్లుగా పోయవలయును. కూజాలు చల్లగానైన పిమ్మట కూజాలను మూసి యెండలోపెట్టేది. తర్వాత రెండుమూడు వారములకు నుపయోగించవచ్చును. ఈ ఊరగాయ జీర్ణమునకు చాల మంచిది.

## దీని యుపయోగములు

పొప్పాయి చెట్టు వైద్యమందును నితర విషయములందును, అధికముగా లాభకారియని చూపించుట యసమంజసము కానేరదు.

ఈ చెట్టుయొక్క చెక్కనుండివచ్చు నారనుండి త్రాళ్లు పేనుదురు. సాధారణముగా వృక్షము యొక్కయన్ని భాగములును నౌషధములందు వాడుదురు. దీని వేరులు రక్తవృద్ధికి నుపయోగింతురు. దీని విత్తనములు.

మఱియు రుచిపదార్థములుగా భుజింతురు. దాహమును నాపుటకు గూడ వీనిని దిందురు. పక్వమైనపండును షర్బతులలో, రక్తవృద్ధికి నుపయోగపడు నౌషధములలో చేర్చుదురు. .........ఈ వృక్షమునుండి వచ్చు పాలవంటి రసము శరీరమున కత్యంత లాభకారి ఉష్ణప్రదేశములలోనుండు జనులుదీనిని.........

మాగిన పండును ముఖమునకు వన్నె దెచ్చుటకు గాను వాడుదురు, దీని దబ్బనొక దానిని చర్మమునకు రద్దుకొనిన ......మాసిపోవును. ఆకు పచ్చని వర్ణముచే నుంచు ఫలమును, ఆకులును, వస్త్రములపైనుండు మైలను పోగొట్టుటకై సబ్బుగా నుపయోగింతురు.

ఉష్ణప్రదేశములలో కఠినమగు మాంసమును మృదువుగా చేయుటకై దీని పాలవంటి రసమును సర్వసాధారణముగా నుపయోగింతురు. పచ్చనిపండుయొక్క రసముతో గూడియుండిన యొక దబ్బను మాంసముపై రుద్దుదురు. లేదా మాంసమును నీపండుయొక్క రసములో కొంతసేపు నానపెట్టుదురు, కొన్ని సమయములలో మాంసమును నుడికించు నీటిలో నీపండు దబ్బను వేయుదురు.

కొందఱు మాంసమును రాత్రియంతయు పొప్పాయి యాకులలో కప్పిపెట్టి యుంచుదురు. మఱికొందఱు మాంసమును పొప్పాయి చెట్టునకు వ్రేలాడగట్టుదురు. పందులను పొప్పాయి యాకులను మేపిన వాని మాంసము మృదువుగా నుండునందురు. పై చర్యలతో కొన్ని యనుమానాస్పదములు, కొందఱు గ్రంథకర్తలు మాంసముతో పొప్పాయి రసమును కలుపునపుడు దానితో బాటిక అల్లమును కూడ కలుపుట మంచిదందురు.

పొప్పాయి రసములోని విశేషములు దానిలో „పపైన్" అనబడు నొక ద్రవ్యగుణముండుటచేత సంభవించును, ఈ ద్రవ్యగుణమును రసమునుండి „ఆల్కహాల్" ద్వారా వేరుపఱుప బడిన ద్రవ్యముగాని...... ......ద్రవ్యగుణము వలన వైద్యమం దుపయోగములు అనేకములయి నందున పొప్పాయి రసముయొక్క వ్యాపారము చాలగొప్పగా జరుగుచున్నది అమెరికా సంయుక్త రాష్ట్రమునుండి ఎండించిన పొప్పాయిరస మెంతవరకు దిగుమతి యగుచున్నదో సరియైన లెక్కలు లేవుగాని యీవ్యాపారము చేయువారి యంచనా ప్రకారము ౩౫ వేలనుండి ౭౦ వేల డాలర్లవరకు అమ్మబడుచున్నదని తెలియుచున్నది. ఒక కాలు తూకమురసము ౧౪ డాలరు నుండి ౩ డాలర్లవర కమ్ముదురు. (అనగా ౪-౭-నుండి ౯-౦-౦ రుపాయలవరకు) „పపైన్"అనుపదము ద్రవమునకే మొదట వాడబడినను నిప్పుడు ఎండించిన రసమునకు గూడ ప్రయోగించుచున్నారు. అమెరికా వ్యాపారమునకు పశ్చిమ ఇండియా దీవులను సిలోను ద్వీపమును నాధారములై యున్నవి

### రసమును సిద్ధముచేయుట

అమ్మకమునకై రసమును గూర్చుటయందుగాని, తయారుచేయుటయందుగాని గొప్ప చాతుర్యము అవసరము లేదు. కాని శ్రద్ధ యెక్కువగా కావలసి యున్నది. సాధారణముగా పండ్లనుండియే రసముతీయుదురు. వర్షముగురిసి పోయిన తర్వాత ఉదుక యెత్తినప్పుడును వృక్షముగా తేకదిగా నుండినపుడును దానిపై కాసినపండ్ల రసము విశేషముగా నుండును, ప్రాతఃకాలములలో రసము విశేషముగా కూడియుండును. కావున ప్రొద్దుననే సాధారణముగా పక్వము కానిచ్చిన పండ్లనుండి రసముదీసి సాయంకాలము వరకు ఎండలో నుంచుదురు. ఒక యంగుళములో యెనిమిదవ భాగము లోతుగా కాట్లుపెట్టుదురు. కాటుకాటునకు అర్ధఅంగుళము ఎడముండవలెను. ఈ కాటులనుండి రసము కారగా దానిని పట్టిపెట్టుకొనవలెను. ఈ ప్రకారము మూడు నాల్గు దినముల కొకసారి చేయవలెను. కాట్లు పెట్టునపుడు లోహము సంబంధ ముగల కడ్డీలతో పెట్టకూడదు. ఏలనన రసము లోహము

లను తగిలినట్లైన రంగు చెడిపోవును. కావున యెముక గాని, దంతపుముల్లుగాని యుపయోగింపవచ్చును. మొట్టమొదట పండ్లనుండి రసముధారాళముగా స్రవించును. దీనిని గాజుకుప్పెలలోగాని గ్లాసులలోగాని, మట్టి పాత్రలలోగాని పట్టిపెట్టవలెను.

రసము పట్టిన వెంటనే యెండబెట్టవలెను. లేకున్న చిలుముపట్టిపోవును. ఎండిన పిమ్మట వెచ్చగానుండినపుడే కాఫీమిల్లులో దీనిని విసురవచ్చును. అప్పుడిది తెల్లని పొడియగును. అటు పిమ్మట దీనిని సీసాలలో వేసిగాలి జొరకుండునట్లుగా బిరడా వేయవలెను.

ఈ పొడినిగాని లేక యెండిన రసమును పొడిచేయక అట్లేగాని అమెరికాకును, యూరోపునకును ఎగుమతి చేయుదురు. అచ్చట దీనిని శుద్ధిచేసి పొడిగాగాని, గోలీలుగాగాని ,,పెపాయడ్'' కెరాయిన్ ,,పపైన్'' ,,పపయోటిన్'' అని పేర్లుపెట్టి విక్రయింతురు.

కాన్పూరులోని యునైటెడ్ ప్రావిన్సెస్ గవర్నమెంటు టెక్నలాజికల్ సంస్థలో నీరసమును తీయుటను పరీక్షించుచున్నారు. ,,పపైన్'' తయారుచేసి విక్రయమున కనుకూలమగునట్లు చేయయత్నించుచున్నారు. ఈ సంస్థయొక్క ప్రిన్సిపాలు యధీనములో పొప్పాయితోటొకటి యుంచినారు. పండ్లను బొడిచి ,,లాటెక్స్'' పాలును, కూడబెట్టియది యొక చోటినుండి యింకొక చోటి కంపునపుడు చెడకుండుటకై కొన్ని యేర్పాట్లు చేయుచున్నారని తెలియుచున్నది. దీనిని సంస్థకు శుద్ధికై పంపి యచ్చటినుండి యమ్మకమునకు పనికివచ్చునట్లు చేయ యత్నించుచున్నారు. ప్రతి చెట్టునుండి అర్థపౌను పావుసేరు,నుండిము ప్పాతిక పౌను ,,పపైన్'' వచ్చునని లెక్కింపబడినది. ఇదివరకే చెప్పినట్లు అమిరికాకు ముఖ్యముగా సింహళమునుండి యెగుమతి యగును. ఈ ద్వీపములో ౧౯౨౫—౨౬ లోను ౧౯౨౭ లోని మొదటి మూడు మాసములలోను సుంకములవలన ,'పపైన్'' అమ్మకము యెంతయైనది తెలియవచ్చును.

| సంవత్సరములు | పౌండ్లతూకము | వల రూపాయిలు |
|---|---|---|
| ౧౯౨౫ | ౬౦౯౩౩ | ౪౨౪౪౫౮ |
| ౧౯౨౬ | ౭౩౬౨౪ | ౬౨౧౩౮౪ |
| ౧౯౨౭ (౩ మా.) | ౧౯౫౩ | ౧౬౯౨౧ |

జర్మనిలో తయారై హిందూస్థానములో నమ్మబడు ,,పపైన్'' యొక్క ధర ఒక ఔన్సు ౧-౮-అనగా ఒకపౌను ౨౪ రూపాయిలు. కావున ఈ పరిశ్రమను హైదరాబాదులో వృద్ధిచేయుటకు అన్నివిధముల సౌకర్యములున్నవి.

ఒకటి రెండెకరములు పొప్పాయితోటను పెంచి దీని పెంపకమునకయ్యు దీని వ్యాపారలాభమును, దీనిరసము తీయు ఖర్చు మున్నగునవి కనుగొనుటకూడ సాధ్యమైనపని. ఒక యెకరములో ౪౦౦ చెట్లు నాటి మూడుసంవత్సరములు పెంచినట్లైన ఖర్చెంతయగును, పంట యెంతపండునను యంచెనా యీక్రింద చూపబడును—

ఖర్చు:— రూపాయి

[క] మూడుసంవత్సరములకు ప్రారంభపు ఖర్చు
- ౧ యెద్దులజత ౧౫౦-౦-౦
- ౧ బండి ౧౦౧-౦-౦
- ౪౦౦ గుంతలు మూడడుగుల లోతు ప్రకారము త్రవ్వుటకు ౧౦౦-౦-౦
- ఎరువు ౨౦౦ బండ్లు ౧౦౦-౦-౦
- ౪౦౦ మొలకలధర ౫౦-౦-౦

౫౦౦-౦-౦

లేక ప్రతిసంవత్సరము. ౧౬౭-౦-౦

(గ) ప్రతిసంవత్సరము ఇతరఖర్చులు:—

కూలి
- ౧ మనిషికి నెలకు ౧౦ రూపాయిలు, ౧ పిల్లవాడు ,, ౬ ,, ౧౯౨-౦-౦
- ఎద్దులమేత, నెలకు ౧౫ ప్రకారము ౧౮౦-౦-౦
- చిల్లర ౨౮-౦-౦

౪౦౦-౦-౦

అనగా మొత్తము ప్రతిసంవత్సరము ౧౬౭ తో కూడా ౫౬౭-౦-౦

(౨) ఆదాయము. ప్రతిసంవత్సరము.
రసమునుండి

(౩) ప్రతిచెట్టుకు అర్ధపాను రసముప్రకారము, మొత్తము ౨౦౦ పానులు. ౧ పాను ౫ రూపాయిల ప్రకారము. ౧౦౦౦-౦-౦

[౪] పండ్లనుండి.
౪౦౦ చెట్లకు ప్రతిచెట్టునకు ౪౦ పండ్ల ప్రకారము ౧౬౦౦ పండ్లకు పండుకు ౧ అణా ప్రకారము మొత్తము. ౧౦౦౦-౦-౦

ఖర్చుపోగా ౧ యెకరమునకు
[౧౦౦౦-౫౬౮.||] ౪౩౩ రూపాయిలు వచ్చును.

నోటు:—

ప్రకృత పరిస్థితులలో పండ్లను విశేషముగా నమ్ముట కష్టము. ఏలనన దీని యాహారయోగ్యత జనులకు బాగుగా తెలియదు.






# స చి త్ర మా స ప త్రి క

## ప్రతి చాంద్రమాసాదిని ప్రచురింపబడును.

ప్రతి సంచికయందును 3, ౪ వర్ణచిత్రములు, ఇతరచిత్రములు నుండును.

చందా సం॥ ౧-కి రూ. 6-0-0. విడిపత్రిక వెల రూ. 0-10-0

మాదిరి పత్రిక అణాలు 0-10-0.

స్టాంపులను పంపిననే పంపబడును. ఉచితముగ పంపబడదు.
మాదిరిపత్రిక తెప్పించుకొన్నతర్వాత చందాదార్లుగ చేరువారు
ఆసొమ్మును మినహాయించుకొని తక్కినసొమ్ము మాత్రము పంపవచ్చును.

ప్రకటన ధరలు:—

ఒకనెలకు మాత్రము సాధారణ పుట 1-కి రూ 30-0-0

సాధారణపుట $\frac{1}{2}$ కి రూ. 15-0-0; సాధారణపుట $\frac{1}{4}$ కి రూ. 8-0-0

6 నెలలకు అంతకుపైన సాధారణపుట 1-కి నెలకు 1-కి రూ. 25-0-0

నెలకు $\frac{1}{2}$-కి, రూ. 12-0-0; నెలకు $\frac{1}{4}$-కి, రూ. 7-0-0

మేనేజరు, "భా ర తి"

తపాలపెట్టె నెంబరు 212, మదరాసు.

## కావలెను

కొలంబియా ప్రెస్ (సూపర్ సాయిల్ ఫైలు మిషన్) విక్రయమునకు సిద్ధముగా గలదు. ఈ హ్యాండుప్రెస్ చక్కని వర్కింగ్ ఆర్డరులో గలదు. వివరములు తెలియగోరువారు క్రిందివారికి వ్రాయుడు.

ప్రకటనశాఖ,
గోలకొండ పత్రికా కార్యాలయము
హైద్రాబాద.

## ఇర్విన్ పండ్లపొడి

ఇది ఇర్విన్ మూలికలచే తయారు చేయబడినపండ్లపొడి; దీనిని యుపయోగించుట వలన దంతములు పరిశుభ్రతనొందుటయేగాక యెట్టిరకమయిన దంతరోగము లున్నను నిర్మూలములై పోవును.

వెల ప్యాకెట్టు ౧ కి రు ౦-౧-౬

తెలియువారు:
ఇర్విన్ రాజు కంపెని;
౨౮ స్టేషన్ నాంపల్లి, హైద్రాబాదు,
అని వ్రాయవలెను.

## "నెలవంక"

కర్త ఆవంత్స వేంకట రంగారావు బి. ఏ.

గాలిగొల్లడు. నటయోగి. వర్షకాలము. ప్రేమపాశము. ఎండకాలము. వృక్షవర్ణములు. దేవాలయము గాలిదూడకుల బాలుడు. పయఃపానము ఊరుపు మొదలగు ౨౭ అపూర్వఖండ కావ్యములు "నెలవంక" అను పేర ప్రకటింపబడినవి. ౪౮ పౌనుల పేపరు వెయిటు కాగితములపై డెమ్మిసైజున చక్కగా ముద్రింపబడి ఒపేక్ బైండు చేయబడినవి. ౩౦ పుటలు. కొలది ప్రతులు మాత్రమే; మూల్యము స్వల్పము. వెల 0-6-0

దొరయువారు
శ్రీ సాహిత్య పుస్తకాలు కొనువారికి } ఆవంత్స వేంకట రంగారావు బి. ఏ. గుండాల వారివీధి; విజయనగరం



## ఆర్డీ అండు కంపెని.

నేత్ర వైద్యులు సులోచనము అమ్మువారు. (అంధము)
124, కెమ్మ బజారు సికింద్రాబాదు.

కండ్లు చాల జాగ్రత్తగా, కంటిలో ముఖ్యభాగమైన లోపలి పొరను కూడా పరీక్షించి, చీకటి గదిలో (మిడ్రియాటిక్) ననుసరించి అద్దములను విధింతురు.

అద్దపు బిళ్లలు (లెన్సులు) ఇంగ్లాండులోను అమెరికాలోను బ్రసిద్ధి కెక్కిన వారిచేత తయారు చేయబడినవి. అయిదు రూపాయీలకు మించినఖరీదుగలవిదొరుకును.

విద్యార్థులకు ప్రత్యేకముగా, గట్టిగా నుండునట్టియు, చాలకాలము ఉపయోగించునట్టియు, తెల్లని లోహము చేసిన సులోచనములు మంచిరకమైన అద్దములతో పదిరూపాయిలకు యిత్తురు.

మినిస్కిన్, లెంటిక్యులర్ (అనగా చాలసన్నని యెక్కువశక్తిగల లెన్సులు) టారిక్, పంటాల్ క్రిట్ -టాక్' అల్ పెరిక్స్, బైఫోకల్, ట్రైఫోకల్ లోనగు మేలైన మొదటిరకములు, మన యూహిందూదేశములో దొరకనట్టివి; రెట్టింపు ఖరీదు మీద జర్మన్ మొదలగు యితర దేశములకు వ్రాసి తెప్పింతురు. నాటి ఖరీదు రు 60 లు మొదలుకొని రకము ననుసరించి యుండును.

అయిదు రూపాయలు మొదలుకొని యింకను హెచ్చు ధరలకు కల్పిత నేత్రములు అమ్మబడును. మీకంటి రంగునకు గాని కొలతకుగాని సరిపోకున్నచో జర్మని నుండి ప్రత్యేకముగా తెప్పించి అందజేయబడును.

పైలెన్సులను గురించియు నేత్రారోగ్యమును గురించియు సంబంధించిన గ్రంథ సముదాయము ఉపాధ్యాయులకు, హకీములకు, వైద్యులకు, (నర్సులకు) పరిచారికలకు, కంటిబాధపడువారికి ఉచితముగా నిచ్చెదరు



ప్రోషిత భర్తృక

# విషయసూచిక

జనవరి ౧౯౩౦



[౧౫౭]





## పూజా పుష్పమాల

### విజయనగరము

ఇందు సనాతన ధునాతన గ్రంథములు సంవత్సర మునకు నాలుగు వెలువడుచుండును. సంవత్సర చందా మూడురూపాయిలు మాత్రమే. పలువురు భాషాభిజ్ఞులు. పత్రికలు ప్రశంసించిన గ్రంథములు వెలువడుచున్న యీ గ్రంథమాలను భాషాభిమానులు ప్రోత్సహింతురని మా నమ్మకము.

1 శివలీల — వేంకటకాళిదాసకవులు

2 భారతీశతకము — కొల్లాపు ధర్మరాయకవి బి. ఏ.

3 కావ్యబిందువు — వేంకట కాళిదాసకవులు

ఇతరులకు ఒక్కొక్క గ్రంథము వెల ఒక రూపాయి.

— వేంకట కాళిదాసకవులు

నారసింహతలపొందుగోరువారేమి చేయవలెను?

---

## పైపూనులేహ్యము

4 గంటలలోవీర్యము గట్టిపరచును. సింహముతో పోరాడుదునన్న బలముసంగును. రక్తముశుద్ధిపరచును. స్త్రీపురుషులకు ఉల్లాసమెక్కువజేసి సంభోగమునందు ఎక్కువకాలము రమించుటకు శక్తినొసంగును. సుఖజాడ్యములు చేరనీయక అటంకపరచును. మహారణ్యములో నివసించుయోగీశ్వరులచే గ్రహింపబడిన చిన్నకిట్టికీ హిమాలయ పర్వత వనమూలికలు. అంబరు. శిలాజిత్తు కస్తూరి బంగారు మొదలైన అనేకవస్తువులచే సిద్ధపరచితిమి. రసవిష గంధకాదులు చేరియుండలేదు. ప్రాణమునకు రక్తమే అధారము. అది చెడిన అనేక రోగములకు తావిచ్చును. స్త్రీపురుషులువాడి, దీనిలోనున్న మహాప్రభావమును ఆదరింతురుగాక. దీని సేవవలన 100 స్త్రీలతో వర్తింపవచ్చునని శాస్త్రముచెప్పబడెను. ఎక్కువగా రమించుటనవసరము. గుణము లేదన్న వారికిడబ్బువాపసు చేతుము. 30దినములకు సరిపడు డబ్బా రూ 3 వ్యయమేను.

డబ్బాలకైన పోస్టేజి ఉచితము

బిగట్ర్యాబులు ఇర్మనువి 30 రూ 2—8—0

**DR. A. S. MURTHY & Co.**
**Chiecacol City. GANJAM Dt.**

## దాసబోధ

### కాకతీయ గ్రంథమాలలో నాలుగవ కుసుమము

శ్రీ సమర్థ రామదాసస్వామి తన శిష్యుడగు శ్రీ శివాజి చక్రవర్తికొరకు రచించిన అపూర్వ వేదాంత గ్రంథమునకిది సరియగు తెలుగుభాషనము. ఇందు సమగ్రముగ రామదాసస్వామి జీవితము గ్రంథవిమర్శనము. శివాజి రామదాసుల చిత్రపటములు గలవు ఇందు 200 అధ్యాయములలో వేదాంత రహస్యములు రాజనీతి ధర్మములు కర్మయోగము మున్నగు అపూర్వ విషయములు గలవు వేదాంతులు, పండితులు సంసారులు త్యాగులు బాలురు వృద్ధులు పఠింపదగిన పవిత్రగ్రంథము. ఇది బెంగాలు గుజరాతు హిందీభాషలలో తర్జుమాయై వేలకొలది గ్రంథములు కర్చుపడినవి. ఆంధ్రభాషలో ఇప్పుడే వెలువడినది. మహాత్మ గాంధి, తిలకు, రాజవాడే, వామన పంతు [illegible] లక్ష్మణరావు మున్నగు ముఖ్యులు వేనోళ్ల శ్లాఘించిన గ్రంథము [illegible] [illegible] [illegible] 30 ప్రతుల [illegible] ప్రతి 1కి రు 5 [illegible] తెలుగు[illegible]యున్నవి

దాసబోధ ఆఫీసు నందిగామ కృష్ణా

లేక. కాకతీయ గ్రంథమాల, వరంగల్ (నైజాం)

---

## సిల్కు వంటి మజిలీను తానులు

### లోక ప్రసిద్ధి జెందినవి

45 అంగుళములు వెడల్పు 12 గజములవి 6 కమీజులకు సరిపడును. రూ. 7-8-0 లు. దొరలు, ఖిక్కిలి ప్రీతిగా వాడుచున్నారు. అన్ని కాలములలోను వాడతగినవి. కష్టాల ఆగారములు పనితనమైనవి. 15 అంగుళముల కొలత గల 6 కమీజుల పెట్టె రు 9 0 0. అక్కర లేనిచో ఖరీదు వాపసు చేతుము. శ్రీకాకుళం మజిలీనులకు పేరువడసినది. సిల్కు కమీజులు 3 పెట్టె రూ 9 0 0 కొలత లంపుడు.

**A. S. M. Gupta &Co, ChiecacolCity**
**Gunjam Dt,**



హైదరాబాదు, జనవరి ౧౯౩౦

సంపుటము ౪ శా. శ. ౧౮౫౧ శుక్ల సంవత్సర పుష్యము సంచిక ౧

## స్వవిషయము

"సుజాత"కు నాల్గవ సంవత్సర మారంభ మగుచున్న నీ సందర్భమున "స్వవిషయము" పేర కొన్ని యంశములు మనవి చేసికొనుట సంప్రదాయ సిద్ధమేకాక అవసరము కూడ నై యున్నది.

గడచిన మూడు సంవత్సరముల కాలములో 'సుజాతను' సంకల్పించినంత బాగుగ నడుపజాలక పోయితి మను మాట నిజము. ఇందుకు కారణము, లివియవి యని వివరించుటకంటె కార్యనిర్వాహకులు తమయందే లోపము నారోపించు కొనుట యుత్తమమును న్యాయమును నైయున్నది. ఎట్లయినను నాల్గవ వత్సరమున నిది ప్రవేశింప గలిగెనని సంతసించుచున్నాము.

ఇటీవల మదరాసు రాజధాని ఆంధ్రజిల్లాలలో సత్యుత్తమములగు మాసపత్రికలు "పుష్పమాల" "జయంతి" వంటివి వెలువడనారంభించి త్వరలోనే యంతరించినవి. ఎన్నియో క్రొత్తవి వెలువడుచున్నవి. అన్ని విధములగు సౌకర్యములును, భాషా నిపుణుల ప్రోత్సాహమును, ధనాధికుల యభిమానమును గల ప్రాంతము లందే మాసపత్రికలు నిలువజాలక పోవుట కాన్పించి నప్పుడు, నిజాం రాష్ట్రములోని 'సుజాత'వంటి పత్రికను నడపువారికి జంకు కలుగు

టసహజమే దైనను, ఎట్లయినను కర్తవ్య నిర్వాహణమును ప్రధానముగా దలచి దైనమువిూద భారమువైచి ముందడుగిడుచున్న మాకు భాషాభిమానులును దేశాభిమానులును నగు సోదరులు తప్పక సహాయ మొనర్తురని నమ్ముచున్నాము.

ప్లవ సంవత్సరమున సుజాత పూర్వమున కంటె యెక్కువ సుందరముగను, యుపయోగకరముగను నుండుటకు సర్వ ప్రయత్నములును చేయబడినవి. త్రివర్ణ చిత్రములును, హాఫ్‌టోను పటములును విరివిగా వచ్చు టేర్పాటులు చేసియున్నాము. మంచి వ్యాసములు పంపు లేఖకులు సంపాదింపబడి యున్నారు. చారిత్రిక చిహ్నములకు ఖనియగు నిజాము రాష్ట్రములోని పూర్వవైభవమును వ్యాసరూపమున ప్రకటింప నిశ్చయించ బడినది. లఘుకథలు క్రమముగా ప్రతి సంచికయందును ప్రకటించుటకు కట్టుదిట్టములు జరిగినవి. హైదరాబాదులోని ఆంధ్రపరిశోధక సంఘమువారి వలన సేకరింపబడి నట్టియు, బడుచున్నట్టియు చారిత్రిక సాధనములకు దీనియందు స్థానమిూయబడును. ఇదియేల యననేల? పత్రికయొక్క అంతస్స్వరూపమును, బహిస్స్వరూపమును సర్వవిధముల నాకర్షకరముగ జేసి పాఠకుల మానసముల రంజింప జేయదలచి యున్నాము. ఇదిమా సంకల్ప వైశాల్యము; విజయము పాఠక మహాశయులపైనను, భాషాభిమానుల పైనను ఉదారులగు దేశీయులపైనను ఆధారపడి యున్నది.





# దుష్యంతుని సర్టిఫికేట్లకట్ట

(ఎమ్. ఎచ్. ఆర్.)

(౧)

పై శీర్షిక చదువగానే, "ఎవరీ దుష్యంతుడు?" "ఇతనికి 'ఈ సర్టిఫికేట్ల కట్ట'కు ఎటువంటి సంబంధము?" "సర్టిఫికేట్లు ఇతనికి ఇంకెవరైనా యిచ్చినవా? లేక ఇతడే ఇతరులకు యిచ్చినవా?" అనే ప్రశ్నలు కొందరికి తోచవచ్చును. బాగుగా చదువుకొన్న వారిలో నిర్వ్యాపారత్వము ముదురుతూవున్న ఈ దురదృష్టపు కాలములో, ముఖ్యముగా ఉద్యోగముల కొరకు తిరుగుచున్న వారికి ఈ "సర్టిఫికేట్ల కట్ట" సంగతి మరింత విచిత్రముగా స్ఫురించ వచ్చును!

ఏ కారణము వల్లనైతేనేమి, కొన్ని సంశయములు మొదటనే వదిలిస్తే మంచిదని నాకు కూడా అనిపిస్తూనే వున్నది. శీర్షికలో పేరువచ్చిన దుష్యంతుడు, ఉద్యోగము కొరకు తంటాలు పడుతున్న ఎవరో ఈ కాలపు అభ్యర్థి అని అనుకోవద్దు. ఇప్పటికి అయిదువేల యేండ్లకు ముందు వ్రాయబడ్డదని చెప్పుకొన బడుతూవున్న మహా భారతములో వచ్చిన శకుంతలోపాఖ్యానములో వ్యాసుని కథానాయకుడుగా మొదట వుండినట్టిన్ని, ఎంత లేదన్నా, పదహారు వందల సంవత్సరముల కింద వుండిన అభిజ్ఞాన శాకుంతల నాటకమును వ్రాసిన మహాకవి కాళిదాసుని వల్ల ఆశ్రయము, అభయము, ఆదరము, పోషణము పొందినట్టిన్ని హస్తినాపురపు రాజైన దుష్యంతుడే కాని ఇంకొకరు కారు. ఇక "సర్టిఫికేట్ల" మాట. ఇవి దుష్యంతుడు ఇతరునికిగాని ఇతరులకుగాని ఇచ్చినవనే సందేహము వద్దు. సర్టిఫికేట్లు దుష్యంతునికి ఇతరులు ఇచ్చినవే. అవి కూడా దుష్యంతుడు "నాకు సర్టిఫికేటు ఒకటి దయచేయండి" అని అడిగి తెచ్చుకున్నవి కావు. అతని పోషకుడగు మహాకవి అనేకులతో చెప్పి యిప్పించినవే సుమండీ. దుష్యంతుడు అడగటము మాట ఎక్కడిది! అతడు ఆ కాలములో లేనేలేడు! వ్యాసుడు మహా భారతములో అతనిని కథానాయకుణ్నిగా చేసిన సమయములో అంతకు ముందే లేడు!! అసలు ఎన్నడైనా వుండెనా అనే సంగతినే సంశయిస్తున్నారు ఈ కాలపు పరిశోధక మహాశయులు! ఎట్లానైతేనేమి, దుష్యంతుని సర్టిఫికేట్లకట్ట మన ముందర వున్నది. దాన్ని విప్పి, వాటిని విడదీసి కొంచెము ఇష్టాగోష్టిగా ముచ్చటించు కొందాము. ఏం?

ఇదిగో, సర్టిఫికేట్లను పృథక్కరించాము.—ఇంత పెద్దమాట యెందుకు లేండీ—'విడదీశాము' అందాము. సరేనా? సరే.—ఆః! ఇంకోమాట ఇంతకు ముందే చెప్పవలసింది—మరిచి పోయినాను; చెప్ప మంటారా?—'ఈలోగా ఈ సర్టిఫికేట్లు గాలికి ఎగిరి పోతవి.' అంటారేమో. "అట్లా అనుకోవలసిన పని లేదు. ఈ సర్టిఫికేట్లు' అంత సులభముగా ఎగిరి పొయ్యేవి కావండీ స్వామీ! కాళిదాస మహాకవి యొక్క ప్రతిభా విశేషంచేత, అధమ పక్షము, పదహారు వందల యేండ్లబట్టి నిలిచి ఉన్నవి! ఉన్నవంటే మన మాతృ భూమియైన భారత వర్షములోనే కాదు. ద్వీప ద్వీపాంతరములలో ఖండ ఖండాంతరములలో వున్నవి! ఒక భాషలో కాదు. మన మాతృదేశములో వున్న వేర్వేరు భాషలలోనే కాకుండా, ప్రపంచములో వున్న ఏన్నో భాషలలో ఇవి ఉన్నవి లేండీ. *కనుక మనకు 'సర్టిఫికేట్లు' పోతవనే సంశయములో పని లేదు.—ఈ మధ్య ఉపన్యాసమును

*ఇంగ్లీషు భాషలో శాకుంతల నాటకమునకు పండ్రెండు భాషాంతరీకరణములును; జర్మను భాషలో బదునెనిమిదియు, ఇటాలియనులో నాలుగును; రషియనులో మూడును, డ్యానిషులో రెండును, స్వీడనులో రెండును, డచ్చిలో రెండును, స్పానిష్, పోలిష్, హంగేరియన్, చాహీమియన్, ఐస్‌ల్యాండిక్ భాషలలో నొక్కొక్కటియు కలవు. ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము: సంపు. 3. పుట ౧౨౩౯

వదిలిపెట్టి, ఆ మరిచిపోయిన మాట చెప్పుతున్నాను. ఏమంటారా? హస్తినాపురపు చక్రవర్తికి—లేదా, రాజును అనండి—ఈ సర్టిఫికేట్ల కట్టతో ఏమి పని? ఎందుకు పని పడ్డదంటే, మన మహాకవి కాళిదాసుకు "వ్యాసుడు మహాభారతములో వ్రాసి పెట్టిన కథను నాటకముగా వ్రాతా" మని సంకల్పము కలిగింది. దుష్యంతుని కథా నాయకునిగా చేతామని, ఆ గౌరవము అతనికే ఇస్తామని నిశ్చయించాడు. కాని వ్యాసుడు తన కథా నాయకుణ్ణి ¶"అసత్యవంతుడుగాను మోసగాడుగాను" చిత్రించాడు. అట్టివాడు నాటకాలలో కథా నాయకుడుగా ఉండటమును మన లక్షణ శాస్త్రము ఏపొప్పుకోదు. అంతే కాకుండా, కథ అట్లావుంటే వినేటందుకు బాగుగా వుండదు. పాడుగుగా కూడా వుండదు. ఇవన్నీ అనుకోనే ఉండవచ్చు—మహాకవి, దుష్యంతుణ్ణి సత్యవంతుని గాను, న్యాయ బుద్ధిణ్ణిగాను, దయా దాక్షిణ్యములు కల రాజుగాను చిత్రించ వలసి వచ్చింది. ఈ విధముగా కొత్త లక్షణములతో, సుగుణములతోను అతణ్ణి దిద్దవలసి వచ్చినందు వల్ల,—అందులోకూడా నాటకము అయిన కారణంచేత, దుష్యంతునికి ఎందరెందరితోనో సర్టిఫికేట్లు యిప్పించ వలసిన పని కలిగింది!! ఇదీ అసలు కారణము.

ఇక సర్టిఫికేట్లు పరిశీలింతామా; ఏం! చూడండి. వీటిని ఇచ్చినవారిని బట్టి కదా మనము విభాగించటము. మొదట వీరిని రెండు భాగములుగా చేయవచ్చును. (౧) మానవులు (౨) మానవాతీతులు: ఈ మొదటి వారిలో (౧) సాంసారికులు (౨) తపో వనవాసులు అని రెండు తెగలు. అట్లాగే రెండవవారిలో కూడా (౧) సాంసారికులు (౨) తపోవనవాసులు అని విభాగము చేయవచ్చును. మొత్తము మీద నాలుగు భాగములు అవుతూ వున్నవి: వీటిలో మొదటి విభాగముఅయినట్టి

మానవసాంసారికులతో

ఆరంభింతాము. వీరిలో నలుగురు ముఖ్యులు అయినారు! వారెవరు? కంచుకి; ఇద్దరు వైతాళికులు; ప్రతీహారి; పురోహితుడు. లెక్కకుఅయిదుగురు అవుతారు. వీరందరు దాదాపు కొద్ది నౌకరులే అనవచ్చును. పురోహితుడికి కొంచెము యెక్కువ మర్యాద ఉన్నదనుకున్నా, ఆయన కూడా రాజుయెదుట కొద్దివాడే. అతని పోష్య వర్గములోని వాడే పురోహితుడు. మిగిలిన వారిలో స్థితిగతులు యెట్లా వున్నవయ్యా అంటే—కంచుకి అంతఃపురములో రాజుగారికి వార్తలు తీసికొనిపోయి వినుపించేవాడు. వైతాళికులా! వారు రాజును పాటలు పాడి మేలు కొలుపువారు. ప్రతీహారి మాటా? అంతఃపురములో పరిచారకుడు, లేదా పరిచారిక. ఈ పాటివారు తమ యజమానుల యజమానుడైన రాజుకు ఇచ్చే సర్టిఫికట్లకు ఏపాటి విలువ ఉంటుంది. వీరితో పొగడ్తలు లభించటము యేమి గొప్ప? నిజమే— కాని అట్లా అనగూడదు. రాజులకు వారి నవుకరులు కూడా సర్టిఫికేట్లు——ఆమాట అనటము మర్యాద కాదేమో, కాకపోతే—బిరుదులు అనండి, ఇప్పటి కాలములో కూడా యిస్తూనే వున్నారు! ఆశ్చర్య పడవద్దు. చూచారా అండీ. ఒక రాజుగారు విశ్వ విద్యాలయము పెట్టించారను కోండి. దాని అధికారు లందరు రాజుగారి వద్ద—ప్రభుత్వము వద్దినుంచి—జీతము తీసుకుంటారను కోండి; అటునంటివారు—విశ్వ విద్యాలయము వారు అనవలెను—ఆ రాజుగారికి "సర్వజ్ఞ సార్వభౌమ సమవర్తి" అనే "డిగ్రీ" ఇచ్చినారను కోండి! ఇది తప్పా? ఇట్లా జరగటము లేదంటారా? ఉన్నది. అట్లాగే, పైన చెప్పినవారు చేసినారను కోండి! ఏం!! అంతేనా?

కంచుకి గొప్పదనము ఏపాటిదో చూచినాము కదా. ఈ వృద్ధ కంచుకి అంటున్నాడు. ఏమని? దుష్యంతుడు "ప్రజల తన కన్న బిడ్డలవలె" నడపుతున్నాడని.*

¶ ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము: సంపు: 3. పుట ౧_౨౭౪

*ఈ వ్యాసములో ఉద్ధృతము చేయబడు వాక్యములు, పద్యములువీరేశలింగము పంతులుగారి తెనుగుగ్రంథము లోనివి;ఆయా వచనముల క్రిందసంస్కృతమూలము వావిళ్లవారి సంస్కృత ప్రతి ననుసరించి వ్రాయబడును:

ప్రజాః ప్రజాః స్వాఇవ తంత్రయిత్వా।

అంకము ౫. శ్లో: ౫

ఇది అతడు చెప్పిన మాటలోపలి సారాంశము వంటి మాట. ఒక రాజు అయిన వానికి ఇది గొప్ప సర్టిఫికేటే!

ఒక శైతాళికుల మాట. నాటకములో [illegible] ఇద్దరు ఒకసారి మాత్రమే వస్తారు. [illegible] సిన పని కలవారో కాని వీరు చెప్పిన సమయము మెల్లు అపులది కాదు. కాకపోతే పోనీయండి, వీరిలో మొదటి వాడిచ్చిన సర్టిఫికేటు లోపలి వాక్యము చాలా దొడ్డది సుమండీ!

గీ॥ †"స్వసుఖము నజూడక లసెను జగము కొఱకు
[illegible] వ్యాపారమిదియె!"

ఎట్లావున్నదో చూడండి ఈ పొగడ్త! ఇతరుల క్షేమము కొరకు కష్టపడటము, ఏ సుఖము విషయములో కోరికే లేక పోవటము ఇది [illegible]వుచేస్తున్నపని. అది అయినా, ఏదో వకనాడు చేసి ఊరుకోవటం కాదు. ప్రతిరోజూ ఇదేపని అన్నాడు, చూచారా ఎంతగొప్ప మాటో? దుష్యంతుడు ఏమాత్రము తన సుఖము కోరక పోవటము సంగతి శాకుంతల నాటకములోని మొదటి మూడంకము లలోనూ కనుపడ్తూనే వున్నది. అయిదవ అంకములో వసుమతీదేవి పాడిన పాటవల్లనూ రాజు ఆమెను గురించి మాధవ్యునితో చెప్పిన సంగతులవల్లనూ స్పష్టముగా తెలుస్తునే వున్నది కదా. కనుక ఈ సర్టిఫికేటు సంగతి తెలిసికొన్నామన్న మాటే!

రెండవ వైతాళికుని వచనములు మరీ వివరముగా వున్నవి!

గీ॥ *[illegible]రలిచిన శిక్షచేసి దుర్మార్గచరుల

స్వహృదయ [illegible] వారసి కాతువీవు,
[illegible]
బంధువు [illegible]

ఎంత మనోహరములైనట్టి [illegible] వాక్యములు ఇవి! [illegible] చేయవలసిన గొప్ప ఉపకారము న్యాయ పాలనము, ప్రజా రక్షకత్వము. మొదటి దాని లో క్రిమినలు సివిలు రెండు:—దీవాని, ఫౌజ్దారి: మొదటి రెండు చరణములలో ఈ రెండూ వచ్చినవి! చివర రెంటిలో సంరక్షకత్వపు తత్త్వము (Theory of guardianship) వచ్చింది! ఎంత ఉత్తమమైన ప్రశంస గల సర్టిఫికేటు! దుష్యంతుని ప్రజా క్షేమతత్పరత ఎంత స్పష్టముగా వైతాళికుడు దీనిలో ప్రకటించినాడు చూచినారా?

ప్రతీహారికి యెక్కువ అవకాశములు దొరకవు. అయినప్పటికీ, దొరికిన సందర్భములోనే—కొద్దిది, చిన్నది, ఒక సర్టిఫికేటు ఇయ్యనే ఇచ్చెను! ఋషులు యెందుకు వచ్చి యుంటారని రాజు అడుగగానే,—సమయము జారిపోనియ్యక అనెను:—

‡"తమ సుచరిత్రచేత సంతుష్టులైన ఋషు[illegible]
వారిని కొనియాడుటకై వచ్చినారని
చెదను"

మరియొకసారి యిట్లనెను: §"కాలవ[illegible] వర్షమునలె దేవరవారి యాజ్ఞ నందుచు గొనియాడిరి!"

వాంఛి సమయోచిత బుద్ధితో తటాలున [illegible] ఈ సర్టిఫికేటులో ఒక్క వాక్యము—కా[illegible] సుచరిత్ర"అనే ఒక్క శబ్దము ఎంత పనియైనా చేయగలదు! దివ్యమైన కాం[illegible] సర్టిఫికేటు చూసినారా?

---

†స్వసుఖనిరభిలాషః ఖిద్యసే లోకహేతోః
ప్రతిదిన మథవా తేవృత్తి రేవం విధైవ!

అం. ౫ శ్లో ౭

*నియమయసి విమార్గ ప్రస్థితా నాత్త దణ్డః
ప్రశమయసి వివాదం కల్పసే రక్షణాయ।
అతనుషు విభవేషు జ్ఞాతయః సన్తు నామ
త్వయి తు పరిసమాప్తం బంధుకృత్యం ప్రజానాం

అం. ౫ శ్లో

‡సుచరితా[illegible]నందిన ఋషయో [illegible]ంసం[illegible] యితు మాగతా ఇతి తర్కయామి.

అం: ౫: శ్లో: ౯ తరువాత

§కాలే ప్రవృష్టిమివ అభినన్దితం దేవస్య శాసనం;

అం: ౬: శ్లో: ౨౩ తరువాత.

పురోహితుడికి కూడా ఈ నాటకములో అవకాశము ఎక్కువ దొరకలేదు! ఋషులను సత్కరించి తీసికొని రావటములో ఇతడు ఒక సారి వచ్చినాడు. ఈ అంకము పూర్తి అయ్యేవరకు ఉన్నాడు. కాని అతడు నోరెత్తవలసిన పని యెక్కువపడలేదు సందర్భము ఎక్కువ లేకపోయినా రాజుకు ఒక మాటలో సర్టిఫికేటు ఒకటి ఇయ్యక ఊరుకున్నాడా? ఏమన్నాడు?

> *,,ఇదిగో వర్ణాశ్రమపరిపాలనము చేయు మహారాజు ఇంతకు మునుపే సింహాసనము దిగి మీ నిమిత్తము నిరీక్షించుచున్నాడు,''

అని అన్నాడు.

దుష్యంతుడు వర్ణాశ్రమ పరిపాలనము చేయువాడనిన్నీ నిగర్వము, సహనము కలవాడనిన్నీ తనకు దొరికిన కొద్ది సమయములో ఋషులకు చెప్పు మిషమీద సర్టిఫికేటు పడవేయనే వేసెను! సనాతనమగు ఆర్య ధర్మము ప్రకారము శాస్త్రములు విధించుతూ వున్న ,,వర్ణాశ్రమ ధర్మము'' ను పరిపాలించుతున్నాడంటే దివ్యమైన శాసన బద్ధుడు (Constitutional) అగురాజు అనికదా అర్థము. ఎంతటి ప్రజా ప్రభుత్వ కాలము (Democraticage) వచ్చినా దుష్యంతుడు యోగ్యుడైన రాజు అని తోచేటట్టు చేసిన ఈ పై ప్రశంస, ఎంత ప్రశంసింపదగి యున్నదో చూడండి.

పొడుగునా గుంజటం యెందుకనిగాని ఈ తెగవారి వచనాల విషయంలో ఎంతైనా చెప్పవచ్చును. అయినా ముందుకు సాగుదాము.

మానవ తపోవనవాసులు

మొదటి అంకములోనే వైఖానసముని అంటాడు.

> గీ. ‡ ,,అర్తులను గావ బుట్టిన యస్త్రమీదు
> శరము నిరపరాధు మీఁద జనదు సుమ్మ!

ఇంకొకచోట¶ అన్నాడు.

> క. ¶ ...రవు ... వంశ... ...,
> దొరకుందగు నీకుయిట్టి దొడ్డగుణంబుల్

వీటిలో ఒకఋషియైనవాడు ఏ ప్రకారము పొగడినాడో కనుపడుతున్నది. ఈ వచనములలో మంచి యోగ్యత, సాధుత్వము గలవాడనటమేకాక ఈ గుణములువంశమునన్నే, పుట్టుక చేతనే కలిగినవని ధృవపరచినాడు. ఈ సర్టిఫికేటు చూడగా మన నిజాము రాజ్యములో మనకు కనుపిస్తూ వుండే ,,ఆలాఖాందాని సదాఖతు నామాలు'' (గొప్పవంశీకుడని ప్రకటించు ధృవ పత్రికలు) జ్ఞాపకము వస్తూవున్నవి!

తరువాతవారు రెండో అంకములో వచ్చిన ఋషి కుమారులు: వారేమన్నారంటే,

> * ,,దుష్యంతుడు ఋషులకంటె అధికున్నడు కాని వాడు''

అన్నారు. అనగా ,,ఋషులవంటి ఉత్తమ చరిత్ర కలవాడు'' అన్నట్టు. కేవల ప్రాపంచిక జీవనము గడుపుతూఉండే రాజును ఋషికుమారులుచూచి అతని సాత్త్విక జీవనము, ఉత్తమ గుణములు, ఋషులకు దగినవిగా నున్నవి అనడము ఎంత గొప్పమాట! ఋషియే అని మాత్రము అనలేదు! అంతే భేదము కదా!!

దుష్యంతుని ఆస్థానానికి శకుంతలను తీసికొని యిద్దరు కణ్వ శిష్యులు వస్తారు. వారు ఖండితమైన వాక్కుకలవారుగా కనపడతారు. సందర్భము కూడా ఎటువంటిదనగా, వారు రాజునల్ల ఏదైనా సహాయము కోరవలసినపని లేదు. గురువుగారి ఆజ్ఞప్రకారము శకుంతలను భర్తవద్ద విడిచిపెట్టటానికి వచ్చినారు. వారు మహాతేజస్సంపన్నులైనవారు. వారితో ,,మంచి సర్టిఫికేటు ఒకటి దుష్యంతునికి యిప్పిస్తామని మహాకవి సంకల్పముచేసి నా

---

* అసావత్రభవాన్ వర్ణాశ్రమాణాం రక్షితా ప్రాగేవముక్తాసనోవః ప్రతిపాలయతి
అం: ౫. శ్లో: ౧౧ తరువాత.

‡ ఆర్తత్రాణాయవః శస్త్రం,
నప్రహర్తుమనాగసి.
అం: ౧ శ్లో॥ ౧౧.

¶ జన్మయస్య పురోర్వంశే, యుక్తరూప మిదంతవ
అం: ౧ శ్లో॥ ౧౨.

* ఉపపన్న మేతదృషిభ్యోనాతి భిన్నే రాజని.
అం. ౨ శ్లో ౧౩ తరువాత

డాయేమి?" అని తోస్తుంది. కాని సంకల్పించ లేదను కుంటాను. ఎందుకంటే సంకల్పిస్తే ఇప్పించే ఉండును! అది పోనియ్యండి. ఈ శిష్యులపేర్లు శార్ఙరవుడు; శారద్వతుడు. ఎవరితో సిఫారసు చేయించి యిప్పింతామూ అనుకున్నాడేమో? మన కవిరాజు. వారిని పూజించి ఓసు కొనివస్తూవున్న పురోహితుడితో చెప్పింతాము అనుకున్నట్టున్నది! కనుక, పురోహితుడు వెనుక చెప్పిన ప్రకారము రాజును పొగడుతూ ఏమన్నాడంటే:—

,,ఓతపస్వులారా. ఇదిగో వర్ణాశ్రమ పరిపాలనము చేయు మహారాజింతకు మునుపే సింహాసనమును దిగి మీ నిమిత్తము నిరీక్షించు చున్నాడు." అన్నాడు

అనగా ,,మా రాజు ఎంత గొప్పవాడో ఎంత సుగుణసంపదకలవాడో చూడండి" అని కణ్వ శిష్యులను సర్టిఫికేట్ల కొరకు ప్రోత్సహించాడన్నమాట! కాని వాండ్లు సామాన్యులా! కొయ్యముక్కలు!! గాంధీ మహాత్ముడివద్ద మంచి సర్టిఫికేటు సంపాదించటము యెంత కష్టమో వీరివద్ద సంపాదించటము కూడా అంతే కష్టముగా ఉన్నట్టున్నది!

పురోహితుడు యింత ఆకర్షకముగా సూచన చేసినాడు కదా. శిష్యులు ఏమైనా ,,ఆహా! మీరాజు మహామంచివాడయ్యా, షాబాష్" అని అన్నారా? లేదు. మానవ స్వభావమును, అప్పటి సందర్భమును పట్టి, ఏదో ,,అవును" అని అయినా తల ఊపినారా? లేదు. ఏమన్నారో చూచినారా:

‡ ,,శార్ఙ్గ:—ఓ మహాబ్రాహ్మణా! ఇది యెంతయు గొనియాడ దగినదే. మేమీవిషయమున మధ్యస్థులము.

---

‡ శార్ఙ ,,భో మహాబ్రాహ్మణ! కామమే తదభినందనీయం, తథాపిన యమత్ర మధ్యస్థాః

శ్లో॥ భవంతి నమ్రాస్తరవఃఫలోద్గమై
ర్నవాంబు భిర్దూరవిళంబినో ఘనాః
అనుద్ధతాస్సత్పురుషాస్సమృద్ధిభి
స్స్వభావ ఏవైష పరోపకారిణాం.

అం: ౫ శ్లో॥ ౧౨.

గీ. తరులు ఫలసమృద్ధిని నమ్రతను వహించు,
మేఘములు నవోదకముల మిగుల వంగు,
సత్పురుషు లుద్ధతులుగారు సంపదలను,
పటుపరోప కారులకు స్వభావమిదియె!"

అన్నారు.

ఇట్లా అంటే ఏమన్నమాట. కణ్వ శిష్యుడు పురోహితుని పొగడ్తమాటలను మెచ్చుకో లేదు. పురోహితుణ్ని ,,మహాబ్రాహ్మణుడా" అని హేళన చేసినారుకూడా! శార్ఙరవుడి పై మాటల తాత్పర్యమేమంటే:—

¶ ,,నీలో బ్రాహ్మణుని కుండవలసిన గొప్పతనము అంతగా కనపడదు! మాదృక్పథము వేరు; నీదృక్పథము వేరు. రాజుయొక్క వినయము నీకు గొప్పగుణముగా తోచుచున్నది. మాకా అది సహజముగా కనుపడుతున్నది. మేము మధ్యస్థులము. దీనిని స్తుతించుటయు లేక నిందించుటయు లేదు."

ఇంతకు ఏమి తేలినదనగా కణ్వశిష్యుడు పురోహితుడు ప్రేరేపించినా అనుకున్నంత మంచి సర్టిఫికేటు యియ్యలేదు. అయినప్పటికి దుష్యంతుడు పరోపకారి అని అనుకోవచ్చునని పల్లు నములుతూ సర్టిఫికేటు ఇచ్చివాడు. (సంస్కృత మూలములో పరోపకారి అనియే యున్నది. వీరేశలింగముగారు యతిస్థానమును కాపాడు

---

¶ ఈ అభిప్రాయము ఈలేఖకునిది కాదు. ఒక విఖ్యాత ఇంగ్లీష వ్యాఖ్యాతది:

(మా. హ.)

You have not got much of a Brahamin in you! You see things in one light we in another. We are indifferent to this humility, if the king, though you take it as a great merit.

—Kalidasa's Abbhignana Shakuntala by Saradarajan Rai M. A
P. 439

కోవటానికి పటు పరోపకారులకు అని వ్రాసినట్టు కను వడుతూ వున్నది) ఇంత మాత్రపుదైనా చాలునని సంతో షించడానికి కూడా వీలులేదు. ఎందుచేతనంటే: బహుశాలి బహుళః పాపుగంటనేపటికే ఇచ్చినఆకాస్తా సర్టిఫికేటును ప్రాడగుంజు కొన్నట్టయింది! ఎందుకంటారా? తరువాత ఈశార్ఙరవుడే దుష్యంతునితో ఈ ప్రకారము అన్నాడు

* శార్ఙ:—ఏమి? చేసినపని యెడ ద్వేషమునుధర్మ మును తప్పటయు రాజునకుఁ దగునా?

*    *    *    *

‡ శార్ఙ: ఈవికారము తరుచుగా నైశ్వర్యమత్తులకు బుట్టెడిదే"

ఇంతేకాదు. దుష్యంతుని దొంగతో పోల్చినాడు. అసత్యవంతుడని సూచించినాడు పాపుడ వన్నాడు. ఎన్నెన్నియో నిందావాక్యము లన్నాడు. కనుక ఇచ్చిన సర్టిఫికేట్లు ఒకరిద్దేకాదు: రద్దున్నర: ఆపైన బెత్తెడుఅయి నట్టు! కనుక దీనికి వ్యాఖ్యాలేదు అందాము. ఏం?

పై ఎన్ని పోగా, కణ్వమహర్షి ఇచ్చిన చిన్న సర్టి ఫికేటు వకటి ఉన్నది. కణ్వుడు నాల్గో అంకములో శకుంతలను భర్తయింటికి పంపే సందర్భములో వచ్చాడు. ఈ మహానుభావుడు దుష్యంతునితో కలయటమే వసలే దు. దుష్యంతుడు తపోవనములో ఉన్న దినములలో ఈకులప ఆశ్రమములో లేడు. ఉంటే కథ జరుగకనే పొయ్యేది! లేదా, ఇంతపొడుగు పెరుగకుండా పొయ్యేది!! సరే. కణ్వమహర్షి దుష్యంతుని విషయములో చూపించిన గౌరవ భావము ఒక శబ్దములో కానవచ్చింది. నాల్గో అంకములో కుమార్తెను పంపేటప్పుడు ఆలోచించినాడు ఏమని?

¶ కణ్వ:— "పూజ్యుడైన దుష్యంతునకు మేమిప్పుడే మిసందేశము పంపిన యుక్తముగా నుండును" అన్నాడు.

కనుక కణ్వుడిచ్చిన సర్టిఫికేటులో దుష్యంతుడు "పూజ్యుడు" అని మాత్రము వున్నది! కొంత్తమునిూద కణ్వమహర్షి కూడా సర్టిఫికేటు ఇచ్చినవాడే అయినాడు!

అనసూయా ప్రియంవదలు ఇచ్చిన సర్టిఫికేట్లు చాలా చిన్నచిన్నవి. "దయాళుననియు" "మహాత్త్వము" కల వాడనియు వాటిలో ఉన్నది. వాటి విషయములో ఠా క్కున చెప్పవలసింది కనపడటములేదు.

ఈ రెండో విభాగాన్ని యింతటితో సమాప్తం చేతామంటారా? సరే, చేతాము! మానవు లిచ్చిన సర్టిఫి కేట్లు సంపూర్ణం.

---

* "కింకృత కార్యద్వేషో ధర్మం ప్రతి విముఖతా కృతావజ్ఞా?"

‡ "మూర్ఛన్త్యమీవికారాః ప్రాయే ణైశ్వర్యమత్తేషు!" అం: ౫ శ్లో॥ ౧౮.

¶ కాశ్యపః "(ఆత్మగతం) కింనుఖలు తత్రభవతో దుష్యన్తస్య యుక్తరూప మస్మాభి విస్రష్టవ్యం." అం: ౪ శ్లో॥ ౧౧ తరువాత.



# యౌవనుఁడు

చెరుకుపల్లి శివరామయ్యగారు

“నవలావణ్య విభాసురుండు • నవసావాద్రసతం జెంగ సౌ
ష్ఠవ సంభావ్యుఁడు • కోమలాభమున మాత్సర్య ప్రధానుండు, ప
ల్లవ సాదృశ్యుఁడు • హావభావ రుచిరాలంకారమా దార్ఢ్య సం
భవ విద్యా నిపుణుండు • యౌవనుఁడసామాన్యుండు భూమండలిన్.

“మాలిన్యంబగు మేని తోడఁ దొలుతన్ • మర్త్యుండు బాలుండునై
వీలన్ జవ్వనమందు రూపగుణ • లాలిత్యంబు దర్శన్ నేర్పుగన్
ప్రాలేయాంశుఁడు • కాంతిహీనుఁడయ్యున్ ప్రారంభమున్ దాఁ గదా...
బాలుండై • పదియారు సత్కళలచే భాసిల్లఁడే పూర్ణిమన్.

“ఆమోద బుః బాడుచున్ • సలుపు బాల్యక్రీడ లేమాయెనో!
మామోటంబులు వచ్చిరాని పలుకుల్ • ముద్దైన రూపంబు లే
యే మార్గంబుల బోయెనో • గన వశంబే! రూపవిద్యాధన
ప్రాముఖ్యంబున బాలుఁడే యువకుఁడౌ ప్రాయంబునన్ వింతగన్.

“శైశవ విద్యాప్రసంగంబులనుమాని • ప్రణయ విద్యా పరిశ్రమలఁజేయు
పసలేని బాల్య చాపల్య దృష్టులవీడి • పులకించు మోహదృక్కుల నిగుడ్చు
అవ్యక్తముగ మాటలాడు నేర్పులద్రోచి • సరసగంభీర వాక్సరణి మెలపు
తోడి బాలురగూడి యాడు వేడ్కలవీడి • యువజనాళి సావాస నభిలషించు

“హావభావంబుల విలాసి • నవినూత్న
లలితరాగ పరంపర • లతను దోహ
దంబుఁ గలిగించి రతికి సా • ధనముఁ జేయు
జవ్వనుఁడు యౌవనారంభ సమయమందు.

“మిత సంభాషణముల్ దరస్మితయుతుల్ • మిథ్యామనోవాంఛలన్
ప్రతిభాభాగ్య సమంచితంబు లమిత • ప్రజ్ఞావిశేషంబు ల
ద్భుత రాగోదయముల్ స్వభావముగ • సంభూతంబు లౌగాదె! యా
ప్రతి మానుఁడగు సుందరాంగుని • వయఃప్రారంభ సంరంభతన్.

“సకల విద్యా పరిశ్రమల గావించి • లోకమున కీర్తిని గాంచగ నెంచియు
శ్రీమాలి విత్తమార్జించి మానవుఁడుండుఁ • గలవానిగతి మెలంగఁగ దలంచు
భువిలోన దాను మానవ శేఖరుఁడటంచుఁ • దలపించు కొనఁగఁ దపించుచుండు
లలిత వసంతరాత్రుల విలాసినిగూడి • పువుసెజ్జల సుఖింప మరి యుంచుండు

వాంఛలకుఁ బుట్టినిల్లైన • ప్రాయమందు
జవ్వనుని నూత్న మానస • జలధిలోన
సత మసంఖ్యాకులంబులై సంభవించు
భావ వీచిక లెన్న నెవ్వారి వశము?

దారిద్ర్యదుఃఖ సంతప్తుఁడై యున్నను భాగ్యవంతుని రీతిఁ బలుకుచుండు
శాకోల నిభదేహ కాంతియుతుండయ్యు కుసుమాస్త్రుఁడ నటంచుఁ గులుకుచుండు
సహవాసమెంత దుఃస్సహమైన దనచెల్మి శ్రేయస్కరమటంచుఁ జెప్పుచుండు
రోగసంపీడిత రోమాంగియైనను తనుఁ గోరినది రంభ యనిదలంచు

ఔరా! యౌవన గర్వాంధ కారపటలి
జ్ఞానవంతుని పైతము క్షణములోన
భోగపరునిగఁ జేసి కీల్బొమ్మపగిది
నాటలాడించుగాదె చోద్యముగ బుడమి

గరసీజాక్షినిగోరి మానవుఁడు నక్రాంతంబు సంసార సా
గరమందున్ సుఖదుఃఖ ఘోర కమఠ గ్రాహంబులన్ జిక్కుచున్
తరణోపాయముఁ గాన కించుకయు మిథ్యాలోక సంబంధ సు
స్థిరుఁడై యుండుటకెల్ల యౌవనముగాదే కారణంబారయన్.

సామాన్యుల్ బెగడొంద లోకమున బ్రజ్ఞావంతుఁడై జ్ఞాన వి
ద్యామాన్యుండగు వానిసైతము ననాయాసంబుగా సుందరీ
వ్యామోహప్రవిభిన్న చిత్తునిగఁ జేయుంజాలు నెంతో యౌవన
ప్రాముఖ్యంబును యోగదృష్టిని తరింపన్ శక్యమే సూరికిన్.



# ఋగ్వేద నిర్మాణకాలము

డా. వేంకోబరావుగారు

(గత సంచిక తరువాయి)

యజుర్వేదములోని నలుబదవ అధ్యాయమందు వ్రాయబడిన 'అసుర్యానామ తే లోకా' అనెడు శబ్దములందు 'అసుర్య' శబ్దము యేసియా మైనరులోని, యొక దేశముపేరు 'అసీరియా' అని పిలువబడుచుండెను. అని డాక్టరు భండార్‌కర్ గారు వ్రాసియున్నారు.

పంజాబునందుండు హరప్ప, సింధుదేశమందుండు మొహంజోదారో అను గ్రామములందు, భూమిని త్రవ్వుటవలన, ఆశ్చర్యకరమగు సమాచారము లస్తిత్వమునకు రాబడినవి. ఐదుసహస్రాబ్దములు క్రీ. కు పూర్వము నా ప్రజలక్కడ దృఢమగు గృహములు కట్టుకొని నివాసము జేయుటయు, ధాతువులతో పాత్రలను జేసి యుపయోగించుటయు వాడుకయందుండెనని తెలియుచున్నది. తాత్పర్యమేమన, యెంతజూచినను మనము ప్రాచీనకాల విషయములందు నిశ్చితమగు సిద్ధాంతములను స్థిరముజేయుటకు, యింకనూ, మనదగ్గఱ, పర్యాప్త సాధనములు సమకూరలేదని దృఢముగ జెప్పవచ్చును. పూర్వోక్త విచారములను జేసిన పిదప, పాఠకుల యెదుట నొక విచిత్రమైన ప్రాచీన వేద విషయిక ధారణమును జెప్పవలెనని తలచుచున్నాను. వేదములు హిందువుల ధార్మిక గ్రంధములు. ప్రాచీనకాలమునుండి అనేకులు వాటిని, "ఈశ్వరీయ జ్ఞాన" మని అనగ, అపౌరుషేయములని నమ్ముచున్నారు. ప్రాచీన దార్శనికులును, మధ్యకాలీన, వేద భాష్య కర్తలును, కూడ నిదే నమ్మకముగలవారై యుండిరి. ఆధునిక కాలమందు, దయానందులవారు తర్కవితర్కములనుజేసి, విద్వాంసుల యెదుట నీ ప్రస్తావనమే పెట్టియున్నారు. వారి యభిప్రాయానుసారము, వేదములు, ఈశ్వరీయ,జ్ఞానము. అవి సృష్టికి అదియందు ప్రసాదింపబడెను. ఎందుకన, ఈశ్వరీయ జ్ఞానముయొక్క వుపయుక్త సమయ మదేయని, చెప్పవచ్చును. పాశ్చాత్య విద్వాంసులు దీనిపై పెక్కు యాక్షేపణములు జేయుచున్నారు. "ఇది కేవలము మన ధార్మిక పక్షపాతమనియు, ప్రత్యేక ధర్మావలంబి తన గ్రంధములను, వాటి భాషయును, ఈశ్వరీయములని, లేక ఈశ్వర ప్రేరణఫలమని నమ్ముచున్నారు. కాని మా యభిప్రాయమందిది నట్టి భ్రమయని దోచుచున్నది." పై విషయమును రెండుభాగములందు విభజించవచ్చును. మొదటిది, వేదములు ఈశ్వరీయజ్ఞానమనుట. రెండవది అవి సృష్టికాదియందునో మధ్యనో రచియింపబడినదనుట. వేదములు ఈశ్వరీయ జ్ఞానమని, సిద్ధము చేయుటకు వేరువేరు ఋషులు భిన్న భిన్న యుక్తి ప్రయుక్తులను స్వీకరించి యున్నారు. 'మనుష్యునికి ఈశ్వర సాహాయము లేనిది ప్రారంభమందు ధర్మము, కర్మలు, ఆచారములు మొదలగువాటి జ్ఞానములలవడుటకు వీలు లేకుండెను,' అని మీమాంసకారుల మతము. దీనిపైనే పతంజలి వ్రాయుచున్నాడు;

"సపూర్వేషామపిగురుః కాలేనానవచ్ఛేదాత్".

అనగ, ఆ ఈశ్వరుడు ప్రాచీనాతి ప్రాచీనమైన గురువు (మనుష్యునివలె) సమయమునుండి పరిమితకాదు,—మరి కొందరు ఋషుల మతమేమన, 'మనుష్యుడల్పజ్ఞుడు, వానికి సృష్టియొక్క యధార్థజ్ఞానము చివరకు బ్రహ్మజ్ఞానము కాజాలకుండెను. ఉపనిషత్తులు జూచిన తెలియును జే మన,' 'బ్రహ్మ ఒక సామాన్యపు పాలకుడు కాజాలడు అతడు మానవ యింద్రియములకును, మనస్సునకును, అతీతుడు.' సంసారిక వ్యవహారములను తెలిసికొనుటకు ఈశ్వర సాహాయ మావశ్యకమై యుండును. ఈశ్వర జ్ఞాన

§ఋగ్వేదాది భాష్యభూమిక పు. స, ౧౨

వాంఛలకుఁ బుట్టినిల్లైన • ప్రాయమందు
జవ్వనుని నూత్న మానస • జలధిలోన
సత మసంఖ్యాకములంబులై సంభవించు
భావ వీచిక లెన్న నెవ్వారి వశము?

దారిద్ర్యదుఃఖ సంతప్తుఁడై యున్నను భాగ్యవంతుని రీతిఁ బలుకుచుండు
కాకోల నిభదేహ కాంతియుక్తుండయ్యు కుసుమాస్త్రుఁడ నటంచుఁ గులుకుచుండు
సహవాసమెంత దుస్సహమైన దనచెల్మి శ్రేయస్కరమటంచుఁ జెప్పుచుండు
రోగసంపీడిత రోమాంగియైనను తనుగోరినది రంభ యనిదలంచు

ఔరా! యౌవన గర్వాంధ కారపటలి
జ్ఞానవంతుని పైతము క్షణములోన
భోగపరునిగ జేసి కీల్బొమ్మపగిది.
నాటలాడించుగాద చోద్యముగ బుడమి

సరసీజాక్షిని గోరి మానవుఁడు నశ్రాంతంబు సంసార సా
గరమందుఁ సుఖదుఃఖ ఘోర కమఠ గ్రాహంబులన్ జిక్కుచున్
తరణోపాయముఁ గాన కించుకయు మిథ్యాలోక సంబంధ సు
స్థిరుఁడై యుండుటకెల్ల యౌవనముగాదే కారణంబారయన్.

సామాన్యుల్ బెగడొంద లోకమున బ్రజ్ఞావంతుఁడై జ్ఞాన వి
ద్యామాన్యుండగు వానికైతము సునాయాసంబుగా సుందరీ
వ్యామోహ ప్రవిభిన్న చిత్తునిగఁ జేయంజాలు నెంతౌవన
ప్రాముఖ్యంబును యోగదృష్టిని తరింపన్ శక్యమే సూరికిన్.



# ఋగ్వేద నిర్ణయ కాలము

డా॥ వేంకోబరావుగారు

(గత సంచిక తరువాయి)

యజుర్వేదములోని నలుబదవ అధ్యాయమందు వ్రాయబడిన ,అసుర్యానామ తే లోకా' అనెడు శబ్దములందు ,అసుర్య' శబ్దము యేసియా మైనరులోని, యొక దేశముపేరు ,అసీరియా' అని పిలువబడుచుండెను. అని డాక్టరు భండార్‌కర్ గారు వ్రాసియున్నారు.

పంజాబునందుండు హరప్ప, సింధుదేశమందుండు మొహంజోదో అను గ్రామములందు, భూమిని త్రవ్వుటవలన, ఆశ్చర్యకరమగు సమాచారము లస్తిత్వమునకు రాబడినవి. ఐదుసహస్రాబ్దములు క్రీ. పు పూర్వము నాప్రజలక్కడ దృఢమగు గృహములు కట్టుకొని నివాసముజేయుటయు, ధాతువులతో పాత్రలను జేసి యుపయోగించుటయు వాడుకయందుండెనని తెలియుచున్నది. తాత్పర్యమేమన, యెంతజూచినను మనము ప్రాచీనకాల విషయములందు నిశ్చితమగు సిద్ధాంతములను స్థిరముజేయుటకు, యింకనూ, మనదగ్గర, పర్యాప్త సాధనములు సమకూరలేదని దృఢముగ జెప్పవచ్చును. పూర్వోక్త విచారములను జేసిన పిదప, పాఠకుల యెదుట నొక విచిత్రమైన ప్రాచీన వేద విషయిక ధారణమును జెప్పవలెనని తలచుచున్నాను. వేదములు హిందువుల ధార్మిక గ్రంథములు. ప్రాచీనకాలమునుండి అనేకులు వాటిని, „ఈశ్వరీయ జ్ఞాన" మని అనగ, అపౌరుషేయములని నమ్ముచున్నారు. ప్రాచీన దార్శనికులును, మధ్యకాలీన, వేద భాష్య కర్తలును, కూడ నిదే నమ్మకముగలవారై యుండిరి. ఆధునిక కాలమందు, దయానందుల వారు తర్కవితర్కములనుజేసి, విద్వాంసుల యెదుట నీ ప్రస్తావనమే బెట్టియున్నారు. వారి యభిప్రాయానుసారము, వేదములు, ఈశ్వరీయ,జ్ఞానము. అవి సృష్టికి అదియందు ప్రసాదింపబడెను. ఎందుకన, ఈశ్వరీయ జ్ఞానముయొక్క వుపయుక్త సమయ మదేయని, చెప్పవచ్చును. పాశ్చాత్య విద్వాంసులు దీనిపై పెక్కు యాక్షేపణములు జేయుచున్నారు. „ఇది కేవలము మన ధార్మిక పక్షపాతమనియు, ప్రత్యేక ధర్మావలంబి తన గ్రంథములను, వాటి భాషయును, ఈశ్వరీయములని, లేక ఈశ్వర ప్రేరణఫలమని నమ్ముచున్నారు. కాని మా యభిప్రాయమందిది నట్టి భ్రమయని దోచుచున్నది." పై విషయమును రెండుభాగములందు విభజించవచ్చును. మొదటిది, వేదములు ఈశ్వరీయజ్ఞానమనుట. రెండవది అవి సృష్టికాదియందునో మధ్యనో రచియింపబడినదనుట. వేదములు ఈశ్వరీయ జ్ఞానమని, సిద్ధము చేయుటకు వేరువేరు ఋషులు భిన్న భిన్న యుక్తి ప్రయుక్తులను స్వీకరించి యున్నారు. ,మనుష్యునికి ఈశ్వర సాహాయము లేనిది ప్రారంభమందు ధర్మము, కర్మలు, ఆచారములు మొదలగువాటి జ్ఞానములలవడుటకు వీలు లేకుండెను, అని మీమాంసకారుల మతము. దీనిపైనే పతంజలి వ్రాయుచున్నాడ ;

„సపూర్వేషామపిగురు: కాలేనానవచ్ఛేదాత్".

అనగ, ఆ ఈశ్వరుడు ప్రాచీనాతి ప్రాచీనమైన గురువు (మనుష్యునివలె) సమయమునుండి పరిమితకాడు,—మరికొందరు ఋషుల మతమేమన , మనుష్యుడల్పబుద్ధి, వానికి సృష్టియొక్క యథార్థజ్ఞానము చివరకు బ్రహ్మజ్ఞానము కావాల కుండెను. ఉపనిషత్తులు జూచిన తెలియునదేమన,' ,బ్రహ్మ ఒక సామాన్యపు పాలకుడు కాజాలడు అతడు మానవ యింద్రియములకును, మనస్సునకును, అతీతుడు.' సంసారిక వ్యవహారములను తెలిసికొనుటకు ఈశ్వర సాహాయ మావశ్యకమై యుండును. ఈశ్వర జ్ఞాన

---

§ఋగ్వేదాది భాష్యభూమికి పు. స, ౧౨

ము లేనిది మనుష్య మాత్రునకు జ్ఞాన మబ్బనేరదు.

ఈ సిద్ధాంతమును, విచారించు సమయమున, వర్తమాన స్థితిగతులను జూడక, సృష్టియొక్క ప్రారంభిక దశను గురించి, యోచింపవలసి యున్నది. ఒకరి సాహాయము లేనిది, మరియొకడు జ్ఞానము సంపాదించుట సంభవమా? దూర మాలోచించుట యెందులకు? అకబరు పాదుషా జేసిన పరీక్ష అందరికి తెలిసి యుండును. అతడు అప్పుడే పుట్టిన శిశువులను, మనుష్య సమాజమునుండి దూరముంచి యుండెను. కొంత కాలమునకు ఆ వ్యక్తులందును పశువులందును బాహ్యాకార వ్యతిరిక్తము మరియే భేదము లేకుండెను. ఆసిరియాదేశపు రాజగు అసురబనిపాలుని విషయమందు గూడ, యిట్టి సమాచారమే ప్రసిద్ధమై యున్నది. ఈ విషయమందు గొప్ప సంఖ్యలో జూడవలెనన్న నేటి కాలమందు, ఆఫ్రికా, దక్షిణ అమెరికా. దేశములందు అనేక ఆటవిక జాతులను జూడవచ్చును. వారు అనంత కాలమునుండి, సభ్య సమాజముతో కలుబడి లేమింకేని, పశుప్రాయులై యున్నారు. వారియందిట్టి యున్నతి లేదు. తాత్పర్య మేమన మనుష్యు డల్పజ్ఞుడగుట వలన, యితర ప్రేరణలేనిది, స్వయం ఉన్నతి బొందనేరడు, సృష్టి కర్తయొక్క జ్ఞానము, వాని పరిమితి ప్రతిభకతీతమై యున్నది. ప్రారంభమున యెప్పుడు జ్ఞానము ప్రాప్తమగునో అప్పుడు అధికోన్నతి జేగూర్చుకొనుట కంత కఠినము కానేరదు. సృష్టికి ప్రారంభమందును, సృష్టికి వెను వెంటనే దాని యదార్థ జ్ఞానము కూడ నత్యావశ్యకమై యుండెను.

వికాస వాదము (Evolution) యొక్క ప్రసిద్ధ సిద్ధాంతము యేమన; మనుష్యుడు మెల్ల మెల్లన తనంతట తానే ఉన్నతి గలుగజేసు కొనును. అతడు మొదట పశు ప్రాయుడై యుండెను, రానురాను సభ్యుడయ్యెను. అతని బుద్ధి, ఆచారము, మొదలగువాటి వున్నతికూడ ప్రకృతి ననుసరించి, ఉత్తరోత్తరమున, యభివృద్ధి గలుగసాగెను, మొదలగు వాటిపై విషయము ననుసరించి రెండు వాక్యములు వ్రాయు టావశ్యకమని దోచుచున్నది. ప్రాచీన నాగరికజాతుల యితిహాసమును జూచిన, ఆకాలపు పురుషులు. స్త్రీలు, మానసిక, ధార్మిక దృష్టితో నధికోన్నతి గలవారై యుండిరని విశదమగుచున్నది. భారత దేశము మరి దాని నికట దేశములందు. హరిశ్చంద్రుడు శ్రీరాముడు, శ్రీకృష్ణుడు మొదలవారిగుయుత్కృష్ట ధార్మికాచారములవలననే వారు నేటివరకుగూడ పూజనీయులై యున్నారు. పాశ్చాత్య దేశములందు గూడ సాకరటీసు ప్లేటో, మొదలగువారివంటి ప్రఖ్యాత పురుషులు మరలి అగబడుటలేదు. ప్రాచీన భారత ఋషులు, నేటికిని మాననీయులై యున్నారు. బ్రాహ్మణాది గ్రంథముల కర్తలు నేటి పురుషులకన్న తప్పక బుద్ధిమంతులై యుండిరనియు ప్రాచీన కాలమందు మానసిక ధార్మికోన్నతి లేకుండెననియు ప్రకృతియే మెల్ల మెల్లన మనుష్యునకు వున్నతి గలుగజేసెననెడి వికాసవాదము భ్రమాస్పదమైనదని వ్రాయుట అతిశయోక్తి కానేరదు.

పై సిద్ధాంతము యొక్క రెండవ భాగము, వేదములు సృష్టికాదియందు నిర్మాణ మయ్యెను. ఎందుకనగ ఈశ్వరీయ జ్ఞానము సృష్టికాదియందే ప్రసాదింప బడెను. అనెడు వాదముపై నొక ప్రశ్న వెడలు చున్నది. అదేమన, సృష్టి యెప్పుడు నిర్మాణమయ్యెను.? దీనికి కొద్దిగ వాయుట అవసరమై యున్నది.

ఈ విషయమందు, హిందూ శాస్త్రాధారములవలన ఈ సృష్టియొక్క ఆయువు, యీ సమయమందు ౧౯౬౦౮౫౩౧౦౭౮ సంవత్సరములని తెలుపబడు చున్నది‡ అప్పుడు వేదముల నిర్మాణ కాలము కూడ నిదేయని జెప్పినను చెప్పవచ్చును. కాని జిజ్ఞాసిక హృదయులకు యిద మిద్ధమని నిశ్చయము జేయుటకు నేటి వరకు సిద్ధాంతిక సాధనములు సమకూరలేదని, తెలుపుటకు మాకు విషాదమగు చున్నది.

కావునే సిద్ధాంతములను జేసిచేసి, చివరకు దరిగానక, Sir Vinternitz మొదలగు పాశ్చాత్య పండితులు వ్రాసియున్నారు. అదేమన; 'The Vedas are admittedly the oldest books in the World' 'The age of this ve-

‡మనుస్మృతి అ ౧. శ్లో. ౬౩. ౭౩. ౭౯. ౮౦,

nerable Hymanal (Rigveda) is unknoun మరియు, they are the oldest books in the library of Mankind'

కాబట్టి ప్రస్తుతము వింటరునిటజ్ (Vinter nitaz) అనే ప్రసిద్ధ పండితుని శబ్దములతోనే సంతోషించి వ్యాసమును సమాప్తము చేయుచున్నాను.

'But it is a greater service to science to confess our ignorance than to deceive ourselves and others by producing dates, which are no dates, and after all it is came to know that we can see at least someglimps not only to our knowledge but also to our Ignorence'

అనగా, నెద్ది నిజమైన కాలము కాదో, అట్టి కాలమును, జూపి, మనను, యితరులను మోసముజేయుటకన్న, మన అజ్ఞానమును స్వీకరించిన, విజ్ఞానమునకు మిక్కిలి సాహాయము జేయువారల మగుచున్నార మన, అజ్ఞానమునను గూడ పరిమితి గలుగఁజేయుచున్నార మనునది కనుగొని చాల సంతోషమగుచున్నది!



## ఓ కవీ!

ఏ. సుబ్రహ్మణ్యముగారు

ఓ కవీ! త్వన్మనో తటాకోన్నత జల
నిర్మలానంత పరిశుభ్ర నీరవముల
లీలఁ బరుగిడు కెరటాలఁ దేలియాడఁ
దమృత రసస్రవం తికలంను గొన్ని
తనివిఁ దీఱఁగఁ ద్రావితి!
ధన్య! నీప
రోవరాంతర సంస్థిత భావకణము
లెంతనిర్మలంబులో!
వాసియంతుఁ గాంచ
మన కుతూహల మతిసాచు మునిఁగితిపుడు.



# ప్రేమ పరిత్యాగము

పి. వేంకటబ్రహ్మణయ్యగారు

జగన్మోహనరావుగారు ఆ వూరు లోవరు సెకండ్రీ స్కూలు హెడ్మాస్టరుగారు. మూడు నాలుగేండ్ల క్రిందట కాకినాడనుండి బదలీఅయి వచ్చినప్పటినుండి డాక్టరు దయాసాగరం గారికి వీరికి చాల స్నేహం కుదిరింది. అప్పుడప్పుడు అభిప్రాయ భేదాలతో వారు తీవ్ర వాదములకు దిగుచుండే వారయినప్పటికి యిద్దరు సంఘ సంస్కరణాభిలాషులే. డాక్టరు దయాసాగరము గారికి అవకాశము తక్కువగా సంకుటనుబట్టి తనచేత నైనంత సహాయం అన్నివిధాల చేస్తూ జగన్మోహనరావు గారిచే ఒక స్త్రీ సమాజమును స్థాపించి వారికి విజ్ఞానము గొల్పు ఉపన్యాసములను గ్రంథ కాలక్షేపము చేయిస్తూ వుండే వారు. మొదట జగన్మోహనరావుగారి భార్య అన్నపూర్ణ డాక్టరుగారి భార్య సరళ తప్ప మరేస్త్రీ ఆసమాజము వంక గూడేది కాదు. క్రమేణ డాక్టరుగారి మంచితనము చేత పలుకుబడిచేత వూరిలో పదిపదియేనుమంది సభ్యురాండ్రుగా చేరేరు, అందులో సుందరం ఒకతె. దురదృష్టవశాత్తు బాలవితంతు వయింది కాని ఆ తెలివితేటలు ఆ కండ్ల మెఱుపులోనే తెలుస్తుంది. మృదు పలుకుల మాధుర్యం కెంపుమీరిన లేత పెదవిలోనే వెల్లడవుతుంది. హృదయ కోమలత లలితనూవిలాసమే బయటపెడుతుంది. ఆముఖ బింబంలో నిష్కళంక భావాలు తాండవిస్తూవుంటాయి.

సుందరం యుక్తవయసురాలు కాగనే రెండేండ్ల క్రిందట సుందరం ముత్తవ్వతల్లి సుబ్బమ్మగారు సుందరాన్ని సమాజానికి పంపించడం మానెయ్యాలనని అనుకుంది కాని సుందరంయొక్క పట్టుదలను చూచి, పైగా రోజు భాగవత భారతాలను చక్కని కంఠమెత్తి చదివి వినిపించుతుంటే వాడి వత్తలయిన సుందరమ్మ గారి కట్టెశరీరం కూడ పులకరించి పోతుండేది. అమ్మాయి యింకాబాగా చదువుకుంటే బాగుంటుందని, అక్కట మానెయ్యమని సుబ్బమ్మగారు సుందరాన్ని నిర్బంధించలేదు. మొన్నా మధ్యనే వక్తృత్వ పరీక్షలోను, వ్యాసరచనలోను సుందరం రెండు బంగారు పతకాలను కూడ బహుమతి నొందింది. దయా సాగరం గారుకూడ తమ ఉద్యమానికి ఆఖరు కొక స్త్రీయైన అక్కరకు వస్తున్నది కదా అని చాలా సంతోష పడుతుండేవారు. సుందరం యొక్క తెలివి తేటలు చూచి గుణగణాలను చూచి దయా సాగరంగారు మహా ప్రేమిస్తూ వుండేవారు.

## ii

ఆరోజు ఆదివారం. జగన్మోహన రావుగారు యింటిదగ్గరనే వున్నారు, సుందరం యేమైనా క్రొత్త విషయాలను తెలిసికొనవచ్చునని, వార్తా పత్రికలను చదుకోవచ్చునని మధ్యాహ్నం భోజనం కాగానే వచ్చింది. జగన్మోహన రావుగారి భార్య అన్నపూర్ణ పని పాటలు చూచుకొని అప్పుడే డాక్టరు గారింటికి సరళతో ముచ్చట్లకోసం వెళ్ళింది. కాసేపు జగన్మోహన రావుగారు సుందరం యీ మాటా ఆమాట మాట్లాడుకొన్నారు ఇంతలో కాంపౌండులో గుబురుగా పెరిగియున్న మనోరంజని చెట్టునుండి ఘుమఘుమ వాసనలు బయలుదేరేయి సుందరం లేచి వెళ్ళి పువ్వును కోసుకొద్దామని గుబురులో ప్రవేసించి మేఘంలో తిరుగుచున్న మెరుపు తీగలా కొమ్మ కొమ్మను మళ్ళించి చూస్తూ వచ్చింది. జగన్మోహన రావుగారు కూడ మెల్లగా సరదాగా నవ్వుకుంటూ చెట్టు దగ్గరకు వచ్చారు. ఆంచు చాటులోనే కనిపిస్తూవున్న పువ్వును కోసి పిడికిటిలో పట్టుకొని "సుందరం! యెందుకు నీకింత శ్రమ నీ మనోరంజితము నా చేతిలోనే వుంది" అని నవ్వేరు. సుందరానికీ ఆ కవిత్వం అర్థంగాక "మీకోసరమే నేనింత తంటాలు పడడం" అన్నది. జగన్మోహన రావుగారు పరవశత్వం చెందేరు. అటుయిటు యెవరు లేకుండా చూచి సుందరం దగ్గరకువెళ్ళి అమాంతంగా కౌగలించుకొని ముద్దుపెట్టుకున్నారు. సుందరం దిగ్భ్రమచెందింది. త్రోసుకొని మరి మాటాడక యింటిదారి పట్టింది. రావుగారికి కాళ్ళలో నరాలు లేనట్లనిపించింది. దడదడ గుండె కొట్టుకోడం ఆరంభించింది. అల్లాగే చిరుచెమటలు పోసుకుంటూ ... గదిలో ... డారు. నిద్రపోయి

లేచేటప్పటికి యిదంతా స్వప్నమయితే బాగుండునని తంటాలు పడ్డారు. నిద్రపట్టలేదు.

సుందరం యింటికివెళ్లి యెవరితో మాట్లాడకుండ పడుకొన్నది. ఏవేవో వెర్రి భావాలతో పిచ్చెత్తినట్లని పించినది సుందరానికి. నాటినుండి తానొక నూతన ప్రపంచంలో పడ్డట్లనుకొన్నది. ఆరోజు సాయంకాలం సమాజానికి వెళ్లలేదు. అడిగినవాండ్లందరికి వొంటిలో యేమో సుస్తీగా వుందని జవాబు చెప్పింది. మరుసటి రోజుకూడా వెళ్లకుండావుంటే నలుగురు అనుమాన పడుతారని వెళ్లక తప్పిందిగాదు. జగన్మోహనరావు గారు మునుపటి రీతిగా ఆదరింపు మాటలు మాట్లాడలేదు. పైగా అతి గౌరవముగా ఒకసారి నిష్ఠూరంగా ఒకమాట మాట్లాడేవారు. సుందరానికిది కష్టం వేసింది. ప్రపంచములో తన జీవితానికి సార్థకం యీ సమాజం తప్ప మరేదీ లేదనుకొన్న సుందరానికిక్కడా జాగా లేకుండా పోయిందని దుఃఖించింది. బ్రతుకే నిరర్థక మనుకొంది. సుందరం చిన్నబోవడము చూచి జగన్మోహనరావుగారు ఒంటరిచాటున సుందరంతో డగ్గుత్తికతో ,,సుందరం! నేను నీకేమి అపకారం చేశాను!'' అని కండ్లతడితో పలుకరించారు సుందరం కొంగు రెండు చేతులతో మెలిబెడుతూ క్రింద చూస్తూ జల జల కండ్లనీరు కార్చింది.

iii

డాక్టరు దయా సాగరంగారు అప్పుడే భోజనము చేసి తడి పొడిగానున్న టర్కీ టవలును తన విశాల వక్షస్థలముపై కప్పుకొని పట్టు బట్టతో పడక కుర్చీ మీద పడుకొన్నారు. ప్రక్కనున్న టేబిల్ కాని నిలబడి సరళ ఒక్కొక్కాకే చుట్టి తాంబూల మిస్తూ సరదాగాక బుర్లు చెబుతూ వుంది. ఇంతలో ద్వారం దగ్గిర ఎర్రగా పొట్టిగా వ్యాసులైన్ పట్టించి అంటనువ్విన క్రాఫుతో, పెద్ద కండ్లద్దాలతో, తెల్లని లాగుపై సిల్కు అఛార వేసి చేతిలో కాగితాల కట్ట పట్టుకొని సరదాగా కనిబిస్తూ వున్న నవ్వు ముఖంతో జగన్మోహన రావుగారు నిలబడ్డారు.

డాక్టరుగారు:—ఓహో! రండి రండి కూర్చోండి అంటూ ప్రక్కనున్న ఖాళీ కుర్చీని ముందుకు లాగేరు.

సరళ:— ఓహో! ఈవేళ ఆదివారం కాబోలు. అందుకనే ఓరికగా కాగితాల కట్ట పట్టుకొని బయలు దేరేరు అన్నగారు ఏంకథ! ప్రేమ పరిత్యాగమేనా!

జగన్మోహన రావుగారు:—ఏం అలా సెలవిచ్చారు. మా వదినెగారు మీరోపర్యాయం విన్నారుగా, బాగులేదా? వదినెగారెంత నేర్చినా పూర్వ సాంప్రదాయం వదల్లు. ఎంతైనా సోమయాజుల వారింటి ఆడబడుచుగా!

సరళ:—సాంప్రదాయం మాటకు కాదుగాని మీరేదైనా క్రొత్త పత్రికను వెదుక్కున్నారా దీనిని ప్రకటించేవాళ్లనుగా చూచి!

జగ; (చిన్నబోయిన ముఖంతో) సెన్సున్న వాళ్లెవరైనా ప్రకటిస్తారు.

సర: అయితే యిక మీ దృష్టితో సెన్సున్న పత్రిక......

దయాసా:— ఇదిగో! సరళా! ప్రతిదానికిని పరాచకాలేనా? సంగతేమిటో విననిస్తావా లేదా?

సరళ:—నేవిన్నాలెండి. నాకుపనుండి పోవాలె కాని మీరు వినండి.

సరళ మాటలు కొంత నిరుత్సాహమునకు కారణమై ముఖము తెల్లబారినా వికారంగా నవ్వేసి కథ చదవడానికి ప్రారంభించారు జగన్మోహనరావుగారు. డాక్టరుగారు కథంతా ఆసాంతం మాట్లాడకుండా విన్నారు. తరువాత ఓ పెద్ద నిట్టూర్పు విడిచారు. ఆపైన మెల్లగా జగన్మోహనరావుగారి వంక చూచి ,,కథయొక్క ముఖ్యోద్దేశమైన స్త్రీ స్వాతంత్ర్యము వారిని దుర్మార్గపు నడవడికి జారమని సలహా యిచ్చినట్లున్నది,'' అన్నారు. అందుపై జగన్మోహనరావుగారు పావు గంటసేపు గ్రుక్క త్రిప్పుకోకుండా అందరిని తిట్టేసినారు! పూర్వాచార పరాయణులను తుపాకిపెట్టి కాల్చేస్తానన్నారు. ఇంకా యేమేమో అని అలసిపోయి కూర్చున్నారు. అంతా శాంతముగా వింటూ వున్న డాక్టరుగారు ,అం

ధుడు కాదండీ. ఇప్పుడు మీరు చదివిన కథలోని కథానాయిక ఏ మన సోదరియో, భార్యయో, అయితే మన కొంత కష్టముగా వుంటుంది! అన్నారు. జగన్మోహనరావుగారు కూడ 'ఎవరయితే యేమండీ' అని వాద బలిమికన్నా మనసులో కొంత గిలి కలిగింది.

iv

సరళ:—ఏమిటా రాత్రికేసు? అర్ధరాత్రప్పుడు ఆంబోతులా వావుడిగా పరిగెత్తుకుంటూ వచ్చారు! సుందరమ్మకేంజబ్బు?

దయాసా:—జబ్బేమిటో నాకూ తెలియలేదు. ఏదో కొంత చిత్రంగానేవుంది అసలు జరిగిన సంగతేమిటంటే:—రాత్రి పన్నెండింటి గంటలకు సుబ్బమ్మగారు (సుందరం మత్తవ్వతల్లి) దొడ్లోకి వెళ్లేరట. నూతిదగ్గిర కాళ్లు కడుక్కుందామని వెళ్లేసరికి ఎవరో చెట్లనడ చీకట్లో మెల్లిగా వస్తున్నట్లు చప్పుడైతే ఎవరా అని మాట్లాడక నిలబడి చూస్తుంది. దగ్గరా వచ్చేసరికి ఎవరదని హెచ్చరించుకోగానే ఆ మనిషి గిర్రని తిరిగి క్రింద పడింది. ముందుకెళ్లి చూడగానే సుందరమని గుర్తించి గుండె బాదుకొంటూ కేకలేసింది. ఇరుగు పొరుగు వారంతా ఆకేకలో కలవర పడి లేచి దీపాలు చేతపట్టుకొని వచ్చి గుడ్లు మీదికిచేసి పండ్లు గట్టిగా బిగించి కట్టెలాపడున్న సుందరాన్ని మీద పడి యేడుస్తున్న సుబ్బమ్మగారిని చూచేరు. ఒకరు దయ్యమన్నారు. ఇంకొకరు భూతమన్నారు. ఇంకొరింకేమో అన్నారు. ఏదైనా సరే డాక్టరుగారికి చూపించడం మంచిదన్నారు మరి కొందరు. నేను వెళ్లేసరికి భైరవ శాస్త్రిగారు "ఇది అసాధ్యమైన దయ్యమండీ! దీనిని నేను నాచిన్నతనంలో నుంచి యెరుగుదును. మొన్ననే అవధాన్లగారి కోడలును అమాంతం యెత్తి బావిలో పడేసింది" అని యేమేమో చెబుతుంటే సుబ్బమ్మగారు నాయనా! యేలాగైనా మాపిల్లను బ్రతికించు నాయనా అని కాళ్లమీద పడింది. నేను నెమ్మదిగా సుందరం ప్రక్కన కుర్చీమీద కూర్చొని నాడి పరీక్షించాను. పలకరిస్తే పలకలేదు. నాకేమి జబ్బుగా వున్నట్లు తోచక పోయినా—మరేమి భయములేదు. మందిస్తాను. తెల్లవారేటప్పటికి నెమ్మదిస్తుంది. అని చెప్పి మందిచ్చి, వెళ్లి వచ్చేశాను. ఉదయము కనుక్కుంటే నెమ్మదిగానే వుందని తెలిసింది.

సరళ:—అయితే జబ్బేమిటో తెలియక పోయినా మందిస్తారన్నమాట!

డాక్టరు నవ్వుతు:—జబ్బేకాదు. మందుకూడ యేమిటో తెలియదు. మంచినీళ్లలో కాస్తంత రంగన్నమాట. ఈ జబ్బు వైద్యులకు తెలిసేది కాదు గూఢచారులకు తెలిసేది.

సరళ:—అయితే మీరు కూడ కనుక్కున్నారన్నమాట? ప్రొద్దున్నే మీరట్లా వెళ్లగానే అన్నపూర్ణ వచ్చింది (జగన్మోహనరావుగారి భార్య) సుందరమ్మను చూచి వద్దామని అనుకొంటున్నానని అన్నపూర్ణతో అనగానే యేం చూచేమంది సిగ్గువిడియాలులేకపోతే సరి! ఏం జబ్బుంది. నా ముఖం జబ్బు అన్నది. దానిపైన సంగతంతా మెల్లగా అడిగితేయిల్లా చెప్పను మొదలుపెట్టింది.

"మళ్లీ మీరెవరితో అనబోకండి. మీ మనసులోనే వుంచుకోవాలే సుమండీ వదినెగారు. నిన్నరాత్రి యెనిమిది గంటలకు అందరు వెళ్లిపోయిన తరువాత భోజనము చేసికొని మావారు యథాప్రకారంగానే వాకిట కొట్టిడిలోనే పడుకొన్నారు. పదకొండు గంటలయిన తరువాత తలుపుచప్పుడైతే లోపలినుండి మెల్లగా లేచి వెళ్లిచూచెను మావారెందుకో సుందరంగారింటి దొడ్డి గోడపైపు వెళ్లి తొంగిచూస్తున్నారు. చూచిచూచి తిరిగిలోపలికి వచ్చేశారు రెండు మూడుసార్లిల్లాగే వెళ్లి చూచిరావడం ఆరంభించారు. ఇంతలో సుందరంగారి దొడ్డి బావిదగ్గిర కేక వినిపించింది గబగబ తిరిగివచ్చి పడుకొని మరి లేచేరుకారు. ఇది జరిగిన సంగతి. ఆపై సుందరమ్మకు పట్టినది దయ్యమో భూతమో యేదో మీరే తెలిసికోవాలి" అని చెప్పింది అన్నపూర్ణ. దీనికనే మిమ్మలనే అడిగింది మరి మీకేం తోచిందో!

డాక్టరుగారు:—అంతమందిచుట్టుపక్కల వాండ్లు వచ్చినా జగన్మోహనరావుగారు వచ్చేరుకారని నేను రాత్రే సందేహించాను.

V

గాంధిగారి బ్రహ్మచర్యాశ్రమ ధర్మాలు అన్నపూర్ణకు భర్త బాగా బోధించేవారు. కొన్నాళ్లు సులభంగానే కాలం గడిపినా రానురాను అనుచరణలో పెట్టడం సులభసాధ్యంకాదని గ్రహించింది అన్నపూర్ణ. భర్త సులభంగా అనుచరిస్తూవుండగా తాను వెనుకాడడం తనకే గాక స్త్రీలోకానికే నామర్దా అని అన్నపూర్ణ దిట్టతనం వహిస్తూవుండేది. కొంతకాల మిలా జరిగింది. భర్తగారి విముఖతకు గాంధీగారి అనుచరణమే కారణము కానట్లు అన్నపూర్ణ గ్రహించింది. భర్తపై కొంత అసూయత కలిగింది. జగన్మోహ రావుగారు యెప్పటికప్పుడే యేదో తొందరపనున్నట్లు నటించేవారు. కొన్నాళ్లిలా జరిగింది. అన్నపూర్ణకూడా యేదో యింత వండిపెట్టి డాక్టరుగారింటికివెళ్లి సరళతో కాలం గడుపుకొనుచుండేది. ఇది జగన్మోహ రావుగారికి స్త్రీ స్వాతంత్ర్య మంత్రాన్ని యెంత జపించినా స్వవిషయంలో అన్నపూర్ణ స్వేచ్ఛా విహారము తనకు కష్టముగానే అనిపించింది. డాక్టరుగారిపై కొంత అనుమానము కూడ కలిగింది. గట్టిగా అన్నపూర్ణను యేమైనా అంటే అసలుకు మోసం వస్తుందేమో అని జంకేరు జగన్మోహ రావుగారు. మనసుకు స్థిమము లేకుండా వుండేవారు. అవకాశం, అసరదా కబుర్లు. ఆ ఉపన్యాసాలు కట్టుబడ్డాయి. ఎవరితోనైనా యేమైనా మాట్లాడుతూ మాట్లాడుతూ మరచిపోతుండేవారు వెర్రివాడిలాగ!

ఆరోజు రాత్రి అన్నపూర్ణ ఆలస్యంగా వచ్చింది. రాత్రి పదిగంటలకు డాక్టరుగారింటివద్దనుండి జగన్మోహనరావుగారింటికి వచ్చి భోజనానికొరకు అన్నపూర్ణకై యెదురుచూస్తూవున్నారు. అన్నపూర్ణ వచ్చి యేమి మాట్లాడకుండా యింత భర్తకుపెట్టి తాను తిని పడుకొన్నది. జగన్మోహనరావుగారి నేవేవో వెర్రివెర్రిభావాలు తల్లోదూరి తొందరపెట్టివి, అల్లాగే నిద్రపట్టింది, అర్ధరాత్రి దాటిపోయిన తరువాత నిద్రలో లేచారు. ఇల్లంతా వెతికితే అన్నపూర్ణ కనిపించిందికాదు. భరించలేకపోయ్యేరు. అప్పటికప్పుడే మోకాళ్లమీద జీరాడినట్లు డాక్టరుగారింటికి వెళ్లి చూచేరు. తలుపులేవి బిగించినట్లు లేవు. బిగించినా తన కడ్డు ట్లులేవు. ఒక గదిలో డాక్టరుగారు అన్నపూర్ణ సరససల్లాపా లాడుచున్నట్లు కండ్లారా చూచేరు జగన్మోహనరావుగారు దేహమంతా మంటలురేగినవి. మరోగది ద్వారాన్ని పట్టుకొని సరళ తన దుస్థితిని చూచి నవ్వుతూ 'ప్రేమ పరిత్యాగం' అని హేళన చేసినట్లు విన్నారు. జగన్మోహనరావుగారికి పిచ్చెత్తినట్లయింది. మాట సరిగా వచ్చిందికాదు. భరింపలేకపోయ్యారు. కండ్లెర్రచేసి చీల్చి పారేద్దామని 'అన్నపూర్ణా! అన్నపూర్ణా!' అని అరవలేక అరవలేక అరిచి దూకబోయి క్రిందపడ్డారు. అన్నపూర్ణ కలవరపడి లేచి ఏమిటండీ! ఏమిటండీ! అని మంచంమీద నుండి క్రిందపడ్డ జగన్మోహ రావుగారిని లేవనెత్తి మంచంమీద కూర్చోబెట్టింది. ఇంతలో జగన్మోహన రావుగారికి తెలివి వచ్చింది.



# మేఘుడు—యక్షుడు

పంగనామముల రామచంద్రరావుగారు

కూయుచున్నది మధుర వాగ్గుంభనమున, వాసకోయిల వామపార్శ్వమున నిలిచి
పిలుచుచున్నవి యనుకూల ఫలమొసంగ, మేలివలపులు వాతెమ్మెరలు సఖుడ!

పరువములర గర్భాధాన పరిచయంపు, టనుభవం బెఱింగిన బలాకాంగనాళి
నేత్రపేయ భవన్ముఖ నిష్ఠయగుచు, నిన్ను సేవించుచుండ శ్రేణికలుగట్టి

మిగత దినాలు లెక్కిడుచు మీద సుఖింప సముత్సుకత్వ మో
ర్వగొనుచు ప్రాణముల్ బరువుమోసెడి నీదగు భ్రాతృభార్యన
మ్మగువ మదేకపత్ని సుకుమారశరీరను జూతువీవు శీ
ఘ్ర గమనరీతి దీవ్యదలకానగరైక నికేతనంబునన్

భర్తృవిరహంబు ప్రమదలకు భరమె కాని, ధైర్యమునసియాడ పాడివత్తలగుచుండు
ప్రణయ పరిణత హృదయపుష్పంబునకును, ప్రియునిపైనాశ జాతిపో విడనితొడమ

ఎడము లెట్టుచు వట్టిపోయినటులుండ, నేల యరటెమిటారి కన్నియ నొసంగి
యేమి భూదేవి నొక్కార్చి కృష్ణవర్ణ, ఉలుము సరసాల నింపివేయుదువు నీవు.

శ్రవణోత్కృష్ట విభూషణాయిత సుధారమ్యంబు నీమాట వి
న్నవిమై త్రోటివిటంక పాళికల విన్నాణంబుగాగొంచు మేల్
జివురుం దామర తూండ్ల—మానస సరస్సీమ ప్రయాణంబులై
శవ రాయంచలు తోడుతాగలవు పో కైలాస పర్యంతమున్.

(నా అముద్రితమగు "బుబ్బుకబురు"నుండి)



# కవిత్వ గౌరవం

రామకృష్ణ శాస్త్రి గారు

౧

“చాలా రోజు లయిందోయి నాయనా నిన్ను చూసి!—పెద్దవాడవయి పోయినావు—మనవాళ్లంతా బాగున్నారా?—అయితే నీ విప్పుడేం చేస్తున్నావు?— బి. యే అయినావు కాదూ.—”

„—అప్పుడే నాలుగేళ్లయింది—ఏమీ చేయడం లేదండి! ఊరికేనే ఉంటున్నాను.”

‚ఊరికే ఉండట మేమిటి! లక్షణంగా ఏ ఉద్యోగంలో నైనా ప్రవేశిస్తే, నిమిషంలో పైకి వస్తావు— నీవేం తెలివి తక్కువ వాడవా—ఇప్పుడు సంపాదిస్తున్న వాళ్లందరూ, నీ కన్న ఎక్కువ వాళ్లా!—'

„ఏమో లేండి. నాకు మొదటినుండీ ఉద్యోగం చేద్దామనే లేదు. అందుచేత యత్నమే చేయలేదు. ఊరికే—అంటే—తీరుబడిగా తిని కూర్చోవడం కాదు లేండి. ఏదో—కవిత్వమని,—నాటకాలూ, కథలూ.— ఆ ప్రపంచములో పడిఉన్నా. క్రొత్త పద్ధతుల మీద పత్రిక ఒకటి నడుపుదామని ఆలోచిస్తున్నాను, నా భార్య కూడా అంగీకరించింది. ఇద్దరమూ కలిసి, స్త్రీలకూ, పురుషులకూ కూడా కలిసి పనికి వచ్చేటట్టుగా ఉండే టట్టు దాన్ని చేయాలను కుంటున్నాము. ఉన్నాయి లేండీ. ఇలాంటివే అనేక ఊహలు—”

„ఈ కాలంలో కవిత్వం, కావ్యాలూ, ఎందు కన్నా అక్కరకు వస్తాయా? ఆ ధోరణులన్ని మస్తుగా డబ్బు ఉన్నవాళ్లకి గాని, లేకపోతే, మన పరువూ, మర్యాదా మనది కాదనుకునే వాళ్లకి గాని ఉండాలి. సామాన్యులు వాటిని నమ్ముకుని యిల్లిల్లూ గుల్ల చేసుకోవడం తప్ప మరేమీ లేదు.”

„దానికేం లేండి. అభిప్రాయ భేదా లుండవను: నా నమ్మకం మట్టుకు „సుకవితా యద్యస్తి రాజ్యేన కిమ్మ” నియే. లక్ష్మి చంచల కాదండీ. శంకరుడు అందుకనే „లక్ష్మీ స్తోయతరంగ భంగచపలా విద్యుచ్చిరం జీవనం” అన్నాడు: బ్రతికిన నాలుగు నాళ్లలోనే, శాశ్వతంగా పడి ఉండేటట్టు ఏదైనా చేసి పోవాలి. లేకపోతే జన్మకు సార్థకత ఏదీ.”

„సరే, బాగానే ఉంది. మా పన్ని పాత ఆలోచనలు—అడిగానని ఏమనుకోకేం బాబూ—”

హోటలులో కాఫీ త్రాగుతూ కూర్చున్నాను: వెనుకనుంచి మాటలన్నీ వినవస్తున్నాయి. విన్న కొద్దీ నాకు నవ్వు వస్తూన్నది. మాట్లాడే ఇద్దరిలో, ఆ „కవి”ని నే నెరుగుదున్నాను. పట్టుకుంటే వదలడనే, చాటుగా ఒక మూల కూర్చుని, త్వరగా కానిచ్చి బయట పడుదామను కుంటున్నా:

„హలో; ఇక్కడే ఉన్నారే. ఎంత సేపైందండీ వచ్చి!—మిమ్మలను చూడనే లేదు.”

ఇల్లు బయలు దేరేటప్పుడు శకునము ఏమైందా అని ఆలోచించు కున్నాను. ఇంతకూ మనం ఎంత తప్పించుకుందామను కున్నా, గ్రహచారం మనం వెళ్లేచోటికి మనకంటె ముందుగానే చేరుకుని ఉంటుంది. తప్పదు కదా చేసుకున్నది అనుభవించక తీరదు:

„రండి”

అసలు నే నాహ్వానించ కుండానే వచ్చి కూర్చుంటాడు. అయినా, నాకే మనసు ఒప్పక, ఎట్లాగూ అంటుకున్నాడు కదా. వదిలించు కుందామన్నా ఓపట్టున వదిలే రకం కాదు. పొమ్మన్నా పోడు. సరే. రమ్మన్నాను: ఈ లోపుగా ఎవరన్నా, మా స్నేహితులలో నాకన్న సుర దృష్టవంతుడు వస్తాడేమో, అతనికి తగిలించి మెల్లిగా నేను తప్పుకుందామని చూస్తున్నాను:

„తారకంగారూ? విశేషాలేమి టండీ? అన్నాను.

మరి మాట్లాడకుండా ఉంటే మనకే బాగుండదు కాదు?"

"—ఈమధ్య నాకో క్రొత్త అభిప్రాయం కలిగిం దండీ. మీరు కనపడుతారేమో అంతా వివరంగా చెప్పు దామనుకుంటే,—కనబడుతున్నారు కాని. ఎవరితోనో కలిసి వెళ్లుతుంటారు! అప్పుడు పలుకరించడ మెందుకని ఊరుకున్నాను, లేండీ! ఇంటికేనా, దోవలో మాట్లా డుదాం."

నా పంచ ప్రాణాల్లో ఏ ఒకటో అరో మిగిలి, మిగతావన్నీ పైకి పోయినాయి. ఆయను నిమిషాలు మాట్లాడటానికే నాకు ఎంతో కష్టమనిపించింది: ఆసో దంతా ఏలా వినడం?

"నాకు కొస్త పని ఉందండీ. ఈసారి ఎప్పు డన్నా కలుసుకుందాం." అన్నాను. అప్పటికైనా అర్థం చేసుకుని వదులు తాడేమోనని.

"[illegible] తెండి. నేనుకూడా వస్తాను."

"నేను [illegible]"

"ఓహో అలాగా, సరే లెండి, [illegible] వాత చెపుతాను. ఇప్పుడు ముఖ్యంగా రెండు నిమిషా లలో ముగించేస్తాను. రండి కార్టు స్టాండు దాకా వస్తాను."

హోటలు విడిచి యిద్దరమూ బయటికి వచ్చాము.

"—ఏమీ లేదండీ. ఒకనాడు ఏదో ఆలోచిస్తూ పడుకుంటే తటాలు[illegible] ఈ ఆలోచన తట్టింది. నేను ఈ మధ్య ప్రేమ గీతాలు వ్రాయాల[illegible] యత్నం చేస్తున్నాను. దినేశవాగ్ నేనుగార్ పుస్తకం చదివి నప్పటి నుంచీ ఆకో రి[illegible] ఉంది. కాని ఏమి సరిగా కుదురడం లేదు. ఏమా [illegible] విచారించి చూస్తే చివరకు తేలిందండి ప్రియు రా[illegible] ఎవరైనా మనస[illegible] లక్ష్యపడితే గాని సరి అయిన ధోరణి కుదురదని - మీరే [illegible]టారు."

"నిజమే—అయినా మీకు [illegible]వేమిటండ మిమ్మల్ని ఎరుగనివారువనరు, మీకనో కష్టమా."

"అయితే మీకూ నచ్చినదన్న మాటేనా"

"ఓ తప్పకుండా ప్రయత్నంచేసి త్వరలోనే సంపా దించండి. మేమందరమూ చూసి సంతోషిస్తాము"

అక్కడితో అతను వదిలాడు. నేను బండీ ఎక్కి యింటికి వెళ్లి పోయినాను.

౩

"రాంమోహన్!"

—మధ్యాహ్నమంతా బాగా ఎండ వేసింది. అప్పుడే పైరా తిరుగుతూంది. కొస్త కునుకు పట్టిందో లేదో: ఎవరో వాళ్ల సొమ్మంతా పడిపోయినట్లు పిలు వడం మొదలు పెట్టారు. "ఈ విజిటర్సుతో చావొచ్చి పడ్డది" అని విసువుకుంటూ లేచి తలుపు తీశాను.

"పాపం. నిద్ర పోతున్నావు గాబోలు. లేపాను నాలుగు దాటింది కదా అని."—అంటూ లోపలికి ప్రవే శించా[illegible] మా సత్యం.

"పరవాలేదు లేరా, [illegible] ఏలా [illegible] చేసాడి [illegible]—అయినా [illegible] ఎక్కు[illegible] సుతుంది—[illegible]"

[illegible]మూ సిగరెట్లు ముట్టించుకుని [illegible]న్నాము. కొంచెం సేపటికి సత్యం—

"ఆ రకం పనేమి బాగా లేదురా—అన్యా యంగా తన్నులు తింటాడు." అన్నాడు.

"పోనీలే వాడెట్లాపోతే మన కెందుకు. అయినా ఒకమారి తగిలితేనన్నా, మనవెంట పడి వేధించుకు తినడం మానుతాడేమో"

నిజమేకాని. చిక్కొచ్చి పడ్డదిరా. ఆ పుంథా కోర్ —— రామమూర్తి. మనం వాడికి మద్దతు అనుకుం టున్నాడు. మన ఆసలా లేందీ. వాడికి లాటి పనులు చేయడానికి ధైర్య ముంటుందా అని, మనమీద కూడా పగ పట్టాడు!

"వాడితో ఏం పోనిద్దూ [illegible] పరేకాని. సంగతే మిటో [illegible]

"[illegible]కు తెలియదూ?"

"ఊహూం"

„సరేలే—మరి ఆమాట చెప్పవేం? నేను మాట్లాడుతూంటే, నీవు అడ్డం రాకుండా ఆలకిస్తూ ఉండటంచేత నీకు తెలుసు నేమో అనుకున్నాను,——ఏమిటంటే, రామమూర్తి తమ్ముడి కూతుర్ని ఎరుగున్నావు కాదూ—చామన చాయగా, పొడుగ్గా ఉంటుందే, ఆ పిల్ల—తారకం ఆ అమ్మాయితో స్నేహం చేయడానికి తంటాలు పడుతున్నాడని—ఆయన పొడగట్టాడు. ఏమరుగుండా నచ్చి తంతే అల్లరి అవుతుందని, ఒంటరిగాచూసి ఏకాలో చేయో విరగగొట్టేయాలని చూస్తున్నాడు.”

„బాగానే ఉంది”

„బాగా ఉండదూ!—కథ ఇంకా ఉంది. పూర్తిగావిను:——వీడు రాత్రింబవళ్లు ఆ వీధి విడవటం లేదట. కర్మం జాలక ఆ అమ్మాయి ఎందుకన్నా గుమ్మం లోకి వస్తే. ఆమెవేపు తమాషాగా చూడటం, ఆ విషయాలన్నీ పద్యాలుగా వ్రాసి పత్రికలకు పంపించడం, ఈ మాదిరి పిచ్చి పనులన్నీ చేస్తున్నాడు. నీవు „ధర్మవర్ధని” చూడటం లేదూ? అందులో కథ పడ్డనాటినుంచీ ఈ సమాచారం చాలా మందికి తెలిసి పోయింది. ఎంత మందికి తెలిసినా, ఇంకా బయటికి పొక్క కుండా, కోమటి రహస్యంలాగా, తెలిసి తెలియకుండా ఉంది.”

„ఇంతకూ మనమేం జేశామని?”

„మనవెంట బడుతూంటాడు కాదూ, అప్పుడప్పుడు తారకం, అందు చేత మనమే వాడికి హుషారిచ్చి—„నీకేం భయములేదు. మేమున్నాం కదా” అని చెప్పి—ఈ మాదిరిగా చేయిస్తున్నామని ముసలాయన అభిప్రాయం—లేని పోనివన్నీ మన నెత్తిమీదికే వస్తున్నాయే.”

„అయితే ఏం చేయమంటావు. తారకాన్ని మందలించనా!”

„ఏం ప్రయోజనం?—మనం కనుక కదిలిస్తే, ప్రేమ తత్వంమీద గంటసేపు ఉపన్యాస మిస్తూ వెంటబడుతాడు. తన ప్రేమ అలౌకిక మైనదని, దానికోసం తన ప్రాణాన్ని సంతోషంగా ఇచ్చేస్తానని, తెలియని వాళ్లు ఏమనుకున్నా లెక్క లేదని... ఈలాగే వాగుతాడు.”

„పోనీ బెదిరిస్తే”

„—మరీ చెడ్డుంది. వాడికి పశువు—మానాభిమానం ఏమన్నా ఉండిఛా! —ప్రియురాలికోసం—”

నాకు జరిగినదంతా జ్ఞాపకం వచ్చింది.

„సరే ఇక తెలిసింది లేరా సత్యం—నెల్లాళ్ల క్రిందట ఓమారు హోటలులో కనబడి నప్పుడు ఈప్రస్తావన తీసుకుని వచ్చాడు. కాని నేనంతగా లెక్క చేయలేదు:—చివరకు ఈ మాదిరిగా తయారయినాడే!”

„—నాడే అని ఊరుకుంటే ఉపద్రవమేదో సంభవిస్తుంది. వెంటనే పని చేసేయాలి”

„మంచిది నేను చెప్పినట్లుగా చేయి. దాంతో వాడికి తెలివి వస్తుంది. రామ మూర్తిని వదిలి పెట్టెయ్యి. ముసలివాడు మాట తూలాడని మనం కూడా తొందర పడట మెందుకురే? ఆ పిల్ల అల్లరి పడకుండా ఉండటమే మనకు కావాలిసింది”—

నా సలహా ప్రకారం నడవటానికి సత్యం అంగీకరించాడు. ఆ సంగతులే మరొక గంట సేపు మాట్లాడుకుని యిద్దరమూ బయలు దేరాము.

రామమూర్తిగారి యిల్లు మా వీధినే, చాలా ఎదురుగా ఉన్నది. మేము కొంత దూరము పోయే టప్పటికి సత్యము నాకు సైగచేశాడు, నేను గ్రహించి, నిదానంగా చూస్తూంటే. తారకం దృగ్గోచరమయినాడు.

మావాడు చెప్పినట్లుగానే వైఖరి అంతా మారిపోయింది. చాలా తమాషాగా ఉంది ఆ మాపు, నాకు మాత్రం వాణ్ణి చూడగానే ఒళ్లు మండుకు వచ్చింది, „కవిత్వం పేరు పెట్టుకుని యీ దౌర్భాగ్యుడు ఈలాటి పశువు తక్కువ పనులు చేస్తున్నాడేమో” అని.

మమ్మల్ని సమీపించాడు తారకం, ఆచారాన్ని అనుసరించి నిలవేస్తాడను కున్నాను. కాని—„బజారుకా?”—అని పలుకరించి నిలబడకుండా నే నడచి పోయినాడు.

ఆతనుదాటి పోగానే సత్యం బిగ్గరగా నవ్వడం మొదలు పెట్టాడు. నాకు మాత్రం చాలా భయం వేసింది. చివరకు పరిస్థితు లేలా మారుతాయోనని.

మరి నాలుగడుగులు వేశే సరికి రామమూర్తి కనిపించాడు. నిప్పులు గ్రక్కుతున్న కళ్లతో నమ్మల్ని ఒకమారుచూసి, మొగం తిప్పుకుని ఏమో గొణుగుకుంటూ వెళ్లి పోయినాడు.

3

„ముహురిహనిగమన దేధవం.....మృగయలెనె రాధా మాధవం”

మామూలుకన్నా చాలా ప్రొద్దు పోయింది. అప్పటికీ తారకం ఇల్లు జేరుకోలేదు. మేనక దీపం దగ్గర కూర్చుని చదువు కుంటూన్నది.

తలుపు చప్పుడైంది. సరే వచ్చాడు కదా అనుకుని లేచి తీయడానికి వెళ్లింది. చీకట్లో అవతల మనిషెవరో సరిగా కనబడలేదు, „పంతులుగారు వచ్చారా” అని అడిగి, మేనక జవాబు విని ఒక కవరిచ్చి వెళ్లి పోయినాడు.

యాదా లోభంగా తీసుకుని వచ్చి బల్లమీద పడవేసింది. దీపం వెలుతురిలో—„మిసెస్ తారకం” అని పైపేరు కనబడ్డది. చకితయై, చించి చదవటం మొదలు పెట్టింది. ముగించే టప్పటికి భయమూ, విస్మయమూ స్ఫుటంగా మొగాన వ్యక్త మవుతున్నాయి.

చిత్ర ప్రతిమలాగా చాలా సేపు, ఏక దృష్టితో నిలవబడి పోయింది. తరువాత యీజీచేరు వద్దకు పోయి అందులో ఓరగా పడుకున్నది.

ఎంతో సేపటికి—తారకం వచ్చాడు. అతన్ని చూడటంతోనే, ఆమెను ఆదివరకు కలచి వేస్తున్న ఆలోచనలన్నీ మాయమయినాయి. నవ్వు మొగంతో ఎదురుగుండా వెళ్లి మీది ఉత్తరీయమూ, చేతకర్రా అందిపుచ్చుకున్నది. ఆతను వచ్చి సోఫాలో జేర గిలబడినాడు.

„చాలా అలసి పోయినట్లుగా నున్నారే—ఇవాళ ఇంత ఆలస్యంగా వచ్చారేమి?” అని అడిగింది. తారకం మాట్లాడ లేదు. మరికొంత సేపటివరకూ ఆమె ఎన్ని సార్లు పలుకరించినా, మొదలకుండా, ఆమె వైపన్నా చూడకుండా ఊరుకున్నాడు. అప్పటికీ మేనక చలించక,

„ధ్యాన వ్యాజముపేత్య చింతయసి కామ్...”

అని ఎత్తుకున్నది.

అక్కడితో అతను మౌన ముద్రను విడిచి బి. „ఎందుకూ అలా గొణ గొణ లాడుతావూ? నాలుగు నిమిషాల బాటన్నా ఊరికే ఉండవు కదా” అని కోపంగా మాట్లాడినాడు.

„ఏమిటీవింత—మాట్లాడమనడం తప్పైతే, మీరు మాట్లాడక పోవడం తప్పు కాదేం. ఈ మాదిరిగా కసురుకూ కోప్పడ్తు ఉండువారు రేపు పత్రిక ఎట్లా నడుపుతారండీ. నా సాహాయ్యంకూడా కావాలన్నారు కాదూ,”

„నీవు పనికిరావు”

„ఎందుచేతనో... జీతం పుచ్చుకోననా?”

„కాదు తెలివిగా పనిజేయలేవని”

„మీకే తెలుస్తుంది”

„ఇదివరకే తెలిసింది”

—ఎవరో పిలిచారు. తారకం లేవకపోవడం చూసి మేనకే పలికింది. తలుపు తీయడం వ్యవధానంగా మరియొక కవరు ఆమె చేతికి వచ్చింది. తీసుకు వచ్చినమనిషి చెంగున దూకి చీకటిలో కలిసి పోయినాడు.

మేనకవణికి పోతూ అక్కడే నిలవబడి పోయింది. తారకం పిలిచాడో తానా విధంగా ఎంతసేపున్నదో— ఆమె కొస్సృహే లేదు.

ఉరిమినట్లుగా ధ్వని ఆమెను మేల్కొలిపింది. నలుమూలలా కలియచూసే సరికి దీపం వెలుతురున, బల్లదరగా. తారకం గర్జిస్తూ చిందులు త్రొక్కుతున్నాడు ఆతనిచేతులో ఆ_రెండో ఉత్తరమున్నది.

„ఇది ఎవరు వ్రాసారు?”

„నాకు తెలియదు,”

„చెప్పవూ?”

,,నిజంగానే నాకు తెలియదండీ'' అని వెక్కి వెక్కి ఏడుస్తూ ఆతని పాదముల సన్నిధిని పడబోయింది.

ఛీ—నన్ను తాకనద్దు—జారిణీ—

అని వామ పాదంతో తలను తన్ని వేశాడు.

,,ఊఁ— ఆడు పులిలాగా గాండ్రిస్తూ ఆమె నిలబడ్డది. అప్పటి ఆమె మూర్తి భయంకరంగానూ, అత్యం తరమణీయంగానూ ఉంది.

,,ఏమన్నారూ—నేను మీ భార్యను—తెలుసునా,'' తారకం ఏమీ మాట్లాడలేదు.

..మాట్లాడరేం— మర్యాదే కాకుండా పౌరుషం కూడా లేదూ మీకు,''

..ఏమిటే''

..మీకు ఒళ్లు తెలిసే అన్నారా—భార్యను జారిణీ అని పిలవడానికి ,లజ్జించని మిమ్మలను చూడటానికే నాకు కష్టంగా ఉంది_తెలిసిందా—ఇదంతా మీ భావుకత్వపు పోకడయేనా.''

..సరే_తెలిసిందిలే_ నన్నుచూడటానికి ఏకు కష్టంగాఉండదూ—,,రాజును చూపిన కళ్లతో ——ఇంతకు నిన్ననవలసిన పని ఏముంది?—నా ప్రారబ్ధము.''

ఆ కాగితము ఆమె మీద విసిరివేసి తారకం ఇంట్లోనుంచి వెళ్లిపోయినాడు. ఆమె మాట్లాడనూలేదు''అతనివైపు చూడనూలేదు.''

ఆతని బూట్సుల చప్పుడు వినపడకుండా పోయిన తరువాత, దెబ్బతిన్న ఆడు లేడివలె ఆర్తనాదంతో ఆమె క్రిందపడిపోయి విలపించింది.

..నన్నింత నిష్ఠుర మాడటం కన్న చంపివేస్తే బాగుండేదే ఏమన్నారూ—అయ్యో.—''

౮

సూర్యుడస్తమించ బోతున్నాడు.

పార్కులో గ్రీన్ హౌసు ప్రక్కను నేనూ సత్యమూ కూర్చున్నాము. సత్యం ఎవరి కోసమో నిరీక్షిస్తున్నవాడిలాగా అటూఇటూ చూస్తున్నాడు. నేను టైమ్సులో బొమ్మలు చూస్తున్నాను.

సత్యం లేచి వెళ్లిపోయినాడు. నేను మరినాలుగడుగుల దూరంలో ఉన్న జూకామల్లె బవర్ చాటు వితర్దికి మీదకు జేరుకున్నాను.

,,ఈలా రండి'' అని తాను ముందు నడుస్తూ మేనకను ప్రవేశ పెట్టాడు సత్యం ,,అమ్మా కూర్చోండి'' అని స్థలం నిర్దేశించాడు,

ఆమె కూర్చున్నది.

,,మీరేనా'' అన్నది సత్యంవంక నమురూ బెదురూ లేకుండాచూసి,

,,అవును'' అని సిగ్గుపడుతూ మావాడు సమాధానం చెప్పాడు.

..మీరు చేసిన పనికి పరిణామ మేమో ఆలోచించారా?''

సత్యం మాట్లాడలేదు.

,,ఒక దంపతులకు ఎడబాటు కలుగజేశారు_ఒక అయిన యింటిపిల్లను ,,భర్త. ఎన్నడూ ఎరుగని రీతిని అవమానించేటట్టు చేశారు_ఇంకా ఏమి చేయనున్నారో.— ఈ విధంగా నామీద పగ సాధించ డానికి హేతు వేమిటో దయయుంచి సెలవిస్తారా?''

సత్యం కళ్లనీళ్లు ఆపుకోలేక పోయినాడు.

,,అమ్మా! క్షమించండి_ అని గద్గదికంతో అన్నాడు.

,,చెప్పుతారా''

—నేల అదిరేటట్టు అడుగులు వేస్తూ, తారకం రొప్పుకుంటూ వచ్చి వారిద్దరి దగ్గరా నిలబడి పోయినాడు. అందరూ భ్రాన్తపడినారు. సత్యంమాత్రం చిరునవ్వు మెరిపించాడు.

,,అమ్మా! ఎంతపని చేశావూ—నా_డెవిల్'' అని చేయెత్తి సత్యం మీదికిపోయినాడు తారకం.

..ఏమిటా మూకుడు?_అంటూ నేను చాటునుంచి వచ్చి ఎత్తిన చేయి ఆపేశాను.

తారకం నిజంగా నిర్జీవుడయి పోయినాడు. అతన్ని చూస్తే నాకే జాలివేసింది. తలవంచుకుని —నన్ను ద్దేశించి.

..మీరే—''అన్నాడు తడబడుతూ.

నేను ఎంతో ప్రయత్నం మీద మనసులోని భావాలేమీ పైకి తోచకుండా చేసి_

,, నేనేనండీ; తారకంగారు_మావాడు ప్రేమ గీతాలు వ్రాద్దా మనుకుంటున్నాడు లెండి_మీరు చెప్పిన పద్ధతే బాగా నచ్చిందినాకు. మా సత్యానికి ఉపదేశించాను_మీరు_ శుభ్రంగా. ధోరణి మార్చేసి విరహిలాగా, విరాగిలాగా, రచనలు మొదలు పెట్టవచ్చును కాదూ _.ఏకక్రియా.”

తారకం స్త్రీ కన్న ఎక్కువగా ఆక్రందనం చేస్తూ,

,,మీరు చెప్పినది తెలిసింది._చాలా పొరబాటు_క్షాన్ని దానికింతటి శిక్ష___మీరు__” అని ఆ పైన మాట్లాడలేక పోయినాడు.

,,అపరాధాన్ని అనుసరించే శిక్ష కూడాను___పరిమితి తెలిసిందా?”

,, తెలిసింది, అంగీకరిస్తూన్నాను. కాని ఆమె__”

__,,మీ భార్య కావడమే ఆమెకు శిక్ష___”

,,అంతేనా?”

నేను నవ్వాను.

,,తారకం నీవు ఇంత అమాయకుడవూ, అబలలాటివాడవూ అనుకో లేదోయ్__నీ భావ పైత్యాన్ని వదలకొడుదామని యీ చిన్న రూపకాభి నయనము ఏర్పాటు చేశాను. అందులో, వేషధారులము ప్రేక్షకులమూ మనమే కావలసి వచ్చింది.___నీకు అందరికీ చెప్పేపద్ధతి నచ్చదని ఈ మార్గం అవలంబించాను__నీవు కవివి కాదూ?_”

,,మరి_”

,,నీమరి నాకు తెలుసును లే_అయిదు నిమిషాల దాకా ఆపు నీమరిని, గిరిని_”

,,సత్యం_!” అని తల విశిరాను.

,,అమాధ !_” తల ఎత్తలేక కూర్చుని ఉన్న మేనకను సంబోధించి, రెండు కాగితా లామెవద్దనుండి తెచ్చి వాకిచ్చాడు మావాడు.

,,ఇదుగోనోయి తారకం_మొదటిఉత్తరం_నీవు చదువలేదుదీన్ని_నాచేత్తో వ్రాసింది. సోదరీ, మీ క్షేమాన్ని కోరి, కొన్ని ముఖ్యమయిన సంగతులు మీ కారుక బరచాలని, ఎల్లుండి సాయంకాలము పార్కులో కలుసుకొమ్మని ప్రార్థిస్తున్నాను.” _సరే రెండవది చూశావు కదా_ ,, రేపే వస్తే చాలా సంతోషిస్తాను. సో_” ఆ,సో, ఏమిటో నీకు వెంటనే అర్థమయితే ఇందాకా వచ్చేదే కాదు_ఎవరిపేరో అనుకున్నావు కాని ఎంతకవి వైనా_,,సోదరుడు,, అయిఉంటుందేమో అని ఆలోచించావూ_అట్లా అవుతుందనుకున్న దేమో లే.,

పొడుకలగని మేల్కొంచినవాని లాగా తారకం తెప్పరిల్లాడు.

,,పొరబాటు_,, అని చేతులు జోడించ బోతున్నాడు.

,,ఇట్లా రా_,, నేను చాలా తీవ్రంగా పిలిచాను. ఆతను ఆశ్చర్య పడుతూ వెంటవచ్చాడు. కొంతదూరం తీసుకుని వెళ్లి_మంచికవి కావడానికి మార్గము ప్రియురాళ్లను సంపాదించాలని తిరగడం కాదు. అనురాగవతీ, అనుకూలా అయిన భార్యను, మన్నిస్తూ, కలిసి మెలిసి కాపురం చేయడం_మనం ప్రేమిస్తూన్నామనుకునే ఆప్రియురాలికి, కూడా, మన భార్యలకు లాగానే_అయినా తెలిసినవాడవు, నీకు చెప్పవలసిన పనేముందీ,

ఇద్దరమూ తిరిగి సత్యం, మేనకా ఉన్నచోటికివచ్చేశాము.

,, మేము వెళుతామండీ, అన్నగారూ,, అన్నది మేనక.

,,అమ్మా మంచిది. తారకం సంగతంతా యింటిదగ్గర చెప్పుతాడు లెండి_శ్రమయిచ్చినందుకు మాత్రం_,,

,,ఆఁ పరవాలేదు___అన్నలను చూడటానికి రావడముకూడా చెల్లెలికి పెద్దశ్రమ యేనా?,,

పార్కు బయటి దాకా కలిసి వచ్చాము. తారకం, భార్యా బండిలో ఎక్కారు. వెళ్లిపోతున్నారు.

,, రేపు సాయంకాలము ఇద్దరమూ మీయింటికి టీకి వస్తాము___, అని సత్యం వెనుకనుంచి కేకవేశాడు.

---

# అన్నపూర్ణ

(ఓ. సీతారామచంద్రరావుగారు)

(ఏకాంక రూపకము)

౧ ప్రదేశము:—ఓరుగల్లు కోట వెలుపల

ప్రవేశము:—ఏకాంబరుఁడు.

ఏకాంబరుఁడు—(సవితర్కము) నేను నిశ్చయి[illegible]న దింతదాక నిశ్చయముకానిదెన్నఁడులేదు. స[illegible] కా[illegible]ప్ఘారు దండయాత్ర యీసారి మ[illegible]యు క[illegible]ట్టముగానున్నది. హైందవులకు జయ మీసారి తప్పక గలుగునను సూచనయైన కన్పట్టుటలేదు. సమయము ననుసరింపవల యును. ఆలీమ ఖానునితో నేను గల్పించిన సంధి ప్రస్తా[illegible]ప[illegible]గమే (విచారించి) కాకున్న తక్కిన [illegible] [illegible] [illegible]. ఇట[illegible] [illegible]గ విచా[illegible]ంకొనుట [illegible] గలుగదు.

(గృహాభిముఖుఁడై నడచుచుండఁగా రఘుప[illegible]త్రో వలో సంధించును.)

రఘుప[illegible]—ఏమి? ఏకాంబరస్వామి! నిరపాయమే నా!

ఏకా—కాకేమి. జరిగిన సభలోని సూచనల ననుస రించితిని.

రఘు—కార్యయా? పండా?

ఏకా—పండే. కాని, ఇంకను—

రఘు—[illegible]మనసు పండలేదా?

ఏకా—(ఆలోచనలో గూడుకొనిన భావము స్ఫు రించునట్లు తల నాడించును.)

రఘు—చేసిన ప్రమాణమో?

ఏకా—కానున్న దేశద్రోహమో?

రఘు—(కొంచె మాలోచించి) మంచిది. జరిగిన విషయము—చేసిన ప్రతిన—కానున్నపని—[illegible]నున్న ఫలము— మొదలయినవి చక్కఁగ విచారించుకొనుము. నేను, తొం దరపని గలదు; పోయివచ్చెదను.

ఏకా—ఎంతమాత్రమైన నాళయున్న మనమీ దారి త్రొక్కవలదు.

రఘు—నేను పోయివచ్చెదను. నీకు పిచ్చియెత్తుచు న్నది. హిందువుల జయకాలము వెనుకబట్టినది. (నిష్క్ర మించును.)

ఏకా—ఏకోదేవః కేశవోవా, శివోవా, (నిష్క్ర మించును.)

౨ ప్రదేశము: ఏకాం[illegible]ని యింటిమేడ,

ప్రవేశము: అన్నపూర్ణ.

అన్నపూర్ణ—(సవిషాదము) ఏదేశీయులు తన దేశ మ[illegible]లో నున్నతరి ప్రాణాహుతుల నైన వేసికొ నక [illegible] [illegible]దేశీయులే స్వదేశ[illegible]ను తె[illegible]ని[illegible] గ్నికొ[illegible] [illegible] పరీక్షను చేయు[illegible] నపుడు దేవు నకంటె ది[illegible]. మేఘానం[illegible]లగు పంచ బృహస్పతుల పన్నుగడల నన్నిటిని దేశవిప్లవకారులగు సచుల సహా యమున చక్రవర్తిసేన ధ్వస్తమొనరించుచున్నది! (కనులని రువిడచి) సంకటములో సంకటము—నేనుగనిన దానినిబట్టి చేసిన యోచన మకారణముగా నుండగలదా? నిశ్చయమే యైన నాకృత్యమేమి? పతిత్వము—దేశాభిమానము! (విచా రించి) విషాదము స్త్రైణము: ధైర్యము పౌరుషము. నేను స్త్రీనైనను కాలము ననుసరించి—చేసిన సమయము నను సరించి—పూనిన వ్రతము ననుసరించి రానున్న యుపఖ్యా తికి శాంతముగ దల నొగ్గవలయును. (వెనకకు మఱలి చూడఁగ నేకాంబరుఁడు వచ్చుచుండును.)

ఏకా—(సన్నిహితించును.)

అన్న—(పతివైపు జూచి కనుల గ్రమ్మిన నీరు లో లోన శమింపఁ జేసుకొనును.)

ఏకా—(సం[illegible]యముతో [illegible]కొనిన స్వరముతో.) ప్రియా! [illegible] [illegible]చుచు[illegible]న్నది.

[illegible]—([illegible]) [illegible] (ప్రకాశముగ) విచారించుటకు వేరు విషయమేమి గలదు. ఓరుగంటినే కాదు—ఆంధ్ర దేశమునంతటిని నట్టువలె నడికించు చున్న

మలిక్ కాఫూరు ముట్టడిని గురించి!

ఏకా—ఏకు దానివలన గలిగిన—లేక, కలుగనున్న అపాయమేమి?

అన్న—ఆత్మకు గలిగిన అపాయ మంగకములకు కాదా?

ఏకా—ఆత్మాంగక భావము దేశ దేశీయుల మధ్య నున్నగదా!

అన్న—ఉండుట విధియా? ఉండకుండుట విధియా?

ఏకా—విధికెక్కడికి? సమయమునుబట్టి విధి మారు చుండును.

అన్న—విధిమారిన ప్రకృతి మారునా?

ఏకా—ఏమి? అట్లు ప్రశ్నించెదవు? మారవలసిన పని గలిగినపుడు మార్చుకొనుటకంటె గత్యంతర ముం డునా?

అన్న—గతిలేకపోయిన మార్చుకొనుట సరికావ చ్చును—కాని, ఉన్నపుడు?

ఏకా—మార్చుకొన చేతగాని వారికి స్వాతంత్ర్య మేది?

అన్న—జాతి, లింగభేదములేక సంపాదమూదరింపదగి నదేనా?

ఏకా—తప్పక!

అన్న—అయినమీరు మార్చుకొంటిరా?

ఏకా—పూర్ణముగా!

అన్న—మతినేనో?

ఏకా—యథేచ్ఛగా మార్చుకొనవచ్చును.

అన్న—(స్వగతము) పెద్దయాటంకము దీరినది. (ప్రకాశముగ) మీయాజ్ఞ నాకు శిరసాధార్యము. ఇప్పటికొక చింత తొలంగినది.

ఏకా—ఇంక చింతయేమి?

అన్న—ఏమియు లేదు—మీ పరిశ్రమనుగురించి.

ఏకా—(స్వగతము) స్త్రీలు మేధావతులు. నే చెప్పకుండగనే తత్త్వమును గ్రహించినట్లున్నది. (ప్రకాశముగ) నాపరిశ్రమ యెట్టిది?

అన్న—నిద్రయు నాహారమును విడిచినట్లే —.

ఏకా—అనుమానమెందుకు? అడుగవలసిన దడుగుము; అనవలసిన దనుము.

అన్న—ఇంటికిరాక—తిరుగుచుండుట.

ఏకా—ఊరిపై నూరు పడినట్లున్నపుడు నిద్ర—ఆహారము—ఇల్లు—సంసారము—

అన్న—ఈవాడు యుద్ధమునకు వ్యవధి గలిగినట్లు చాటింపబడియెగదా?

ఏకా—అగును. అయిన?

అన్న—విశ్రాంతి కాలమందైన నిల్లు చేరరాదా!

ఏకా—కలియవలసిన వారిని కలియుట—మంతనములాడవలసిన చోట మంతన మాడుట—

అన్న—తురకల తోడేనా?

ఏకా—(స్వగతము) ఇది ఛలోక్తియా?

అన్న—తురకలతోటి యేనా?

ఏకా—అట్లని యూహించితివా?

అన్న—కేవల మూహయే కాదు—

ఏకా—ఎవరు చూచిరి? ఎచటచూచిరి నన్ను?

అన్న—ఎవరు చూచిన నేమి? అబీను ఖానునితో మీకేమి పనిగలిగెనో నేను వినవచ్చునా?

ఏకా—స్వగతము) స్త్రీలకు కర్ణ పిశాచములుండునని మాత్రమే ప్రతీతి. నేత్ర పిశాచములు కూడ నుండునని నేను సిద్ధాంతము చేయగలను. కాని. కేవల దేశహితైషి యగు దానితో పర్యవసానమున దేలవలసిన విషయము నిపుడే చెప్పగూడదని దాచియుంచగా బట్టబయలు చేయుచున్నది. ఇంత దెలసికొనిన దాకొంచెము దెలసికొన కుండునా?

అన్న—అబీనుఖానునితో మీకేమి పని గలిగెనో వినవచ్చునా?

ఏకా—ఏకా విషయముతో పనేమి?

అన్న—భావమును మార్చుకొనుటకు నాకు మీరాజ్ఞనిచ్చినది మీరు మరువకుందురు.

ఏకా—లేదు.

అన్న—ఇంకేమి? అందుకే.

ఏకా—(సంకోచించుచు) అట్టయిన నీ వెఱింగితివో లేక తలచితివో అది నిశ్చయమే. (పైకి చెవినిడి) అదిగో ప్రియా! క్రిందిభాగమునుండి నన్నెవరో పిలచుచున్నారు. నేనేగవలసి యున్నది. (నిష్క్రమించును.)

అన్న—దేవమా! నకింత పరీక్షయేల? మంచిది. పరీక్షింప దలచితివో, దేశము పారతంత్ర్య మహాసముద్రమున మునుగనున్నపుడేనా? అపుడైనను భార్యాభర్త విషయమననేనా? ఈశ్వరా! ఎంలటి దుర్దశ! దేశభక్తియైనను మానుకొనవలయును! పతిభక్తియైననుమానుకొనవలయునుకదా—క్రిందటి దండయాత్రలో నబలాజన మొనరించిన శపథమున నాకొకట్టిభాగము న్నది కదా! ఇపుడు నాపతినాకు భావము మార్చుకొనుట కాజ్ఞనిచ్చియున్నాడు ఆయాజ్ఞ దేశభక్తిని విడచుట కైనను. పతిభక్తిని విడచుటకైనను బని





అమాత్య శిఖర అక్కన్న గారు.

By Courtesy-- Pictorial Hyderabad.



అమాత్య శేఖర మాదన్న గారు.

By Courtesy— Pictorial Hyderabad.

కీవచ్చును. (నిష్క్రమించును.)

3. ప్రదేశము: ఓరుగంటి వెలుపల యుద్ధభూమి.

ప్రవేశము: కాకతీయ సైన్యము, మలిక్ కాఫూరు సైన్యము యుద్ధము చేయుచు.

యోధ—నీవు హిందువుడవు—నేనునంతే. నీవడ్డు దొలగుము. నాకు శత్రువు మలిక్ కాఫూరు. అతని తరువాత నాతని సేనాపతి అబీదు ఖానుడు!

ఏకాంబరుడు—నేను తొలగను. నీకు శక్తిగలచేని నన్ను జయించి నా మిత్రులకు—నాధులకు జోక్యము గొనుము.

యోధ—నీవు శ్రీ ప్రతాపరుద్ర మహారాజు సేవకుడవు కాదా? నీకు అబీదుఖానా—అతవా, మలిక్ కాఫూరు ప్రభు వెట్లయ్యెను?

ఏకా—ఉద్యోగమును బట్టి.

యోధ—కాకతీయుల కొలవు కాకతీయ ప్రభుత్వమును వంచించుటతో సరి యయ్యెనా?

ఏకా—(స్వగతము) ఈతండెవండు? ఓరుగంటి సైన్యమందు నేను చూచినట్లు లేదెన్నడును!

యోధ—మాటాడవేమి? ఒక్కమాట బలుకుము. నీయొద్ద నెవని కొలచెదవో వానిని వంచించు ప్రజ్ఞయే యున్న నిప్పుడు నీ పద్దాని నేల యవలంబించి ప్రాణముల గాపాడు కొనరాదు?

ఏకా—నీ వంత పోటు బంటవా?

యోధ—అట్లని చెప్పుట లేదు. జయాపజయము లీశ్వరాధీనము. నేను తప్పక నిన్ను జయింప గలనని చెప్పుటలేదు. కాని దేశభక్త్యావేశమున నిన్ను జంప గత్తి నెత్త వలసి వచ్చినది. నీవు ధనాశ వలననో—నూతన ప్రియత వలననో నీ యేలికను—ఎవరి యనుగ్రహము వలన నీ విన్నినాళ్లు పోషింప బడితివో అట్టి యేలికను వంచించితివి. నీవును నేనును ఒక దేశీయులము—ఒక దిక్కున గాపుర మున్నవారము. కనుక నుండవలసినంత సంబంధ ముండుటచే నిన్ను తొలగుటకు ప్రార్థించితిని—నా శత్రువును, నాదేశ శత్రువును నా కప్పగించుమని చెప్పితిని. నీవు గైకొనలేదు. నిన్ను జయించుటకు నీవే నాకుత్తరువిచ్చితివి—అథవా, ప్రోత్సహించితివి. ఇక నేను దేశహితము కొరకు చేయగల కృత్యమును కలసింప రాదు. అయినను—చెప్పుచుంటిని. సాధ్య మైనంత దవ్వు—

ఏకా—నీవు—నీవు—దేశ హితైషివా? అదియెట్లో చూచెదను—నీ దేశమెట్లు నీచే నీవంటి వారిచే కాపాడబడునో చూచెదను. (ఇరువురు ఘోరముగా యుద్ధమొనరించెదరు. ఇరువురి గాత్రములు వ్రణ మయములై యుండును.)

యోధ—ఇదిగో! తప్పించుకొనుము. (అబీదుఖాను వైపు నడచును.)

ఏకా—స్వరక్షణ కొరకు పాటుబడువాడు పంద. నా క్రొత్త యేలిక కొరకు నేను రక్షకుడను. (అబీదుఖానుని కడ్డముగ నిలచి తన చాటున కాతనిని గొనును.)

యోధ—అట్లయిన నీ కర్మము. ఇనుములో నగ్ని—(బల్లెముతో నిద్దరను గుదిగ్రుచ్చును. ఏకాంబరుడు, అబీదుఖానుడు క్రిందబడియెదరు.)

యోధ—(బల్లెమును క్రింద బడవైచి పరుగున బోయి ఏకాంబరుని శిరమును తొడపై నిడుకొని కూర్చుండి.) నాథా! ఎంతటిదినము వచ్చెను. (పరిశీలించి) ఇక యెక్కడి నాధుడు! చేతులార జంపుకొనిన పిశాచి కీలోకమున నాథుండెక్కడ? దైవమా! మా యిరువురి ప్రేమైక నిధానమగు దాంపత్యమును చెడగొట్టుటకే నాపతికి దేశద్రోహచింత గల్పించి, మా చరిత చారిత్రక ప్రపంచమున శాశ్వతముగా నుంప దలచి నాకు నా పత్యనుకూలచింత విడువ శాసించితివా? అయ్యయో? నా నాథా! నీవేల దేశ ద్రోహుల కుతంత్రములో జిక్కి నా కిట్టి వైధవ్యము నా చేతనే ప్రాపింప జేసితివి? భావమును మార్చుకొనుటకు నా కేల నాజ్ఞ నిచ్చితివి? నిన్ననుసరింపమని నన్నేల యుద్బోధింప వైతివి? ఇప్పటికైనను నన్ననుసరింపకున్న నాకు

గతియేమి? పరమ పితా! నిశ్చయముగ నేను! పతివ్రతనే యగుదునేని దేశహిత చింతవలన ప్రాణమునకంటె నధికుడగు నాథుని చేతులార జంపుకొనిన పాపినని నిగ్రహింపక నేనెన్ని జన్మముల యందైన ఏ మహా మహునకే యర్ధాంగి నగునట్లనుగ్రహింపుము. ఏ జన్మ మందైన మా యిరువురకు గాఢమగు—నిశ్చలమగు దేశభక్తిని ప్రసాదింపుము!

(బాకుతో వక్షమున బొడచుకొని భర్త శరీరముపై నొరగును.)



# ప్రబోధము

[భాగవతుల పూర్ణయ్య కవిగారు]

తన్ను గానని తమము నగ్రమ్ముకొనిన
శూన్య దృష్టుల పరగించి చూత వనిక
గాంచి నంతనె; నా హృది కానదయ్యె
జాతి పూవుల స్వచ్ఛమా ఛాయలందు.
స్వాదు పరభృత గీతికా స్వాదనంబు
కాకు కీకంత పంచమ గాన రసము,
వల్లికాలోక సునిశిత వాక్య మర్మ,
మెటుగదింతకు నా హృది;

ఎచట గనిన
నిస్తులానంద సలలిత నినద చయము,
చివురు నాలుక జొబ్బిల్లు చిరుత పాటొ,
వల్లి వలపేడ్పు కన్నీటి పాట కొదలొ,
క్రింద మీదుగ హృదిని నొక్కింత పరకు......

* * అల్ల నల్లన చంద్ర రేఖార్ద్ర కాంత
కాంతు లెల్లెడ గ్రమ్మ నే గాంచు వనిక
ప్రసవ కాలపు ముదము లోపలను మరిగి
భ్రమర కైతవ, తమమున, పడియె నేమొ!

స్వచ్ఛమై శాంతమై చల్లు చల్లదనము
పెదవి కదుపని వల్లిక పదను నగవు
అలరు కన్నియ తెలిముద్దు లాననంబు
ప్రణయ ముగ్ధుని చేసె నా భ్రమర మతుల.
* * మున్ను మదిలోన గానంచి కొన్న చిలుత
సుమసుమాంగిని గాంచక సురసురనుచు
భ్రమను దూలిన యా యళి పాడనట్లు
తిరిగితిరిగియు వేసారి తీవియలను
పొన్నదరినున్న మాధవీ కన్నియకును
మాలి శుభ గేహమందలి మల్లెతీవ
నడుమ పడియుంటి శూన్య దృక్కడల బడలి...
* * విసికికొను సౌమనస్యాంత వీధికలను
కరలి కొనివచ్చు స్వచ్ఛంద సురభివాత
తరగ యల్లన వీచ సితాంత సౌఖ్య
డోలికాందోళ ఖేలన లీల తేల్చె
ఎంతవరకిట్టి సౌఖ్య మే గాంతు ననుచు
ఉస్సురని యూర్పితిని, గాలి, నూర్పుసెగల.



# దీపావళీ

సురవరము ప్రతాపరెడ్డిగారు (బి. ఏ. బి. ఎల్.)

ఈ పండుగను నరక చతుర్దశియని కూడ వ్యవహరింతురు. ఇది ప్రతి సంవత్సరము ఆశ్వయుజ కృష్ణ చతుర్దశీ దినమునఁ జేయఁబడును.

ఈపండుగ విషయమై యనేక కథలు చెప్పఁబడుచున్నవి. అందివి ముఖ్యమైనవి.

౧. శ్రీకృష్ణుఁడు సత్యభామా సహాయుఁడై నరకాసురుని చంపినందున.

౨. బలిచక్రవర్తి వామనునిచేతఁ దన యావద్రాజ్యమును గోలుపోయినందున.

౩. శ్రీ రాములు రావణ వధానంతరము రాజ్య పట్టాభిషిక్తుఁ డీ దినమయినందున.

౪. నరకమునుండి విముక్తి చెందుటకై యమునిగూర్చి ప్రార్థించుట.

౫. విక్రమార్క చక్రవర్తి యీదివసమున పట్టాభిషిక్తుఁడైనందున.

నీపై కారణములచేత నీదీపావళి జరుపఁబడుచున్నదని తెలియుచున్నది.

వీనిలో నేది నిజమో పిమ్మట నిరూపించెదను.

అది యట్లుండె. పై కథ లేవియో పాఠకులజ్ఞాపకార్థ మిపుడు వివరింపఁబడును.

౧. నరకాసురవధ—ఈకథ యాంధ్రదేశమందంతటను. దక్షిణమునను దీపావళికి ముఖ్య కారణముగా భావింపబడు చున్నది. కావుననే యీచతుర్దశి "నరక" చతుర్దశియని చెప్పఁబడుచున్నది. నరకాసురవధను గుఱించిన కథ భాగవతమందును హరివంశమందును చెప్పబడియున్నది. నరకాసురుఁడు లోక కంటకుఁడు కాఁగా శ్రీకృష్ణుడు వాని వధింపఁ బ్రయాణమయ్యెను. సత్యభామయు నాతని వెంబడించెను. శ్రీకృష్ణుఁడు మొదలు ముర రాక్షసుని వాని పుత్రులను జంపెను. నరకుండదిచూచి కోపోద్దీప్తుఁడై కృష్ణునిపై యుద్ధమునకు వచ్చెను. అప్పుడు సత్యభామ తానే చాపముగొని వేడి నారసములచే నరకాసురునితో ఘోరయుద్ధముచేసి యలసి పోయెను. శ్రీకృష్ణుఁ డామెకు సహాయుడై నరకాసురుని వధించెను.

ఈ కథలో ముఖ్యముగ గమనింప వలసినది సత్యభామ యొక్క యుద్ధనైపుణి. ఆకాలమందు స్త్రీలు సహితము యుద్ధకళా కౌశలమందారితేరినవారై యుండినందులకు భారతీయులందఱు సంతసింప వలసినదే.

౨. బలిచక్రవర్తి కథ:—బలిచక్రవర్తికథ భాగవతమందు విపులముగా వర్ణింపబడినది. బలియసురరాజు దానమందుఁ బ్రఖ్యాతి వహించినవాఁడు. వేడిన యభ్యర్థులకు లేదనువాఁడు కాఁడు. అప్పుడు విష్ణువు వామనావతారమెత్తి బలిచక్రవర్తిని మూఁడడుగుల భూమిని వేడి రెండుపాదములచే భూమ్యాకాశముల నావరించి మూఁడవ పాదమునకుఁ దావులేక దానిని బలిచక్రవర్తి శిరముపై యుంచి యతనిని పాతాళమునకుఁ ద్రొక్కెను. ఆకారణము చేతనే నీ

చతుర్దశీ దినము పుణ్యదినముగా భావింపఁబడు చున్నదని చెప్పుదురు. వ్రతరాజము మున్నగు గ్రంథములందు సత్యభామా కృష్ణుల కథయొక్క సూచనయే లేదు. వానిలో బలిచక్రవర్తి కథయే యున్నది. అందిట్లున్నది.

శ్లో. చతుర్దశీదినేరాజ్యం బలేరస్త్వతియాచయేత్ । పురావామన రూపేణ ప్రార్థయిత్వాధరామిమాం॥

దదావ తిథిం రింద్రాయ బలిం పాతాళ వాసినం। కృత్వాదైత్య పతిం దద్యా దహోరాత్రత్రయం హరిః॥

తస్మాత్సహోత్సవం చాత్ర సర్వదైవ హికారయేత్ । మహారాత్రిప్స ముత్పన్నా చతుర్దశ్యాం మునీశ్వరాః॥

... ... ... ...

దీపదానాది కార్యేషు గ్రాహ్యాపథ్యాహ్న కాలికాః। తతః ప్రదోష సమయే దీపాన్ దద్యాన్మనో రమాన్॥

౩. శ్రీరామ పట్టాభిషేకము:— ఇందు విశేషము లెవ్వియు లేవు.

౪. నరకవిముక్తి:— నరక చతుర్దశియను పదములోని నరకమనఁగ యమలోక మని యర్థము. దానినుండి విముక్తి చెందుటకై ఈ యుత్సవము చేయవలెనని దీని భావము.

వ్రతచూడామణియం దీసూచనయు నున్నది.

శ్లో. "యమాయ ధర్మరాజాయమృత్యవేచాంతకాయచ॥"

ఇందు యమపూజా విధి చెప్పబడి యున్నది. గుప్తే అనువారు తమ "హిందువుల పండుగలు, వ్రతములు" అను గ్రంథమం దీయంశము నే విపుల పఱచినారు. నరక మనగా ముత్తికి యనియు, కార్తీక మాసమందే సూర్యుడు తులారాశి చేరుననియు దానివలన రాత్రులు దీర్ఘమగు ననియు, నీ నరకమును పరిశుభ్రపఱచుట కిదియే యదననియు, నరకాసురుఁడు భూదేవీ కుమారుఁ డనుటచేత భూమినుండియే ముత్తికి యుత్పన్న మయ్యెనని చెప్పుట కిదియొక కథగాఁ గల్పింపఁబడె ననియు వ్రాసి యున్నారు.

౫. విక్రమార్కుని కథ.—విక్రమార్క శకమును లెక్కించువారి కీ దినమునుండియే సంవత్సరారంభ మగుచున్నదని చెప్పుదురు. అట్టిచో నిది ముఖ్యముగా గమనింపవలసి యున్నది. విక్రమార్కుఁడను రాజు క్రీస్తుపునకు పూర్వము ౫౭ సంవత్సరముల క్రిందట అనగా సుమారు ౨౦౦౦ సంవత్సరముల క్రిందట యుద్భవించి యార్యావర్తము నంతయు నేకచ్ఛత్రాధిపత్యముగ నేలిన మహారాజు. ఇతని యాస్థానమందే కాళిదాసాది నవరత్నములుండిరని చెప్పుదురు. ఈరాజు మహా సాహసికుఁడనియు నిశ్చఁ డనేక మనుష్యాతీతమైన కార్యములచేసి యుత్సాహ సాహసౌదార్య ధైర్య గుణములచే విరాజిల్లె ననియు ననేక గాథలు వ్రాయఁబడి యున్నవి. ఈ విక్రమార్కుడు విశేషముగా నుత్తర హిందుస్థానమందే రాజ్యము చేసెను. ఇతని ముఖ్యపట్టణము "ఉజ్జయని". ఇతఁడుకొంతకాలమునకు దక్షిణ దేశపు రాజును, నాంధ్ర చక్రవర్తియు నగు శాలివాహనునిచే నోడింపబడెను. ఈ విక్రమార్కశకము దక్షిణములో ప్రచారమందు లేదు. ఉత్తర హిందుస్థానమందిది విశేషముగా వాడఁబడుచున్నది.

ఆచారము:- మొత్తముపై యీ మహోత్సవము హిందూ దేశ మంతటను ప్రచారమం దున్నది. దీని యుద్దేశము పూర్వమే దేనోక మహాకార్యము జరిగియుండ దాని జ్ఞాపకార్థమై యేర్పాటయి యుండును. విశేష సంఖ్యాకులు సత్యాకృష్ణులు లోక కంటకుడగు నసురుని సంహరించిన సందర్భమునొక్క జ్ఞాపకార్థముగా నిది నేటికిని పుణ్యదినముగా భావింపబడుచున్నదని నమ్మెదురు. ఇదితప్పని విమర్శనలో నిరూపింతును. ఈదినమొక స్త్రీ బాణ ప్రయోగము చేసి శత్రునాశన మొనర్పగా నేడు మన యార్యులును బాణములుకాల్చి (పటాకులు) తమకే హాని కలిగించుకొనుచున్నారు. ఈపటాకులుకాల్చుటవలన విదేశములకు మన ద్రవ్యము పోవుటయొకటి. మనచేజిడ్డు వదలుట రెండు. మన పిల్లల కీమందులచే నపాయములు సంభవించుట మూడు. మన పూర్వుల మన మీవిధమున నగౌరవపఱచుట నాల్గు—నివి వీని ఫలితములు. ఈ పండుగనాడు పటాకులు కాల్పవలయునని యే గ్రంథమందును వ్రాయబడలేదు.

ఏదియెట్లున్నను మన దేశములో అశ్వీజ కృష్ణ చతుర్దశినాడు చీకటిలోనే యందఱును లేచి శిరస్స్నానము చేసి దీపములు వెలిగించి పటాకులుకాల్చి పూజాదికము లొనర్చుదురు.

ఈ దీపావళిపండుగ మార్వాడీలకు చాల ముఖ్యమైనది. ఆ యుత్సవమునాటికి వారు తమ లెక్కల నన్నిటిని పరిష్కరించి యానాడు క్రొత్త ఖాతాపుస్తకములు తెచ్చి పూజించి బ్రాహ్మణ మంత్ర పురస్సరముగా నాశీర్వాదములంది స్నేహితులకు విందులొసగి చాల యానందముతో నుందురు. ఆంధ్రదేశమందును దుకాణము లున్న వారందరును మార్వాడీలను జూచి కూడినమే వారును క్రొత్త లెక్కల నేర్పాట్లుచేసికొందురు. మొత్తముపై వ్యాపారస్థులచే నీపండుగ సంవత్సరాదిగా నెంచబడుచున్నది.

భవిష్యత్పురాణోత్తర భాగమందు శ్రీకృష్ణుడు ధర్మరాజుతో జెప్పినట్లుగా బలిచక్రవర్తి గౌరవార్థము దీపావళిపండుగ చేయబడుచున్నదని యున్నది. ఆపురాణమున నీపండుగను "దీపాలికోత్సవము" అనిపేర్కొని యున్నారు. శ్రీకృష్ణుడిట్లుచెప్పెను:— "పూర్వము బలిచక్రవర్తిని దేవుడు వామనరూపియై భూమిని యాచింపనాతడు సర్వలోకములు నాతనికి ధారపోసెను. అప్పుడు కృతజ్ఞుడై దేవుడీవిధమున బలిం బూజించున ట్లేర్పాటు చేసెను.

శ్లో॥ విష్ణు నావసుధాలబ్ధా ప్రీతేనబలయేపునః
ఉపకార కరోదత్త శ్చాసురాణాం మహోత్సవః

అప్పటినుండి యీ యుత్సవమును "కౌముది" యని పిలుతురు. ఈపండుగనాడు సర్వస్థలములందు—దేవాలయ మఠవృక్ష గృహాది స్థలములయం దంతటను దీపములు పెట్టవలయును. మరియు నాపురాణమందిట్లున్నది.

"శ్లో॥ కార్తికే కృష్ణపక్షేచ చతుర్దశ్యాందినోదయే। అవశ్య మేవ కర్తవ్యం స్నానం నరక భీరుభిః॥

నేటికిని కార్తిక కృష్ణపక్ష చతుర్దశి నాడే యీయుత్సవము జరుపబడుచున్నది.

ఈ పండుగ విషయములో "నరకచతుర్దశి" యనుచో నరకయను పదమువలన ననేక సందేహములు కలుగుచున్నవి. నరకాసురుని కర్మముచేసి యాతనివధకై లోకమునేటికిని సంత

సించుచున్నదని కొందరు చెప్పుచున్నారు. ఈ భవిష్యత్పురాణ మందలి పైశ్లోకమందు "నరకభీరుభిః" అనుచో నరకమునుండి భయపడువారందరు ఆనాడు స్నానము చేయవలెనని యున్నది. కావున నరకమును పొందకూడదను నిష్టముతో నీచతుర్దశినాడు యమపూజను చేసి యీ బలిపూజనుపిమ్మట చేయవలెనని చెప్పు పైపురాణ ప్రమాణము చాలముఖ్యమైనది. దీని విషయమై ముందువిమర్శింతును.

ఈ పండుగనాడు ధనికులయొక్కయు, దొరలయొక్కయు, లంచ డబ్బులనే ధబ్బవసైన సంపాదించిన కుబేర కుమారులయొక్కయు నిండ్లకు తెల్లవారక మునుపేలేచి యలంకరించుకొని భోగపుసానులు నీరాజనములిచ్చి పూజింతురు. ఈ యాచారమనేక నగరములందున్నది. దీనికిని మన భవిష్యత్పురాణమున నాధారమున్నది. ఈ శ్లోకమును చిత్తగింపుడు.

శ్లో॥ వేశ్యావిలాసినీ సార్ధం స్వస్తి మంగళ
కారిణీ గృహాద్గృహం వ్రజంతీచ పా
దాభ్యంగ ప్రదాయినీ॥

భవిష్యత్పురాణమం దీయుత్సవ కథనమందలి కడపటి శ్లోకముదాహరణ యోగ్యమని తలంచి యిం దుదాహరించుచున్నాను.

శ్లో॥ దీపోత్సవేజనిత సర్వజన ప్రమోదం ।
కుర్వంతి యే సుమనసో బలి రాజపూ
జాం। దానోప భోగ సుఖవృద్ధి శతా
కులానాం।హర్షేణ వర్షమిహ పార్థివ యా
తి తేషాం॥

విమర్శనము

నరకాసుర వధకారణమున నీపండుగ యేర్ప డినదని యే ప్రమాణమగు గ్రంథమందును లేనందున నీకథను త్రోసివేయవలయును. ఇక బలిచక్రవర్తి విషయమే గ్రాహ్యమైనట్టిదని భావింపవలయును.

ఈపండుగనాడు

శ్లో॥ ప్రభాతయేత్ స్నానమథ్యైతు నరకస్యతు
యాయవై॥

అనగా నరకభయముకొఱకై స్నానముచేయవలయును అనుటచేతను

శ్లో॥ నరకాయ ప్రదాతవ్యో దీప స్సంపూజ్య
దేవతాః॥

అనగా నరకమునకై దీపములం బెట్టి దేవతలను బూజింప వలయును అనుట చేతను

శ్లో॥ చతుర్దశ్యాంతుయే దీపాన్ నర
కాయ దదంతిచ । తేషాం పితృగ
ణా స్సర్వే నరకాత్స్వర్గ మాప్నుయుః॥

అనగా చతుర్దశీ దివసమున నెవ్వరు యమరాజును [నరక] దీపములం బెట్టి పూజింతురో వారి పితరులు నరకమునుండి విముక్తులై స్వర్గమును బొందుదురు అనుటచేతను, నీ పండుగ నరకాసురుని సంబంధము కాదనియు నరక విముక్తికై యముని పూజచేయుటకేర్పడి నట్టిదనియు విశదమగును. అయితే

శ్లో॥ చతుర్దశీ దినేరాజ్యం బలే ర స్త్వితియాచయేత్॥

అనగా చతుర్దశీ దివసమునాడు మరల బలిరాజ్యము వచ్చుగాతయని పూజింపవలయును అనుదానికి సమన్వయము చేయవలసి యున్నది. బలిచక్రవర్తి కథలో బూర్వమొకప్పుడు

వామనుఁడు బలిని మూఁడుపాదముల భూమిని వేఁడి రెండు పాదములచే భూమ్యాకాశములాక్రమించి మూఁడవపాదము బలి శిరస్సుపైనుంచి యాతనిని పాతాళమునకణఁగఁ ద్రొక్కెనని యున్నది. పాతాళమన నధోలోకము. అందుఁ జీకటి యుండును. విష్ణువు మూఁడుపాదములు గలిగినవాఁడుగా ఋగ్వేదమందు వర్ణింపబడినాఁడని లోకమాన్య బాలగంగాధర తిలకుగారు తమ వైదిక నిలయమను గ్రంథమం దుదాహరించుచు నందిట్లు వ్రాసియున్నారు.

“విష్ణుని త్రిపాదములను గూర్చి ఋగ్వేదమందు పలుతావులలో పేర్కొనబడియున్నది ...... సూర్యుని యుదయ, మధ్యందిన, అస్తమయములే యీ మూఁడుపాదములుగ వర్ణింపఁబడినవని మాక్సుమూలర్ పండితుఁడు తలంచుచున్నాఁడు. ఈ విష్ణుపాదములే పురాణములో వామనమూర్తియొక్క మూఁడడుగులుగ వర్ణింపఁబడియున్నవి. ఇచ్చట విష్ణుఁడనగ సూర్యుఁడని పండితులందఱును ఒప్పుకొనియే యున్నారు ...... ఈ విష్ణుపాదములలో రెండు మాత్రమే మానవులకు గాన్పించుననియు మూఁడవది నరులకుఁగాని పశుపక్ష్యాదులకుగాని గాన్పించదని, ఋగ్వేదము ౧, ౧౫౫, ౫-లో చెప్పియున్నారు [అనగా విష్ణువు మూఁడవపాదము అధోలోకమం దున్నదని దీనియర్థము] ఈ యధోలోకము చీకటిమయముగను జలమయముగను నుండి నరులకదృశ్యముగా నుండును ..... వేయేల! సూర్యుని వార్షికగమనమే మూఁడు విష్ణుపాదములుగ వర్ణింపఁబడినవి సూర్యుఁడు దక్షిణముపైనుండి జనులకు గాన్పించు కాలము విష్ణుని రెండు పాదములగును. తదుపరి సూర్యుఁడు క్షితిజము క్రిందికి గ్రుంకిపోయి దీర్ఘరాత్రిని కల్పించినప్పుడు అదృశ్యమగు విష్ణుని మూఁడవ పాదమేర్పడును.”

పై వాక్యములవలన వామన కథలోని రహస్యము కొంత వెల్లడియయ్యెను. కడపటి వాక్యమందు దీర్ఘరాత్రి యన నేదియో గ్రహించిన తక్కిన యంశములు సులభమగును—

ఆర్యులొక కాలమందు అనగా సుమారు ౧౦ వేల సంవత్సరములకుఁ బూర్వము ఉత్తర ధ్రువమండల ప్రాంతభూములందు నివసించిరని తిలకుగారు “వైదికనిలయము” అను గొప్ప గ్రంథమును వ్రాసి నిరూపించినారు. ఆ మండలమందు నాటికిని నేటికిని మన దేశమునకు భిన్నముగానుండు ప్రకృతి వైపరీత్యములు చాలగలవు. అందు మనకిప్పుడవసరమగు నంశ మొకటి. ఆ దేశ నాభూభాగమందు ఆఱునెలలు పగలును ఆఱునెలలు చీకటియును నుండును. దీనినే దేవతల కొక దినమని మనవారనేక గ్రంథములందు వర్ణించిరి. ఈ యాఱునెలల పగటిని దీర్ఘదివసమనియు, ఆఱునెలలచీకటిని దీర్ఘరాత్రి యనియు తిలకుగారువర్ణించినారు. ఈదీర్ఘదివస దీర్ఘరాత్రు లెప్పు డారంభమగునో యీ యంశమును తిలకుగారు తమ గ్రంథమందిట్లు వ్రాసియున్నారు. “ఉత్తరధ్రువము మేరు పర్వతమని మనవారు తెలిపియున్నారు. మఱియు సూర్యసిద్ధాంతము ౧౨వ అధ్యాయము ౬౭వ శ్లోకములో నీవిధముగ వర్ణింపఁబడినది, “మేరు పర్వతమువద్ద దేవతులకు మేష సంక్రమణము నాటి సూర్యోదయ మొక్కటే సూర్యోదయము. ఆదినము మొదలుకొని సూర్యునియొక్క

అర్ధావృతమువరకు అనగా [ఆరునెలలవరకు ను] వారు సూర్యుని చూచుచునే యుందురు. ........ మేరు పర్వతమువద్ద మేష సంక్రమణమునాడు సూర్యోదయమగును. తిరిగి ఆరునెలలవరకు అనగా తులా సంక్రమణము వరకు సూర్యుడాకాసముననే వెలుగుచుండును. తులాసంక్రమణముతో అస్తమయమగును. తులా సంక్రమణము మొదలు తిరిగి మేష సంక్రమణమువరకు సూర్యుడడుగునకు గ్రుంకుటవలన ఆరునెలలవరకు చీకటి వ్యాపించును. దీనిభావమేమన, మేషసంక్రమణము మొదలు తులా సంక్రమణమువరకు ఉత్తరాయణము, తుల మొదలు మేషమువరకు దక్షిణాయనము. అందువలననే ఉత్తరాయణకాలము దేవతలకు పగలగుచున్నది అని చెప్పబడియున్నది. కాని భాస్కరాచార్యులగారి కాలములో ఉత్తరాయణ దక్షిణాయణ సంజ్ఞలను మార్చిరి. మకర సంక్రమణము మొదలు కర్కాటక సంక్రమణమువరకు ఉత్తరాయణమని యిటీవల వారు మార్చిరి.

ఈ పై ప్రమాణమువలన ఉత్తర ధృవమండల వాసులుగా నుండినప్పుడు మనపూర్వులగు నార్యులకు తులాసంక్రమణమునాడు దీర్ఘరాత్రి ప్రారంభమగుచుండెనని తెలియును. నాటినుండి తిరిగి యాఱునెలలవఱకు వారు చీకటిలోనే కాలము గడుపవలసివచ్చెను. కావున నా చీకటి ప్రవేశించినతోడనే వారు దీపోత్సవమును జేసి "బలి" యను శత్రువును పాతాళమునకు తన మూడవపాదముచే నడగద్రొక్కి యచ్చుటనే తాను బహుకాలమునుండు నాడగుటచే సూర్యుడు మరల తమ కగపడు కాకయని ప్రార్థించుటకై యేర్పాటుచేసిన పండుగ యీదీపావళీయనితోచుచున్నది. తులా సంక్రమణమునాడే దీపావళి యనుటకు ప్రమాణముగా ధర్మసింధు విట్లు వ్రాయుచున్నది.

శ్లో॥ తులా సంస్థే సహస్రాంశౌ ప్రదోషే
భూతదర్శయోః॥
ఉల్కాహస్తానరాః కుర్యుః పితౄణాం
మార్గదర్శనం॥

సూర్యుడు దీపావళినాడు తులారాశిని పొందుచున్నాడనియు నాడు లోకులు దివిటీలతో తమ పితృదేవతలకు మార్గదర్శనముచేయవలయుననియు దీనియర్థము. తిలకుగారు తులా సంక్రమణమునుండి దీర్ఘరాత్రి ప్రారంభమగుచున్నదని వ్రాసిన ప్రమాణ మిదివఱకే విపులముగా నుదహరించినాడను కావున పై ధర్మసింధు ప్రమాణము దాని కనుకూలముగా నుండుటచే దీపావళీదినము ఉత్తరధృవవాసులకు దీర్ఘరాత్రి ప్రారంభ దినముగా నుండెనని నిశ్చయమయ్యె. అందుచేతనే యేపండుగకు లేనట్టి దీపాళిని నీయుత్సవమందు వెలిగించునాచారమై యున్నది. చీకటి మొడతెగక ప్రారంభమగుటచేత నా కష్టకాలము త్వరగా బోవుటకు ప్రార్థించుటకై యేర్పడినది. అంతియకాక పై ధర్మసింధువు శ్లోకమందీనాడు దివిటీల (దీపముల)చే పితృదేవతలకు మార్గముచూపించవలెను అను దాని కర్థమేమో విచారించిన తక్కినదంతయు విశదమగును. ఈపండుగ నాడు.

శ్లో॥ యమాయధర్మ రాజాయ మృత్యవే
చాంతకాయచ

అని యమధర్మరాజును బూజింపవలెననియు పితృదేవతలు నరకమునుండి స్వర్గమునుపొందుటకై యముని ప్రార్థించవలెననియు నిదివరకే ప్రమాణములు వ్రాసితిని. దీనియర్థమేమన నీదీర్ఘరాత్రి కాలమందు శ్రీ యాఱునెలల కాలమందు చనిపోయిన వారికి కర్మాదుల చేయుటకు దీర్ఘదివసము వచ్చిన తర్వాత- ననగా- నాఱునెలల తర్వాత వారికిం గర్మములు చేయుచుండిరని నిరూపించినారు. ఈ క్రింది వాక్యములు వారి గ్రంథమునుండి యుదహరించుచున్నాడ.

"ఎవరైనను దక్షిణాయన అనగ పితృయాన కాలములోఁ జనిపోవుట అశుభ సూచకమని మన హిందువులెన్నుదురుగద. మహాభారతమోక్ష వీక్షుడైన భీష్ములవారు దక్షిణాయన కాలమంతయుండి ఉత్తరాయణపుణ్యకాలము వచ్చువరకును ప్రాణములను విడువక అంపశయ్యమీద నిరీక్షించుచుండెననియు మన కందరకును తెలిసిన విషయమే"

ఇచ్చట యొక్క విషయము గమనింపవలెను. ఇదివరకు తిలకుగారు నిరూపించినట్లు మన దేశములో నుత్తరాయణము మకర సంక్రాంతినాడు వచ్చును. కాని యుత్తరధ్రువమందు తులాసంక్రాంతినాడు వచ్చును. తులా సంక్రాంతినాడే దీపావళియనుట నిరూపించినారము. కావున దీపావళినాడు ధ్రువమండలమందు దక్షిణాయనము ప్రారంభమగును. దక్షిణాయనమందు చీకటియుండుటచేఁ జీకటిలో (రాత్రి కాలమందు) శ్రాద్ధ కర్మాదులు చేయరు. కావున నీదక్షిణాయనములోఁ జనిపోవు వారికి నుత్తరాయణము వచ్చినతర్వాత శ్రాద్ధకర్మములను మన పూర్వులుత్తరధ్రువమందుండినప్పుడు చేయుచుండిరని తిలకుగారు వ్రాసినారు. ఈ క్రింది వాక్యములను చిత్తగింపుడు.

"చీకటి కాలములో (పితృయానములో) చనిపోయినయెడల తిరిగి దేవయానము అనగా వెలుతురు వచ్చువరకు అపరకర్మలను చేయుటకు వీలుండదు. అంతకాల మీకర్మలను చేయకుండ నిలిపియుంచుటయే చనిపోయినవాని యాత్మకు శుభదాయకము. ఎప్పటిమాటలో యేల యీకాలములో సైతము ఎవరైన రాత్రికాలములో చనిపోయిన యెడల సూర్యోదయ కాలము వరకు నాపియుంచుదుము కద. ఇట్టి సందర్భములో పితృయానకాలములో చనిపోవుట యశుభ సూచకమని మన పూర్వులు తలంచుటలో నేమియును వింతలేదు."

ఇప్పుడు మనము దీపావళినాడు దీపములెందుకు పెట్టుటయు, యమపూజ నెందులకుఁ జేయుటయు, పితృలకు సద్గతి నెందుకీ పండుగనాడే కోరుటయు, మున్నగు సంశయములు విశదమగును. ఈ యాఱునెల చీకటి దీపావళీనాడు ప్రారంభమై యాఱునెలలవఱకుండుటచే నంతవఱకు చచ్చినవారు (పితృదేవతలు) యపరకర్మహీనులై యుత్తమలోకములకు దప్పినవారై నరకమందే నివసించుచుండిరని మనవారు విశ్వ

సించిరి: నేటికిని నెవ్వరైన తమ పితరులకు శ్రాద్ధకర్మలు చేయకుండిన పితరులకు సద్గతిలేదనియు, నరకమునందే వారు కష్టింతురనియు జనులు చెప్పుదురు. శాస్త్రములును నట్లే చెప్పుచున్నవి. ఎవరైన దమ కుమారులు లేకుండిన వేరొకని దత్తుతీసికొందురు. ఇట్లుచేయుట కేవలము తమకు వానిద్వారా సద్గతి కలుగుటకేయని మన శాస్త్రిములు చెప్పుచున్నవి. పుత్రయనుపదమున కుకూడనిదేయర్థమున్నది. “పున్నామ నరకాత్ త్రాయత యితిపుత్రః” పుత్ అను నరకము నుండి కొడుకు తల్లిదండ్రులకు దర్పణములు విడిచి కర్మలుచ్చేసి వారిని విముక్తి పొందించును గనుక నాకొడుకును బుత్రయని పిలుచుచున్నారు అని దీనియర్థము.

ఇట్లు పితృదేవతలీ యాఱునెలలు నరకమం దుందురుగాన వారికి నరకబాధ యుండనట్లుగా యముని పూజించుటకు దివిటీలతో నా చీకటిలోఁ బితరులకు స్వర్గమార్గము చూపించుటయు నీ పండుగవలన గలుగునని మన పూర్వులూహించి యీయుత్సవము నేర్పాటు చేసిరి.

ఇంతియు కాక మన దేశమందింకొక యాచారమున్నది. దీపావళినుండి మొదలుకొని కార్తీక మాసాంతము వఱకుఁ గూడ దీపోత్సవములు పెట్టుదురు. ఆకాశదీపములని కొందరు మేడలపై దీపములు పెట్టుటయు మఱికొందఱెత్తైన గట్టుల మీదను దీపముల వెలిగించుటయు కలదు. ఇదియును నా దీర్ఘరాత్రిలో పితృలకు మార్గదర్శకముగా నుండుటకై పెట్టుదురని భావించ వలయును.

ఇట్లాలోచించి చూచిన నాకీపండుగ యుత్తర ధృవ నివాసుల దక్షిణాయన ప్రారంభపు పండుగా గానవచ్చుచున్నది. కాని నరకాసుర కథకుగాని, శ్రీరాముల జయమునకుగాని విక్రమార్కునికిగాని నీ పండుగ నేమాత్రమును సంబంధించ దనినా యభిప్రాయము. విజయదశమి యనుపదములో “విజయ” అనుట కర్థము అర్జునడనిచేసి యర్జునుని యుత్తర గోగ్రహణ యుద్ధమునాటి సంబంధపు పండుగయని తప్పుడర్థముఁజేసినట్లు నరకచతుర్దశి యను పదమునకు నరకమునుండి పితృదేవతలకు విముక్తి కలిగించుటకై చేయఁబడిన పండుగ యని యర్థము చేయుటకు మారుగా “నరక” యను పదమును నరకాసురుని కర్థముచేసి వాని వధను శ్రీకృష్ణుని కంటగట్టి యా సందర్భమున నీ పండుగను జేయుచున్నారని వ్యాఖ్యానము చేసి జనులను దప్పు త్రోవలందు నడిపించినారు.

కావున పైవిమర్శన సారాంశమేమన నీ నరకచతుర్దశి దీర్ఘరాత్రి కాలమందుఁ బచ్చిన పితృలకు నరక విముక్తిచేయు పర్వదివసమని బలి, యమ, వామన, దీప, నరక, పాతాళ యను పదములు సాక్ష్యమిచ్చుచున్నవి.

ఈ విషయమును ముగించుటకుఁ బూర్వమింక మూడు విషయములు సూచింతును. గుప్తే పండితుఁడు నరకమును గుఱించి వ్రాసిన యభిప్రాయము గమనింపఁ దగినది. ఈ దివస మున సూర్యుఁడు తులారాశి చేరుననియు, వాస్తవ ... దీర్ఘమగుననియు

వ్రాసినారు. ఇంతవఱకు సరిగానున్నది. కాని నరకమునకు, పురీషాది మలములని యర్థముచెప్పి యీ మలమును బరిశుభ్రముచేయు కాలమిది యనియు, నందులకై యీపండుగ చేయుదురని చెప్పుచో వీరు తప్పుదారిని నడచిరి. దీర్ఘ రాత్రులను మన సాధారణ రాత్రులకన్న నొకటి రెండు గడియలు హెచ్చుగా నుండుట యని వీరు భావించిరి. వీరి కుత్తరధృవ పరిస్థితులు జ్ఞాపకమునకు వచ్చియుండిన తప్పక నా సిద్ధాంతమునకు వచ్చెడివారే!

ఇక రెండవ యంశము, బలిపూజ నీదివసమునఁ జేయవలయునను శ్లోకములం దీపంక్తి గమనింపఁదగినది.

"మహారాత్రి స్సముత్పన్నా చతుర్దశ్యాం మునీశ్వరాః"

అనగా నీచతుర్దశినాఁడు మహారాత్రి యుద్భవించెను. ఈ మహారాత్రిపద మేకవచనముగా వాడినారు. మఱియు మహారాత్రియనుట మన దీర్ఘరాత్రికర్థ మన్వయించుచున్నది. ఉత్తరధృవ పరిస్థితులు పురాణకారులకుఁ దెలియనందున వారు మహారాత్రియని వాడినను దాని యాదార్థ్యమును గమనింపక పోయిరి. ఇక మూడవ యంశము వామనుఁడు బలిని పాతాళమునకు త్రొక్కెనని వర్ణించుచు బలిరాక్షసులకు రాజని చెప్పఁబడెను. రాక్షసులు రాత్రించరులని ప్రసిద్ధినొందినవారు. మఱియు బలి నివాసమిప్పుడు పాతాళమని చెప్పుదురు. పాతాళము చీకటితో నిండినట్టిది. ఈయంశములవలన బోధయగుట యేమన సూర్యుడు (విష్ణువు) బలిని పాతాళము వరకు ద్రొక్కుచు వెంబడించె ననుటచేఁ జీకటిలో నిలిచి ప్రపంచమునకు జీకటి గలిగించెనని యర్థము కలుగుచున్నది. కావున బలిపూజచేయుచు

శ్లో॥ చతుర్దశ్యాం దినే రాజ్యం బలేరస్త్వితి మాచయేత్

అని వ్రాసియున్నారు. అనగా మరల బలి రాజ్యము కలుగు గాక. లేక మరల సూర్యుడు బలిని విడిచి మరల మా కగపడుగాక యని దీని రహస్యము.

(ఈ వ్యాసము ప్రతాపరెడ్డిగారి "హిందువుల పండుగలు" అను రాబోవుగ్రంథమును౦డి ముద్రింపబడినది) సం. సుజాత



[౮]

"ఏం? ఏమన్నానని?"

"అన్నదిచాల్దు. ఇంకేం కావాలి?"

"రాజద్రోహపు మాట లన్నానా?"

"అన్లేమ మరి. (Imperialism) సామ్రాజ్యత్వం నశింప జేయాలనే వుద్దేశం జాతీయ పతాకంలో వుంటే, జాతీయ పతాకంలో ఈ రాజ్యపు రాజచిహ్న మెందుకన్నావు. గంభీరంగా ఆ మాటలు నువ్వు అంటే జనమంతా ఎట్లా కక్కిరిక్కిబిక్కి రయ్యారో చూసుంటావు. ఆ వొక్క మాటకే నీ ఖర్మం మూడిం దనుకున్నారంతా. ఇంకేమన్నావో జ్ఞాపకముందీ? జాతీయ పతాకం ఆరోహణం చేస్తే అంతా కాకున్నా కొందరైనా ధైర్యవంతులు ముందుకొచ్చి ఆ పతాకానికి తలవంచుతారన్నావు. అందుకు నేను సిద్ధమన్నావు. ఈ రెండు మాటలు ఒకటి తరువాత మరొకటంటే ఏమర్థం తేల్తుందో చూడు. సామ్రాజ్యత్వం నశింప ప్రయత్నించేవాళ్లు కొందరు యిక్కడున్నారని, వాళ్లల్లో నువ్వుకూడా వక్కడవని అర్థం తేల్తోంది. ఈ మాటలు చాలవు?"

నాకేమీ అర్థమయ్యింది కాదు. నవ్వొచ్చింది.

"ఏం, నవ్వుతావ్? నామాటలన్నీ నవ్వులాటకోసం అనుకుంటున్నావు గావాలి!"

"అట్లాకాదు వెంకట్రావ్. నీ మాటలు నాకర్థమవ్వడంలేదు. సామ్రాజ్యత్వం నశించి పోవాలనే వాళ్లీ దేశంలో వున్నారని చెప్పడానికి అన్ని తంటాలు పడ్డాననా నీవుద్దేశం? సామ్రాజ్యత్వం నశించి పోవాలనే వాళ్లు యొక్కడ లేరని! బహిరంగంగా యీదేశంలో అనరని! నేను మాత్రం అననవా! అట్లా అన్నంత మాత్రానికే వీళ్లు చర్య తీసుకో బోతున్నారంటే నవ్వొచ్చింది."

వెంకట్రావుకు కోప మొచ్చింది. మాట్లాడకుండా లేచాడు.

"సరే వెళ్లుతా. నీ అదృష్టాన్ని ఎవరు తప్పిస్తారు!"

"కోప్పడకు వెంకట్రావ్. ఏం చేయాలో చెప్పు."

చెయ్యి పట్టుకో కూచోబెట్టా. కోపం పోయిందా ముఖంలోంచి. దయాజాలి వచ్చినాయి. కూచున్నాడు.

"నీమాటల్ని సమర్థించుకోవాలి యింద్రా! నీ అభిప్రాయా లెట్లాంటివో నువ్వెట్లాంటి దానవో నాకు బాగా తెలుసు. కాని బహిరంగంగా నీ అభిప్రాయాలని వ్యక్త పరుస్తే లాభంలేదు. చిక్కుల్లోంచి తప్పించుకోడం సాధ్యంకాదు. నాటక మాడాలి. కొంచం సేపటి కోసం నామాట విను. బతిమాలుకుంటా యింద్రా!"

వెంకట్రావు నాచేతుల్ని తన చేతిలో పట్టుకోని అతిదీనంగా అన్నా డీ మాటలు. కళ్లెంబడి నీళ్లు కారడం మొదలెట్టాయి. ఎంతో బాధపడు తోన్నట్టని పించింది పాపం!

ఏం మాట్లాడాలో తోచింది కాదు. ఆ కళ్లకేసి చూస్తూ కూచున్న. మళ్ళీ అన్నాడు.

"నువ్వు కలకత్తానుంచి రానడంతోనే, నిన్నూ నీ ఖాదీవేషంచూసి అనుమాన పడ్డారు పూళ్ళో అంతా. సి. ఐ. డీలకు నువ్వెవరో ఎక్కణ్ణుంచొచ్చావో అంతా తెలుసు. మొన్నటి ఉపన్యాసమంతా రాసుకో పంపారు కూడా."

"ఏం చేయమంటావు మరి?"

"విశ్వనాథదాసు అనమన్నమాట లనాలి. ఆయన నిన్ను తప్పిస్తాడు."

"ప్లీడర్లని నమ్మొద్దు వెంకట్రావ్! అసహ్యమైన అబద్ధాల అనమంటారు. అట్లా అనడం కన్న చచ్చింది నయం."

"ఏం, వినవు?"

,,ఏదీ! ఒక్కసారి యిట్లారా. ముద్దు పెట్టుకో'' వెంకట్రావు వంగి తన తలని నా వక్షంమీద, ఆమాంతం ఆనించి యేడవడం మొదలెట్టాడు. అతని తలని నా చేతుల్లో లేపుదామనుకొని చేతులేసా. చేతులు మండిపోయినాయి. చూచుకుంటే చుట్టూ చుట్టబడున్న బ్యాండేజి లోంచి రక్తం, గాయం, అగుపడుతున్నాయి. అది చూచి వెంకట్రావు మరీ యేడుస్తున్నాడు.

,,ఎక్కడున్నాం వెంకట్రావ్!''

,,కలకత్తాలో మీ యింట్లో.''

,,ఎట్లా వచ్చాం?''

,,వదిలేసారు.

,,Trial జరుగలా?''

,,ఆ రాజ్యంలో Trial యెక్కడిది!''

,,మరినన్ను అట్లా బాధించింది లా ప్రకారమే నా!

,,వాళ్ల యిష్టమే లా యింద్రా!''

,,ప్రజలూ పత్రికలూ ఏంచేస్తున్నాయి''

,,నిన్ను, నీ అవస్థని, నీ ఖర్మాన్ని, బొత్తిగా మరిచిపోయినాయి''

,,నాయకులు?''

,,అంతే''

,,మాట్లాడ్డానికి చాతకావడంలేదు. హృదయమంతా తప్పుతొన్నట్టనిపిస్తోంది''

,,.................''

,,ఏం! యేంచుకేడుస్తావ్? వెంకట్రావ్ చెప్పవూ? ఆయాసవస్తోంది. ఆc! తెలిసింది. పరవాలేదు వెంకట్రావ్. చివరకిసంతోషమే. నువ్వున్నావు నా దగ్గిర. చూడు. నువ్వేంచేస్తావ్ ముందు?''

,,ఎమల్లే ఆదర్శంకోసమే పడుస్తాయింద్రా?''

,,వద్దు, వెంకట్రావ్, మళ్లీ ఆదేశం వెళ్లకు. నామల్లే కష్టపడకు.''

,,కౌసింద్రా! ఆదేశంకోసం మనలాంటి వాళ్లెంతలో బలిగావాల్సుంది. నేను గాకుండా తప్పదు.''

,,చెయ్యి. అట్లా చేచెయ్యి. పరవాలేదు''

,,.................''

,,ఏది. యిట్లారా. ముద్దుపెట్టుకో. వేళలేదు,,

వెంకట్రావు ముద్దుపెట్టుకున్నాడు. ఆ వాలుగు పెదవులు విడిపోకుండా చేతుల్ని ఆ మెడచుట్టూ పోనిచ్చి గట్టిగా ఆతలని కట్టేసుకున్న. మాయిద్దరి కళ్ల నీళ్లు నా చెంపలమీదనుంచి కారుతున్నాయి.

అయిపోయింది





Edited & Published by K, Balakrishna Reddy, Printed by G. Ramakrishna Reddy, Golkonda Press, Troop Bazar Hyderabad (D.)

# అమృతాంజనము

## అన్ని నొప్పులకు మంచి మందు




తలనొప్పుల మాన్పును, వాయువు పోట్లను బాపును. పార్శ్వపు నొప్పులను బారదోలును. పోట్లను గొట్టును. బెణుకుల శోధించును. వాపుల రూపుమాపును. దగ్గును తగ్గించును. దురదను తొలగించును. ఈమందు నురుద్దగానే, చెమటవలన శరీరమందలి దుష్టపదార్థములను తొలగించి దేహమున కారోగ్యము కలిగించును. నొప్పుల తీసివేయును.

డజను 1-కి 6-0-0 చిల్లరగా డజను 1కి 6/4/0 ఒక డబ్బి 0/10/0

ప్యాకింగు, ఇతరఖర్చులు ప్రత్యేకముగా చార్జి చేయబడును.

వ.రా:—50 డజనులుగాని అంతకు పైగాగాని కొనిన టోకు ధర చెప్పన యియ్యబడును.

అమృతాంజనం డిపో, బొంబాయి లేక మద్రాసు.

---

వైద్యరత్న పండిత డి. గోపాలాచార్యులవారి

రిజిస్టర్డు

# జీవామృతము

వెల సీసా 3-4-0

ఇది అమూల్యమయిన అనేక యోషధులతో తయారు చేయబడిన శ్రేష్ఠమయిన బలవర్ధకౌషధము. శక్తికి మించిన పరిశ్రమ విశేషమోహము మొదలగు వాని హేతువునే సంభవించిన దేహదౌర్బల్యము పొందినవారికయినను యీ జీవామృతము అమృతోపమానమయినది. ఏదో దీర్ఘవ్యాధికి గురియయి ఎక్కుడుగ క్షీణించినవారికప్పటికి సంపూర్ణారోగ్యము పునఃప్రతిష్ఠాపన చేయగల మహత్తరౌషధరాజము. ఎంతటి బలవంతుడయిన పీనుగువలె జేయు శుక్లనష్టమును మూత్రమూత్ర సుఖారమును, వేయేల బలహీనతచే గలుగు నే వ్యాధినయినను నిరోధించి దేహమున కనిమేను పుష్టిని, క్రొత్తమంచి రక్తమును నరములకు పటుత్వమును, వీర్యవృద్ధిని, భీమబలమును ప్రసాదించు [illegible].

(రిజిస్టర్డు)

ఆయుర్వేదాశ్రమము

ఫోను నెం 2191

151 గోవిందప్పనాయకవీధి,
తపాలుపెట్టె 287,

మదరాసు

తంతివిలాసు "పండిత్"